# ఆదర్శాలు - అనుబంధాలు

సింగమనేని నారాయణచౌదరి

శ్రీమతి
డా॥ యం. రుక్మిణీ కృష్ణమూర్తిరావు
కానుక



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2.

# అంకితం

పవిత్రమూర్తి
"మా నాన్న" కు
ప్రేమ, గౌరవాలతో,

— చౌదరి.

# ఆదర్శాలు-అనుబంధాలు

వెంకటరామయ్యగారు, లక్షాధికారిగాకపోయినా, బీద వాడనుకోవటానికి ఏమాత్రం ఆస్కారంలేదు. అతనొక మాధ్యమిక తరగతి కుటుంబీకుడు! తండ్రిగారు కట్టించి పాతి కవేలరూపాయల ఆస్తి సంపాదించివెళితే, అతను తన కష్టార్జి తంగా ఐదుగురి సంతానాన్ని మాత్రం ధారాళంగా పొందగ లిగాడు. కాని ప్రస్తుత పరిస్థితుల్లో అతడు చేసినఅప్పు, దానికి సంబంధించిన వడ్డీ, చక్రవడ్డీ, వగైరాలు కలిపితే మొత్తం ఎంతౌతుందో, అతనిఆస్తి కూడా అంతకుమించి ఈనాడులేదు- ఇదే ఆతని తండ్రికి అతనికీ ఉన్న ఒకేఒక ముఖ్యమైన తేడా!

అయితే వెంకటరామయ్య గారిలో ఒక ముఖ్యమైన విశిష్టత ఈవిషయంలో మనం గమనించాల్సి వస్తుంది. అతను ఇంతఅప్పు చేసినా, గ్రామంలో ఏఒక్కరికి కూడా ఈఅసలు రహస్యం తెలియదు. ఇంకా నిజం చెప్పాలంటే చాలా మంది దృష్టిలో "అప్పు అనేది లేదనుకోనేంత," స్థితి తెచ్చు కొన్నాడు. వినేవారికి కాస్త ఆశ్చర్యంగా ఉండొచ్చు! కాని నిజపరిస్థితి ఇంతే. . . . !!

ఇంత బాకీ చేయాల్సిన అవసరం, పరిస్థితి ఎలా సంభ వించిందని ఎవరైనా ప్రశ్నిస్తే అది 'ప్రశ్న' గాదంటాను

నేను. ఆస్తి ఉన్నప్పుడు, అప్పు చేయటమూ, అందుకు తగ్గ అవసరాలుండటమూ, అందరకూ అతి సహజమే! అయితే ఆస్తికి సరిపడేంత అప్పు ఎలా పుట్టింది అనుకుంటే కాస్త ఆశ్చర్యమే! అందులోనే ఉంది వెంకటరామయ్యగారి లౌకికము.

రామయ్యగారితో ఎవరేనా మూడుక్షణాలు మాటాడితే చాలు, ఎదుటివాడు వెంటనే 'ఎంతైనా లౌకికుడు' అనుకోక తప్పదు. అదే అతనిలో గల విశిష్టత, దక్షత, ప్రతిభ కూడా. ఎలాంటి వారినైనా క్షణంలో మిత్రునిగా మార్చుకో గల సామర్థ్యం అతనికేచెల్లు ఏవిషయాన్ని గురించైనా గాని, మాటాడినా, వాదించినా ఆగ్రామంలో ముందు వెంకట్రామయ్య గారినే చెప్పుకోవాలి. గ్రామకీయాలు మొదలు కొని, రాజకీయాలు, ప్రాపంచిక, విజ్ఞానవిషయాలు, చివరకు సినీకీయాలవరకూ అన్ని విషయాలూ తన సహజ వాగ్ధోరణి చేత, అతిసమర్థనీయంగా, చాకచక్యంగా మాటాడి, ఎదుట వారిని ఇట్టే ఆకర్షించటంలో అతనికి అతనే సాటి. చిన్న తగవులు మొదలుకొని, పెద్ద పంచాయితీలన్నీ, గ్రామంలో అతని అధ్యక్షతన జరిగి తీరాల్సిందే! న్యాయాన్ని నిర్మొహమాటంగా, ఆత్మవంచన చేసుకొనక, అతిసూటిగా నిష్పక్షపాతంగా, ఎంతపెద్ద సమస్యలనైనా సులువుగా పరిష్కరించేవాడు. ఈగుణమే గ్రామంలో అతనికి పెద్ద గౌరవాన్ని, గొప్పతనాన్ని, సంపాదించి పెట్టింది.

నిజానికి వెంకట్రామయ్యగారి హృదయం నవనీతం వంటిది. బాధను సహించటం అతను జీవితంలో ఎన్నడూ

అలవాటు చేసుకోలేదు. పీడితప్రాణులపై అతనికెంతో జాలి. ఎవరినీ, ఏవిషయంలోగాని కోపగించుకొనే స్వభావం కాదత నిది. కాని మంచిఏదో, చెడుఏదో గ్రహించుకోగల పరిజ్ఞానం, మనిషిని చూడగానే వాని గుణగణాల్ని పసిగట్టే విమర్శాత్మకదృష్టి అతనికి ప్రకృతి ప్రసాదాలు.

అతని వదనంలో ఎప్పుడూ అనిర్వచనీయమైన, ఆనందరేఖ, పెదవులపై స్నిగ్ధమందహాసం నాట్యంచేస్తూంటాయ్. ఏభై సంవత్సరాల వయసు-ఆవయసులో కూడ ఎంతో ఠీవి, హుందాతనం అతనిలో కొట్టొచ్చినట్టు కన్పిస్తాయ్. ఫాలభాగం విశాలంగా, విధివ్రాతను, స్పష్టంగా, వ్యక్తీకరించేలా కనిపిస్తుంది. అతడదృష్టవంతుడని సూచించే బట్టతల అతని ఆకారానికే ఒకమెరుగు. కాని ఆ అదృష్టంలో నిజమేమిటో!

మొత్తానికి వెంకట్రామయ్యగారిని జూచిన ప్రతివారూ, పూజ్యభావంతో, వీక్షిస్తారు. అదే అతని ముఖవర్చస్సులో గల ప్రత్యేకత.

ఇన్నిఉదాత్త గుణాలూ, లౌకికత, చాతుర్యత ప్రతిభ కల్గిన అలాంటి వ్యక్తికి అప్పుపుట్టడంలో ఆశ్చర్యం ఇక ఏమాత్రం వుండదనుకుంటాను. అతడు తనుచేసిన అప్పు వివరాలు ఏ ఒక్కరికీ, చివరకు, కుటుంబ వ్యక్తులకు కూడా తెలియకుండా కట్టుదిట్టం చేసుకోగలిగాడు. నిజానికి ఒక విధంగా ఆలోచిస్తే, ఈ బాకీల విషయంలో అతని లౌకికతే అతన్ని కొంతవరకూ చెరచిందని చెప్పాలి. ఒక్కొక్కసారి తన అప్పు సంగతులు తలచుకొని బాధగా నిట్టూర్చి

నిస్పృహతో భారంగా శూన్యంలోకి చూస్తూంటారు రామయ్యగారు.

వెంకట్రామయ్యగారికి ముగ్గురు మగపిల్లలూ, ఇద్దరాడపిల్లలూ. మొదటి రెండూ చివర ఒకటీ మగసంతానం. ఆడపిల్లలలో పెద్దమ్మాయి శారద - వివాహం అయింది. మేనరికాల్లోగాని, దగ్గరబంధుత్వాల్లోగాని వరుడు లేనందున కొత్త సంబంధం వెదుకవలసి వచ్చింది వరుడు ఇంటర్ పాసై దగ్గర పట్టణంలో ఏదో ఆఫీసులో గుమాస్తాగిరీ వెలిగిస్తున్నాడు. వారి తలిదండ్రులూ పెద్ద ఆస్తిపరులేంగాదు- ఒక్కకొడుకు- ఒక్కకుమార్తె - పెళ్లయిన మూడుమాసాలకే పట్టణంలో సంసారం నెలకొల్పాడు. అక్కడ భార్యాభర్తలే గాక స్కూల్ ఫయినల్ చదివే అతని చెల్లాయికూడా వుంది. వారికి ఆ వచ్చే జీతం సరిపోతుంది. పొలంపనులు చూసుకుంటూ అతని తలిదండ్రులు స్వగ్రామంలోనే ఉండిపోయారు. ఈ పెళ్ళికి మూడు వేలకట్నంధారపోశాడు వెంకట్రామయ్య. పెళ్ళిమహావైభవంగా జరిపించాడు. ఆ వైభవమంతా బాకీసొమ్మేనన్న విషయం ఏ కొద్దిమందికో తెలుసు.

వరుని పేరు వెంకటేశం- అక్కడే సంబంధం కుదరటానికి రామయ్యగారి పెద్దకుమారుడు 'రామం' కారణం. రామం, వెంకటేశం ఇంటర్ వరకూ క్లాస్ మేట్సు ఈ కారణంవల్లనే పెళ్ళి జరిగిందని వప్పుకోవచ్చు. కట్నంవిషయంలో రామయ్యగారు ఏమాత్రం వెనుకాడలేదు. ఐతే గాని! అబ్బాయి మంచివాడు- ఉద్యోగం చేస్తున్నాడు- జీవితం సుఖంగా జరిగిపోతుందనే ఉద్దేశంతో కోరినకట్నంతో

వివాహం జరిపించాడు. ఆ పెళ్ళిఖరుతో కలసి అప్పు చాలా పెరిగిపోయింది. 'గతజలసేతుబంధనం' రామయ్యగారి స్వభావానికే విరుద్ధం. అందుకే అతడు గతాన్ని తలచుకొని పెళ్ళికి ఏనాడూ వెనకాడ లేదు.

నిజానికి వెంకట్రామయ్యగారికి అప్పుచేయాల్సిన అవసరం, సంతానం కలిగిన పదునైదు సంవత్సరాల వరకూ ఏమాత్రం కలుగలేదు. ఆ అపేక్షకూడా లేదు. పెద్దకుమారుడు 'రామం' తెలివితేటలు ఒక్క-తండ్రినేగాక గ్రామప్రజలందర్నీ బాగా ఆకర్షించాయి. రామం చురుకైనవాడు-సూక్ష్మగ్రాహి. ఏ విషయాన్నయినా ఏకసంధానంలోనే గ్రాహ్యం చేసుకోగల్గిన ప్రతిభ అతనిలో ఉంది. "వృద్ధికి కావలసిన విజ్ఞానం, ప్రతిభ, మీ అబ్బాయిలో ఉన్నాయి, ఎలాగయినా పెద్దచదువులు చదివించా" లన్నారు శ్రేయోభిలాషులూ, బంధుమిత్రులూ. రామయ్యగారు కుమారుని తెలివితేటలకూ, వారి 'ప్రశంసలకూ' మురిసిపోయాడు. వెంటనే పట్టణంలో ఫస్టుఫామ్‌లో చేర్పించాడు.

ఇక రెండవ కుమారుడు ప్రకాశం స్థితి కూడా ఇంతే అయింది. ఆ అబ్బాయి ఐదోతరగతి చదివే రోజులలోనే, తులసీదాసు రామాయణం చదివి అర్థం చెప్పాడని, ఇప్పటికీ అంటారు గ్రామప్రజలు. ఐదవ తరగతి పూర్తయేలోగా, రుక్మిణీకల్యాణం, సుమతి, వేమన, భాస్కర, కృష్ణ శతకాదులూ, అమరకోశం, ఆంధ్రనామ సంగ్రహం, అన్నీ ప్రకాశంకు కంఠతా వచ్చాయి. ఆంధ్రసాహితిపై అప్పట్నుంచే అతనిలో విశేషమైన జిజ్ఞాస ఏర్పడింది. అలా తీర్చిదిద్దిన

వాడు కూడ రామయ్యగారే. "ప్రకాశం రామాన్ని మించి పోయ్యాడే" అన్నారందరూ. ఐదు పూర్తికాగానే ప్రకాశాన్ని కూడా పట్నంలో జేర్పించాడు రామయ్యగారు. వీరిద్దర్నీ చదువుకు పంపించగానే ఒక పెద్ద ఆశాదీపం రామయ్య హృదయంలో జ్యోతులను వెదజల్లింది. వారి గురించి ఎన్నో ఆశలు. ఊహాసౌధాలు నిర్మించుకున్నాడు. ఎంతఖర్చయినా సరే, ఇద్దర్నీ పెద్దచదువులు చదివించి వంశదీపకులచేసి కీర్తి సంపాదించాలనుకొన్నాడు. వారి చదువులకు డబ్బు సర్దటానికి తన దగ్గర నిల్వఅంటూ ఏదిలేదు. పంటలవల్ల మిగిలే ఆదాయం ఏ కొద్దిమాత్రంగానో వుండేది. ఆ ఆదాయానికి అప్పు తోడుగా కలిపి డబ్బు సర్దటం అతనికి అలవాటయింది. వారి కోసం అప్పుచేయటంలో ఏమాత్రం సందేహంగాని, సంశయంగాని, అడ్డుగానీ, చెప్పలేకపోయింది అతని అంతరాత్మ.

ప్రస్తుతం రామం బి యల్. లో చేరాడు. పట్టుబట్టి మద్రాస్ వెళ్ళాడు. ప్రకాశం 'ఇంటర్' రెండవ సంవత్సరం చదువుతున్నాడు. రామయ్యగారు వూహించినట్టు రామం చదివివుంటే ఇంతడబ్బులో అరభాగంకూడా అప్పు అయేది గాదు. రామం తెలివితేటలు అనుకున్నట్టుగా వుపయోగపడ లేదు. స్కూల్ ఫయినల్ వరకూ ఎక్కడా తప్పకుండా మంచి మార్కులతో ఉత్తీర్ణుడౌతూ వచ్చాడు. కాని విధి వక్రించింది. ఇంటర్ చదువుతూండగా బస్సు ప్రయాణంలో పెద్ద ఆక్సిడెంట్ జరిగింది. ఆ దెబ్బకు రామం ప్రాణం పోవాల్సిందే! తలబద్దలయింది... అప్పట్లో అందరూ "అదృష్టవంతుడు బ్రతికి బయటపడ్డాడు" అన్నారు. ఆ దెబ్బకు ఆస్ప

త్రిలో ఆరుమాసాలు నివాసం చేయవలసివచ్చింది. అందు వల్ల ఆ సంవత్సరం చదువు మానాల్సి వచ్చింది. తర్వాత సంవత్సరం మళ్ళీ ఇంటర్‌లో చేరాడురామం. కానీముందున్న తెలివితేటలు, చదువుపట్ల శ్రద్ధ అతనిలో అంతరించాయి. ఆ సంవత్సరం ఎవరూ వూహించని విధంగా, మూడు భాగాలూ ఫెయిలయ్యాడు. రామయ్యగారు దుఃఖించాడు గాని చలించలేదు. ఆక్సిడెంట్‌వల్ల మెదడు దెబ్బతిందనీ, ఏకాగ్రత తప్పిందనీ డాక్టర్లు చేసిన నిర్ధారణ అతనికితెలుసు. కాని రామం మీదున్న విశ్వాసంతో దాన్ని విశ్వసించలేక పోయాడు. అంతా తనఖర్మ అనుకున్నాడు. ఆ సంవత్సరమే చదువుమాన్పించి, పెళ్ళిచేసి ఏదేనా ఉద్యోగంలో చేర్చమని శ్రేయోభిలాషులు సలహా యిచ్చారుకాని, రామయ్య అంగీకరించలేదు. ఫెయిలయిన భాగాలను చదవటానికి మద్రాసు 'జయంతీ ఇన్‌స్టిట్యూట్' కు పంపించాడు. అక్కడ రెండు సంవత్సరాలుండవలసి వచ్చింది. ఆ రెండేళ్ళకే మూడువేలు హారతికర్పూరంలా హరించుకు పోయాయి. మొత్తం ఇంటర్ పూర్తికావటానికి నాల్గు సంవత్సరాలు, బి. యే, పూర్తి కావటానికి నాల్గుసంవత్సరాలూ పట్టింది. అయినా మంచి మార్కులతో ఉత్తీర్ణుడు కాలేకపోయాడు. డాక్టరీ చదివించాలన్న రామయ్యగారి ఆశ నిరాశ అయింది. అందుచే రామంకోరిక ప్రకారం బి. ఎల్. కి పంపించాడు మద్రాసుకు. ఆ ఎనిమిది సంవత్సరాల కాలేజీ చదువుకు పదివేలు ధారాళంగా ఖర్చయ్యాయి. ఐనా రామయ్యగారు చలించలేదు. రామంపై వుంచుకొన్న ఆశలను ప్రకాశంపై మరలించి

డాక్టరీ చదివించాలన్న తన కోర్కె ప్రకాశం ద్వారా నెర వేర్చుకోవాలని కలలు కంటున్నాడు ప్రస్తుతం రామయ్య. ఈ ఇద్దరి చదువులకూ అమ్మాయి పెళ్ళికీ ఇంతకావటం అతి శయోక్తిగాదు.

పేరుకుపాతికవేల ఆస్తేగాని అందులో చెప్పుకోదగ్గ ఆదాయంలేదు. ఉన్న ఆరెకరాల మాగాణి చెరువుక్రింద వుంది. దానికి బావినీటి సౌకర్యంలేదు. చెరువునీరే ఆధారం. ఆ చెరువుకో విశిష్టతవుంది. దానికి నీరంటూ వచ్చిందంటే మొత్తం ఆంధ్రలోవున్న తటాకాలన్నీ నిండినట్టే లెక్క. అందుచే సంవత్సరానికి ఒక పంటమించి అందులో పైరు పెట్టే అవకాశం లేదు. ఆ ఆదాయం ఇంటి ఖర్చులతోనే ముగిసిపోతుంది. కాస్తాకూస్తో మిగిలినా, వడ్డీచెల్లించటానికి సరిపోయేది. ఇక మెట్టభూములుకూడా పాతిక ఎకరాలుంటా యేమో। వాటి ఆదాయం గురించి ఎక్కువ చెప్పాల్సిన అవ సరం లేదనుకుంటాను. ఇలాంటిపరిస్థితుల్లో చదువులకు కావా ల్సిన డబ్బు అప్పుగా మారింది. గ్రామవాసులకు ఈ విష యంలో రామయ్య గురించి కాస్త అనుమానమే! కుమారుల చదువుకు అప్పు చేయకుంటాడా అని. కాని నిక్కచ్చిగా తెలుసుకోలేక పోయారు. అప్పున్నా యింత అప్పుంటుందని పొరపాటున కూడా ఎవరూ అనుకోలేకపోయారు. ఈ బాకీ సమస్యే రామయ్యగారినిపుడు కాస్తా కుంగదీస్తోంది. అదృష్టం కొద్దీ యింతవరకు ఎవరూ బలంగా వత్తిడిచెయ్యలేదు. అయినా ఆయనకో భరోసా! తనకుమారుల పెళ్ళిళ్ళు జరి పిస్తే ఆ వచ్చేకట్నంలో ఈ బాకీ సొమ్మెంత అని! ఉద్యో

గాలు లభిస్తే యిక ఏ చిక్కులూ వుండవు. అప్పిచ్చినవారు కూడా ఇదే మనస్థితిలో వున్నారు. బాకీదార్లు ఎపుడేనా అడిగితే, "పెళ్ళిళ్లు కాగానే తీరుస్తాలేవోయ్! మహా నీబాకీ ఎంతగానీ" అనేవాడు నవ్వుతూ ధీమాగా! బాకీ కొద్ది అనే మాట కూడా నిజమే! రామయ్య ఎవరిదగ్గర కూడా రెండు వేలు మించి బాకీ చెయ్యలేదు. అలా ఐదారు గ్రామాలలో పది, పన్రెండుగురు వ్యక్తుల దగ్గర అప్పుచేశాడు. అందుచే బాకీదార్లందరూ నా కొద్దిపాటి అప్పు ఎప్పుడు తీర్చక పోతాడులే అనే భావనకు వచ్చారు. ఇందులో రామయ్య గారి తెలివి అపారం. ఎంతైనా లౌకికుడుగదూ! ఐనా రామయ్య మనసులో ఏదో బాధ, ఆవేదన. దానికి స్పష్ట స్వరూపం అతనికే తెలియదు. కాని కుమారులతలచుకోగానే మళ్ళీ ఆదోవిధమైన ధైర్యం! ఏమిటో ఈమానవప్రకృతి...!

రామం ఇంటర్ పాసయినపుడే పెళ్ళిచేయాలను కున్నారు బంధువులంతా, ఒక్క రామయ్యతప్ప! మేన మామగారి పెద్దకుమార్తె ఎదిగిన పిల్లవుంది. పదివేలకట్నం యిస్తామన్నారు, కాని రామం అంగీకరించలేదు. చివరకు తండ్రికూడా అందరి బలవంతంవల్ల అంగీకరించి కుమారుణ్ని వత్తిడి చేశాడు. కాని రామం, తన చదువు పూర్తికానిదీ జీవనాధారంఅంటూ ఒకటి ఏర్పరచుకోనిదీ, పెళ్ళి అంటూ కల్ల అని కుండబ్రద్దలుకొట్టినట్టు చెప్పేశాడు. ఎప్పుడూ మౌనంగా ముభావంగా వుండే రామం యిలా అనేసరికి అందరూ నిరాశ చేసుకున్నారు. ఆ అమ్మాయి పెళ్ళి వేరే జరిగిపోయింది.

తర్వాత బి. ఏ. మొదటి సంవత్సరం పూర్తికాగానే మేనత్తకూతురు సంబంధం వచ్చింది. అమ్మాయి చాలా అందంగా వుంటుంది. కొంతవరకూ చదివిందికూడా. అంతే గాక ఈసారి కట్నం రేటు ముందుకంటే రెండువేలు పెరిగింది. రామయ్య ఈసారి కుమారుణ్ని వప్పించాలని గట్టిప్రయత్నం చేశాడు. రాము ముందు అన్నమాటల్నే బట్టీపట్టినవానిలా వప్పచెప్పాడు. అంతా నిరాశ చేసుకున్నారు. చాలామంది 'వాడిఖర్మ' అన్నారు.

బి. ఏ. పూర్తికాగానే ఎక్కడో కొత్త సంబంధం ఒకటి వచ్చినట్టు వినికిడి. ఈసారి కట్నం పదిహేనువేల యింది. రాముం అదృష్టం కాబోలు, అందరూ వేలకువేలు మించిన కట్నంతో వస్తున్నారు- అందుకూ కారణం వుంది. రాముం మంచి అందగాడు, స్ఫురద్రూపి, గుండ్రటి ముఖం. దీర్ఘనాశిక, ఇంద్రధనసులా వంకర తిరిగిన కనుబొమలు. అవే చాలు లతని అందాన్ని చాటటానికి. ఇక గుణవంతుడనే సదభిప్రాయం అందరకూ వుంది. అందుకేమరి ఈ వేలంవెర్రి! ఈసారి రామయ్య అవకాశం ఏమాత్రం జారవిడుచుకోగూడ దనుకున్నాడు. తన అప్పులన్నీ దాదాపు ఈ కట్నంతో తీర్చ వచ్చు. సంసారం కుదుటబడుతుంది. వియ్యంకులు లక్షాధి కారులు. ఎంతో ఆశ కల్పించుకున్నారు వారు. అంత ఉన్నత ఆస్థిపరులీ సంబంధం కోరటానికీ కారణం లేకపో లేదు. పెళ్లికుమార్తె రాముంకు కాలేజీలో జూనియర్. కాలే జీలో అతన్ని చూసింది. అతని అందం ఆమె హృదయంలో ముద్రవేసుకుంది. పెళ్లిచర్చ వచ్చినప్పుడు తన తల్లిముందు

విషయం బయటపెట్టింది. రామం పూర్తి, పేరు, వివరాలు తనకింతకుముందే తెలియటంవల్ల చెప్పింది కులం ఒకటే. అమ్మాయి వలచింది. ఇంతకుమించి ఏంకావాలి? వెంటనే ఆమె తండ్రిగారు అమ్మాయి కోరిక కనుగుణంగా, సంబంధం కోసం రామాపురం వచ్చి రామయ్యను కలుసుకొన్నాడు. రామయ్యగారి విషయం విని ఎంతో ఆనందించారు. ఈడూ జోడూ బాగా వుంటుందని మురిసిపోయాడు. ఈసారి కూడా రామం ముందుసలె ప్రవర్తించాడు. తండ్రి కన్నీరు పెట్టుకొని మరీ అడిగాడు. కోపంవచ్చి తిట్టాడుకూడా? అంతే, మరురోజు రామం పత్తాలేదు. రెండుమాసాలు గాలించినా దొరికలేదు. రామయ్య పశ్చాత్తాపం చెందాడు. ఎటున్నా రావాల్సిందనీ, నీ కోరికకు విరుద్ధంగా ప్రవర్తించననీ పత్రికా ప్రకటన చేయించిన తర్వాత ఊడిపడ్డాడు రామం. అంతటితో పెళ్లి సంబంధాలు ఉపసంహరించుకొన్నాయ్? ఆ సంవత్సరమే బి. ఎల్. లో చేరాడు.

ఇదంతా తలచుకొని మరీ బాధపడతాడురామయ్య. రామం వయసిపుడు చాలా మించిపోయింది. పెళ్ళి చేయగలిగుంటే తనకిన్ని బాధలుండేవిగావు. సంసారం సాఫీగా సాగేది. ఇంతకూ తనఖర్మ అనుకొని వేడి గాఢనిట్టూర్పు వదలుతాడు రామయ్య ఐనా ఈనాడు పదిహేను వేలకు వచ్చిన సంబంధాలు, బి. ఎల్. పూర్తికాగానే పాతికవేల రేటులో రాకపోగలవా, అని ఒక సమర్థన. ఈ ఆలోచన అతన్ని ఒక విధంగా, ఉత్సాహవంతుణ్ణి, ధైర్యవంతుణ్ణీ చేసేది. పిచ్చి మానవుడు...!!

ప్రకాశం అంటే మరీ అభిమానం ఆ కుటుంబాని కంతా! ఇంటర్ ఈ సంవత్సరంతో పూర్తవుతుంది. వచ్చే సంవత్సరం 'డాక్టరీ'కి పంపించాలి. చదివించటానికి వాని మేనమామ కూడా సిద్ధంగా ఉన్నాడు. వారికీ వీనిపై ఎన్నో ఆశలున్నాయి. అతని చివరికుమార్తెనివ్వాలని వారిఅభిలాష. తనమాట కాదనడు ప్రకాశం ఈ సంవత్సరంకాగానే పెళ్ళి ముగిస్తే ఇక అన్ని బాధ్యతలూ వారివే! ఇదీ వెంకట్రామయ్యగారికి ప్రకాశం గురించిన ఆలోచన.

ఇక చివరి కుమారుడు చంద్రం. మూడు సంవత్సరాల క్రితం ఆ గ్రామానికి మాధ్యమిక పాఠశాల వచ్చింది. అందులో యిప్పుడు 'థర్డుఫామ్' చదువుతున్నాడు.

రెండవ అమ్మాయి లలిత. ఆ సంవత్సరమే పుష్పవతి అయింది. పెద్ద అమ్మాయికంటే అందంగా వుంటుంది. అచ్చం ప్రకాశం పోలిక. ఐదవ తరగతివరకూ చదివింది. ఆ అమ్మాయి పెళ్లి సమస్య ఇప్పుడిప్పుడే రామయ్యగారిలో తలెత్తుతోంది. కాని ప్రస్తుత పరిస్థితుల్లో అప్పుచేయాలంటే ఎందుకోజంకు. మేనరికాల్లోగాని, బంధుత్వాల్లోగాని, వరుడు లేడు, ఈ సంవత్సర మాగితే రామం పెళ్ళిచేసి అమ్మాయి పెళ్ళి కూడా జరిపించవచ్చు. ఈసారి రామంను ముందుగా వదలకూడదు. ఇన్ని ఆలోచనలున్నా, అతనిలోఏదో అస్పష్ట నిరాకార, ఆవేదన రోజురోజుకూ గూడు కట్టుకుపోతోంది.

ఇన్ని వ్యథలు మనసులోవున్నా గ్రామంలో ఏ ఒకరి ముందూ తన బాధను వెల్లడించుకొనే తత్వం గాదతనిది. సంఘంలో రామయ్యగారి గౌరవానికే మాత్రం లోటులేదు

అప్పు గురించిన విషయాలలో గ్రామవాసులకు పట్టింపు లేదు. అందుకే "ఆయనకేం మహారాజు" అంటారు. "పేరుగొప్ప వూరు దిబ్బ" అన్నట్టుంది అతని సంసార స్థితి, మానసిక పరిస్థితి. ముఖంలో విషాద భావాలెప్పుడూ కన్పించనీయని గంభీర వ్యక్తిత్వం ఆయనది. సంఘంలో ఏమాత్రం కాలు జార గూడదని అతని పట్టుదల. అందుకే గాబోలు అతని ఎడమచేయి ఎప్పుడూ కుడి మీసంమీద వుండాగా, గంభీరంగా చిందులు త్రొక్కుతూంటుంది.

# 2

"ప్రకాశం" తన పేరుకుతగ్గ ప్రకాశ్ వీధిలోనే. ఒక గది అద్దెకు తీసుకొనివుంటున్నాడు. గది చాలా పెద్దది. ముందు వరండాకూడా వుంది. బాడుగ ఇరవై రూపాయలు. అతని రూమ్ మేటు రామకృష్ణ! అతను కేవలం రూమ్ మేట్ మాత్రమేగాదు, క్లాస్ మేట్, డెస్క్ మేట్ కూడా! వారి మిత్రత్వం ఈనాటిదిగాదు. ఏడుసంవత్సరాలుగా వారు జంటగా చదువుతూ వచ్చారు. కాని ఈ సంవత్సరమే వారు మొదటిసారిగా రూమ్ మేట్సు. రామకృష్ణ స్వగ్రామం పట్టణానికి పదిమైళ్ళ దూరంలో వుంది. తండ్రి పెద్ద భూస్వామి. ఆయనగారికి ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు బాపట్లలో అగ్రికల్చర్ చదువుతున్నాడు. వివాహితుడు. ఇక రెండో వాడు రామకృష్ణ. ఇంతవరకూ వివాహం కాలేదు. ఇప్పట్లో అయ్యే సూచనలు కూడా లేవు. వయసు రెండుపదులు. ఐదు

న్నర అడుగుల పొడవు, అందుకుతగ్గ లావుపాటి బలిష్ట శరీరం, గుండ్రని కండలు తిరిగిన నిండుముఖం. ముక్కుమాత్రం కాస్త మొద్దు. ఫాలభాగం కాస్త కురుచ. కళ్లు ఏవో విపరీత భావాలు సృష్టిస్తున్నట్టు వైరుధ్యంగా కన్పిస్తాయ్. పొగపీల్చటంవల్ల పెదవులు నలుపు రంగులో నిగ్గుదేలివుంటాయి! ముఖం రంగు నలుపుగాక పోయినా ఎరుపుమాత్రం కాదు. మొత్తానికి అందగాడనటానికి మనసొప్పకపోయినా అనాకారి అనటానికి ఆస్కారం లేదు.

అతనికి పూర్తి విరుద్ధం ప్రకాశం. ప్రకాశం మంచి పొడగరి. పొడవుకు తగ్గ శరీర దారుఢ్యం, పసిమిరంగు శరీర ఛాయ. కోలముఖం, నూవుపూవులాంటి సుందరనాశిక, స్నిగ్ధ కపోలాలు, పల్చటి ఎర్రని పెదవులు. ఉన్న విజ్ఞానమంతా కళ్ళలోనే కన్పింపచేసే నిశితదృక్కులూ, ముఖానికి వింత వర్చస్సు నాపాదించే నొక్కులజుట్టు అందం, గాంభీర్యం అతని సొత్తేమో అనిపించేలా వుంటాడు ప్రకాశం. అతని వేషధారణ ఒక కొత్తపంథా! హైస్కూల్ చదువులోనే అతను ధోతీ ఉపయోగించటం అలవాటు చేసుకున్నాడు. అతను జీవితంలో ఎన్నడూ ప్యాంట్ తొడిగి ఎరగడు. ఎప్పుడూ తెల్లటి చొక్కా, గ్లాస్కో పంచెతో స్వచ్ఛతను నిరూపిస్తుంటాడు. ఆ కాలేజీ విద్యార్థులలో ఈ వేషధారణ కలవాడొక్క ప్రకాశం మాత్రమే!

రామకృష్ణ వేషధారణ ఒక వింత పద్ధతిలో వుంటుంది. గంట కొక డ్రస్‌మార్చటం అతని నాగరికతలోని

ముఖ్యాంశం! ఈ వేషమార్పులలో అతను రకరకాల పద్ధతుల నవలంబిస్తూంటాడు. మొద్దుగావుండే తన జుట్టును వుంగరాలు త్రిప్పాలనే ఘోర ప్రయత్నం అతని క్రాఫ్ చూస్తే ఎవరికైనా తెలుస్తుంది. కాస్త అతివాది రామకృష్ట. తెలియని విషయాలను కూడా తెలిసినట్లు మాటాడాలనే ప్రయత్నం అతని వాగ్ధోరణిలో సులభంగా పసిగట్టవచ్చు.

ప్రకాశం మితవాది కాని వాదనకు దిగాడంటే అతనంత విసుగ్గా, సమర్థనీయంగా మాటాడేవారు మరొకరుండరేమో ననిపిస్తుంది. తనకు తెలియని విషయాల గురించి జోక్యం కలుగచేసుకోనుట మంటే అతనికి ఏవగింపు. ప్రకాశాన్ని చూడగానే అతని సరళ మృదు మనసు నెవరైనా అర్థం చేసుకోగలరు. అతని వ్యక్తిత్వం కంటి చూపుల్లోనే వ్యక్తమవుతూంటుంది. గంభీరంగా ప్రవర్తించాలనే ఆరాటం అతనికో ఎన్నడూ లేదు. అతని నడకలోనూ మాటల్లోనూ, ముఖంలోనూ గంభీరత వుట్టిపడుతూంటుంది.

రామకృష్ట గంభీరంగా ప్రవర్తించాలనే కొంతవెర్రి గలిగిన వ్యక్తి! ప్రకాశాని కతని చేష్టలు ఒక్కొక్కసారి నవ్వు తెప్పిస్తూంటాయి! రామకృష్ట చూడటానికి కాస్త భయంకరంగా కనిపించినా అతని హృదయం ఎంతో సున్నితం!

ప్రకాశం వయసుకూడా రామకృష్ణకు మించిలేదు. కాని ప్రకాశాన్ని జూచిన ఎవరేనా పాతిక సంవత్సరాల వయసుంటుందను కుంటారు. తన నిజమైన వయసింత అంటే

"మోకాళ్ళవరకూనా"! అని హాస్యం చేస్తారు మిత్రులు.

కాలేజీ తెరచి నెలరోజులు కూడా కాలేదు. కాలేజీ ఎలక్షన్స్ దగ్గర పడుతున్నాయి. పార్లమెంటు, శాసనసభ ఎన్నికల మించిన ప్రచారంతో వీటి ఘనత, కాలేజీ గోడలు మొదలుకొని, పట్టణ వీధుల వరకూ మ్రోగుతుంది. ప్రతి విద్యార్థి అందులో ఉత్సాహంతో పాల్గొంటాడు. పేరుకిని పదవులేగాని నిర్వహించాల్సిన బాధ్యతలంటూ అట్టేవుం డవు. పదవీ వ్యామోహమే యిందలి ప్రధానాంశము. ఇందులో దాదాపు పది పన్నెండు పదవులు కేటాయించ బడుతుంటాయి.

నామినేషన్స్ దాఖలు చెయ్యటానికి యిక రెండురో జుల గడువు మాత్రమేవుంది. అప్పుడే కొందరు నామినేషన్స్ యిచ్చి ప్రచారం కొనసాగిస్తున్నారు. ఈ ప్రచారాల ధోరణి బహు వింతగా మూర్ఖంగా వుంటుంది. ఎవరి దగ్గర కాగినా గుంతలోపడ్డ రికార్డు ముల్లులా, పాత చింతకాయ పచ్చడిలా, ఒకేపాత ధోరణి. చాలామంది ప్రచారాలకు విషయాన్ని కంఠతా చేస్తారు కూడా; అది వారి శక్తిసామ ర్థ్యాలకు నిదర్శనమన్నట్టు!! ఒక్కొక్క అభ్యర్థికి కొన్ని కొన్ని ముఠాలు అప్రయత్నంగా ఏర్పడి, ఎటుచూసినా గుంపులు గుంపులు, గుసగుసలు. అంతా ఢంకావాయించి నట్టు పెద్ద అలజడి. సమ్మె నాయకులవలె కాలేజీగేట్ల ముందు తరగతి గదులముందు బైఠాయిస్తారు నాయకులు.

నామినేషన్స్ యివ్వటానికి యింకా రెండు రోజులు గడువుందనగా, రామకృష్ణ ఆ ఉదయం తన సహామిత్ర బృం

దంతో ధీమాగా తన గదికి వచ్చాడు ప్రకాశం కోసం. వచ్చే సరికి వాలుకుర్చీలో పడుకొని ఏదో చదువుతున్నాడు దండు వేగంగా వచ్చి ఆసనాల నలంకరించింది.

"ఏమిటోయ్ అతిరథులూ, మహారథులూ పెద్ద దండులా బయల్దేరారు? ఎక్కడేనా యుద్ధం ప్రకటించ లేదు గదా!" అడిగాడు వారందరి వేపు తన కళ్ళను వేగంగా త్రిప్పుతూ, చిన్నగా నవ్వుతూ.

"ఒరేయ్ ప్రకాశం . . ." ప్రారంభించాడు రామకృష్ణ.

"ఏమిట్రా—"

"నీ కవిత్వంమాని మేము చెప్పేది కాస్త విను" కాస్త సీరియస్ ప్రదర్శించాలని ప్రయత్నం చేశాడు.

"ఊ . . . కాని"

"నిన్న ఫైనల్ బి. ఏ. చదువుతూన్న ఆ శేఖర్ గాడు ఆంధ్ర సారస్వతసంఘ కార్యదర్శి పదవికి నామినేషన్ దాఖలు చేసాడు."

"నిజమే తెలుసు!"

"చెప్పేది పూర్తిగా విను! ఆంధ్రమనే పదానికే అర్థం తెలీని అలాంటి దద్దమ్మ, చచ్చుపీనుగ ఆ పదవి నలంకరించటానికి మేమంగీకరించం! కాలేజికంతా వాడంటే హడల్! అసలే రౌడీ! అందుకే చాలామంది వానికి వ్యతిరేకంగా నామినేషన్ యివ్వటానికే జంకుతున్నారు. అందుకని నీవు వెంటనే వానికి వ్యతిరేకంగా నామినేషన్ దాఖలు చెయ్యాలి. నీవు నిలిస్తే ఓట్లన్నీ నీవే!"

"నేనా," కాస్త ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

"అవును, తమరే!"

"నాకీ వుపదేశం యిచ్చేందుకు బదులుగా నీవే పోటీ చేయకూడదట్రా! కావలసినంత సాయం చేస్తాను. నా కెందుకీ పదవులూ, పట్టాలూ."

"ఓహో! అప్పటికి తమరు పెద్ద ఆదర్శవంతులయినట్టూ, మేమేమో పనికిమాలిన వెధవలైనట్టూ," ఆక్రోశించాడు రామకృష్ణ.

"ఛ! ఛ!! అదిగాదురా నా అభిప్రాయం-"

"ఇంకేమిటోయ్ మహా, నీ అభిప్రాయం! పడుగు రాడుమాట విని తీరాల్సిందే! నేనే పోటీ అంటూచేస్తే నా కంటే ఆ శేఖర్‌గాడే కాస్తనయం. వానిపేరైనా కాలేజంతా తెలుసు! నా పేరు నీకూ, వీరికీదప్ప వీధిలోని కుక్కలకు కూడా తెలియదంటే నమ్ము. నేను నిలిస్తే డిపాజిట్ కూడా కృష్ణార్పణం చేసుకోవాల్సిందే! ఇక నీ గురించి తెలియని కాలేజీ విద్యార్థులు లేరంటే అతిశయోక్తిగాదు. నీకు ఆంధ్ర సాహిత్యంపైవుండే అభిరుచి, రచనాశక్తి అందరకూ బాగా తెలుసు. నీ కథలు చదువని కాలేజీగర్ల్ లేదంటే నమ్ము! మొన్న ప్రచురణయిన నీ 'సంకెళ్ళు' కథ చదివి గర్ల్సు అంతా వెయిటింగ్‌రూమ్‌లో కూర్చుని నీ గురించి తెగవాగేస్తున్నారట! కాబట్టి, బాబూ! నాయనా! దేముడూ! మా మాట వినరా! నిన్ను గెలిపించే బాధ్యత మాది. ఈ దెబ్బతో ఆ శేఖర్‌గాడి మదం *అణచాలి. ఈసారి కూడా గెలుస్తాననుకుంటున్నాడేమో వెధవ! ఇక నీవు

దప్ప ఎవరు పోటీ చేసినా జయం వానిదే! కాబట్టి నీవిక మా మాటకు అడ్డుచెప్పకు. ఖర్చులన్నీ మావే, ప్రచారమంతా మాదే.''

''ఫలితం నాదంటావ్ అంతేనట్రా? ఐనా మనకెందుకురా అతనిపై కక్ష! వాడు గెలిస్తే మనకొచ్చేనష్టం ఏమిటి? ఓడితే వచ్చేలాభమేమిటి?''

''అదేమిటి ప్రకాశం అలాఅంటావ్? చెవిటివానిముందు శంఖూదినట్లు మా మాటలన్నీ వ్యర్థమేనా! మొన్న రామకృష్ణపై వాడు చేసిన రాద్ధాంతం ఎంత అక్రమమో తెలుసా. మన రామకృష్ణ గౌరవం కాపాడాలంటే నీవు తప్పక పోటీచేసితీరాలి. నీవు పోటీచేసినవిషయం తెలిస్తే చాలు వాని గుండెలు దిగజారిపోతాయి. ఇక వాడేంగెలుస్తాడు'' అంటూ బతిమాలాడు విశ్వం.

ప్రకాశం కొద్దిక్షణాలు ఆలోచించి ''సరే మీ యిష్ట ప్రకారం గాని'' అన్నాడు. అందరూ ఆనందంతో ఎగిరి గంతేశారు.

ఇంతమంది మిత్రులు ఒక్క ప్రకాశాన్నే ఈ విధంగా బలవంతంచేయటానికి అతనిలోగల విశిష్టతే కారణం అనవచ్చు. నిజానికి ప్రకాశం ఆంధ్రసారస్వతంలో అందెవేసిన చేయి. స్కూలుఫైనల్ చదివే రోజుల్లోనే అతనికి రచనాశక్తి అలవడింది. ఇంటర్‌లో చేరగానే స్వనామంతోనే రచనలు ప్రారంభించాడు. కాలేజీలో అడుగుపెట్టిన నాలుగు మాసాలలో ఒక నవలకూడా ప్రచురణైంది. అది ప్రసిద్ధ రచయితల, విమర్శకుల మన్ననల నందుకుంది. కర్ణాకర్ణిగా

విద్యార్థులకు, లెక్చరర్లకు కూడా ఈ విషయం తెలిసి అభినందించి అతని మేధస్సును కొనియాడారు. వార, పక్ష, మాస పత్రికలలో తరచూ అతని రచనలు ప్రచురణ జరుగుతూండటంచే కళాశాలలోని ప్రతివ్యక్తికీ, ముఖ్యంగా విద్యార్థినులకు ప్రీతిపాత్రుడయ్యాడు ఎంతోమంది ఇతని పరిచయం కోసం తహతహలాడేవారు.

ప్రకాశంలోగల ఈ ప్రత్యేక కారణాలే అతని మిత్రులను ప్రోద్బలపరిచేలా చేశాయి. మిత్రులందరకూ అతనంటే ఒక ప్రత్యేక గౌరవం. ఆంధ్రసారస్వతంలో యింత అభినివేశంగల ప్రకాశమే ఆ పదవికి అర్హుడని వారి భావన.

మరురోజే ప్రకాశం నామినేషన్ దాఖలుచేశాడు. ఇది తెలిసిన చాలామంది మిత్రులు, పరిచయస్తులూ తమకు తాముగావచ్చి తప్పక సహాయంచేస్తామని వాగ్దానం చేశారు.

ఆరోజు మొదలుకొని ప్రకాశం పేరు కాలేజంతా మారుమ్రోగింది. ప్రకాశం ప్రతి క్లాసుకూ వెళ్ళి బాధ్యతగా ఓటు నర్థించాడు. అతని ఉపన్యాస ధోరణి అందర్నీ వశపరచుకొంది. రామకృష్ణ, విశ్వం, రావు, శేషు, శివం అందరూ అతనికి అన్నివిధాలా తోడుగా ప్రచారం కొనసాగించారు. అటు శేఖర్ పార్టీ పూర్తిగాదిగజారింది. ప్రకాశాన్ని చూస్తుంటే అతని ఒళ్ళు అసూయచే దహించుకుపోయింది. విద్యార్థులందరూ హేళనా భావంతో వీక్షించసాగారు. గరల్స్ దృష్టిలో అతనొక అల్పవ్యక్తిగా రూపొందాడు. ఓటుకై క్లాసుకెళ్ళగానే ఈలలతోనూ, అరుపు

లతోనూ అతన్ని హడలగొట్టి అల్లరిపాలు చేశారు. శేఖర్ కాస్త చలించాడు. కాని మనోధైర్యాన్ని వీడలేకపోయాడు. సాధ్యమైనంతవరకూ ప్రతివ్యక్తినీ ఆహ్వానించి కాఫీ, టిఫిన్, సిగరెట్లతో ముంచెత్తసాగాడు. ఇరుపార్టీలూ ప్రబలిపోతున్నాయి.

సాయంత్రం నాలుగు దాటింది. కాలేజీ వదిలారు. ప్రకాశం మిత్రులింకా ఏదో హడావిడిలో వున్నారు. ప్రకాశం విసుగును భరించలేక ఒంటరిగా గదికి బయలుదేరాడు. కళాశాల ఆవరణకూడా పూర్తిగా దాటలేదు.

"ప్రకాశంగారూ" ఎవరిదో నూత్న కంఠస్వరం విని ఉలుకుపాటుతో వెనుదిరిగాడు. ఎదురుగా తన క్లాస్ మేట్.... రాధాదేవి....!

"నమస్కారమండీ —" అందామె!

ప్రకాశం ప్రతివందనమాచరించాడు, ఆశ్చర్య భావాలతో.

"మీరు ఆంధ్రసారస్వత సంఘకార్యదర్శిగా పోటీ చేయటం నిజంగా మన క్లాసంతా గర్వించదగ్గ విషయం. మీ విజయాన్ని మనస్ఫూర్తిగా కాంక్షిస్తున్నాను"

"థాంక్స్" అన్నాడు ప్రకాశం.

"మీరు తప్పక విజయంపొందుతారు."

"మీ సహాయంవల్ల..... ఇక నే వెళ్తానండీ"

"ఆగండి...." మళ్ళీ అదే కమ్మని వీణలాంటి స్వరం. ప్రకాశం సాభిప్రాయంగా ఆమె కళ్ళవేపు చూశాడు. ఆమె కంటిరెప్పలు తటపట లాడించింది. "అబ్బే మరేంలేదు."

అంది అపోవిధమైన స్వరంతో, వెనుక సహ విద్యార్థినులు వస్తూండుటచే.

ప్రకాశం చిన్నగా నవ్వుకొని బయల్దేరాడు. కళ్ళ ముందు ఆమె మూర్తి మెదిలింది. ఈ సంఘటనకతను ఆశ్చర్యపోయాడనే చెప్పాలి. ఏమిటీమె ప్రవర్తన? ఎందుకు తన్ను పలుకరించింది. అభివందనలు తెలుపటానికేనా! ఇందులో తన ఘనకార్యమేముంది. అతనిలో ఆలోచనలు సహస్రపాయలుగా చీలుకున్నాయి. రాధ అందమైన అమ్మాయి అనటంలో అణుమాత్రం కూడా సందేహానికి ఆస్కారంలేదు. కాలేజి రోమియోలు ఈమె చుట్టూ పడిగాపులు గాస్తూ ఫాలోలు కొడుతూ ఫోజులు విసరుతూ పరిచయం కోసం తహతహలాడటం, ఆమె కనుసన్నలలో పడటానికి చేసే ప్రయత్నాలు ప్రకాశానికి తెలియనివి గావు. ఆమె గురించే ఆలోచిస్తూ గదికి చేరాడు. ఐదునిముషాల తర్వాత రామకృష్ణ, విశ్వం, మరికొందరు మిత్రులు బిలబిలా వచ్చారు.

"అదృష్టం అంటే నీదేనోయ్! మాంచి ఛాన్సు కొట్టావ్" ఛలోక్తి విసిరాడు. విశ్వం

"అంటే" ప్రకాశం సూటిగా అడిగాడు.

"అదీ నన్నడిగావా! ఏమీ-దెలియని నంగనాచిలా! రాధతో నీవు మాటాడటం నేను చూడలేదనుకున్నావా."

"చూ సే"

'అబ్బ అలా అడిగితే ఎలారా! అదృష్టం నీదే అన్నాను.''

"అబ్బాయ్, విశ్వం ఇంత వయసొచ్చినా నీ పిల్లచేష్టలు విడిచిపెట్టలేదురా? నీకు విషయ పరిజ్ఞానమే లేదు. అమ్మాయి అబ్బాయిని పలుకరించగానే యిన్ని పెడర్థాలా! ఎంత అజ్ఞాన హృదయంరా నీది. అన్నా చెల్లెళ్లు, అక్కా-తమ్ముళ్లుగా, మిత్రులుగా ఎందుకు భావించరో అర్థంగాలేదు. కేవలం గుడ్డిగా కాముకీ కాముకుల సంబంధాలు కల్పించటంలో నీ విజ్ఞానమెంత దాగివుందో గ్రహించుకో? ఇంత చదువూ చదివి ఇంకా సంకుచిత భావాలుంచుకొని భవిష్యత్తులో ఎలా జీవించగలవోయ్? విశాల మనస్తత్వాన్ని అలవరుచుకోవాలి. పుట్టగానే ఎవరికీ ఏదీరాదు. వయస్సునుబట్టి, విద్యనుబట్టి గుణాలు మార్చుకోవాలి. ఆ అమ్మాయి మీ అందరిలా నాకు కృతజ్ఞతలు తెల్పటానికి వచ్చింది. ఏదో పెద్ద డిటెక్షన్ చేసిన వానిలా వుంది నీ ధోరణి చూస్తే" కాస్త సీరియస్‌గానే అన్నాడు ప్రకాశం.

"నేనేదో హాస్యానికంటే నీవేమిటో ఇంత గంభీర ఉపన్యాసం దంచేశావ్"

"హాస్యానికీ అవధులుంటాయి. ఎదుటి మనసులను నొప్పించేది ఎన్నడూ హాస్యంగాదు ఇలాంటి విషయాలలో అసలే పనికిరాదు. నీమాటలే ఆ అమ్మాయి విన్నదనుకో, ఎంత బాధపడుతుందో యోచించు. ఆమె స్థానంలో నీ చెల్లాయి వుంటే యిలా అనగలిగేవానివా? ఎవరేనా అంటే అప్పుడు నీవెంత బాధపడేవానివి. 'తనలాగే అందరూ' అనే లౌకికజ్ఞానం పెంపొందించుకోవాలి. నేను నిన్ను మరీ చెడ్డవానిగా, అల్పుని క్రింద జమకట్టి ఈ మాటలంటున్నానను

కోకు. సాధారణంగా మన కాలేజీ విద్యార్థులలో వుండే గుణ మేయిది. మార్చుకుంటేతప్ప మనోవికాసం లభించదు."

క్షణకాలం అందరూ మౌనంగా వుండిపోయారు. విశ్వం మనసులో ఏవోభావాలు చెలరేగుతున్నట్టు అతని ముఖ కవళికల బట్టి గ్రహించాడు ప్రకాశం. ఆ నిశ్శబ్ద వాతావరణంలో అందరి ఆలోచనలూ క్షణకాలం ప్రకాశం మాటలమీదే పరుగెత్తాయి.

"రేయ్! ఇక ఈ ప్రసంగం మాని కాన్వాస్‌కి వెళ్దాం పదండి. మా ప్రకాశంతో వాదనకు దిగాలంటే వాటిని జీర్ణించుకొనే శక్తికూడా వుండాలి. ఇప్పుడు ఈ ప్రసంగాలకూ వాదనలకూ అవకాశంలేదు. ముందు కాన్వాస్‌కి వెళ్దాం పదండి" అన్నాడు రామకృష్ణ.

"ఓకే! " అన్నారు అందరూ!

ఆరోజే పోలింగ్. కాలేజంతా అట్టహాసంగా, గల భాగా వుంది. ఎటువిన్నా అరుపులూ, నినాదాలు.

"దయచేసి మీ ఓటు మాకివ్వండి మరిచిపోకండి".. "నేను శక్తికిమించి మీకు సేవ చేస్తాను; మరీమరీ అర్థిస్తున్నాను."

"మిమ్మల్నే నమ్ముకున్నాను ఏంచేస్తారో" . . . . ఇలాంటి అభ్యర్థనలూ, ప్రార్థనలూ ప్రతి అభ్యర్థినోళ్ళలోనూ అతని సహచరుల నాలికలపైనా విరామంలేకుండా నాట్యం చేస్తున్నాయి.

శేఖర్ కాలేజి ఆవరణముందు జీపుతోసహా వచ్చాడు, అందులో మైక్ సెట్ అరేంజి చేసివుంది. నూతన సినిమా

టలతో కళాశాల కుడ్యాలు ప్రతిధ్వనిస్తున్నాయ్! ఎటుచూ సినామురాలు! ప్రతిఆడపిల్లచుట్టూ ఐదారుగురూ! మాకి వ్వండి అనిఒకరంటే, మరవకండి అనియింకోకరు. అంతా రణ గొణ ధ్వనులు. పెద్దతిరుణాలవలె తయారయింది కళాశాల.

ఓటింగు ప్రారంభమయింది. అంతవరకూ వున్నగలభా కాస్త తగ్గింది. అయినా గుసగుసలు వినపిస్తూనే వున్నాయి. శేఖర్ తనదే విజయం అనకొని విర్రవీగుతున్నాడు. ప్రకా శం సహచరులు అతనివేపు ఒక అల్పుని క్రింద జమకట్టి చూస్తున్నారు. శేఖర్‌కు వళ్ళుమండింది. మీసాలపై చెయ్యి వేసి, సగర్వంగా వారికి చూశాడు. ప్రకాశంఅతని మూర్ఖతకు నవ్వుకున్నాడు.

ఓటింగు పూర్తయింది. ప్రతివిద్యార్థి ఎవరికివారే మీకే ఓటేశామని అభ్యర్థులకు తెల్పుతున్నారు వేయనివా రితోసహా.

మధ్యాహ్నం రెండు గంటలనుండి కౌంటింగ్ ప్రారం భమయింది. మొదట 'యూనియన్ సెక్రటరీ' ఓట్లు లెక్కిం చారు. ఆతర్వాత ఆంధ్రసారస్వత సంఘపు ఓట్లు లెక్కించ సాగారు. మొదటి నూరు బ్యాలెట్లలోనూ, మూడుభాగాలు శేఖర్‌కు వచ్చాయి. శేఖర్ ముఖంలో విజయగర్వం తాండ విస్తోంది. "చూడరా మన తడాఖా," అనే భావంతో రామ కృష్ణవేపు చూశాడు. రామకృష్ణ చెదరలేదు; ప్రకాశం గంభీ రంగా వుండిపోయాడు. మూడు వందలు లెక్కించేసరికి యిరు వురకూ సమానత లభించింది ఆరువందలు పూర్తిఅయేసరికి

ప్రకాశానికి వందఓట్లు మెజారిటీ లభించింది. రామకృష్ణ మింగేవానిలా శేఖర్ వేపు చూశాడు. "ఇంకా ముందుం దోయి ముసళ్ళ పండుగ" అన్నట్లు వురిమాడు శేఖర్.

కౌంటింగ్ పూర్తయింది. ప్రకాశం నాలుగు వందల పైచిలుకు ఓట్లమెజారిటీతో ఘనవిజయం సాధించాడు. నినాదదాలతో కాలేజంతా మారు మ్రోగింది! ప్రకాశాన్నందరూ అభినందించారు. ఓటువెయ్యని వారుకూడా వచ్చి, మేము కూడా వేశామని చెప్పుకున్నారు. శేఖర్ కాలేజి ఆవరణంతా గాలించినా పత్తాలేడు. రామకృష్ణ తన వుత్సాహానికి, ఆనందానికి, అవధులు కల్పించుకోలేకపోతున్నాడు.

మరురోజు సాయంత్రం ఎన్నికయిన అభ్యర్థుల ఉపన్యాసాలు జరుగవలసి వుంటుంది. కొందరు ఎన్నికైన అభ్యర్థులు వాటిని కంఠతా కొట్టటానికి అపుడే ప్రారంభించారు. ప్రకాశంకు ఆబెడదలేదు. అతను స్కూలు స్టడీసునుండి ఎన్నో వక్తృత్వపు పోటీలలో పాల్గొని విజయాలు సాధించాడు.

డ్రామాహాలులో ఉపన్యాసాలు ప్రారంభమయ్యాయి. ప్రతిఅభ్యర్థి, తన్నుగురించి, తనుగావింపబోయే సేవ గురించి ఉద్ఘాటించుకొనసాగారు. రాత్రి తొమ్మిది గంటలయింది... ప్రకాశం వేదిక నెక్కాడు. వేదికమీద నిల్చొనగానే అతని చూపులు ముందువరుసలో కూర్చొనున్న రాధపై ప్రసరించాయి. ఆమె ప్రకాశంకళ్ళలోకి సూటిగా చూసింది. ఆచూపులలో ఎన్నో ధన్యవాదాలు తెలుపుతున్న భావనలు ప్రకాశంకు గోచరించాయి. ప్రకాశం మందహాసం

గావించి మైక్ ముందు నిలబడ్డాడు. ఆమెచూపులు తనశరీ రాన్నంతా దోచివేస్తున్నట్టుగా ఫీలయ్యాడు ప్రకాశం. ఏమిటా చూపులకంత మహత్తు ... అనుకొన్నాడు.

అరగంటకాలం అనర్గళంగా ఆంధ్రసాహిత్యవైశిష్ట్యం గురించి, వాటి ప్రాముఖ్యతనుగురించి, సారస్వత మాతకు తాను సాధ్యమైనంత అందరి సహకారంతో న్యాయం చేకూ రుస్తానని వివరించి ముగించాడు. అతనిధోరణి ఒక కొత్త పంథాలో సాగింది. అందరిలా ఈ ఎన్నికలగురించి ఎక్కడో గాని ప్రస్తావించలేదు అదొక విలక్షణమైన పద్ధతి.

ఉపన్యాసం పూర్తికాగానే హాలంతా చప్పట్లతో నిండిపోయింది. వేదిక దిగుతూ యథాలాపంగా రాధవేపు చూశాడు. ఆమెచప్పట్లు చరుస్తోంది. అధరాలపై వింత లాస్యం, కళ్ళలో ఏవో ఆశాభావాలు, ముఖంలో అనిర్వచ నీయ అస్పష్ట ఆనందరేఖలు ప్రకాశం అరక్షణంలో చూడ గలిగాడు. తన విజయం ఆమెలో యింత ఆనందాన్ని రేకె త్తించిందంటే నమ్మలేకపోయాడు. ఉపన్యాసాలన్నీ ముగి యగానే అందరూ వెళ్లిపోయారు. రామకృష్ణ, ప్రకాశం తెలుగు ఛీఫ్ 'నండూరి' గారితో ఏదో చర్చిస్తూండిపోయారు. అందుచే కాస్తఆలస్యమయింది. అప్పటికే అందరూ వెళ్ళి పోయారు. హాలంతా నిశ్శబ్దంగావుంది. సంభాషణ ముగి యగానే శలవు తీసుకొని వారు హాలుదాటి బయటకు వచ్చారు. ఎవరో పొడిదగ్గుదగ్గినట్టయింది. ఇద్దరూ శబ్దం వచ్చిన వేపు చూశారు.... రాధాదేవిగారు.... ప్రకాశం తన కళ్లను తాను నమ్మలేకపోయాడు.

"ఏమండీ ఒంటరిగా వున్నారు?" అడిగాడు ప్రకాశం.

"మీరున్నారుగాతోడు" ఆమె కిలకిలానవ్వింది. ఆమె ధోరణికి ప్రకాశంకన్నా రామకృష్ణ అధికంగా ఆశ్చర్య పోయాడు.

మళ్ళీ ఆమె అంది. "మీరు చాలాబాగా వుపన్యసించారు. మీలోని ఈ వైజ్ఞానిక ప్రతిభే మిమ్మల్ని విజయుల్ని చేసింది."

"కృతజ్ఞుణ్ణి"

ముగ్గురూ మెట్లుదిగి క్రిందకు వచ్చారు. ప్రకాశం ఏదోఆలోచిస్తూండిపోయాడు. రామకృష్ణ వారిద్దర్నీ తదేకంగా చూస్తున్నాడు.

మెట్లుదిగి ఆవరణంలో చేరగనే రాధ, "మీతోసావకాశంగా మాటాడాలని వుంది. వీలుంటే ఎప్పుడైనా ఈ అడ్రసుకురండి" అంటూ ఒక చీటి అందించింది.

"నాతోనా?"

"అవును"

"ఎందుకూ?"

"కారణం అట్టేలేదు. తర్వాతచెబుతాను. వస్తానండీ" అని వెళ్ళిపోయింది.

రామకృష్ణ ప్రకాశంవేపు ఏమిట్రాయిది అన్నట్టు చూశాడు. ప్రకాశం తలపంకించాడు.

"ఇంతకూ ఆమె అభిప్రాయం" రామకృష్ణ అడిగాడు.

"అదే నాకూ అర్థంగాలేదు. బహుశా ఏదో కారణం వుండవచ్చు. రెండు సంవత్సరాలుగా ఒకే క్లాసులో వున్నా ఎన్నడూ పరిచయమూ లేదు, పలుకరింపూ లేదు."

"అయితే నీకర్థంగాలేదన్నమాట"

"ఊహూ"

"అమాయకుడవురా, ముంముందు నీకే అర్థమవుతుంది"

ప్రకాశం మౌనంగా వుండిపోయాడు. ఆమె ప్రవర్తన ఏవిధంగానూ అర్థంగాలేదు. సావకాశంగా మాటాడవలసిన అవసరం! అదీ ఇంటిదగ్గర కలవాలట!! ఏదీ అర్థంగాలేదు...

కాలేజీ ఆవరణ దాటి బయటికొచ్చారు. వెన్నెలనీడ ముందుగా నడుస్తూంది. వారు దాన్ని అనుసరిస్తున్నారు.

# 3

రామయ్యగారు తనజననము, బాల్యము, యౌవనము కౌమార్యము, గార్హస్థ్యము అన్నీ ప్రస్తుతము వుంటున్న రామాపురంలోనే గడిపాడు. రామాపురాన్ని కేవలం ఒకపల్లెటూరు అనటానికి ఏమాత్రం ఆస్కారంలేదు పట్టణఛాయలందులో పూర్తిగా గోచరిస్తాయి. దాదాపు వేయీ ఐదు వందల నివాసాలపై బడుంటాయి. గ్రామంలో పురాతన కట్టడాలుగల గృహాలు ఏకొద్దిగానో కన్పిస్తాయి. పట్టణంలోని కాలనీలవలె, వరుసదీర్చి అధునాతినపద్ధతిలో కట్టబడి

ఉన్నాయి. గ్రామం చాలా విశాలంగా వుంటుంది. గ్రామం లోని ఏకొద్ది గృహాలో తప్ప చాలావరకు అంటు మిద్దెలు లేవు. వీథులు విశాలంగా, అతుకు బొతుకులు కన్పించ కుండా వున్నాయి. గ్రామంలోని ఏవీథినయినా, బండి వెళ్ళేందుకు విశాలంగా, వీలుగా, సౌకర్యంగా వుంటుంది. ఆ గ్రామంలో రోజుకు అణా సంపాదించే వాడు మొదలుకొని కొన్ని వందలు సంపాదించేవారివరకూ వున్నారు. చుట్టు పట్ల పల్లెలన్నిటికీ రామాపురం ఒక హెడ్ క్వార్టర్ లాంటిది అన్ని పల్లెలకు వ్యాపార కేంద్రం యిది. అందుచే నాగరకత రామాపురవాసుల ప్రతిముఖంలోనూ కన్పిస్తుంది. తాలూకా, తర్వాత చెప్పుకోదగ్గ గ్రామం యిది.

గ్రామం చూడటానికి రెండుభాగాలుగా, కన్పిస్తుంది. ఒకటికోట, మరొకటి పేట అంటారు. ఈపేర్లు గ్రామంఎప్పుడు పుట్టిందోగాని అప్పట్నుంచీ వున్నాయి. కోటకు పేటకు మధ్య ఆరేడు గజాల ఎత్తుగల శిధిలమైన ఒకపెద్ద గోడవుంది. దాని నందరూ కోటగోడ అంటారు. పూర్వానికి దీన్నెవరో పాలెం గాళ్ళు పాలించారని, అప్పుడీ కోటగట్టారని ప్రతీతి. ఇప్పటికి దాదాపు 12 గజాల ఎత్తుబురుజులుకూడా వుండేవట. అవన్నీ శిథిలమైపోగా అక్కడక్కడకొద్దికొద్దిగా గోడమాత్రంమిగిలింది.

వైశాల్యంలోగాని, గృహాలలోగాని, పేటకంటె కోట చాలచిన్నది. బహుశా మూడువందల కుటుంబా లుండవచ్చు. కోటలో రెడ్డిరాజుల ప్రాచ్యవైభవ చిహ్నాలు యిప్పటికీ కొద్దికొద్దిగా కన్పిస్తాయి. రెండుమూడు బ్రాహ్మ ణకుటుంబాలుతప్ప మిగతా అన్నీ కాపువారివే. పూర్వానికీ

కోటపేరు 'రెడ్డిపాలెం' అని జనవదంతి. కానీ నేడాపేరు కాలగర్భంలో కలసి రామాపురంగా మారిపోయింది. పేటలో నానాజాతిసమితి నివాసులను ఈనాడు చూడవచ్చు. పేటలో అర్థభాగం కమ్మవారిది స్థానము. ఆ తర్వాత బోయ వారిని లెక్కించవచ్చు.

కోటకు దక్షిణం వేపున దాదాపు ఆరుఫర్లాంగుల పొడవుగల చెరువుంది. చెరువు లోపల వైశాల్యము దాదాపు వంద ఎకరాలుండవచ్చు. ఆ చెరువుకు రెండుతూములు. ఎందుకో గాని ఒకదానికి 'కుంటితూము' అనిపేరు పడిపోయింది. అదిసార్థక నామధేయం గలది. దానికి ఒకద్వార మంటూ లేదు ఇంకొక తూముకు కొన్ని సంవత్సరాల క్రితం ద్వారం వుండేదట. కాని ఈమధ్య అది గ్రామంలోని కొందరి పెద్ద మనుషులవల్ల అపహరించబడిందని వినికిడి. అప్పట్నుంచి మళ్ళీ వేయించాలని ఎవరూ తలంచలేదు. అందుచే చెరువుకు నీరంటూవస్తే ఆ రెండుతూములగుండా నిరాటంకంగా స్వేచ్ఛగా ప్రవహించేది. అందువల్ల ఎంత నీరొచ్చినా కొద్ది మాసాలలోనే సంపూర్తి చెందేవి వాటికొక ద్వారబంధం వేయిద్దామని యింతవరకూ ఎవరూ తలచినట్టు లేదు. ఆ గ్రామీణుల సంఘీభావం అటువంటిది. చెరువు మధ్య దాదాపు ఐదు వందల తుమ్మచెట్లుంటాయి. ఆవేపు ఎవరేనా షికారంటూ, వెళితే సారాయి కంపు కొట్టటంపరిపాటి. అది ఆ గ్రామ బోయవారి మహాత్మ్యం. రామాపురానికి ఒక ఔట్‌పోస్ట్ కూడా వుంది. పోలీసులకు ఆ బోయలకు దోస్తీ జాస్తీ. ఎవరేనా పెద్ద ఆఫీసర్లు వచ్చేపక్షంలో పోలీసులే

వీరికి ఇన్ఫర్మేషన్ యిచ్చేవారు. దొంగలకు పోలీసులకూ ఆమాత్రమైనా సంఘీభావం వద్దా మరి.

మూడువత్సరాలక్రితం ఆ గ్రామానికి మాధ్యమికపాఠశాల ఏర్పడింది. ఈ సంవత్సరం ఫోర్తుఫారంకూడ శాంక్షన్ అయిందట. కాని భవననిర్మాణం యింతవరకూ జరగలేదు. గ్రామంలోని కక్షలూ వ్యవహారాలే అందుకు కారణ మనవచ్చు.

స్వాతంత్ర్యం రాకముందునుంచే ఈ గ్రామానికి పంచాయితీ ఏర్పడింది. అప్పట్లో గ్రామంలో కమ్మవారికి కాపువారికి పెద్దపార్టీ ఏర్పడింది. ఆ పార్టీల పుణ్యమా అంటూ అంతవరకూవున్న హయ్యర్ ఎలిమెంటరీస్కూల్, హాస్పటల్ మూసివేయబడ్డాయి. ఈ పార్టీల సంరంభం ఆరేళ్ళపాటు నిర్విఘ్నంగా సాగింది. పది, పండ్రెండువరకూ హత్యలుకూడా జరిగినట్టుజ్ఞాపకం. ఈ కక్షలవల్ల గ్రామంలో అర్థభాగం ఆర్థికంగా దెబ్బతింది. స్వాతంత్ర్యం మనకు సిద్ధించేటప్పటికి యిరుపార్టీలూ కాస్త్రాచల్లబడ్డాయి. కాని చితోష్ణభస్మంలా, ఆవేడి వారిగుండెల్లో యిప్పటికీ రహిస్తూనే వుంది. ఆ కక్షను సాధ్యమైనంతవరకూ గ్రామ వ్యవహారాలలో తీర్చుకుంటూ మానసికంగా తృప్తిపడేవారు. గ్రామ పంచాయితీ అధ్యక్షుడుగా ప్రస్తుతం ఒక కమ్మ ఆసామి వుంటున్నాడు. కాపులు ఈపదవికి తెగ ప్రయత్నించారు కాని లాభంలేకపోయింది. పోగా వారిలో ఈ విషయాన్ని గురించి పగ కాస్తా ప్రజ్వరిల్లింది.

ఇదీ రామాపురంయొక్క సంక్షిప్త సామాజిక చరిత్ర. విపులంగా వ్రాయాలంటే భారతమవుతుంది.

వెంకట్రామయ్యగారి గృహం పేటలో పెద్దవీథిలో మొదట్లోనే వుంది. ఇల్లు పురాతన గృహమే అయినా కొద్ది సంవత్సరాలక్రితం, పైకప్పు తీయించి మరీ నూతనంగా కట్టించటంతో, కొత్తగా కన్పిస్తుంది ఇంటిగోడలకు పచ్చరంగు వేయించాడు. లోపల ప్రత్యేకంగా రెండుగదులు నిర్మించి, పూర్వపు ఛాయలనేమాత్రం కన్పించకుండా తీర్చిదిద్దాడు. ఇంటిముందు పెద్దనడవ - వసారా. వసారా కటూ యిటూ రెండు కొత్తగదులు, వసారాలో నాలుగయిదు కుర్చీలూ, రెండు మేజాలు. ఒకప్రక్క ఫిలిప్స్ రేడియో నాగరకత ఆ గృహంలో ప్రతిబింబిస్తోంది. గ్రామానికి నాలుగైదు సంవత్సరాలక్రితం ఎలక్ట్రిసిటీ వచ్చింది. అందుచే గృహంనిండా జ్యోత్స్నలు వెదజల్లేలా, విద్యుత్ దీపాలు అమర్చాడు. గ్రామంలో అడుగుపెట్టగానే మొదట కనిపించే యిల్లు రామయ్యగారిదే.

అదే గ్రామంలో కథాకాలానికి ఐదు సంవత్సరాల క్రితం, పేరుమోసిన మోతుబరిరైతు తిమ్మయ్య, అప్పట్లో ఆ ఫిర్కా అంతటా పెద్దభూస్వామి. అతని సంతానం, ఒక మగపిల్లవాడు, ఒక ఆడపిల్లమాత్రమే! కుమార్తెను తన మేనల్లునికే యిచ్చి పెళ్ళిచేశాడు. పెళ్ళయి సంవత్సరం తిరక్కముందే ఆమె ఎవరితోనో లేచిపోయింది. దీనికి కారణం ఆమె భర్త నపుంసకత్వమేనని అందరూ అంటారు. తిమ్మయ్య పరువు ప్రతిష్ఠలన్నీ ఆ ఒక్క సంఘటనతో మంట

గలశాయి. అతని భార్య ఎప్పుడో మరణించింది కూతురు చేసిన ఈ దౌర్భాగ్యపు నీచకార్యం భరించలేక ఆత్మహత్య చేసుకొని తృప్తిచెందాడు. ఇక కుమారుడు వెంకయ్య. అతనికీ ఆ సంవత్సరమే వివాహమయింది. అతని భార్య ఆ గ్రామానికి 'హెలెన్' లా తయారయింది. భర్త ఎప్పుడూ ఇంటిపట్టున వుండడు. అసలేజూదరి. అందుకుతోడు త్రాగుడు, వ్యభిచారం. ఆమె విరోగాన్ని భరించలేకపోయింది. ఆస్తి జూచి వివాహం జరిగింది. అతనినడవడి ముందుగా తెలుసుంటే ఈ వివాహం జరిగేదికాదేమో! కాపురానికి వచ్చిన నెల రోజులలోనే ఆమె గురించి గుసగుసలు ప్రారంభమయ్యాయి. భర్త వెంకయ్యకు కూడా ఈ విషయం చూచాయగా తెలిసింది. సంవత్సరం జరిగేసరికి ఆమె విటుల సంఖ్య వందల లెక్కలో తేలింది. ఒకనాడు వెంకయ్య ఆమెను పరపురుషుని ప్రక్కన నీచస్థితిలో చూడవలసి వచ్చింది. నెలరోజులు తిరిగే సరికి ఆమెకు విడాకులిచ్చినట్లు గ్రామమంతా గుప్పుమని ప్రాకిపోయింది.

ఇక లంకంతఇంట్లో ఒక్క వెంకయ్యమాత్రం మిగిలాడు. చాలామంది బంధువులు ఆస్తికోసం పిల్లనిస్తామని అర్రులు చాచారు. వెంకయ్య అందుకు విముఖత చూపించాడు. త్రాగుడు, జూదం, వ్యభిచారం నిర్విఘ్నంగా కొనసాగింది.

ఐదుసంవత్సరాలు గడిచేసరికి మూడుభాగాలు ఆస్తిని తెగనమ్మాడు వెంకయ్య. ఇక కొద్ది ఆస్తిమాత్రమే మిగిలింది. ఇల్లు స్మశానంలా తయారయింది. వెంకయ్య తన మిగిలిన

పాతికవేల రూపాయల కిమ్మతుచేసే ఆస్తిని కూడా అమ్మ టానికి పూనుకున్నాడు. చాలామంది వారించారు. అందులో ఆరభాగం వెంకటరెడ్డికి అమ్మి డబ్బుతీసుకొనివెళ్ళి, ఆరు నెలలతర్వాత మళ్లీ ప్రత్యక్షమయ్యాడు రామాపురంలో.

వచ్చీరావటంతోనే నేరుగా వెంకట్రామయ్యగారి యింటికి వెళ్లాడు. వసారాలో వాలుకుర్చీలో పడుకొని చుట్ట కాలుస్తూన్న రామయ్య ఆశ్చర్యపోయాడు ఇతని రాకకు.

"కూచో వెంకడూ!"

అతను కూలబడ్డాడు.

"ఏమిట్రా వెంకడూ, చివరికిలా తయారయ్యావ్! మన కులానికే అప్రదిష్ట తెచ్చావ్రకదరా? ఇప్పటికైనామించి పోయిందిలేదు. నే నెక్కడైనా పిల్లనుచూసి పెళ్ళిచేస్తా, బుద్ధిగా వ్యసనాలుమాని ఇంటిపట్టునవుండు," అంటూ, తన మాటలు వింటున్నాడా లేదా అని ఆతనివేపు సాభిప్రా యంగా చూసి, నిరుత్సాహం చెందాడు.

"ఇదో బాబాయ్! నాకీ వుపన్యాసాలు కొత్తగాదు!! వచ్చినపని కాస్త చెప్పేస్తాను. ఆ తర్వాత..."

"నాతో మిగిలిన రాచకార్యమేమిటోయ్"

"చూడు బాబాయ్! నా మిగిలిన ఆస్తి పన్రెండు వేలు ధారాళంగా చేస్తుందని నీకు తెలుసు! కాని ప్రస్తుతం డబ్బు అవసరం! ఆరువేలిచ్చావంటే నీ పేర రిజిష్టర్ చేయి స్తాను" అన్నాడు.

రామయ్య ఆశ్చర్యపోయాడు, "ఇంతకూ నా దగ్గర డబ్బెక్కడిది?"

"బాబాయ్, సన్నిహితుడవని మీకు యివ్వదలచు కున్నా. సాయంత్రం మళ్లీవస్తా ఇష్టముంటే డబ్బు తెచ్చి సిద్ధంగావుండు" అని వెళ్ళిపోయాడు.

రామయ్య బాగా ఆలోచించాడు. నాలుగెకరాల బంగారంలాంటి మాగాణి. నిజంగా పంద్రెండు వేలు చేసేదే! డబ్బువుండి కొనగలిగితే తను అదృష్టవంతుడు. అందులోనే సంవత్సరానికి రెండు వేలపంట ధారాళంగా తీయవచ్చు! కాని డబ్బు ఎలా?

రెండుగంటలు దీర్ఘంగా ఆలోచించి, ఒక నిశ్చిత నిర్ణయాని కొచ్చాడు. వెంటనే రెండుమైళ్ళదూరంలోఉన్న తన బావమరిది గ్రామంవెళ్ళి, అతనితో అన్ని విషయాలు చెప్పాడు. ఆయనకెంతో ఆనందమయింది. రామయ్య అడిగితేచాలు ఇచ్చే స్థితిలో వున్నాడు. అందుకు కారణం, రామయ్యగారి కుమారుడు ప్రకాశానికి తన కుమార్తె నివ్వాలనే బలీయమైన వాంఛ! వెంటనే అతనడిగిన ఆరువేలూయిచ్చి పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు.

"ఇక నాదేముందోయ్! ఈ సంవత్సరం ఇంటర్ పూర్తికాగానే నీ కప్పచెప్పుతాను. వాణ్ణి డాక్టరీ చదివించటమూ, పెళ్లిచేయటమూ అంతా నీ బాధ్యతే" అన్నాడు.

ఆ సాయంత్రానికే తిరిగి గ్రామంవచ్చాడురామయ్య. రాగానే వెంకయ్య కన్పించాడు. ఇద్దరు సాక్షుల్ని పిలుచుకొని వెంటనే తాలూకా టౌన్‌కు వెళ్ళారు. మరురోజు ఒంటిగంటకు రిజిస్ట్రేషన్ పూర్తయింది. రామయ్య అందరి సమక్షంలో డబ్బుచెల్లించాడు. ఈ విషయం అంతవరకూ

గ్రామంలో ఎవరికీ తెలియదు. అంతాగంటలమీద జరిగి పోయింది.

రెండురోజులలో గ్రామమంతా ఈ విషయం తెలిసి పోయింది. చాలామంది రామయ్య అదృష్టానికి ఈర్ష్య పడ్డారు. కొందరేదో మోసంచేశాడని కూడా అనకపోలేదు.

రామయ్య ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసు కున్నందుకు, తన తెలివికీ, తన ఘనతకూ తనే గర్వించాడు. ఇక తన కష్టాలన్నీ గట్టెక్కుతవి. ఈరోజు ఆరువేలకుకొన్న భూమిని మరుక్షణంలో అమ్మినా రెట్టింపు లాభం లభిస్తుం దన్న ధీమా అతనికుంది. ఎంతైనా రామయ్య లౌక్యుడు!

వెంకటరామయ్యగారు భూమికొన్న విషయం తెలిసి అంతవరకూ ఆ భూమిని కౌలుకు తీసుకొని, సాగుచేసుకొం టున్న వెంకయ్య బంధువులకు గుండెల్లో అగ్గిమండింది. ఎలా గైనా ఈ భూమి సంపాదించుకోవాలన్న ఆశ వారికి ముందు నుంచీ వుంది. డబ్బుతోగాక, మోసంతో ఆస్తి తమ పరం చేసుకోవాలన్న వీరి కోర్కె ఈనాడీ విధంగా తలక్రిందు లయిపోయింది. తమ కీ విషయం చూచాయగా తెలిసి వున్నా వెంకయ్యకు ఆ డబ్బు తామే ఏదో విధంగా ముట్ట చెప్పేవారు. ఎంత గుట్టుగా రామయ్య ఆస్తిని కాజేశాడు! వారికోపం తారాపథాన్నందుకుంది.

ఇంత కక్షను ప్రదర్శిస్తున్న ఈ సాంబయ్య, దేవ య్యలు వెంకట్రామయ్యగారి కులస్థులేకాక దగ్గర బంధువులు కూడా! కాని ఈ సంఘటన వారిలో బంధుత్వాన్ని తెంచి కక్షను తలెత్తేలా చేసింది. సాంబయ్య దృష్టిలో వెంకటరెడ్డి

మొదిలాడు. ఎలాగైనా భూమిని సాధించాలనే మొండిపట్టు అతనిలో ప్రవేశించింది.

ఆ సాయంత్రం సాంబయ్య, దేవయ్యలు కలిసి రహస్య సమాలోచనలు ప్రారంభించారు. దీనిని పరిష్కరించటంలో వెంకటరెడ్డి సాయం కోరవలసి వచ్చింది. వెంకటరెడ్డి పేరు ఆచుట్టుపట్ల పల్లెలన్నిటిలో ప్రసిద్ధి. కోర్టువ్యవహారాలలో అతన్నిమించిన చెయ్యి ఈ ప్రదేశాలలో ఎక్కడా లేదని చెప్పుకుంటారు. పదిసంవత్సరాల కోర్టు అనుభవం అతనిలో మంచి దక్షత, ప్రతిభ సంపాదించిపెట్టింది. అతనితో వ్యవహారానికి దిగినా ఎవ్వరూ నెగ్గుకు రాలేరని ప్రతీతి. ఐదారు ఖూనీలుచేయించికూడా తప్పించుకోగలిగాడు. ఇది గ్రామస్థులందరకూ తెలుసు. అందుకే అతనంటే జడుస్తారు. లెక్కకు మించినన్ని భూముల వ్యవహారాలలో దిగ్విజయం సంపాదించాడు. అందుకే అతనివైపు ఈ విషయంలో మొగ్గారు సాంబయ్య దేవయ్యలు.

విషయమంతా విన్న తర్వాత వెంకటరెడ్డి ఈ అవకాశాన్ని ఏ మాత్రం జారవిడుచుకో కూడదనుకున్నాడు. వెంకట్రామయ్యకు యితనికి పాతకక్షలు చాలా వున్నాయి. ఈ విధంగానైనా రామయ్యపై కక్షతీర్చుకోవచ్చని వెంకటరెడ్డి తలంచాడు. సాంబయ్యకు వెంకటరెడ్డికి మధ్య చాలా లావాదేవీలున్నాయి. ఈ భూముల వ్యవహారం జయిస్తే తనకో భాగం ఇచ్చేపక్షంలో ఇందులో తలదూర్చగలనని నిర్మొహమాటంగా చెప్పేశాడు వెంకటరెడ్డి. వెంకటరెడ్డితో వ్యవహారం కత్తిమీది సామువంటిది. ఆలోచించి సాంబయ్య

అంగీకరించాడు. దమ్మిడీ ఖర్చులేకుండా భూములన్నీ మీపరం చేయగలనని వెంకటరెడ్డి తన మెదడునంతా ఖర్చుపెట్టి, ఆలోచించి చెప్పేశాడు.

“ఎలాగయినాసరే రెడ్డిగారూ, మీ ఇష్టప్రకారమే గాని. బంగారంలాంటి భూమిని చేజేతులా వదలుకోలేను” అన్నాడు సాంబయ్య.

“సాంబయ్యా, రామయ్యా రిజిస్ట్రీషను చేయించుకొన్నంతమాత్రాన, ఆస్తి అతని వశం ఎన్నటికీగాదు. వెంకయ్యగాణ్ని మెత్తచేసి చేతుల్లో కొన్నివందలు పారవేస్తేచాలు. అవతల సంగతి నేను చూసుకుంటాను” అన్నాడు రెడ్డి ధీమాగా.

“ఏమో మిమ్మల్నే నమ్ముకొన్నాను. రేపుసాయంత్రం లోగా వెంకయ్యనెక్కడున్నా పిల్చుకొస్తాను.”

“భేష్! అదే మనకు కావలసింది. వాణ్ని పట్టుకొస్తే చాలు, తతంగం అంతా నేనే నడిపిస్తాను. ఈ విషయం ఎవరికీ తెలియకూడదుసుమా!” అన్నాడు వెంకటరెడ్డి.

## 4

సాయంత్రమయింది. సంజారుణ కిరణాలు, ఎర్రటి భూభాగంపై లోహద్రవంలా ప్రవహిస్తూ, భూమినంతటినీ, గోధుమవర్ణంలో ముంచెత్తుతూంది. ఆకాశంలో అంతవరకూ మాగడ తరకల్లా, స్వచ్ఛంగా స్వేచ్ఛగా, తేలియాడుతున్న మేఘాలు, క్షణంలో తమ రూపాలను మార్చుకొని

కసాయివాని కఠిన హృదయంలా, నల్లటి కారురంగులో నిగ్గుదేలాయి. హృదయంలో అంతవరకూ ఏదో అతిగాఢ రహస్యాన్ని దాచుకొని, ఒక్కసారిగా, భరించలేక, భోరున ఏడ్చిన తప్తజీవిలా, పిడుగుపెట్టిన మేఘం గర్జించింది. కన్నీటి ధారల్లా ప్రారంభమయిన వర్షం, కొద్దికాలంలో భోరున కుండపోతలా వర్షించ సాగింది.

పట్టణం ఉత్తరం వేపున రైలుకట్టమీద కూచొని ప్రకృతి, ప్రశాంతతలోని రసాన్ని ఆస్వాదన చేస్తూన్న ప్రకాశం క్షణంలోసంభవించిన ఈఅలజడికి, నిలువలేక, ఉన్న చోట నుంచి లేచి వడిగా పట్టణంవేపు నడక సాగించాడు. ఎంతవేగంగా ప్రయాణం సాగించినా, తనగది చేరాలంటే ఇరవై నిముసాల కాలంపట్టగలదు. ఈవర్ష ధాటికి తను ముద్ద కాగలడు. ఐదునిముషాలలో రామచంద్రనగర్ చేరుకు న్నాడు. వర్షానికితోడు, గాలి విసురుగా వీయసాగింది.

ప్రకాశం, వర్షధాటినుండి తన్నుతాను రక్షించుకొనే ప్రధానోద్దేశంతో, వీధికి దగ్గరనున్న, ఇంటివరండా చేరాడు. అచట నిల్చుంటే వర్షం తనపై పడదు. అయినా గాలితు పురకు, వణుకు పుడుతోంది.

ఐదు నిముషాలు గడిచింది. వర్షం తగ్గేసూచనలే మాత్రం కన్పించలేదు. వీధుల్లో అప్పుడే మునిసిపాలిటి లైట్లు వెలిగాయి. ఆ దీపకాంతులలో వర్షధాటి స్పష్టంగా కన్పి స్తోంది. అంతవరకూ తనునిల్చున్న ఈరక్షితగృహం ఎవరిదా అన్నభావనవచ్చాకగాని, ఇలా నిల్చోటం చూచి వారే మనుకుంటారో అన్న ఆలోచన అతనికి తట్టలేదు.

ఇంతలో ఆయింటి తలుపు నెవరో తెరచారు. వరండాలో విద్యుద్దీపం వెలిగింది. తలుపుగుండా ఎవరో బయటకు వస్తున్నట్టు, నిడస్పష్టంగా, గోచరించింది. ప్రకాశం తనక్కడ లేనట్టుగా, నిశ్శబ్దంగా వుండిపోయాడు.

"ఎవరూ," అప్పుడే వరండాలో ప్రవేశించిన ఆయింటి యజమాని ప్రకాశాన్ని పలుకరించాడు.

"వర్షం వస్తూంటే యిక్కడ నిల్చున్నానండి"

"లోపలకు రండి"

"ఫరవాలేదులెండి, కొద్ది నిముషాలుండివెళ్తా,"

"అంతవరకూ లోపలున్నా వచ్చే నష్టం ఏమీావుండదు"

ప్రకాశం యిక కాదనలేకపోయాడు. ఆ వ్యక్తివెన కాలే లోపలకు వెళ్ళాడు. ఆవ్యక్తికి ఏభయ్ వత్సరాల వయసుంటుంది. సన్నగా, పొడుగ్గా, ఎర్రగా, వున్నాడు. ముఖలక్షణాలను బట్టి మంచినాగరకుడనే గ్రహించవచ్చు!

"కూచోండి" ఆయనొక సోఫా చూపిస్తూ అన్నాడు. ప్రకాశం కూలబడ్డాడు. ఆవ్యక్తి ఒక టర్కీటవల్ తీసి అతని కిస్తూ "తల తుడుచుకోండి" అన్నాడు. వాతావరణం నిశ్శబ్దంగా వుంది.

ఆ వ్యక్తి ఏదో అడగబోతూండగా యింతలో వంటింట్లోంచి కాబోలు, ఒక యువతి ప్రవేశించి ఏదో తండ్రితో అనబోయి, నూతన వ్యక్తి అందుండటంవల్ల ఆపుచేసుకొని అతనివేపు పరీక్షగా చూసి ఆశ్చర్య, ఆనందాలతో, "ఓహ్! మీారా ప్రకాశంగారూ!" అంది. ప్రకాశం తనలోని ఆశ్చ

ర్యాన్ని అణచుకొని తన సహజ కంఠస్వరంతో "మీరా, రాధాదేవిగారూ! అయితే ఇది మీ ఇల్లేనన్నమాట" అన్నాడు.

"ఆనాడు మీరక్కడసిచ్చి రమ్మన్నా రాలేను. ఈనాడొచ్చి ఏమీ తెలియనివానిలా, "ఇది మీ ఇల్లేనా అనటం భావ్యమా ప్రకాశంగారూ!"

"అబ్బే! నే నింతవరకూ మీ యింట్లోనే వున్నానని పొరపాటునకూడా భావించలేను. వర్షంబారినుంచి రక్షించుకోవటానికి మీ యింటి పంచచేరాను" అన్నాడు ప్రకాశం.

"సరే! మీరు రాకూడదనుకున్నా విధి మిమ్మల్ని ఇక్కడకు లాక్కొచ్చిందన్నమాట" అంది

ఇంతవరకూ వీరి సంభాషణ నిశ్శబ్దంగా వింటూన్న ఆ ఇంటి యజమాని (రాధ తండ్రి) పెదవులపై స్నిగ్ధమంద హాసరేఖ ఉదయించింది. చిన్నగా నవ్వుతూ "అయితే ప్రకాశం నీవేనన్నమాట" అన్నాడు. ప్రకాశం ఈ ఏకవచన సంబోధనకు ఆశ్చర్యపోయాడు అంతవరకూ బహువచనంలో సంబోధించి, ఆహ్వానించిన ఆ వ్యక్తి నోటిగుండా ఇంతలోనే "నీవు" అన్న సంబోధన విని ఆశ్చర్యపోయాడు.

"నేనేనండీ" అన్నాడు.

"అయితే నన్ను గుర్తుపట్టలేదా?"

ఈ ప్రశ్న ప్రకాశంలోని ఆశ్చర్యాన్ని ద్విగుణీకృతం చేసింది. అయితే ఇంతకుముందే తను ఇతనికో, తనకు ఇతనో తెలుసుండాలన్నమాట! ఎంత ఆలోచించినా జ్ఞప్తికిరాలేదు. ఆ వ్యక్తి పకపకా నవ్వి, ఏమి ప్రకాశం ఆలోచిస్తున్నావ్!

నీ కింత వయసొచ్చిన తర్వాత జ్ఞప్తికి వున్నానా అడగటం నాదే పొరపాటు" అన్నాడు. ప్రకాశం నిశ్చేష్టుడై ఆతనివేపు రాధవేపు అయోమయంగా చూశాడు. రాధ కళ్ళు నవ్వుతున్నాయి.

"ఏమిటో మీ రనేది నాకేమాత్రం అర్థంగా లేదు. మిమ్మల్ని గుర్తించనందుకు క్షంతవ్యుణ్ని! మీరెవరో నాకు నిజంగా జ్ఞప్తి లేదు"

ఆ వ్యక్తి ప్రకాశంవేపు చూస్తూ చిన్నగా నవ్వి, రాధతో, "అమ్మాయ్! రెండు వేడికాఫీలు పట్రా" అని పురమాయించి ప్రకాశంకు అన్ని విషయాలూ చెప్ప ప్రారంభించాడు. రాధ కాఫీ తెచ్చేలోగా, అతను చెప్పటంకూడా పూర్తిచేశాడు. అతని మాటల సారాంశం యిది.

అతని పేరు రాజారావు. ప్రకాశం తండ్రి వెంకట్రామయ్యగారూ, రాజారావూ స్నేహితులు. పదునైదు సంవత్సరాల క్రితంవరకూ, రాజారావుగారి నివాసం కూడా రామాపురమే. ఆయన పుట్టింది నెల్లూరుజిల్లా. పెరిగింది గుంటూరుజిల్లా, పెళ్ళిచేసుకొన్నది కడపజిల్లా. ఉద్యోగం చేసింది యిదే జిల్లా రామాపురంలో, ఇదీ అతని చరిత్ర! దాదాపు పదిసంవత్సరాలు రామాపురంలో వైద్యునిగా పనిచేశాడు. ఆ పదిసంవత్సరాలలో డబ్బు బాగా గడించాడు. చుట్టుపట్ల పల్లెలలో అప్పటి కెక్కడా వైద్యసౌకర్యం లేదు. ఆర్. ఎమ్. పి. డాక్టర్‌గా ఆ గ్రామానికితన్ని అపాయింట్ చేశారు. నెలకు పై ఆదాయమే రెండువందలు మించి వుండేది. పది సంవత్సరాలలో పాతికవేలు సంపాదిం

చాడు. అంతలో గ్రామంలోఏర్పడ్డ పార్టీలవల్ల హాస్పిటల్ మూతపడటంచే ఆ గ్రామాన్ని వదలి, అంతటితో ఉద్యోగ విరమణ కూడాచేసి, పట్టణం చేరుకున్నాడు రామాపురంలో వున్నన్నాళ్ళు, రామయ్యగారికీ ఇతనికీ మంచి నేస్తం! పట్టణం చేరిన తర్వాత మళ్ళీ రెండు మూడుసార్లు రామాపురంవెళ్ళి మిత్రుల్ని పలకరించి వచ్చాడు. ఆ తర్వాత విరమించుకొన్నాడు. నెల్రకితం అతని కుమార్తె ఏదో సందర్భవశాత్తూ, రామాపురం అబ్బాయి ప్రకాశం తన క్లాసులో చదువుతున్నాడని చెప్పడంచే, రాజారావు చాలా సంతోషించి కుమార్తెతో, ఎలాగైనా అతన్నిచ్చటకు పిల్చుకురావాలనికోరటం జరిగింది. తన పాతనేస్తం రామయ్య గారి కుమారుడయినందువలన ప్రకాశంపట్ల ఈ విధమైన ఆపేక్ష జనించింది.

కాఫీ సేవించిన తర్వాత ప్రకాశం అన్నాడు, "నాకీ విషయాలింతవరకూ ఏమాత్రం తెలియవండీ! ఎప్పుడూ మా నాన్నగారు కూడా నాతో ఈ విషయాలను ప్రస్తావించలేదు. అసలు మీ రిక్కడున్నట్లే ఆయనకు తెలియదనుకుంటాను. మీ పరిచయం నాకెంతో ఆనందంగా వుంది."

ఆ తర్వాత రాజారావుగారు, రామయ్యగారి కుటుంబ విషయాల గురించి వివరంగా ప్రశ్నలడిగాడు. ఈ ప్రశ్న జవాబులతో అరగంటకాలం గడిచింది. రాజారావు మితవాది గాడు. అతివాదనే చెప్పాలి. పరిచయస్థులతో అతని సంభాషణ ఎప్పుడూ ఇదే ధోరణిలో సాగుతూంటుంది. ప్రకాశం

అతిక్లుప్తంగా తన సంభాషణ సాగించాడు. రాధ వీరి సంభాషణల మధ్య కేవలం ప్రేక్షకురాలిగా వుండిపోయింది.

వాన పూర్తిగా వెలిసింది. గడియారం ఎనిమిది గంటలు కొట్టింది. ప్రకాశం పైకిలేచాడు, "ఇక నే వెళ్తానండీ, వానకూడా వెలిసింది" అంటూ!

"ఇదేమిటి, ఇలా వెళ్ళటానికి వీల్లేదుసుమా! భోంచేసి వెళ్ళు" అన్నాడు.

"ఎందుకు లెండి" అనబోతూండగా, రాధ అందుకొని, "మీ హోటలు భోజనంకంటే ఏమాత్రం తీసిపోదు లెండి" అని ముగించింది. 'ఇక వీరు వదలరు' అనుకొని భోజనం గావించాడు. రాధ స్వయంగా వడ్డించింది రాజారావు నాలుక ఒక్క క్షణంకూడా విశ్రాంతి తీసుకోలేదు.

భోజనానంతరం ప్రకాశం సెలవుతీసుకొని బయలుదేరాడు. "నిత్యమూ వస్తుండాలి సుమా" హెచ్చరించాడు రాజారావు.

"మరిచిపోకండి" అంది రాధ.

ప్రకాశం గత సంఘటనను నెమరువేసుకొంటూ గదికి చేరుకొనేసరికి తొమ్మిదయింది. ఊహించనివిధంగా ఏర్పడ్డ ఈ అపరిచిత వ్యక్తుల పరిచయం ఇంత దగ్గరి పరిచయస్థులిగా తయారు చేయగలదని ప్రకాశం ఏ విధంగానూ భావించలేకపోయాడు. గత సంఘటన అతనిలో ఒక చిత్రమైన మధురానుభూతిని కల్గింపచేసింది.

గదిలో అడుగుపెట్టగానే అంతవరకూ ఏదో పఠిస్తున్న కృష్ణ తలెత్తి, "ఏమిటోయ్, పత్తాలేకుండా పరారయ్యావ్

సినిమా కెళ్దామని ఆరుగంటలనుండీ నిన్ను గాలించి చివరకు విరమించుకొని యిలా కూలబడ్డాను" అన్నాడు. వీరిమధ్య గల ఈ ఘనిష్ట స్నేహబాంధవ్యం ఏనాడూ, వీరు ఒంటరిగా ఎటూ వెళ్ళేలా చేయలేదు. ప్రకాశం చెంతలేకుంటే తనలో ఏదో లోపించినట్టుగా ఫీలవుతాడు రామకృష్ణ! అందుకే రామకృష్ణ అపుడపుడు ప్రకాశంతో, "ఒరేయ్ ప్రకాశం! నీవే ఆడపిల్లగా జన్మించివుంటే, నాలాంటి వారినెందరినో కొంగుకు కట్టుకొని త్రిప్పేవాడివి" అనేవాడు. అందుకు ప్రకాశం, "అంత కష్టపడాల్సిన అవసరం లేదులేవోయ్! ఆ స్థితిలోవుంటే నిన్నే నేను తప్పక 'లవ్' చేసేవాణ్ని" అనేవాడు నవ్వుతూ.

గదిలో ప్రవేశించి చొక్కావిప్పి దండెంపై వేసి కుర్చీలో కూలబడుతూ, "ఈనా డనుకోనివిధంగా ఒక విచిత్ర సంఘటన జరిగింది" అన్నాడు తను చెప్పబోయే విషయానికి ఉపోద్ఘాతం ప్రారంభిస్తూ! రామకృష్ణ వినటానికుత్సాహం చూపించాడు. విషయాలను ఒకదృశ్యంలా వివరించి చెప్పాడు ప్రకాశం. ఎప్పుడే విషయంచెప్పినా దృశ్యరూపంగా, కవిత్వ ధోరణిలో చెప్పటం అతని ప్రత్యేకత! అందుకే ప్రకాశం ఏదైనా చెప్పటంప్రారంభిస్తే అతిశ్రద్ధగా వింటారు మిత్రులు.

చెప్పటం ముగించిన తర్వాత రామకృష్ణ, "అందుకేగా, తమకు ప్రత్యేక ఆహ్వానాన్ని అందచేశారు రాధాదేవి గారు! నేనపుడే అనుకున్నాను. యిందులో ఏదో నిగూఢ రహస్యం నిక్షిప్తమైవుందని" అన్నాడు.

"అయినా ఈ విషయం మన మిత్రులెవ్వరికి తెలియ చేయనని నీవు నాకు మాటివ్వాలి. విని వాడాపు అందరూ అపార్థం చేసుకుంటారని నా అభిప్రాయం" అన్నాడు ప్రకాశం.

"సరే! మరికథంతా గుట్టుగానే జరుపుతారన్నమాట" అంటూ పకపకనవ్వాడు. ప్రకాశం కోపంగా చూసేసరికి ఆ నవ్వు ఆగింది. ఆ రూక్షణవీక్షణాలలోని భావాలను పసికట్టా లని ప్రయత్నించి విఫలత చెందాడు రామకృష్ణ! అంతటితో ఆ విషయాన్ని గురించిన ప్రస్తావన ముగిసి సినిమాప్రోగ్రాం వేపు దారితీసింది.

వారంరోజుల తర్వాత ఒక సెలవురోజున, ఉదయం ఎనిమిదిగంటలు దాటిన సమయంలో ప్రకాశం రాజారావు గారింటికి బయలుదేరాడు. గత వారంరోజులలో రెండుసార్లు వెళ్దామనే ప్రయత్నించాడుగాని అతని అంతరాత్మ నిర్దు ష్టంగా అంగీకరించలేకపోయింది. అతిగా రాకపోకలు సాగిం చటం ఆత్మాభిమానానికి లోటువని అతని వుద్దేశం. కారణం అంటూ ఏదీ ప్రత్యేకంగా లేని సందర్భంలో మరీ మరీ వెళ్ళటం అతనికి మనస్కరించలేదు. మొన్నటిరోజున కాలే జీలో రాధ, "ఏమండీ, మా యింటి ముఖం చూడటమే మానివేశారు. ఏదైనా అలక్షణం మాలో కన్పించితే క్షమించి చెప్పండి. అంతేగాని ఉలుకూ, పలుకూ లేకుండా యిలా హఠాత్తుగా మానివేస్తేమాత్రం మేము క్షమించము. రెండు రోజులుగా మీతో ఈ విషయం చెప్పాలనే ఆశించా గాని ఈ కాలేజి వాతావరణంలో అది అనుకూలించలేదు–"

ప్రకాశం సెలవురోజున తప్పక వస్తానన్నాడు. ఈ రోజు సెలవు. యిక ఈనాడు వెళ్ళని పక్షంలో వారపార్థం చేసు కోవచ్చనే భావనతో బయలుదేరాడు. ఎందుకోగాని ప్రకా శం అంతరాత్మలో ఒక మూల ఆ కుటుంబాన్ని గురించి ఏదో కుతూహలత, యిష్టత అప్రయత్నంగా ఏర్పడింది. ముఖ్యంగా రాధాదేవి మాటల్లో కన్పించే ఆ స్నేహభావ తరంగాలు కనుచూపుల్లో వెల్లడయే ఆ స్నిగ్ధ మైత్రి భావాలు, అతని మృదు మనసునుసోకి, ఒక విధంగా పర వశింపజేశాయి.

రాజారావుగారి కుటుంబం పెద్దదిగాదు. అతనూ, భార్యా. కుమార్తె మాత్రమే ప్రస్తుతం యిక్కడ వుంటు న్నారు. కుమారుడు విజయవాడలో ఏదో ప్రత్యేక సంస్థలో మేనేజరుగా పనిచేస్తూ అక్కడే భార్యా పిల్లలతో స్థిరపడి పోయ్యాడు. రాజారావుగారు వృద్ధంతలోమంచి ఆ స్తిపరులే! పట్టణం చెరువుక్రింద, నాలుగు ఎకరాల తరీ భూమి వుంది. వాటి ఆదాయంతో అతని కుటుంబ ఖర్చులన్నీ ముగిసి పోతాయి. అదీగాక ముందు వైద్యంలో సంపాదించిన డబ్బు అంతో యింతో బ్యాంక్‌లో నిల్వవున్నది. ప్రస్తుతం వుం టున్న యిల్లు ఎనిమిది సంవత్సరాల క్రితం స్వంతంగా కట్టిం చాడు. రాజారావు మంచి మాటకారి. అందరితోనూ కలుపు గోలుతనంగా వ్యవహరించే మనిషి. కాని తన మనసులోని రహస్యాల నేమాత్రం వెల్లడిచేసే తత్త్వం గాడతనిది. భవి ష్యత్‌పై చూపుంచుకోనితప్ప ఏ పనీ ప్రారంభించడు. ప్రస్తుతం ఒక పెద్ద ఫ్యాన్సీషాపులో పార్టనర్‌గా వుంటు

న్నాడు. వాటి వ్యవరాలుతప్ప అతనికి యితరత్రా వ్యాసంగాలేనాడు లేవు. వైద్యం విరమించుకొని పదిసంవత్సరాలు కావస్తోంది. నెత్తిమీద పెట్టుకునే బరువుబాధ్యతలుగాని సమస్యలుగాని అతని కేనాడు లేవు. మొత్తానికి రాజారావు సుఖ, స్వేచ్ఛాజీవి అనవచ్చు! అతనికి పెద్దపెద్ద ఆఫీసర్లు, కాలేజీ ప్రిన్సిపాల్స్ మొదలుకొని చిన్నచిన్న గుమాస్తాల వరకూ వందలకొలది మిత్రులున్నారు. వీరి పరిచయం రోజూ క్లబ్ లో వృద్ధిపొందుతూంటుంది. అవసరంవస్తే ఎలాంటి పనయినా చేయటానికి వెనుదీయడనిపిస్తాయి అతని కంటి చూపులు. అతని తత్త్వంకూడా అంతే! "పట్టుపట్టగరాదు-పట్టివిడువగరాదు" అంటాడతను తన ఉద్దేశాలను బయట పెట్టేటపుడు.

ప్రకాశం రాజారావుగారిల్లు చేరుకొనేసరికి తొమ్మిది కావస్తోంది. బయట తలుపువేసి వుంది. ఒక క్షణమాగి చిన్నగా మునివేళ్ళతో తలుపు తట్టాడు. దానికి ప్రతిగా, "ఎవరూ?" అన్న మృదుస్వరం, అడుగులచప్పుడు. వాటికి లయవేస్తున్నట్లు గాజులరవ్వడి, గొలుసుల సవ్వడి వినిపించాయి ప్రకాశానికి.

రాధ తలుపు తీసింది. ఆమె అధరాలపై మెరపు తీగలా తెల్లటినవ్వు మెరిసింది.

"రండి"

"మీ నాన్నగారు యింట్లో లేరనుకుంటాను" లోపల అడుగుపెడుతూ అడిగాడు ప్రకాశం.

"అరగంట క్రితం బయటికెళ్ళాడు. మీకిటురావటానికి యిన్నాళ్ళకు తీరిక లభించిందన్నమాట. మా నాన్నగారు మిమ్మల్ని అడుగని రోజంటూ లేదు. ఏమిటలా నిల్చున్నారు. కూచోండి"

"రావాలనే అనుకొన్నాను. ఎందుకోగాని తీరిక లభించలేదు. క్షమించండి" అన్నాడు సోఫాలో నెమ్మదిగా కూచుంటూ!

"అదేమిటండీ! మమ్మల్ని క్షమాపణ గోరవలసిన దుర్దశ మీ కింకా రాలేదులెండి" అని ఆగి, "అరె! మరచే పోయాను. ఉండండి కాఫీ తెస్తా" అంటూ లోపలి వేపు వెళ్ళింది. ప్రకాశం వారించాలనుకున్నాడుగాని అనుకున్నంత త్వరగా నోట్లోంచి ఆ మాట బయటకు రాలేకపోయింది.

కాఫీ ముగించిన తర్వాత రాధ, "నా గదిలోకి వెళ్దాం పదండి" అన్నది. ప్రకాశం ఆమెను అనుసరించాడు. ఇద్దరూ కుర్చీలలో కూలబడ్డ తర్వాత, ఏదో ఒకటి మాటాడక తప్ప దని, "బాగా చదువుతున్నారా" అని సంభాషణ మొదలెట్టాడు ప్రకాశం.

"చదువు కేంగాని ఏమైనా కబుర్లు చెప్పండి" అంది రాధ.

"కబుర్లా! అలాంటివి నా మెదడులో ఆట్టేవుండవు. అసలు ఏ విషయమని చెప్పగలను. ఎలా ప్రారభించగలను-" ఈ జవాబు కాస్త అతుకు బొతుకులుగా అతని నోటినుండి వెలువడింది. ఆ తర్వాత వెంటనే అనుకున్నాడు తనెందు

కింత అతుకు బొంతుకుల ప్రలాపన గావించాడా అని! కొద్దిగా సంకుచితుడు వ పోయాడు ప్రకాశం అరక్షణం.

రాధ ఆ మాటకు నవ్వింది చిన్నగా. ఆ నవ్వు ప్రకాశం దృష్టికి వ్యంగ్యపూరితంగా కనిపించింది. ఆక్షేపణా పూర్వకమైన ఆ నవ్వు తన హృదయానికి సూటిగా గుచ్చుకున్నట్టు మధనపడ్డాడు.

"చూడండి! మీరు వచ్చినది మొదలు నేనే అంతా వసపిట్టలా వాగేస్తున్నాను. మీ రేమో మౌనిలా గంభీరంగా ఒక్క పలుకు లేకుండా నన్ను మరీ వాగిస్తున్నారు. ఇలా వుంటే నేను మిమ్మల్ని క్షమించనుసుమా! అదో మళ్లీనవ్వుతారు! నేను ఎగతాళి చేస్తున్నాననా" అంది తనూ నవ్వుతూ. ఆమె ధోరణి ప్రకాశం మనసులోవున్న కొద్దిపాటి వ్యధనూ పూర్తిగా తొలగించింది.

"అలా మౌనంగా వుండాలనీ నేను ప్రయత్నించలేను. నిజం చెప్పాలంటే నా కితరత్రా ఏ విషయాలుగాని మాటాడటం తెలియదు. ఏదో మీ దర్శనం చేసుకుపోదామనిలా వచ్చా."

"ఆ. .ఆ . . మరీఅంతకవిత్వం పొర్లించకండి. మేమేం గుళ్లోని రాతిబొమ్మలముగాదు, ఆకాశంలోని దేవతలమూ కాదు. మమ్మల్ని మీరు దర్శనం చేసుకోవటానికి. ఆఁ! కవిత్వం అంటే ఇపుడు జ్ఞప్తికొస్తోంది. మీ నవల నేనూ చదివాను. అతిశయోక్తి, స్తుతి అనుకోకుండా వుంటే అంత ఉత్తమ నవల నే నింతవరకూ చదువలేదని చెప్పగలను. అందులోని శాంత విశిష్ట వ్యక్తిత్వం నన్ను నిజంగా ఆక

క్షించింది. కాని వర్ణాంతరం పేరుతో ఆ జంటను వేరుచేయ టం మాత్రం చివరలో నాకు కాస్త బాధ గలిగించింది. మీ దృష్టిలో వర్ణాంతర వివాహం అంతగడ్డుగా కనిపిస్తోందా?"

"అంతా మీరేచెప్పేస్తున్నారు. ఆ మాత్రం జవాబు కూడా మీరే ఊహించుకోండి"

"అన్నారూ! మా నాన్నగారు కూడా యిలాగే అంటారు, "అమ్మాయ్! నీ విలా మాటాడుతూంటే ఎదుటి వారు కేవలం వినాల్సిందేగాని జవాబిచ్చేంత స్థితిలో వుండరు" అని. అసలు నా నోరే అంత! అందుకే నా మిత్రులు కూడా, "రాధీ! నీ పెళ్లి కాస్తా అయితే ఆ వచ్చే అత్తగారిని మాటలతో నేహడలగొట్టేస్తావుసుమా" అంటారు! మీరే చెప్పండి నేను వదరుబోతునేగదూ! చూడండి. ఏ విషయం ప్రారంభించానో, సంభాషణ ఎక్కడకుదిగిందో. ఆ... యిప్పుడు చెప్పండి. వర్ణాంతర వివాహాల గురించి మీ అభిప్రాయం?-"

ప్రకాశం ఆమె స్వేచ్ఛాధోరణికి కాస్త ఆశ్చర్యం చెందినా, సంకుచితత్వం కనిపించని ఆమె విశాల హృదయా నికి ఎంతో ఆనందించాడు. ఒక్క అరక్షణం మౌనంగా వుండి, "మీ రడిగిన ప్రశ్నకు జవాబంత తేలికగాదు రాధా దేవిగారూ! వర్ణాంతర వివాహాలంటే సంఘదృష్టిలో, చాలా వరకూ నైచ్య, దౌర్భాగ్యరూపంగా కన్పిస్తున్నాయ్ ఈనాడు కేవలం పైపై మాటలలో, సంఘ సంస్కరణ అని వాగేపెద్దమనుష్యులూ, ఉపన్యాసాలిచ్చే రాజకీయ, ఆదర్శ వేత్తలు కూడా తమ కుటుంబాలలో ఆ స్థితి జరిగేపక్షంలో

పరువు, ప్రతిష్ఠ, కులం, గోత్రం అని గర్జించకపోరు. వీధుల్లో అరచే సంస్కరణ అనేపదాలకూ, ఇంట్లో అరచే ఈ అరపులకు ఎంత ఘనిష్ఠ వ్యత్యాసం కన్పిస్తోందో చూడండి. అలాంటిస్థితిలో కేవలం
సంకుచిత, మూఢభావాలతో బూజుపట్టిన హృదయాలుగల పల్లెటూరి ప్రజలు ఈ విషయాల నెంతవరకూ ఆచరించ గలరు, విశ్వసించగలరు! విశాలహృదయం అంటూ బయట అరచి, ఇంట్లో అతినైచ్యంగా ప్రవర్తించే ఈ సంఘ సంస్కర్తల మేడిపండు రూపాలకంటే ఆ పల్లెటూరివారే శాస్త్ర మెరుగు మీరన్నట్టు నా దృష్టిలో వర్ణాంతర వివాహ సమస్య అంతగడ్డుగా కన్పించటంకూడా నిజమే! కేవలం పుస్తకాల్లో కథకోసం, విశిష్టాచరణలేని ఆదర్శాలను, అసందర్భ అసహజ కల్పిత ధోరణిలో పాత్రల వ్యక్తిత్వాలను అతిసులభంగా మార్చగల్గటం నా దృష్ట్యా చాలా నీచం, ఆత్మవంచనకూడా. నవలలో శాంత ప్రేమికుడు, రాజు తండ్రి పరువు ప్రతిష్ఠలే ప్రాణంగా, కులగోత్రాలే దేహంగా గల సంకుచిత ప్రాణి. తరతరాలుగా తరుముకువస్తున్న ఈ పురాతనాచార సాంప్రదాయాన్ని ఎటువంటి సంఘటనకూడా వారి హృదయాలనుండి వేరుచేయలేదు. కేవలం కథ కోసమైతే వారి హృదయాలలో మార్పుదెచ్చే ఏదైనా సంఘటనను ప్రయత్నపూర్వకంగా సృష్టించే రచయితలు కూడా లేకపోలేదుగాని, నాకు మాత్రమది చాలా అసహజ ధోరణిలో కనిపిస్తుంది ఇక తండ్రి అంగీకరించకపోయినా తెగువ కల్పించుకొనే పరిస్థితులు రాజుకు లేవు. అందుకే వర్ణాంతరం

పేరుతో వారిని విడదీయవలసి వచ్చింది. ఇది నాభావంకూడా. కేవలం కథాకల్పనకాదు" అన్నాడు ప్రకాశం. అతని విమ ర్శనాత్మకధోరణి రాధను సంభ్రమంలో ముంచెత్తింది.

"మీ అభిప్రాయంతో నేనూ అంగీకరిస్తాను. ఇక మీ నవల విషయం విడిచిపెట్టి సర్వసాధారణంగా ఆలోచిం చండి. ఇద్దరివ్యక్తుల పవిత్రప్రేమ ఈ మతం పేరిట నాశన మయేపక్షంలో వానికే హృదయం. శీలం అర్పించిన స్త్రీగతి యేంకావాలి? ఆ పురుషుని హృదయం ఎలా వుండాలి? ఎలా గైనా పురుషుడు కాస్త కూస్త వ్యథచెందినా, కాలక్రమేణా దాన్ని రూపుమాపుకొనటానికి సంఘం దోహదం చేస్తుంది కూడా! అవును! అతడు స్వతంత్ర స్వేచ్ఛాజీవి. ఇక స్త్రీవిష యంలో ఆ ప్రణయం ఒక మాయనిమచ్చ. నిజంగా శీలం చెడకున్నా లోకం ఆమెను పతితగా గుర్తిస్తుంది. ఇక ఆమెకాజన్మలో వివాహమయే పరిస్థితి వుండదు. అలాంటి విపత్కరపరిస్థితిలో ఆమెకు ఆత్మహత్యే శరణ్యంకాగలదు."

"... మీ సునిశిత విమర్శకూడా అంగీకరించవల సిందే! మీరు స్త్రీలుకాబట్టి స్త్రీ పరంగానే ఆలోచించగలరు. ఆదర్శాలుగలవాడనుకొని ఏ స్త్రీకూడా ప్రేమించదు, ప్రేమిం చిన తర్వాత వాడెంత దౌర్భాగ్యుడైనా, ఆదర్శవ్యక్తి అని నమ్ముతుంది. మీ స్త్రీలలోగల అల్పమానసికవర్తనా అదే! పరిస్థితులను క్షుణ్ణంగా, భవిష్యత్ వేపు దృష్టించుకొని ఆలో చించలేరు. . ."

"అంటే మీ అర్థం స్త్రీ అంటవచ్చినవాణ్ని ప్రేమిస్తూ కూర్చుంటుందనా! స్త్రీలే మానసికంగా దౌర్బ

ల్యలనేనా మీ అర్థ ! మీ నవలేతీసుకోండి. శాంతపాత్ర
తోని విశిష్టత, ధైర్యం, ఆలోచన రాజులో ఏ మాత్ర
మున్నాయ్! నన్నడిగితే మీ పురుషులే అతిపిరికిపంద
లంటాను. తన ఆదర్శాలకు ఆశయాలకు సంకెళ్ళు వేసుకొని
పెద్దలు విధించిన హద్దు అనే నాలుగుగోడలమధ్య నలుగుతూ
తనవ్యక్తిత్వాన్ని, ఆత్మను వంచించుకొనటం ఎంతవరకూ
న్యాయం? తల్లి, తండ్రీ అంటారా నిజమే? జన్మకారకులు
వారు. తనుజన్మించాడు! కన్నారుకాబట్టి వారుపెంచారు.
పెంచినమమకారం వారిలో వ్రేళ్లుపాతుకొనుంటుంది. ప్రేమిం
చారు. కన్నారుకాబట్టి వారుపెద్దచేశారు. అంతమాత్రంచే తన
తలిదండ్రులే తన ఆదర్శాలనుకొని, కృంగి, కృశించటం ఎంత
వరకు సమంజసం? తనను తలిదండ్రులు ప్రేమిస్తే అంతకు
మించినప్రేమతో తను యింకొకర్ని ప్రేమించాడు. తలిదం
డ్రులే తనకై అంతగా ప్రాకులాడితే, వారినిమించినప్రేమతో
తను వలచినవారికై తనెంత ప్రాకులాడాలి! తనుప్రేమించిన
అమ్మాయిని తల్లి, తండ్రి అనే నికృష్ట దౌర్భాగ్య భావా
లతో వంచించటం ఏం మగతనం? ఇప్పుడుచెప్పండి? మీ
పురుషులు దుర్బలులా, స్త్రీలు దుర్బలులా? మీరెక్కడైనా
చూశారా? వర్ణాంతరంపేరుతో, స్త్రీలు తమ ప్రేమికులను
కాలదన్నటం? వారేముందుగా తెగిస్తారు. అయినా మీపురు
షులుకామాత్రం జ్ఞానం కూడా వుండదు. క్షమించండి. ఏదో
ఆవేశంలో అనేశాను. . ." ఉద్రేక! ఉద్వేగ, ఆవేశ భావా
లతో ఆమె చెప్పినమాటలు విని ప్రకాశం ఆశ్చర్యపోయాడు.

"మీ మాటలు నిజమేనని నేనూ అంగీకరిస్తాను. కాని ఏ కొందరినో దృష్టిలో వుంచుకొని మీరిలా వాదిస్తున్నారని నేననుకొంటున్నాను. కాని "వర్ణాంతర వివాహాలు" ఎంత వరకూ సఫలవంత మవుతున్నాయనేదే ఆలోచించదగ్గ విషయం-"

"సఫలవంతంకావటం, కాకపోవటం ఆయావ్యక్తిని, వ్యక్తిత్వాన్నిబట్టి నిర్ణయించాల్సుంటుంది. అంతేగాని..," అని యింకా ఏదో అనబోతూండగా. "ఏమిటమ్మాయ్ మా జోరుగా వాగేస్తున్నావ్. నోటికి మంచిపదును దొరికిందే!" అంటూ ప్రవేశించాడు రాజారావు.

అరగంటతర్వాత ప్రకాశం ఆ గృహంనుండి తనగదికి బయలుదేరాడు. అతనిలో రాధ ప్రసంగం గురించిన ఆలోచనలే తారాడుతున్నాయి. ఆమెతో జరిగిన అరగంట సంభాషణ అతని స్మృతిపథంలో మరొక్కసారి మెదిలింది. ఆమె సంభాషించేటపుడు, కళ్ళలో కన్పించే నిశితదృక్కులూ, ఉద్రేకంలో ప్రసంగించే ఆమె విలక్షణ విమర్శాధోరణి, అతన్నెంతో ఆకర్షించాయి. కొద్దిరోజుల పరిచయమే, ఏదోచిరకాలపు బాంధవ్యంలా, ఆత్మీయతారూపంగా తన్ను బంధించినట్లు ఫీలయ్యాడు. "ఈ సుశిక్షితవ్యక్తికి శుభంచేకూరుగాక" అనుకొన్నాడు ప్రకాశం.

## 5

వెంకటేశం, వెంకట్రామయ్య అల్లుడు. మొదటి కుమార్తె శారదభర్త. శారద రామంపోలిక. విశాలమైన

నుదురు, కొనదేలిన నాశిక, గోధుమవర్ణపు శరీరచ్ఛాయ అందమైన అమ్మాయనటాని కేమాత్రం సందేహంలేదు. శారద హృదయం అతిసున్నితం! బాధను భరించలేని మన సామెది. అంతా తంద్రితత్త్వం ఈమెలో ప్రతిబింబించిందని చెప్పవచ్చు. ఎవరైనా ఏమైనా అంటే కేవలం బాధపడటం తప్ప ఎదురుతిరిగి జవాబిచ్చే స్వభావంగాదామెది. పని పాటలు శుభ్రంగా, సహనంగా చేయగల సుగుణశీల.

ఆమె భర్త వెంకటేశం చదివాడుగాని వత్తిపనికిమాలిన మనిషి. చదివినవానికన్నా చాకలిమెరుగన్న సామెత ఇటు వంటివారిపట్ల వర్తిస్తుంది. అతనిచూపుల్లో, నడకలో, మాట లలో అతని స్వభావం ఎవరైనా వెంటనే పసిగట్టవచ్చు.

పెళ్ళయిన మొదటి నాలుగుమాసాలూ, వెంకటేశం భార్యపట్ల సహృదయతతో, ఆదరస్వభావంతో ప్రవర్తించి, తన దయాస్వభావాన్ని చాటుకోవాలని భార్యపట్ల భర్తకు గల ప్రేమవిశ్వాసాల్ని నిరూపించుకోవాలని గట్టిగా ప్రయ త్నించాడు. అప్పట్లో శారదకూడా యింత సహృదయతగల భర్తలభించటం తన అదృష్టం అనుకొని మురిసిపోయింది. కాని కాపురం వచ్చిన రెండుమాసాలలోనే అసలు స్వభావం గు రించింది.

భార్య ప్రతికదలికను అనుమానస్వభావంతో వీక్షించే సంకుచితుడతను. అందంగా అలంకరించుకొని, శారద నవ్వుతూ కనిపిస్తేచాలు, "ఇదేం లంజలకొంపనుకున్నావా! రంభలా అలంకరించుకొని వయ్యారం వొలకపోయటానికి" అనేవాడు పదాలనొత్తిపలుకుతూ వ్యంగ్యంగా, క్రూరంగా!

ఈ పలుకులు ఏ సంసారస్త్రీ భరించగలదు? హృదయాన్ని ఎదురుగా చీల్చి ముక్కలుచేసినా యింతవ్యథ శారద అను భవించేదిగాదు. ఆమె సున్నితహృదయంలో, రంపపుకోతలా ఆ మాటలు నిలువునా కోసివేసేవి. కాని హృదిలో ఎంత బాధున్నా యితరులతో చెప్పుకోని వలవలాఏడ్చే తత్వంగా దామెది. అందులోనేదాచుకొని, కుమిలేది!

వంటలో ఉప్పుగాని, కారంగాని అంతో యింతో హెచ్చుతగ్గులు కనిపిస్తే, పళ్ళెంముఖానికేసి, "ఇదేం ముష్టి వాడుతినే భోజనమనుకున్నావా!" అని విసురుగా లేచివెళ్ళే వాడు, ముఖమంతా కుంచించుకొని. ఈ మాటలకు శారద గాలికి రెపరెపలాడే ఎంగుటాకులా, గడగడ వణికేది. ఎప్పుడైనా తీరికున్నప్పుడు యేదైనా కథలపుస్తకం ముందువేసుకుంటే, "ఇదేం రీడింగ్‌సర్కిల్, లైబ్రరీగాదోయ్! దొరసానిలాకూచొని చదువుకోటానికి! నిన్నిలాపైపై తిరగటాలకు గాదు పెళ్ళిచేసుకొన్నది. . . ఛీ! ఛీ! పల్లెటూరు వెధవలు" అని విసుక్కునేవాడు. నిత్యకార్యక్రమంలో యిలాంటి విసుగులు, దెబ్బలూ, ఎన్నో ఎదుర్కోవలసివచ్చేది శారద.

ఇలాంటి సంసారం నాలుగునెల్లు జరిగేసరికి ఆమెకుఎలాంటి పరిస్థితుల్లో ఎలాంటి అవాచ్యపు మాటలు భర్తనోటిగుండా వెలువడగలవో, కంఠతాకొట్టినట్టుగా జ్ఞప్తికివుండిపోయాయి. ఇంట్లో చేసేపని తక్కువే అయినా ఈ మాటలవల్ల ఏర్పడే అలసటే ఆమెను అధికంగా బాధించేది.

రెండు మూడు సందర్భాలలో భర్త మిత్రుల ఎదుట కూడా కాఫీలో పంచదార కాస్త హెచ్చుగా వున్నందు వలన అతిమోటుగా సహించరాని మాటలన్నాడు.

ఇటువంటివారిలో పుట్టుకతోనే యిలాంటి విషబీజాలు జన్మించి వుంటాయేమోనని నా అనుమానం. ప్రతివిషయం లోనూ భార్యపట్ల తన ఆధిక్యతను నిరూపించుకోవాలనీ, స్త్రీ కంటే పురుషుడుగొప్పని చాటిచెప్పాలనీ, భార్యను మాటల ద్వారా అతిక్రూరంగా హింసిస్తూ అందువల్ల తానేదో అని ర్వచనీయ ఆనందాన్ని అనుభవిస్తూ, గొప్పవేత్తలా ప్రవర్తిం చాలని వీరి గాఢ, మూఢవిశ్వాసమై వుంటుందనుకుంటాను. భార్యను ప్రేమతోగాక బలంతో లొంగదీసి, తనంటే భయపడేలాచేసి గౌరవప్రపత్తులు సంపాదించుకోవాలని వీరి అభిలాషకాబోలు. స్త్రీ హృదయంలోని అగాధసీమలను, అనురాగంతో సందర్శించగలిగితే అందులోగల అనురాగపు టంచులనందుకొని, పరిణయస్వర్గధామంలో ధన్యతచెందవచ్చు గాని, వారి హృదయకుహరాలలో నిప్పులుపోసి ఆ మండే మంటలవల్ల తన ఆనందాన్ని అభివృద్ధిచేసుకొనవచ్చుననే భావనగలవారు చివరకు ఎప్పుడో ఒకసారి, ఆ ఉత్తుంగతరం గాలలో వీచే ఉజ్వలజ్వాలలలో, అగ్గిలోపడ్డ శలభంలా మగ్గి పోగలమని ఏనాడైనా గ్రహించుకుంటారు. "స్త్రీఅబల! పురుషుడు సబలుడు!! భార్య దాసి! భర్త యజమాని! ఆమెకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుగాని, ఆనందాన్ని అనుభవించే హక్కుగాని లేదు. భర్త అడుగుజాడలలో బానిసలా నడవ టమే వారి జీవితాదర్శం–" ఈ దౌర్భాగ్యపు ప్రబోధనలు

వెంకటేశం మూఢ-అల్పహృదయంలో నాటుకొని, సాధ్య మైనంతవరకూ వాటిని తన భార్యముందే వెదజల్లుతూ తన ఆధిక్యతను, అధికారాన్ని నిరూపించుకుంటాడు. శారద గడగడవణికితే, అతనిహృదయం ఆనందవీచికల తేలుతుంది.

ఆమె ప్రతిస్పందనలోనూ, ప్రతిపలుకులోనూ ప్రతి కులుకులోనూ, తన అనుమానాన్ని వెళ్ళగక్కుతూంటాడు. అతని నోటిగుండా వెల్వడే ఆ మాటలు నా కలం ప్రత్య క్షంగా మరీ విన్పించలేదు. ఈ దుర్భర జీవనసాగరంలో చితికిన నౌకలా, ఆమె తన ప్రయాణాన్ని సాగిస్తోంది. దానికి గమ్యస్థానంలేదు-తెరచాపలేదు ఏనాడైనా ఆ సముద్రంలోనే అంతంగావచ్చు!

ఈ విచ్ఛిన్నసంసారంలో, భార్యా భర్తకు మధ్య యింకొక వ్యక్తికూడా వుంది. ఆమె వెంకటేశం చెల్లెలు. పేరు ఇందిర. అదేపట్టణంలో స్కూల్ ఫైనల్ చదువుతూంది. వయసు పదునాలుసంవత్సరాలు. కాని ఆమె దేహదారుఢ్యం, పెరుగుదల, బిగువైన యవ్వనసంపద, ఆమెకు కనీసం ఇరువది వత్సరాలైనా వుంటుందనేలా భ్రాంతికలిగిస్తాయి. ఆ సంవ త్సరమే మొదటిసారిగాపట్టణ వాతావరణంలో అడుగుపెట్టింది. అంతకు మునుపు క్రింది తరగతివరకూ, తమ స్వగ్రామం పక్కనేవున్న ఫిర్కాగ్రామంలో చదువుతూండేది. ఈసారి పట్టణంలో చదవాలనే కుతూహలంతో యిక్కడకు చేరింది.

ఇందిర వెంకటేశానికి పూర్తి విరుద్ధం! ఆమె మనసు ఆతనిలాకరుడుగట్టిన కఠిన శిలగాదు. శారదంటే ఆమెకునల్ల మాలిన అభిమానం. వదినలోగల సౌమ్యత, సరళముగ్ధత,

హృదయ నైర్మల్యత ఇందిరనెంతో ఆకర్షించాయి. వదిన ముందు చిన్నపిల్లలా, పసిపాపలా గారాంచేస్తుంది. వదినంటే పంచప్రాణాలు. అందుకే శారద, ఇందిరను తనచితికిన నౌకకు చుక్కానిఅని భావిస్తుంది. వెంకటేశం తిట్లనేపాల పొంగుకు ఇందిర సానుభూతి, నీళ్ళచిలకరింపులా శారద హృదయంపై పనిచేసేవి. అన్నమనస్తత్వం ఆమె చిన్నప్పట్నుంచీ బాగాఎరుగు. చీటికిమాటికి వదిననే అసందర్భపు ప్రలాపన సహించలేక ఒక్కొక్కసారి అన్నకుఎదురు తిరిగేదికూడా. అన్నగారంటే గౌరవభావంలేకపోగా, కొంతవరకూ అసహ్యభావం ఏర్పడిందామెకు.

ఇందిరే ఈసంసారములో లేనిపక్షంలో శారద ఏనాడో తనస్వరూపాన్ని కోల్పోయివుండేది. ఈవదినామరదళ్ళ సరససల్లాపాలు ఆగృహంలోకాస్త మలయమారుతం వీచినట్టుగావుండేది. సూర్యుడస్తమించగనే చీకటిఏర్పడుతుంది. చీకటిని ఆస్వాదించలేని లోకానికి చుక్కలవెలుగు కొంత ఆహ్లాదంకలిగిస్తుంది.

వెంకటేశం నెలసరి ఆదాయం తొంభైరూపాయలు. కుటుంబఖర్చులకుపోనూ పాతికో పరకో వెనకేస్తూంటాడు. ప్రస్తుతంవుంటున్న యిల్లుఅద్దెయిల్లు-యిల్లుమరీ అంతపెద్దదీ గాదు చిన్నదీగాదు. వంటగదీ స్నానాలగదీకాక, ఇంకొక ప్రత్యేకగది, వాటిమధ్యహాలు, బయటనడవ, వెనకాల బావి- అద్దె చాలాస్వల్పం.

ఉదయం పదిగంటలకు భోజనాలు ముగించుకొని అన్నా చెల్లెళ్ళు గృహం వదుల్తారు. మళ్లీఒంటిగంటకుగాని

రారు. అంతలోగా శారద టిఫిన్, కాఫీ తయారుచేసివుం చేది. అదిముగించుకువెళ్ళి మళ్ళీ సాయంత్రం ఐదుగంటలకు యింటిముఖం చూస్తారువాళ్ళు. అంతవరకూ శారద ఆ నిశ్శబ్ద వాతావరణంలో బిక్కుబిక్కుమంటూ కాలాన్ని భారంగా గడిపేది. చదువు కొంతవరకూవచ్చు. చందమామ బాలమిత్రలాంటి కథలపుస్తకాలు చదవగలదు. కాని భర్త వాటినిచూస్తే తన వీపుచిట్లుతుంది. భర్తను ధిక్కరించటం ఆమెకు సరిపోదు. అందుచే వాటికీ స్వస్తిచెప్పింది. ఏదోనిర్జన ప్రాంతంలో విసిరివేయబడినట్లుండేది ఆమె మనోస్థితి.

ఈ మధ్యనే ప్రక్కయింట్లో ఎవరో కొత్తగాచేరారు. ఆ యింటావిడ సుందరమ్మకూ, శారదకూ స్నేహంకలసింది. కాని వయోతారతమ్యంవల్ల అది వృద్ధిపొందలేదు. ఆమెకు రెండుపాతికలవయసు. ఆమెభర్త ఏదో ఉద్యోగం చేస్తు న్నాడు. వారికొకకుమారుడు. ఇంటర్ ఫెయిలయి తప్పిన వాటిని చదువుకుంటూ ఇంట్లోనే వుండిపోయాడు. సుంద రమ్మకోసం ఆ యింటికివెళ్ళినపుడు శారద, అతనిచూపుల్ని భరించలేకపోయేది. అందుచే ప్రస్తుతం ఆ యింటికి వెళ్లా లంటే ఆమెకు సయించదు. తనగదిలో కూచుంటే కిటికీ గుండా అతనిగది కనిపిస్తుంది. ఎప్పుడూ ఆ వ్యక్తిచూపులు ఈ గదిమీదే విరామంలేకుండా ప్రసారం చేస్తుంటాయి. అతని చూపులెపుడూ వీ రి కై ఆరాటపడుతూంటాయి. అతన్ని చూడగానే శారద ఒళ్ళంతా మండేది. అటువేపు చూడాలన్నా ఆమెకసహ్యం, వెగటు.

మూడుగంటలయింది. అంతకు గంటక్రితమే తన భర్తా, ఇందిరా వచ్చి కాఫీ, ఫలహారంసేవించి వెళ్ళారు. వంట ఇంట్లో పనిముగించుకుని శారదగదిలోకివచ్చి మంచంపై కూచొని 'ఎంబ్రాయిడరీ' అల్లసాగింది. ఇంతలో ఒక కాగితమ: వుండ కిటికీ చువ్వలగుండా విసురుగావచ్చి ఆమెపాదాల ముందు పడింది. శారద శరీరమంతా ఒక్కసారిగాభయంతో జలదరించింది. గుండెల్లో సమ్మెటపోటులా ఏదో బాధ మొదలయింది. కంపిస్తున్న చేతులతో ఆ వుండ దీసుకొని పేపరు మడత విప్పింది. అందులో...... ...

"ప్రేయసీ!

నీ వాల్గంటి చూపుల వేడ్కలతో, తియ్యనిపల్కుల సుధారసాలతో, వెచ్చటి స్పర్శల పులకింతలతో, నన్ను మురిపించి, మరపించి, ఉన్మత్తునిగాచేసి నా హృదయపీఠ మలంకరించలేవా! నీ వెచ్చటికౌగిలింతలో, నీ మధుర అధర చుంబనాలలో మగతగా, మమతగా, కరగి స్వర్గ, స్వప్న జగత్తులో విహరించాలని నామది ఎంతో ఆరాటపడుతూ, కుంములాండటం, నీవు గ్రహించ లేదా! నన్ను దగ్గరకు చేర్చుకుని నీ అంకఫలకముపై నాతలనిడుకొని నా కన్నులలోకి భావగర్భితంగా, మత్తుగా, చూస్తూ నన్ను ప్రణయస్రవంతిలో తేల్చుమని నిన్ను అర్థిస్తూ నీ నామోచ్ఛరణే పారాయణగా నిత్యముజపిస్తూ నీ నిరీక్షణలో కల్లుచించుకొని నీకోసం వేచియుంటూ...

"నీ........"

క్రింద సంతకం మాత్రం అందులో లేదు.

ఈ నికృష్ట దౌర్భాగ్యవ్యక్తి వ్రాసిన ఉత్తరం ఆమె మనసులో భయంకరజ్వాలను రేపింది. శారద వళ్ళంతా కోపంతో నిట్టూర్చింది. ఆమె మనసులో మనసు లేదు. దుర్మార్గుడు కవిత్వమంతా ఒలకపోశాడు. (తెలుగులో ఫెయిలయికూడా) ఈ ఉత్తరాన్నేంచేయాలి! తనభర్తకు చూపితే అవును ఇలాంటి నీచులకు దేహశుద్ధి చేయించాలి. కాని ఒకవేళ భర్తతన్నే అనుమానిస్తే.... అమ్మో ఇంకేముంది. అసలే అనుమానపుమనిషి. చుట్టూ ఏదోవల తన్ను బంధించినట్టు ఆమె హృదయం వ్యథచెందింది. ఆమె అరచేతులలో స్రవించిన స్వేదజలానికది ముద్దయింది. కోపంతో దానిని చింపి, ముక్కలుచేసి వంటింట్లో పొయ్యివేసి వచ్చేంతవరకూ ఆమె మనసు శాంతించలేదు. చదువులుచదివారువెధవలు. మట్టిలో కాల్చనా! ఎదురుగా వాడు కనిపిస్తే ఒక్కసారిగా అధఃపాతాళానికి అణగదొక్కాలనేంత ఉద్రేకంవచ్చింది. ఎంత సర్దుకోవాలనుకున్నా మనసును చిక్కబట్టుకోలేకపోయింది కోపంతో. ఈ జటిల సమస్యాపరంపరలో అరగంటకాలం దీర్ఘంగాగడిచింది.

బయట తలుపు తట్టినశబ్దం అయింది. శారద ఆలోచనలనుండి బయటపడి ఉలుకుచెందింది. తలుపు తీయటానికి గదిదాటి హాల్లోకివచ్చింది. అంతలో "బహుశా వాడేనేమో" నన్న ఆలోచనతట్టి తటాలున ఆగిపోయింది. ఎంత తెగింపు ఎంత ధైర్యం ఇప్పుడేంచేయాలి. తలుపుతీయటమా మానటమా, తీసి దుడ్డుకర్రతో వాణ్ణి దేహశుద్ధి చేయటమా అని

తటపటాయిస్తుండగా "శారదా" అన్నపిలుపు వినిపించింది. ఆ స్వరంవినగానే అంతవరకూ వున్న భయాందోళనలొక్క-సారిగా ఎగిరిపోయి 'అమ్మయ్య' అనుకొని "వస్తున్నా నన్నయ్యా" అంటూ వెళ్ళి తలుపుతీసింది.

"ఏమ్మా! వినిపించలేదా! ఇంతాలస్యంచేశావ్" అంటూ ప్రకాశం ప్రవేశించి కుర్చీలో కూలబడ్డాడు. దీనికి శారదేమీ జవాబివ్వలేదు, "ఏమిటన్నయ్యా, ఈమధ్య అసలు రావటమే మానేశావు, ఒకేచోటవుండికూడా యిన్నాళ్ళు రావటానికి తీరిక లభించలేదన్నమాట" అన్నది.

"ప్రతిరోజూ రావాలనే అనుకుంటాను. కాని నాగదికీ ఈయింటికిమధ్యగల రెండుమైళ్ళదూరం జ్ఞప్తికివస్తే చాలు, ప్రయాణం వాయిదావేసుకుంటాను. ఇప్పటికే పక్షంరోజులవుతూండిగదూ నేనురాక. కాలేజి విడువగానే సైకిల్ తీసుకొని యిలావచ్చేశాను "అని అరక్షణం ఆగి" బావ యింకా ఆఫీసునుండిరాలేదుగదూ. కులాసాగానే వున్నారాఅందరూ" అన్నాడు ప్రకాశం. శారద మౌనంగా తలూపి, "టిఫిన్, కాఫీ, రెండూవున్నాయి. లేఅన్నయ్యా, తీసుకుందువుగాని" అంది.

"ఎందుకు శారదా! నేనువచ్చేముందే హోటల్లో ముగించుకొని వచ్చేశాను"

"ఏం! ఈయింట్లో ఏదీ ముట్టుకోకూడదనుకున్నావా! పరవాలేదులే అన్నయ్యా" అంటూ వంటింటివేపు నడిచింది. ప్రకాశం ఆమె వెనుకాలే వంటింటిలోకి నడిచాడు. పీటవేసి ప్లేటులో టిఫినుంచి కాఫీతయారుచేసే ప్రయత్నంలో మునిగి

పోయింది. ఇంతలో "వదినా" అంటూ ఇందిర గబగబా వంటింటిలో ప్రవేశించి బావనుచూచి ఏదో నేరంచేసిన దానిలా నాలిక కరచుకోంది.

ప్రకాశం తలెత్తి ఇందిరవేపుచూస్తూ, "ఏంఇందిరా! అలానిల్చుండిపోయావ్! నేనేంకొత్తగాడుగా" అన్నాడు నవ్వుతూ. ఇందిర మెల్లగావచ్చి శారదప్రక్కగా కూచోని "ఎప్పుడొచ్చావ్ బావా! నెలరోజులుగా యిక్కడకు రావటమే మానేశావు" అంది.

"ఆ . . ఆ. . . మరీ అంత అభాండం నా నెత్తిన రుద్దకు! నేను సరిగ్గా పక్షం క్రితమే వచ్చాను" అన్నాడు ఇందిర కిలకిలానవ్వింది. వీరిద్దరివేపుచూస్తూ ముభావంగా వుండిపోయింది శారద.

ఇంతలో బయట బూట్లచప్పుడు వినిపించి, "వారొచ్చినట్టున్నారు" అంటూ బయటకెళ్ళింది శారద. ప్రకాశం, ఇందిర మాటల్లో పడిపోయారు.

"ఇంకొంచెం వడ్డించనా?"

"నా కడుపేం చెరువుకాదు" అంటూ చేయికడుక్కొని "బాగా చదువుతున్నావా ఇందిరా" అనడిగాడు. "ఏదో తోచినంత" అంది.

ప్రకాశం చేయితుడుచుకుంటూ హాలులోకి వచ్చేసరికి బాత్‌రూమ్‌నుంచి వెంకటేశం ముఖం తుడుచుకుంటూ వస్తూ ప్రకాశాన్నిజూచి, "ఏమిటోయ్! మేమిన్నాళ్ళకు జ్ఞప్తికి వచ్చామన్నమాట. ఇంతకూ కులాసాయేనా?" అని అడిగాడు.

సాయంత్రం ఆరుగంటలు దాటేవరకూ ఆ బంధువుల సంభాషణలో మునిగిపోయాడు ప్రకాశం! వీరి సంభాషణలో శారద పాల్గొనలేకపోయింది.

"ఆరుదాటింది. నేవస్తా యిందిరా" అంటూ బయట కొచ్చాడు.

"భోంచేసి వెళ్ళకూడదా బావా?"

"ఇకరాత్రి తొమ్మిదివరకూ ఈ కడుపుకు పూర్తి విశ్రాంతికావాలి" అంటూ సైకిల్ ఫెడల్ తొక్కాడు గట్టిగా"

"రేపు రావాలి బావోయ్!" వెళ్తూన్న ప్రకాశంకు వినిపించేలా అరచింది ఇందిర.

# 6

వెంకటరెడ్డిగారి సలహా, సాంబయ్య హృదయంలో ఆరిపోవటానికి సిద్ధంగావున్న ఆశాజ్యోతిని మళ్లీ యధావిధిగా కాంతులు వెదజల్లేలా చేసింది. సాంబయ్య, దేవయ్యలు స్వంత అన్నదమ్ములుగాదు. వీరిరువురితండ్రులూ ఏకోదరులు. అందుచే వీరి బంధుత్వం పటుత్వమైనదనే చెప్పాలి. వీరికి చెప్పుకోదగ్గంత ఆస్తిపాస్తులు లేవు. ఏడెనిమిది సంవత్సరాలుగా ప్రస్తుతం రామయ్యకొన్న నాలుగెకరాల తరీభూమినీ సాగుచేస్తుండేవారు. ఆ భూమి గ్రామంపైకి మంచిసారవంత మైనదనీ, ఎకరాకు ముప్ఫయిబస్తాల ధాన్యం యివ్వగలదని అందరి అభిప్రాయం. ఆ భూమివలనే వారు సంసారాన్ని

నడుపుకోగలుగుతున్నారంటే అతిశయోక్తిగాదు. వెంకయ్యా వీరిదగ్గరి బంధువు. వరుసకు వీరు మామ గారవుతారు. ఈ బంధుత్వాన్ని అడ్డం పెట్టుకుని, కొన్నిసంవత్సరాలు కౌలు కూడా యివ్వలేదు. వెంకయ్యా తన భార్యకు విడాకులిచ్చిన తర్వాత ఈ భూమిని కాజేద్దామన్న వుద్దేశంతో సాంబయ్యా తన కుమార్తెనిచ్చి వివాహం చేస్తానన్నాడు. కాని వెంకయ్యా అందుకు యిష్టత చూపలేదు. అయినా వీరికి ఏనాడైనా వెంకయ్యాను ఏదోఒకవిధంగా లోబరచుకొని, ఈ భూమిని స్వాతంచేసుకోవాలనే ఆశ నిండుగా వుండేది.

వెంకటరెడ్డి సలహామేరకు సాంబయ్యా, వెంకయ్యాకోసం నాలుగయిదురోజులు సాధారణంగా అతడుండేప్రదేశాలనన్నీ గాలించి చివరకు పట్టణంలో ఒక భోగంకొంపలో పట్టు కొన్నాడు. వెంకయ్యాతో, "వచ్చిన కారణం ఏమిటని" అడి గాడు. గ్రామంవస్తే అన్నివిషయాలూ చెబుతానని అతని చేతిలో కొంత డబ్బుంచి, బలవంతంగా గ్రామం లాక్కొ చ్చాడు. గ్రామం చేరేసరికి రాత్రి ఎనిమిదిగంటలయింది.

సాంబయ్యా, దేవయ్యాలతో కలసి, వెంకయ్యాతోసహా నేరుగా వెంకటరెడ్డి యిల్లు చేరుకున్నాడు. వెంకటరెడ్డి అప్ప టికే అన్ని ఏర్పాట్లూ పూర్తిగా చేసుకొన్నాడు. వెంక య్యాను చూడగానే చిరునవ్వులుచిందిస్తూ ఆహ్వానించాడు.

అందరూ కుర్చీలలో కూలబడ్డారు.

"విషయమేమిటో చెప్పండి" అన్నాడు వెంకయ్యా విసుగ్గా!

"అంత ఆతురత చెంది లాభంలేదోయ్! చెప్పేది పూర్తిగా విన్నతరువాత యిక్కణ్నుంచీ కదలమన్నా కద ల్లేవు" అంటూ రెడ్డి ఉపోద్ఘాతం మొదలుపెట్టాడు. వెంకయ్య మనసులో ఏవేవో రూపంలేని ఆలోచనలు ఒక్క సారిగా లక్షలభివృద్ధి చెందాయి.

"చూడు వెంకయ్యా! నిజంచెప్పాలంటే నీ వంటి అమాయకుణ్ని నే నెక్కడా చూడలేదు. నీ మంచితనమే నిన్ను నాశనం చేసింది. కాకపోతే పదివేలపై చిలుకుచేసే బంగారంలాంటి భూమిని ఆ రామయ్య మాటలకు మోసపోయి అర్ధరేటుకే తెగనమ్ముతావా! కనీసం నాతో ఆ విషయం చెప్పున్నా నేనే నీకు ధారాళంగా పదివేలూ యిచ్చే వాడిని. కాని నీ పొరపాటే నిన్ను కూల్చింది. అయినా నీ విపుడు కాస్త మాతో సహకరించే పక్షంలో ఆ స్తినంతా నీ పక్షం త్రిప్పగలను... అయితే..." అంటూ వెంకట రెడ్డి హుందాగా తన మీసాలపై చేయివేసి వెంకయ్యవేపు సాభిప్రాయంగా చూశాడు.

వెంకయ్య వీరనుకున్నంత అమాయకుడుగాడు. ఈ ఆరుసంవత్సరాలలో అతనెంతో అనుభవం సంపాయించాడు. వివిధ రకాల వ్యక్తులను. వ్యక్తిత్వాలనూ చూశాడు. ఇపుడు వీరు తన నుండి ఏదో ఆశిస్తున్నారని, తన వల్ల ఏదో అమూల్యమైన కార్యం జరుగుతోందనీ గ్రహించాడు. అయినా తనదగ్గరిపుడే ఆస్తిపాస్తులు లేవు. వీరు వేరే ఏదోవిధంగా తన్నుపయోగించుకో చూస్తున్నారన్నమాట. వీరినుండి తన కేదయినా గిట్టితే యిప్పుడేగిట్టాలి. ఈ అవకాశం

జారవిడుచుకోగూడదనుకున్నాడు. అయినా తన మనో భావాల్ని బయటకు కనిపించ నివ్వలేదు.

"అసలు విషయమేదో చెప్పండి. మీరు నా ఆస్తి నెలాగూ తిరిగి నాకు సంపాదించి పెట్టలేరు. అది నాకు స్పష్టంగా తెలుసు. డొంకతిరుగుడుమాని మీ పనేదో చెప్పండి" అన్నాడు నిర్మొహమాటంగా!

ఇక వెంకటరెడ్డి చెప్పక తప్పదనుకున్నాడు. "చూడు వెంకయ్యా! రామయ్యకు ఆస్తి అమ్మి యింకా పట్టుమని పది రోజులుకూడా కాలేదు. ఈ ఆస్తిని సాంబయ్య పక్షం త్రిప్ప టానికొక అవకాశముంది. . ." అంటూముగ్గురిముఖాలవేపూ సూటిగా చూశాడు.

"ఇప్పుడు నీ వమ్మిన ఆస్తిని సాంబయ్యకు అగ్రి మెంటురూపంలో యింతకుముందే అమ్మినట్టుగా ఈనాడొక అగ్రిమెంటు మనం సృష్టించాలి. సంవత్సరం క్రితమే ఇది జరిగినట్టు వ్రాశాను. అందులో నీ విప్పుడొక సంతకం పడేస్తే! వెంటనే కోర్టులో దాఖలుచేసి రామయ్యపై వ్యాజ్యం పడెయ్యవచ్చు! ఈ దెబ్బతో రామయ్యకొన్న ఆస్తి సాం బయ్య పరమవుతుంది. అందుకు తగినసాక్ష్యాలుకూడా నేను సేకరిస్తాను, ఇక నీవు సంతకం పడేస్తేచాలు" అంటూ వెంకట రెడ్డి ఆగాడు.

ఈ మాటలు విన్న తర్వాత వెంకయ్యకు అసలు కిలకం అర్థమయింది. వీరు చెప్పినమాటలలో ఎంతవ్యవహార దక్షత దాగిఉంది. ఇన్నాళ్ళూ తనకు యిలాంటి ఆలోచనే తట్టలేదు. రిజిస్ట్రేషన్ అయిన మూడునెలలో ఇలాంటివి

దాఖలుచేస్తె అవి చెల్లుతాయని ఎవరో ఎప్పుడో అన్నట్లు జ్ఞాపకం. ప్రస్తుతం తను ఆ అగ్రిమెంట్‌పై సంతకంపడేస్తె తప్పక సాంబయ్యపరం కావచ్చు. వెంకయ్య బాగా ఆలోచించి ఒక నిశ్చయానికొచ్చాడు. అయినా పైకిమాత్రం "మీరు చెప్పిన ఆలోచన కూడా బాగానేవుంది. కాని నేను యిలాంటిపని చెయ్యను. రామయ్యను మోసంచేయాలేను." అన్నాడు.

ఈ మాట వినగానే సాంబయ్యగుండెల్లో బండపడింది. కాని వెంకటరెడ్డి చలించలేదు. వెంకయ్య మనసు అతనికి బాగా అర్థమయింది.

"బాగా ఆలోచించు వెంకయ్యా! ఇది సాంబయ్య పరంకాగానే నీకూ కొంతభాగం యిస్తాం, నీ కొచ్చేనష్టం ఏమీలేదు."

"సరే! ప్రస్తుతం నాకు వెయ్యిరూపాయ లిచ్చే పక్షంలో సంతకం పడేస్తా"

ఈ మాటవిని సాంబయ్య "వెయ్యి రూపాయలే" అన్నాడు. దేవయ్య ఇది ఎటుతిరిగి ఎటువెళ్తుందో ఊహించ లేకపోతున్నాడు.

"వెయ్యిరూపాయలొక భాగ్యమా! ఏదీసాంబయ్యా వెంకయ్యకు ముందు మూడువందలివ్వు? మిగిలింది తర్వాత యిద్దురుగాని" అన్నాడు రెడ్డి.

"వీల్లేదు. నేనంగీకరించను. రేపు నా పీకలపై ఈ విషయమొస్తె మీరు రడ్డొస్తారా?" అని అరిచాడు వెంకయ్య.

చివరకు రాజీచేసి. అరమొత్తం యిప్పుడూ, మిగతాది వ్యవహారం తెగిన తర్వాత యిచ్చేవిధంగా రాజీచేసుకున్నారు.

ఆ తర్వాత ఈ విషయం అరగంట సమాలోచన జరిగింది. వెంకయ్య శాస్త్ర వణుకుతూనే సంతకం చేశాడు.

సాంబయ్య గుండె ఆనందంలో ప్రోగింది. "అమ్మయ్య" అనుకొన్నాడు. వెంకటరెడ్డి పనిముగిసినందుకు పళ్ళికిలించాడు.

వెంకయ్య ఐదువందలు జేబులో వుంచుకొని, వెంటనే ఆ ప్రదేశం వదలి వెళ్ళాడు.

వెంకటరెడ్డి, సాంబయ్యలు జరుగబోయే కార్యక్రమాన్ని గురించి చర్చించుకోసాగారు.

శ్రావణమాసందాటి భాద్రపదంలో అడుగుబెట్టింది కాలం. వరినాటటానికిదే మంచి అదును. వెంకట్రామయ్య తనుకొన్న కొత్తభూమిలో వరినాటించాలని అభిప్రాయపడ్డాడు. ఈ నాలుగెకరాలలో వరినాటితే వందబస్తాలు ధారాళంగా పండుతాయి. తన అప్పు సంవత్సరంవారీగా ఈ పంటలమ్మి తీర్చవచ్చు. తన దరిద్రం కొద్ది సంవత్సరాలలోనే తిరుగుముఖం పడుతుందని ఆలోచించసాగాడు. ఇప్పటికి భూమికొని రెండుమాసాలు కావస్తోంది.

అంతకుముందురోజే వర్షం బాగా కురిసింది. వరి నాటించాలని దున్నకానికి తన పాలెగాళ్ళను ఆ భూమికి పంపించాడు.

పాలెగాళ్ళు వెళ్ళిన గంటకల్లా రామయ్య బంధువొకతను పరుగుస్తూవచ్చి, "ఎంత పనిజరిగింది రాముడూ! మన

వాళ్ళు దున్నటానికి వెళ్ళగానే ఆ సాంబయ్య లేడూ వాడూ, ఆ దేవయ్య, వానిముతా అంతా కట్టెలు తీసుకొనివచ్చి భూమిలో అడుగుపెడితే తలలు బ్రద్దలవుతాయ్ జాగ్రత్త అని గాండ్రించారు. ఎంతధైర్యం! ఎంతపొగరు మనభూమిపై వచ్చి మనపైనే దౌర్జన్యం సాగిస్తారా. మన సేద్యగాళ్ళంతా దిక్కుతోచక నిలబడిపోయారు. చిన్నరమ్మని నాతో చెప్పి పంపారు. వెంటనే రావాలి" అంటూ గబగబా చెప్పాడు. వెంకట్రామయ్య ఈ హఠాత్ హరారత్‌కు ఆశ్చర్య పోయాడు. వెంటనే కోపం ప్రజ్వరిల్లిందతనిలో. వీరెవరు నా భూమిలో అడుగుపెట్టటానికి. నేను కొన్ననాడే వారి సాగు చేయటం వూడిపోయింది. ఎంతపొగరు. వీళ్ళఅంతు తేలుస్తా. అంటూ పంచె ఎగపెట్టి తోటవైపు బయలుదేరాడు. బహుశా ఏదయినా దెబ్బలాట జరుగవచ్చనే వుద్దేశంతో దాన్ని వారించటానికి గ్రామంలోని కొందరు పెద్దమనుషు లను ఆ వచ్చినవ్యక్తి రామయ్య వెనకాలేపిల్చుకుపోయాడు. ఆ క్షణంలోనే గ్రామమంతా ఆ విషయం పాక్కిపోయింది.

అందరూ తోటదగ్గరకు చేరారు. వెంకట్రామయ్య అటురాగానే సాంబయ్య ఏదో అస్పష్టంగా అరచాడు. గ్రామంలోని పెద్దమనుషులంతా అటు సమావేశమయ్యారు.

"ఈ భూమిలో మీరు అడుగుపెట్టటానికి వీల్లేదు" అంటూ అరచారు సాంబయ్య దేవయ్యలు ముక్తకంఠంతో.

"ఏమిటోయ్! మీ అబ్బసొమ్మనుకున్నావా, ఈభూమి డబ్బుపోసి కొన్నానోయ్ డబ్బుపోసి! కావాలంటే రిజిష్టరు పత్రం చూపిస్తాను" అని అరచాడు రామయ్య.

"నీ రిజిష్టరుపత్రం ఎవరిక్కావాలి! సంవత్సరంక్రితమే దీన్ని మేము డబ్బుపోసి కొన్నాము"

"రుజువూ!"

"నీ అబ్బలాంటి రుజువుంది యిక్కడ. కావాలంటే ఈ అగ్రిమెంటుచూడు" అంటూ తనపంచెలో దాచుకొన్న పత్రంతీసి పెద్దమనుషుల ముందుంచాడు సాంబయ్య.

దాన్ని చదివి అందరూ నోళ్ళు తెరచారు. వెంకట్రామయ్యగారు మొదట్లో ఆశ్చర్యపడినా, ఇందులో ఏదో కుతంత్రంవుందని వెంటనే గ్రహించాడు

"రిజిష్టర్ ముందు అగ్రిమెంట్లు ఏం పనికొస్తాయోయ్, తీసుకొని దిబ్బలోవేయి" అన్నాడు.

"అంతఖర్మ మాకెందుకు? నీకున్నంతహక్కు మాకూ వుంది కావాలంటే యిదేదో కోర్టులోనే తేల్చుకుందాం, అక్కడేతేల్తుంది ఎవరిదో ఈ భూమి" అన్నాడు సాంబయ్య ధీమాగా. ఇంతలో వెంకటరెడ్డి ఆ గ్రామమునసబు కరణాలతో సహా వచ్చాడు.

గంటవరకూ వాదోపవాదాలు అతితీవ్రంగా జరిగాయి. ఎవరూ అడ్డులేకపోతే తలలు పగలకొట్టుకొనేవారే ఆ వృద్ధేకంలో. గ్రామ పెద్దలంతా చివరకొక నిర్ణయం చేశారు. "ఇందులో ప్రస్తుతం ఎవరికీ హక్కులేదు ఆలోచిస్తే మీ యిరువురకూవున్నట్టు దాఖలాలున్నాయి. కోర్టులో విషయం తేల్చుకొనేవరకూ ఎవరూ యిందులో అడుగుపెట్టకూడదు" అని తీర్పు చేశారు. తాత్కాలికంగా అందరూ అంగీకరిం

చారు. మరురోజే కోర్టులో తమ వకీళ్ళద్వారా రుజువులూ, సాక్ష్యాలూ, దాఖలుచేశారు ఇరుపార్టీలూ.

* * * * *

ఈ సంఘటనకు వెంకట్రామయ్యగారు హతాశుడై పోయాడు. ఇలాజరుగుతుందని అతనుకలలోకూడా వూహించుకోలేదు, అంతా తారుమారై పోయింది. విషయమేదో అడిగితెలుసుకుందామనుకున్నా ఆ వెంకయ్యగాడు మూడు మాసాలుగా పత్తాలేడు. ఇక ఈ వ్యవహారం ఎన్నిఏళ్ళకు తెగుతుందో ఏమో! కాని తనకో ధైర్యం. తను డబ్బుపోసి కొన్నాడు. సాక్షులుకూడా వున్నారు. తప్పక తనకు జయం లభిస్తుందని వూరట చెందాడు.

గ్రామస్తులు ఎవరిది న్యాయమో, ఎవరిదన్యాయమో తేల్చుకోలేకపోయారు. గుట్టుగాజరిగిన ఆకుతంత్రం ఎవరికీ తెలియదు. ఈపరిణామంవల్ల కమ్మకులంలో రెండుపార్టీలు చీలిపోయాయి. వెంకట్రామయ్య పక్షంకొందరు, సాంబయ్య వర్గంకొందరు.

సాంబయ్యకు ఈవిషయంలో పూర్తిధైర్యమున్నా దేవయ్యకు కాస్త అనుమానమూ, జంకుకూడా! తమఈఅన్యాయం ఫలిస్తుందాఅని ఆందోళన చెందాడు. కాని వెంకటరెడ్డి నూరిపోసేమాటలవల్ల అతనూకాస్త ధైర్యము తెచ్చుకోగలిగాడు. వీరిద్దరిమధ్య వెంకటరెడ్డి మూడునాలుగువందలు

అప్పుడే భక్షించాడు. సాంబయ్యా దేవయ్యలకు సగటు ఐదు వందలు ఖర్చయ్యాయి యిప్పటికే!

ఈకమ్మవారికి ఏర్పడ్డ తగవునకు, కాపులు సంతోషించి, గద్దెనెక్కి నాటకాన్ని తిలకించసాగారు. వెంకట్రామయ్య పక్షంకొందరు, సాంబయ్యా పక్షంకొందరూ చేరారు. ఒక్కనెలలోనే ఈపార్టీలు తీవ్రరూపం దాల్చాయి. కోర్టులో కేసుఫైల్ చేశారు. వాయిదాలు వేయసాగారు.

# 7

మూడుమాసాల రాధ పరిచయం ప్రకాశంలో ఆమె పట్ల వింతమిత్రత్వాన్ని అస్పష్ట, అనిర్వచనీయ అభిమానాన్ని ఆక్రమించుకున్నాయి. రాధ దృష్టిలో ప్రకాశంరూపు, వ్యక్తిత్వమూ, ఒకఘనిష్ఠ, విశిష్ఠ పరిణామాన్ని పెంపొందించాయి. ఆమె కతనొక అభ్యుదయవాదిగా, ఆదర్శరచయితగా, యింకా విపులీకరించి చెప్పాలంటే, ఆమెమనసులో ఏవోమధుర తరంగాలు సృష్టించినట్టుగా, రూపకల్పన గావించుకొంది. ఆమెసాహిత్య, విజ్ఞానప్రతిభ, ఆమెవిమర్శాత్మక ధోరణి, ఆమెపట్ల ప్రకాశానికి, గౌరవాన్ని మిత్రత్వాన్ని పెంపొందించాయి.

ప్రకాశం ఏవిషయమైనాచర్చిస్తే, ఆమె అతిదీక్షగా విద్యార్థినిలా ఎంతోఓపికగా ఆలకించేది. అతని మాటల్లో ఏదోస్వచ్ఛత, ఆకర్షణీయత వుందని రాధాదేవి తొలిరోజే గ్రహించింది. అనవసరంగా ఏమాటాగానీ మాటాడే రకం

గాదు ప్రకాశం! ఏవిషయమైనా బాగాతూచినట్టు మాటా డటం అతని ప్రత్యేకగుణం. ఆ ప్రసంగ, అనవసరధోరణి అతనికి చిరాకు. రాధ ఈవిషయం బాగాగ్రహించింది. ఆమె విమర్శలూ, చర్చలూ, ప్రకాశం మేధస్సుకు, ఒరిపిడికలిగించి ఏదోమరచిన విషయాన్ని మరీజ్ఞప్తికి తెచ్చేలా చేసేవి. అందుకే ఆమెంటే ప్రకాశంకు అభిమానం, వాత్సల్యం. రాధ తనపట్లచూపే ప్రత్యేకశ్రద్ధకు అపుడపుడతను సిగ్గుపడు తూండటంకూడాకద్దు.

ఈ మూడు మాసాలలో అతనిగదికీ, ఆమె గృహానికీ ఒక ప్రత్యేకమైన బాటఏర్పడిందని చెప్పాలి. ఏ రెండు మూడురోజులలో అతను రానిపక్షంలో రాధకు ఏదో లోపించి నట్టు, ఏదోబాధను అనుభవించేది. రాగానే నిలదీసి అడిగేది. ఇలా ఆమెనుండి ప్రశ్నవస్తుందని ప్రకాశానికి బాగా తెలుసు. అందుకే అతను వాటికి జవాబివ్వడు. చిన్నగానవ్వుతాడు. . . అంతే!

రాధ తల్లికి ప్రకాశం సుశిక్షిత వ్యక్తిగా ఉత్తము నిగా అర్థమయ్యాడు. రాజారావులో మంచి తెలివి తేటలు వున్నాయి. ఎదుటమనుషుల్ని ఎంతో సులభంగా వేగంగా చదువగలడు. వారి ముఖంలోని ప్రతిపేరాలను మళ్లీ వ్రాయ గలడు. ఈ అనుభవ విజ్ఞానం ప్రకాశం అనే నిఘంటువును అనుకున్నంతగా తొందరగా వల్లించలేకపోయాడు. "ఏమిటి ఇతని సంపూర్ణ వ్యక్తిత్వం తనకందకుండా వెళ్తోంది" అను కొనేవాడు. కొన్ని అధ్యాయాలు అతిసులభంగా చదవగలి గాడుకాని మిగిలిన చివరిభాగం ఎంత ప్రయత్నించినా పూర్తి

చేయలేకపోయాడు. అయినా వూహించ గలిగాడు. అది పొరపాటు గాదనుకొనేవాడు కూడ.

రాజారావంటే ప్రకాశానికి ఒకవిధమైన గౌరవభావం వుంది. అది పూర్తి గౌరవభావం అనటంలో సందేహంలేదు. కాని, రాజారావు అతివాగుడు అతనికంతగా సహించేదిగాదు.

వీరితో తనకు కలిగిన పరిచయం గురించి తన తండ్రికి తెలియచేద్దామని ప్రకాశానికి చాలా వుత్సాహంగా, ఆరాటంగావుంది. కాని కాలేజి తెరచిన దాది గ్రామంవెళ్ళలేదు. అందుచే తన తండ్రికి తెలియచేసే అవకాశం లేకపోయింది. ఈసారి డిసెంబరు సెలవుల్లో వెళ్ళగానే వీరి విషయం చెప్పాలనుకొన్నాడు.

రాజారావు ఏదోసందర్భంలో, "మీ నాన్నగారికి మా విషయం తెలియచెయ్యలేదూ," అని అడిగాడుకూడా. అందుకు ఇంతవరకూ లేదన్నాడు ప్రకాశం. ప్రస్తుతం రామయ్య స్థితిగతుల గురించి ప్రకాశానికి కూడా ఏమాత్రం తెలియదు. రాధకీవిషయం అసలేపట్టదు. వీరి సాన్నిహిత్యం ఏకవచన సంబోధనవరకూ దారితీసింది. ఇన్నాళ్ళూ రాధా దేవీ అని సంబోధిస్తున్న అతనీనాడు రాధా అనేమాటతోనే సరిదిద్దుకొన్నాడు. ఈ విషయం అతనికెవరూ నేర్పలేదు. ఎందుకిలా అయింది అనికూడా ప్రకాశం ఆలోచించడు.

ఆనాడు కాలేజి విడువగానే ప్రకాశం రాధ యింటికి వెళ్ళాడు. ఇద్దరూ గదిలో కూచొని బాతాఖానీ మొదలెట్టారు. ఆ గది రాధకు ప్రత్యేకించబడినది. వీరి సంభాషణలో ఆమె తల్లి ఎప్పుడూ పాల్గొనదు.

అరగంట యిద్దరిమధ్యా ఏదేదో సంభాషణ నడిచింది. చివరకు వీరి చర్చ పురాణాలవేపు పరుగెత్తింది. ఈ సందర్భంలో రాధకు ఏదో అనుమానంవచ్చి "ప్రకాశం! సీతారాముల, రాధాకృష్ణులగురించి మనకు పరిపూర్ణంగా తెలుసు. కాని నాకొక అనుమానం. వీరిప్రణయంలో సీతారాముల ప్రణయం గొప్పదా, రాధాకృష్ణుల ప్రణయం గొప్పదా?" అనడిగింది.

"ప్రశ్న తప్పుగా అడుగుతున్నావు రాధా! రాధాకృష్ణులది ప్రణయంగావచ్చు. కాని సీతారాములది ప్రణయం గాదు"

"మరి?"

"వారిది అనుబంధం మాత్రమే"

"అలాగే అనుకోండి. మీ దృష్టిలో ఎవరిప్రేమ ఉదాత్తమైనది."

"ఇంతకూ నీకీ అనుమానం ఎందుకొచ్చింది?"

"ముందీవిషయం తేల్చండి. తర్వాత చెబుతాను"

"కాని ముందు నీ అభిప్రాయం తెలియచేయాలి రాధా"

"నా అభిప్రాయమే ముందు కావాలంటారా?"

"అవును."

"అయితే నేను సీతారాముల ప్రేమేగొప్పది, ఉదాత్తమైనది అంటాను." ప్రకాశం ఈ మాటకు మందహాసం గావించాడు. "అయితే నీ అభిప్రాయం నాకు పూర్తి విరుద్ధం!

సీతారాములకన్నా, రాధాకృష్ణుల ప్రేమేగొప్పదీ, విశిష్ట మైనదీ అంటాను నేను."

"ఎలా! ఏ విషయంలో, యే విధంగా మీరు దాన్ని అంగీకరిస్తున్నారు! సీతారాములు ప్రేమస్వరూపులేగాక ఆదర్శదంపతులుకూడా! ఒకరి సుఖంకై మరొకరు దుర్భర బాధలనుకూడా అనుభవించారు. సీత రావణుని దగ్గరకూడా నిత్యమూ తన నాథుని, సుఖశాంతులకై ప్రార్థనలు సల్పింది: అనుక్షణమూ రామనామ జపోపాసనతోనే కాలం వెళ్ళ బుచ్చేది! ఆ నామమే ఆమె పాలిట ఆహారం! కాని రాధా కృష్ణులు అలాంటివారుగాదే! వారు గావించిన ఆ ప్రేమ కలాపాలను, లోకం వ్యభిచారంక్రింద లెక్కించింది. వారి మధ్యగల ప్రేమకన్నా, తృష్ణకే ఎక్కువ ప్రాధాన్యతవుందని నా అభిప్రాయిం. అలాంటపుడు వారి తుచ్ఛప్రణయాన్ని సీతారాములను మించి పొగడటంలో మీ అభిప్రాయం ఏమిటో నాకు అర్థంగాలేదు" అంది రాధ.

ప్రకాశం చిన్నగా నవ్వాడు. "ఒక కోణంనుంచీ పరిశీలిస్తే నీ మాటలూ అంగీకారమే! కాని నిష్పాక్షికంగా అన్నికోణాలను యేకదృష్టితో చూడగలిగినపుడే మనం నిజాన్ని గ్రహించగలము. నీవన్నట్టు సీతారాములది కేవలం బంధమేగాదు, దాంపత్యంకూడా! వారిరువురకూ శాస్త్ర సమ్మతంగా, అగ్నిసాక్షిగా వివాహం జరిగింది. అంటే ఒకరు చేసేపని యిరువురూ, అది సుఖంగాని, కష్టంగాని భాగం పంచుకోవాల్సిందే! అది ధర్మం! వారిరువురకూ బంధం! అందుకే ఆ ధర్మానికి బంధానికి కట్టుబడి, వారొక

రికై ఒకరు తమ సర్వమూ త్యాగంచేయ సిద్ధించారు. ఒక్కరు వియోగం ఒకరు భరించలేకపోయారు. వారి ఈ అనుబంధం కేవలం దాంపత్యానుబంధమే? ఆ బంధంవల్లనే వారిలో ప్రేమబంధంకూడా యేర్పడిందనవచ్చు! అందుకే వారి దాంపత్యం శాశ్వతం! ఆదర్శం! భార్యాభర్తల బంధం రీత్యా వారెన్ని యుగాలకైనా ఆదర్శ పురుషులే! నేనూ అంగీకరిస్తాను! కాని రాధాకృష్ణులు శాస్త్రసమ్మతంగాగాని, మరి ఏ ధర్మరీత్యాగాని వివాహం చేసుకోలేదు. వివాహం అనేపేరుతో వారొకరినొకరు ఎప్పుడూ బంధించుకోలేదు. వారికి తెలియకుండానే వారిరువురి హృదయాలను ఒక నిరాకార ప్రణయపాశం అతిగాఢంగా పెనవేసింది. అంతే! అదే వారి బంధం! ఒకరిని విడిచి ఒకరుండలేకపోయారు. కృష్ణుకు మురళివాయి స్తేచాలు రాధ ఎటున్నా చెంతవ్రాలేది. ఆ పిలుపులోనే అంతరాగబంధం మిళితమైవుందంటే నీవాశ్చర్యపడుతావేమో! అతిపవిత్రమైన వారి ప్రణయంవల్ల అలాంటి అస్పష్టబంధాలు ఏర్పడ్డాయి. వారికి వ్యక్తిగత విషయాలనవసరం. వారికి కావలసింది ప్రేమస్వరూపం మాత్రమే! నీవు తుచ్ఛవాంఛ అన్నావు. వాంఛ పవిత్రమైనపుడది హద్దులు మించవచ్చు. అంతమాత్రంచే వారి శృంగారలీల లేనాడు అపవిత్రం, తుచ్ఛంగావు. ఆనాటి లోకం వ్యభిచారంక్రింద లెక్కించింది. మరీనాడు రాధా కృష్ణుల నగ్నస్వరూపాలను ఆరాధించేవారెందరులేరు. వారు ప్రణయ స్వరూపులు. దాంపత్యం అంటే యేమనిగాని, వైవాహికబంధం అంటే యేమనిగాని వారేనాడూ నిర్ణయించుకోలేదు. లోకంకోడ్డె

స్త్రీస్తున్నా తమ బంధాలను పొరపాటున కూడా సడలించు కోలేకపోయారు. అసలు ప్రణయానికి, వివాహానికి సంబంధం వుండితీరాలని వారేనాడూ భావించ లేదు. అది వీరికననసరం. ఇది వారికవసరం. అందుకే ప్రేమ విషయంలో సీతారా ములకంటే వీరిప్రణయమే చరిత్రమైనది, ఉదాత్తమైనది, విశిష్టమైనది. . ."

"మీరు చెప్పిన ప్రకారం ఆలోచిస్తే, ఈనాడు రహస్యంగా జరిగే కాముకీ కాముకుల వ్యవహారంకూడా ఉదాత్తమైనదే అంటారా!" ఈ మాటని రాధ పకపక నవ్వింది. ప్రకాశం నవ్వలేదుగాని ఆమె ప్రశ్న అతనిలో ఒక దుమారం లేపింది.

"ఈ ప్రశ్నకూడా ఆలోచించవలసిందే రాధా! కేవలం కాముకత్వంతో, క్షణికోద్రేకాల సంతృప్తికై శరీరాల నాశించే వ్యక్తులెన్నడూ ఉదాత్తులుగారు. వారు చరిత్రహీనులు. కాని యిటువంటి వ్యవహారాలలో కూడా చాలా తెగలున్నాయి. పరిస్థితుల ప్రభావాలకు బలియైనవారూ, హృదయ సౌందర్యంతోపాటు శరీరసౌందర్యాన్ని కూడా వుపాసించేవారు, అనేకరకాలసంబంధాలు మనం వింటున్నాం. కాని కొందరి ఈ స్థితి మొదటినుండీ చివరివరకూ, నిష్పాక్షికంగా పరిశీలిస్తే ఆ ప్రణయాలలో కూడా ఉదాత్తత మనం చూడాల్సివస్తుంది. అది యే విశాల హృదయంకల వాడో గాని అర్థంచేసుకోలేడు. మనం కథల్లో, నవలల్లో చదివే యిటువంటి సంబంధాలను కొన్ని హర్షిస్తాం. సినిమాలలో చూచి ఆనందిస్తాం. ఆ ప్రేమికులజంట స్థిరంకావాలని

ఆశిస్తాం కాని నిత్యజీవితంలో అలాంటివి మన కళ్ళ యెదు రుగా జరిగితే వాటిని ఎంతో నీచంగా హేయంగా ఆలో చిస్తాం. ఇది అనాదినుంచి బూజుపట్టిన అభిప్రాయం. కాని అలాంటి ప్రణయాలలోకూడా ఎంతో ఉదాత్తత వుంటుం దని మనం ఆలోచించలేకపోతాం. న్యాయంగా ఆలోచించ గలిగిననాడే వాటి విశిష్టత అర్థమవుతుంది. అది యే కళాకా రుని కలంలోనైనా పడగలిగితే తప్పక చరిత్రరూపం దాలు స్తుంది'' అన్నాడు ప్రకాశం.

తనువేసిన ప్రశ్నకు, ఊహించనివిధంగా సమర్థ నీయమైన సమాధానం లభించేసరికి. రాధ ఎంతో ఆశ్చర్య పడింది. అతని వాదనలో ఎంతోసత్యం వుందని గ్రహిం చింది. సంఘంలోగల యిలాంటి ప్రణయాలను ప్రతివారూ నీచంగా చూడటంవల్లనే స్త్రీకి 'పతిత' అనే కళంకం రుద్ద బడుతోంది. కాని వారిలోకూడా నీతి, నిజాయితీ, ధర్మం వుండగలవనీ, వారి ప్రణయంకూడా దాంపత్య జీవనంలాం టిదేననీ ఎవరూ ఆలోచించరు, అలాఆలోచించటం ఏ విశాల హృదయుడికో చెల్లు! వాటినర్థంచేసుకోవటం అనుకున్నంత సులభంగాదు'' అని అనుకుంది రాధ.

''సంఘం స్త్రీని పతితగా గుర్తించినంత నీచంగా, పురుషుణ్ని ఎందుకు గుర్తించదు? తప్పు అనేది యిద్దరికూ చెందినా అందులో పూర్తిభాగం స్త్రీదే అయినట్టు లోకం గుర్తించటంలో ఎంత అన్యాయంవుందో చూడండి. ఇటు వంటి విషయాలలో పురుషులపై అంతవేగంగా నీచాభిప్రా యాన్ని అంతబలంగా ఆపాదించరు. పురుషునకు యిటువంటి

చెల్లునట! స్త్రీకేమాత్రం చెల్లదట? స్త్రీనేదోషిగా గుర్తించే సంఘం పురుషునకెందుకంత ప్రాధాన్యత యిస్తుంది? ఇది స్త్రీలోని లోపమా? పురుషుని ఆధిక్యతా?" రాధ అడిగిన ఈ ప్రశ్నకు ప్రకాశం మందహాసం గావించాడు.

"ఒక నిర్దుష్టమైన కట్టుబాటు అంటూ లేనిపక్షంలో ప్రపంచం యేనాడో తలక్రిందులవుతుంది. హద్దూ, ఆచారం అనేవి సంప్రదాయమైనవి. అవే లేనిపక్షంలో సంఘం మూడు ముక్కలవుతుంది. అందుకే అనాదినుండి యేర్పడిన ఈ సాంఘిక సదాచారాలవలననే ఈనాడు కొంతవరకూ సంఘం తుప్పుపట్టకుండావుంది. యేనాడైతే ఆ సదాచారాలను రూపు మాపి, కొత్తవిప్లవం లేపగలుగుతారో ఆనాడు లోకమే ఒక పెద్దమార్పు పొందుతుంది. ఎన్నో ఆశయాలు, అనుభవాలు, విజ్ఞానంగల పెద్దలు విధించిన హద్దులను ఈనాడు ఆదర్శ వాదులంఅంటూ లేచేసత్రకాయలు కొందరు నిర్మూలించ ప్రానుకుంటున్నారు. అదిసాధ్యమైననాడు ఒకరూపుఅంటూ సంఘంలో కనిపించదు. పూర్వంనుండీ సంఘం స్త్రీపట్ల కొన్ని హద్దులు, నియమాలు యేర్పరచింది. వాటిని స్త్రీ రక్షించుకోగలిగినాడే ఆ స్త్రీత్వానికి పరిపూర్ణత. అది అతి క్రమిస్తే వెంటనే లోకం ఆమెను గుర్తించి అభాండం వేస్తుంది. అది ఆమెతప్పు. పురుషునకీవిషయంలో హద్దులు లేవు. ఉన్నా అవి అతన్ని నిందించలేవు. ఈ భేదభావాలు ఈనాటివిగావు. అందుకే ఈ విషయంలో స్త్రీపైననే అసలు మొత్తం పడ్డబడుతుంది. ఈ విధంగానైనా కొంత అభాండం అనే హద్దులేనిపక్షంలో యేనాడో స్త్రీ తన సర్వస్వాన్ని

కోల్పోయివుండేది. ఆమె పవిత్రత లోకాని కీనాడు అవసర మయేదిగాదు. ఈ సంఘాచారాలు పురాతనమైనవైనా బూజుపట్టినవిగావు. అవి బూజనుకొని ఈనాడు కొందరు స్త్రీలకు సమాన హక్కులుగావాలి. వారూ పురుషులకే మాత్రం తీసిపోరు. అనే నినాదాన్ని కొనసాగిస్తున్నారు. నిజంగా వారు మూర్ఖులని నా అభిప్రాయం. స్త్రీకి పూర్ణ స్వాతంత్ర్యం లభించిననాడు సంఘం తప్పక తుప్పుపడుతుంది. పెద్ద, చిన్న అనే తెగలులేనిదే ఏ కార్యమూ జరుగదు. లోకం అంతా సమాన ఆస్తిపరులుగావాలి. బీదలు వుండనే కూడదంటే అది ఒక్క అల్పాభిప్రాయం. దాని పర్యవసానం తర్వాతగాని తెలియదు. స్త్రీ స్వాతంత్ర్యం పూర్తిగా ఆక్ర మించుకుంటే పవిత్రత అనే పదానికే అర్థం వుండదు. ఒక శతాబ్దానికి ఊహించలేని నీచమైనమార్పు సంభవిస్తుంది. పాతకట్టుబాట్లు ఎన్నడూ సడలకూడదు. ఇలాఅంటే నీడె వడో పాతకాలపుమనిషి, ఆదర్శవాదికాదు అంటారు. కాని జరుగబోయేకాలాన్ని కూడా ఆలోచిస్తే ఈలాంటి మార్పుల వల్ల ఎంతో క్షోభం బయలుదేరుతుందని అర్థంచేసుకోవచ్చు. ఇప్పటికే స్త్రీకివచ్చిన హక్కుల విషయమే ఆలోచించు, అవి ఎంతవరకూ సత్ఫలితాలను చూపించారో! ఇక యిది శ్రుతిమించితే పూర్తిగా సంఘం భ్రష్టపడుతుంది. 'ఎవరికి వారే యమునాతీరే' అన్నట్టు మారిపోతుంది లోకం. స్త్రీని స్త్రీగా చూసేవారెవరూ వుండరు. స్త్రీ స్త్రీగాలేనినాడు ప్రకృతే మార్పుచెందుతుంది. అర్థమయిందా రాధా."

ముగించాడు ప్రకాశం.

ఎక్కడో ప్రారంభించిన విషయం, చివరకు యిలా వరకూ దిగింది. రాధలో వింతవిస్మయాన్ని, ఒక క్రొత్త భావాన్ని ప్రకాశం రేకెత్తించాడు.

"మీరు చెప్పింది నిజంగా నగ్నసత్యం! కానిసంఘానికి మార్పుతప్పక కావాలి అనిఅందరూ అరుస్తున్నారే! వారి అభిప్రాయాలు పూర్తిగా విరుద్ధమైనవే అంటారా"

"అసలు 'మార్పు' అనేపదానికి సరైన 'అర్థం తెలిసిన వాడెవడూ,' మార్పుకావాలని ఆశించడు. మార్పు తనంత రావాలిగాని, ఒకడుచేస్తే, చెపితేవచ్చేది మార్పుగాదు, కృత్రిమ నాటకం. మార్పుకావాలనే ఆదర్శవాదులు పెద్ద విజ్ఞానవేత్తలుగాదని నాఅభిప్రాయం. వారికసలు స్వరూపం తెలియదు. ఏవోబురఖాలు మాత్రం వారిదృష్టికి కనిపిస్తాయి ఇలాంటిమార్పులు ముందుకు అనర్థాలేగాని శ్రేయోదాయకం గాదు."

వరండాలోని గడియారం 'ఠంగ్ఠంగ్' అనిఆరుగంటలు కొట్టింది.

"చూడుప్రకాశం! నీమాటలెంతో గడియారంకూడా అంగీకరిస్తోంది" అంది నవ్వుతూ రాధ.

రాధ వెళ్ళి కాఫీతెచ్చింది. "ఈనాడు మనం సినిమాకు వెళ్ళాలిసుమా" అంది కాఫీకప్పు అందిస్తూ.

ప్రకాశం కాఫీకప్పు బల్లపైవుంచి, "సరే! అయితే మీనాన్నగారినడుగు" అన్నాడు.

"ఫరవాలేదు, నిన్ననే అనుజ్ఞ తీసుకున్నాను. వెళ్దామా"

"ఇప్పుడేనా,"

"ఆరుదాటిందిగా, మనంచేరేసరికి ప్రారంభమే అవు తుంది. ఊ...లేవండి"

* * * * *

ఇందిరకు ప్రకాశం బావంటే ఏదోచెప్పరాని అభిమా నం. ఆఅమ్మాయికి వయసొచ్చినా ప్రేమవ్యవహారాలంటే ఏమిటో సరిగా తెలియవు. కాని ప్రకాశంబావ, అదేదో తియ్యని భావం, తనలో వెదజల్లాడనుకొని సిగ్గుపడుతుంది. ఏదైనానవల చదువుతున్నప్పుడుగాని సినిమా చూస్తున్నప్పుడు గాని, అందులో కథానాయకుడుగా ప్రకాశం బావనూ, కథానాయకిగా తన్నూ వూహించుకొని, స్వప్నలోకాలను గాలించేది. అలావూహించగనే సిగ్గుదొంతరలు ఏర్పడి, హృదయమంతా బావరూపు నిండిపోయేది. తనన్నయ్య పెళ్ళినాడు ప్రకాశాన్ని చూడగానే, ఏవేవో సంబంధాలు కల్పించుకొంది. తనకు ప్రకాశం, "బా,....వ...." అనుకొని కేవలం బావగానేకాక యింకోరూపంలోకూడా సృష్టించు కొనేది. ప్రకాశంతో పూర్తిపరిచయ మేర్పడిన తర్వాత, ఆ భావన పెరిగిపెద్దదయింది మొదట్లో వున్నంతసిగ్గు ఇప్పుడు బావ ఎదుట తగ్గింది. ఇందిర సరిగా లోకజ్ఞానం తెలియనిపిల్ల కాని తెలివైనది. తమక్లాసులో ఫస్టుమార్కులన్నీ ఆమెవే! పల్లెటూరి వాతావరణంలో పెరిగిందిగాబట్టి ఆలోచనలు అమాయకంగా ఏర్పడుతూండేవి. తనునమ్మినదంతా సత్యమనే

ఆమె అభిప్రాయం. శారదకు ఇందిర మనసు బాగా అర్థ మయింది. రెండుమూడుసార్లు కలలో కూడా 'బావా' అని కలవరిస్తూండటం కూడా ఆమె విని నవ్వుకొంది. ఈ అమాయకపుపిల్ల ఆలోచనలకు శారద ఎంతో సంతోషించింది. ప్రకాశానికి ఎలాగయినా ఆమె నిప్పించాలనే భావనకూడా ఏర్పరచుకొంది. ఇందిరను ప్రకాశంపేరుతో ఏదోవిధంగా అప్పుడప్పుడు వుడికించేది శారద.

ఆనాటి సాయంత్రం వంట పనులన్నీ ముగించుకొని శారదా, ఇందిరా బయట హాల్లోకూచొని ఏవో కబుర్లలో పడిపోయారు.

"వదినా! ప్రకాశం బావ పక్షంరోజులయినా రాలేదు చూడు! ఇక్కడొక యిల్లుందనే విషయమే మరచిపోయాడు" ఏదో ధ్యానంలో అంది ఇందిర.

"అదేమిటే ఇందిరా అలా అంటావ్! మొన్ననేగా వచ్చివెళ్లాడు. అప్పుడే వారాలను లెక్కిస్తున్నావు! మీ బావ యీ యిల్లు మరచినా నిన్ను మరవడులే"

"పో వదినా! నీ వెప్పుడూ యింతే!"

"ఈసారిరాగానే చెబుతాలే, అన్నయ్యా నీ మరదలూ . . ."

"ఇకచాల్లే వదినా! మా పెద్ద చెప్పొచ్చావుగాని— అన్నయ్యరానీ నేనూ చెబుతాను"

"ఏమని చెబుతావేమిటి?"

"ఏమని చెబుతాను. నీ వాఫీసుకు వెళ్ళగానే వదిన నిన్నుగూర్చి కలలు "

"ఇక ఆపవే. మీ అన్నయ్య వస్తున్నారు" అంటూ పైకి లేచింది శారద. వెంకటేశం ప్రవేశిస్తూనే భార్యవేపు రుసరుసచూస్తూ, "ఏం పనిపాటలులేవూ! బయట వరండాలో కూచొని ఉపన్యాసాలుదంచుతున్నారు. ఛీ ఛీ సిగ్గులేని మనుష్యులు" అంటూ తనగదివేపు వెళ్లాడు. ఈ మాట శారద కన్నా ఇందిర హృదయాన్ని బలంగా గాయంచేసింది. శారదవేపు జాలిగా చూసింది. ఆమె కళ్ళల్లోనీరు సుడిగుండాల్లా తిరుగుతున్నాయి.

"ఊరుకోవదినా!" అని సముదాయించబోయింది ఇందిర.

వెంకటేశం గదినుండి బయటకువచ్చి, "యేమిటలా మొద్దులా నిలబడ్డావు! ఇంటికి మనిషొచ్చాడే! కాస్త కాఫీ తెచ్చి యిద్దామన్న పరిజ్ఞానంకూడా వద్దా! ఛీ ఛీ" అన్నాడు అసహ్యంగా. ఈ మాటకు ఇందిరకు కోపం మండింది. "యేమిటన్నయ్యా అస్తమానమూ వదిన్నలా చీదరించుకోకపోతే ఒక్కసారిగా గొంతు నులిమెయ్యకూడదూ. తప్పులేకపోయినా ఎప్పుడూ పాడురుసరుసలు"

"నువ్వు నోరుమూసుకో! మధ్య నీ పెత్తనం జాస్తి అయిందే" అంటూ బాత్‌రూంవేపు నడిచాడు.

సాయంత్రం ఆరుదాటింది. బయటనుండి ముగ్గురాడపిల్లలు బిలబిలా లోపలకువచ్చి "ఇందిరా" అని కేకేశారు ఇందిర వంటింట్లోంచి బయటకువచ్చి వీరినిచూసి, "యేమిటే ఇలాఊడిపడ్డారు. యేంకొంప మునిగింది" అంది నవ్వుతూ

"అయితే కొంపలు మునిగిపోతేతప్ప నీదగ్గరకు రామన్న మాట మేము. ఉదయం సినిమా కెళ్దామని చెప్పి యిప్పు డిలా అంటున్నా వేమిటి?"

"అయితే నా దగ్గరిపుడు డబ్బుల్లేవు"

"మీ అన్నయ్య నడుగు"

"అమ్మో! చావమోదుతాడు. ఇప్పుడే పోట్లాడు కున్నాం. ఇక రాం రాం" అంది. ఇంతలో వంటింట్లోంచి "ఇందిరా" అన్న శారద పిలుపువిని, లోపలకువచ్చి, "ఏం వదినా" అంది.

"ఇదోడబ్బు" ఏదో డబ్బీలోంచి తీసి యిచ్చింది శారద.

"ఎందుకూ"

"ఎందుకేమిటి, సినిమాకు"

"నీ కెక్కడివి?"

"కూరగాయల డబ్బులో మిగిలింది. వెళ్ళు వారు కాచుకొనుంటారు."

ఇందిర వదిన బుగ్గపై మృదువుగా ముద్దెట్టుకొని, "మా మంచి వదిన" అంటూ బయటకు వచ్చింది. "పిచ్చిపిల్ల" అని నవ్వుకొంది శారద. మిత్రబృందంతో సహా సినిమాహాలు వేపు దారితీసింది ఇందిర.

## 8

ప్రకాశం, రాధ సినిమాహాలు దగ్గరకు చేరేసరికి ఆరు న్నర కావస్తోంది. ప్రకాశంతో ముఖపరిచయంవున్న కొం

దరు వ్యక్తులు వీరిరువురూ యిలా జంటగా కన్పించటం చూసి ఆశ్చర్యపోయారు. కొందరు ఈర్ష్య చెందారు. కొంద రెగతాళిచేశారు. కొందరు చాటుగా ఏవో ప్రేలుకొన్నారు. ఇలాంటివి సంభవిస్తాయని ప్రకాశానికి ముందుగానే తెలుసు. అందువల్ల అతనేమీ బాధ చెందలేదు. లోకం లోకమేఅన్న సహజ విషయం అతను విస్మరించలేదు. రాధకు చాలామంది తమకేసి గ్రుచ్చిచూడటంచే కాస్త సిగ్గుపడింది. ఎదుటవారు తమను వేలెత్తి చూపుతున్నట్లుగా ఫీలయింది. ప్రకాశంలో యిలాంటి అసహజ భావాలకు చోటులేదు. ఒక మిత్రు రాలితో కలసి తిరిగినంతమాత్రాన, తన వ్యక్తిత్వానికిగానీ. తన భావాలకుగాని ఏమాత్రమూ సంకుచితత్వం ఏర్పడదని అతని అభిప్రాయం.

ప్రకాశం బుకింగ్ ఆఫీసువేపు వెళ్ళబోతూండగా, వెనుకనుంచి పరిచిత [illegible] అని పిలిచినట్ట యింది. ప్రకాశం వెనుదిరిగి చూశాడు. ఎదురుగా ఇందిరా ఆమె మిత్రులూ. రాధ ఆమె పిలుపునూ, ప్రకాశం వెనుదిర టాన్నీ ఒకక్షణంలో గమనించింది.

"సినిమాకు వచ్చావా ఇందిరా?" అనడిగాడు తన సహజధోరణిలో. అతని ధోరణిలోగాని, ముఖకవళికలలో గాని ఏ విధమయిన మార్పు కనిపించలేదు. రాధ కెంతో ఆశ్చర్యం వేసింది.

"ఈమె పేరు ఇందిర. నాకు మరదలవుతుంది. ఈమె రాధ. నా క్లాస్ మేట్".

ఇందిర క్షణకాలం తనచుట్టూవున్న పరిసరాల్ని కూడా విస్మరించి రాధవేపు రెప్పార్పకుండా చూసింది. ఆ చూపులకు రాధ ఎలాగో అయిపోయింది. వీరిలా ముభావ లోకంలో మునిగివుండగా, ప్రకాశంవెళ్ళి మూడుబాల్కనీ టికెట్లు పట్టుకొచ్చాడు.

"ఇందిరమిత్రులు, "మేంవెళ్తామే! నీకు మీ బావ దొరికాడుగా" అని వెళ్ళిపోయారు. ఇందిర వారిని ఆగమనే ధోరణిలో నోరుతెరవబోయింది. "వారినేం పిలువకులే! టికెట్స్ తెచ్చా" అన్నాడు ప్రకాశం.

"ఏంచదుతున్నారండీ," రాధ అడిగింది. ఇందిర జవాబిచ్చింది. ఆమె హృదయంలో ఈ నూతనవ్యక్తికీ, తన బావకూగల సంబంధం ఎలాంటిదా అనే సమస్య బయలు దేరింది. రాధకు ఇందిరను చూసినప్పట్నుంచీ ఏదో అభిప్రాయం తలెత్తింది. "ప్రకాశంకీమె ఏవిధమయిన మరదలు? ఇన్నాళ్ళూ ఏ విషయమూ తనతో అనలేదు ప్రకాశం. ఇదేదో సఘూఢంగావుందే" అనుకొంది. వీరి హృదయాలలో ప్రస్తుతం సంచరిస్తున్న భావాలు ఏకగర్భసంజనితాలే! వారి అనుమానాలు ఒకే పంథాలో దీర్ఘంగా పయనిస్తున్నాయి.

ముగ్గురూ హాల్లో ప్రవేశించి వరుసగా కుర్చీలలో కూలబడ్డారు. ఇక్కడొక విచిత్రం జరిగింది. మొదట ప్రకాశం ఒక కుర్చీలో కూలబడ్డాడు. రాధవెంటనే అతని కుడిప్రక్క కుర్చీలో కూలబడింది. ఇందిర కిదెంతో దుర్భరంగా కనిపించి ఏమాత్రం ఆలోచించకుండా వెళ్ళి ఎడమవేపు కూచొంది

యిద్దరి మధ్యా మిగిలిపోయాడు ప్రకాశం. రాధ మనసులో యేదో అర్థంగాని అనుమానజ్వాల ఆమెకు తెలియనుండానే బుసకొట్టింది.

తెరమీదరాబోవుచిత్రం 'ట్రయిల్' చూపిస్తున్నారు. ప్రకాశం తెరపై దృష్టినిలిపి చూస్తూండిపోయాడు. యిందిర ఆవేపుచూస్తున్నా అందుకు బదులుగా రాధా ప్రకాశంల జంట దృశ్యం ఆమె కళ్ళముందు మెదలినట్టయింది. ఆమె ఆలోచనలు ఆమెకే అర్థంగాలేదు. తనేవిషయం ఆలోచిస్తున్నానా అని కూడా ఆమెకు తట్టలేదు. ఏదో ఊహించని విషయం తనముందుజరిగి, తన్నొక విషవలయంలో బంధించినట్టుగా నిస్పృహ చెందింది. ఆ నిస్పృహలోనే ఒక గాఢ సమర్థన, అంతకుమించి ఈర్ష్య ఆమెలో ప్రబలిపోయాయి. ఓరగా రాధవేపు చూసింది. రాధచేయి ప్రకాశం చేతిపైనుంది. కడుపులో అగ్గిభగ్గునమండింది.

రాధ మనస్థితికూడా దాదాపు యిలాగేవుంది. నిర్దుష్టాభిప్రాయాలులేని ఈ అసహజత్వపు ఆలోచనలవల్ల తన హృదయం సంకుచితం అవుతున్నదే అనుకొని వ్యథచెందింది. యిందిర ధోరణీ ప్రకాశం తీరూ చూస్తుంటే వీరిద్దరికీ ఏదో పటుత్వమయిన సంబంధంవున్నట్టు, ఆ సంబంధం తన మనసులో సంచరిస్తున్న, ప్రకాశంపట్లగల బంధాన్ని ఒక్కసారిగా తెంచివేస్తున్నట్లు, తన ఆరాధనలోవున్న ఒక కమనీయ విగ్రహం, చెదురుబదురుగా తనను విడిపోతున్నట్టు తనకేదో, తీరనిద్రోహం జరుగుతున్నట్టూ భావించి, అర్థంగాని ఆవేదనను అనువించసాగింది రాధ. ఆమె మనసు సక్ర

మంగా ఆలోచించాలని, వ్యర్థ ప్రయత్నం చేసింది. తనెందు కంత బాధపడాలి? తనకు ప్రకాశంపై ఏ మధికారంవుంది? ఇందిరకే ప్రకాశం తన హృదయాన్ని అర్పించాడేమో! అబ్బ!! ఆ మాట తన కెందుకంత భారంగా కనుపిస్తుంది? లేదు...అలాకాదు, కాకూడదు. ప్రకాశంకు ఆమెకూ కేవలం బంధుత్వమేనేమో! అతని మనసు తన కర్థం! ఈ విధంగా మళ్ళీ సమర్థించుకొని సంతృప్తి చెందసాగింది రాధ. ఐనా ఏదో అనుమానం హృదయాన్నంతా కలచివేసే ఆవేదన!

ఇందిరకూడా ఆమెపట్ల తన అభిప్రాయాన్ని సమర్థించుకోవాలని ఎంతో ప్రయత్నించింది. కాని సాధ్యంకాలేదు, తనపట్ల ప్రకాశం పరిచయం కేవలం బంధుత్వమేనేమో! కాదు, కాదు. తన మనసు భావకుగ్రాహ్యం! మరి రాధ.., అబ్బ! ఎంతకఠోర సమస్య! ఇది నిజమా? జాగ్రదావస్థా? ఎటూ నిర్ణయించుకోలేని ఆమె హృదయం ఈర్ష్యలో మ్రగ్గ సాగింది.

ప్రకాశం ఈ రెండు హృదయాలలో జరిగే పోరాటానికి అతీతుడైనట్టుగా నిశ్చలంగా, నిర్వికారంగా చిత్రం చూస్తూండిపోయాడు. అతనిలో ఏవిధమయిన సంక్షోభమూ సంభవించటానికి ఏమాత్రం అవకాశం లేకపోయింది. రాధ గురించిగాని, ఇందిర విషయమయిగాని అతడేనాడూ పనిగట్టుకొని ఆలోచించలేకపోయాడు. రాధంటే అతనికి అభిమానం, ఇందిరంటే వాత్సల్యం. రాధ విజ్ఞానసృష్టి అతన్ని ఆకర్షితుణ్ణి చేసింది. ఇందిర చలాకీతనం అతణ్ని ఆందింప

చేస్తుంది. వారి విరుద్ధ ప్రకృతులూ అతనిలో ఏనాడూ విజృభించలేదు. రాధ మిత్రత్వం అతని హృదయంలో ఉత్సాహంగా చిందులు త్రొక్కింది. ఇందిర అమాయకత్వం అతనిలో వాత్సల్యాన్ని పెనవేసుకొనేలా చేసింది. అందుకే వారంటే ప్రకాశానికి ఏదో ఒక అనుభూతి.

చిత్రం సగంఅయింది. రెండు మూడుసార్లు ఇందిర రాధవేపు, రాధ ఆమెవేపూ చూసుకున్నారు. ఏ అభిప్రాయాలతో అవలోకించుకున్నారో నిర్దుష్టంగా చెప్పటంకష్టం! వారు చిత్రమే చూడలేదనవచ్చు. చూసినా మెదడుకు ఎక్కి వుండదని నా అనుమానం.

చిత్రం పూర్తయింది. వీరి హృదయపోరాటాలు మాత్రం యింకనూ పూర్తిగాలేదు.

ముగ్గురూ హాలుదాటి ఆవరణ బయటకొచ్చారు. ఎవరిమధ్యా ఏవిధమయిన సంభాషణా జరగలేదు.

బయటకురాగానే ఇందిర మిత్రులు కన్పించి ఆమె కోసం ఆగారు. ఇందిర ఇది గమనించింది. కాని ప్రకాశాన్ని ఈ స్థితిలో విడిచిపోవడం అంటే వేరొకరికి అప్పగించి వెళ్ళటం, తనదేదో పోగొట్టుకున్నట్టుగా యిందిర నిస్పృహ చెందింది.

"నే వెళ్తాబావా! రేపు యింటికి వస్తావుగదూ"

"వీలుంటే"

"అలాగాదు. తప్పకరావాలి."

"ప్రయత్నిస్తాను."

యిందిర ప్రకాశంవేపు అదోకవిధంగాచూసి వెళ్ళి పోయింది. ఏవో నూతనభావాలు ఆమె కళ్ళనుండి వర్షించా యని ప్రకాశాని కప్పుడేతట్టింది. యిటువంటి చూపులతో యిందిర తన్నెప్పుడూ చూడలేదు. ఆ చూపులభావాలు మాత్రం అతనికి స్ఫురించలేదు.

యిందిర వెళ్ళగానే రాధ తన హృదయంలో అంత వరకూవున్న ఏదోబరువు తొలగినట్టు ఆనందించింది. అంత వరకూ అణచుకున్న ఉద్వేగాన్ని ఒక్కసారిగా వెళ్ళ గక్కుతూ, "ఆమె మీకు ఏవిధంగా మరదలు?" అని సాగ దీసి అడిగింది.

"అంటే?"

"ఆమె ఎవరూ అని"

"మరదలూ!"

"అదికాదు"

"యింకేది?"

"అదే! ఆమెకూ మీకూ ఎలాంటి బంధుత్వం అని"

"నీ ప్రశ్న చాలా విచిత్రంగావుంది రాధా! ఆమె నా చెల్లాయిభర్తకు, చెల్లెలు అవుతుంది. అర్థమయిందా?"

రాధకు అర్థమయినట్టే తోచింది- "వారిక్కడేం చేస్తున్నారు?"

"మా బావ యిక్కడే వర్కుచేస్తున్నాడూ."

"అయితే ఆ విషయం నా కెన్నడు చెప్పలేదే!"

"అవసరం కలగలేదు"

"ఓహో! అలాగా!!" అంది రాధ చిన్నగానవ్వి. ఆ నవ్వు కొత్తగా కనిపించింది ప్రకాశానికి.

"నడచివెళితే చాలా కాలం పడుతుంది. నీవు జట కాలో వెళ్ళు రాధా."

"అయితే మీరు!"

"నేను నా గది కిటే వెళ్తాను."

"లేదు, లేదు! మా యింటికి వెళదాం రండి"

"బాగానే చెబుతావ్! నాకేం కొంపాగోడు లేదను కున్నావా!" అని ఒక జట్కానిపిల్చి ఆమెనందులో కూచో మన్నాడు.

రాధ అందులో కూచొని, "ఉదయం వస్తారా?" అనడిగింది.

"ఏమో చెప్పలేను" అన్నాడు ప్రకాశం. బండి కదలింది.

# 9

శారదకీ మూడుమాసాలనుండీ ఏమాత్రం మనసు సరిగాలేదు. ఇన్నాళ్ళూ భర్తతోవున్న ఏవగింపువల్ల ఏర్పడే బాధను మించినవ్యథ, ఈనాడు ఆ పక్కింటి అప్రాచ్యునివల్ల అనుభవిస్తోంది. వాని వికారాలూ, చేష్టలూ, ఉత్తరాలూ శ్రుతిమించిపోతున్నాయి! ఈ దౌర్భాగ్యుడు నా పాలిట శనిలా దాపురించాడనుకొని వాని వినాశనాన్ని ఆశించేనామె. ఉత్తరాలు వ్రాయటం ఆ తొలిరోజుతోనే ఆగుతాయనుకొంది

గాని, రానురాను అవి రోజుకొకటిచొప్పున విడుదలవుతున్నాయి. అన్నీ ఒకే పంథా! ఒకే అభిప్రాయం!

వారంరోజులక్రితం శారద విచిత్ర స్థితిలో పడింది. ఆ రోజామెకు లభించినఉత్తరం కొత్తగావుంది. ఆ ఉత్తరంలో ఇందిరాఅని సంబోధనవుంది. ఇంతవరకూ ఇలాంటి ఉత్తరాలు వస్తున్నాయన్నమాట అనుకొని మండిపడింది. [illegible]గా లనుకొందిగాని ఏదీతోచలేదు. తన భర్తకీ విషయం తెలియచేయాలని మొదట్నుంచీవుంది. కాని వాడు అసలే కోపపు మనిషి. ఎటుతిరిగి ఎటు అర్థంతీస్తాడోనన్న అనుమానంతో ఆ ప్రసక్తి మానుకుంది. కాని ఎంతకాలం ఈ రహస్యబాధాఝరిలో ఎదురీత సాగించేది! వాని వికారచేష్టలు చూస్తుంటే వళ్ళంతా పాములూ, జెర్రులూ ప్రాకినట్టనిపించేది.

ఆ రోజు మధ్యాహ్నం వచ్చిన ఉత్తరం ఆమెలో మరీ విపరీతమైన సంచలనాన్ని, భయాందోళనను యినుమడింపచేసింది. ఇన్నాళ్లూ వ్రాసిన ఉత్తరాలన్నీ ఒకెత్తు ఈ ఉత్తరమొకటీ ఒకెత్తు. అందులో "శారదా! ఎన్నిరోజులుగానో, నీకై తపిస్తూ, విరహజ్వాల కాహుతయిపోతున్నాను. ఇక ఈ మౌనాన్ని భరించలేను. ఈ రోజురాత్రి 12 గంటలకు మా పెరట్లో కలిసేది. నీవు రానిపక్షంలో నేనేవస్తాను." అని వుంది. ఈ ఘటనకు నిలువెల్లా వణకిపోయింది. దీన్నయినా భర్తకు చూపిస్తే!. అదీభయమే! వాడు కనిపిస్తే నమిలి మింగేద్దామన్నంత అక్కసూ, కోపమూ జనించాయి.

* * * * *

ఇందికూ ఇలాంటి ఉత్తరాలు అందకపోలేదు. మొదట్లో ఆమెకూడా భయపడ్డా తర్వాత అతన్నొక పిచ్చివాని క్రింద జమకట్టి అంతటితో వాటిని విస్మరించింది. కాని రానురాను శ్రుతిమించే ఈ చర్యలకూ, ఉత్తరాలకూ ఆమె కోపం శ్రుతిమించి, ఆమె మనసులో ప్రతీకారం ప్రజ్వరిల్లింది. అసలే ఆమె మనసు రాధను చూసినప్పటినుండీ ఒకవిధంగా అసూయతో నిండిపోయింది. అలాంటి పరిస్థితులలో ఈ అల్లరి ఉత్తరాలు పుండుమ్మన్న వేలిపై ముసిరే ఈగల్లా ఆమెను చుట్టుముట్టాయి.

ఆనాటి సాయంత్రం స్కూలునుండి తిరిగివచ్చి బాత్ రూమ్‌లో ముఖప్రక్షాళనం చేస్తూండగా, వెంటిలేటర్ గుండా ఒక ఉత్తరం ఆమె ముందుపడింది. మొదట్లో ఆశ్చర్యపడి, ఆ కాగితం ఏదో అర్థంచేసుకొని దాన్ని స్పృశించరాదనుకొంది. కానీ మళ్ళీ అది ఎవరికంటయినాపడితే ప్రమాదం అనుకొని తీసుకొని చదివింది. ఆ ఉత్తరం పూర్తిగా శారదకు వ్రాసినదానిలాగే వుంది. కాని ఈ ఉత్తరంలోగల తేడా ఏమంటే కాలనిర్ణయం మాత్రం 2 గంటలకు వుంది. అది చదువగానే వళ్ళంతా కోపంతో బుసలుకొట్టింది. ఈ విషయం వదినతో చెపితే ఏదయినా పరిష్కారం చూపగలదేమోనని ఆశించేది. ఎలాచెప్పాలో, చెబితే ఏమనుకొంటుందోనని ఆదిలో అనుమానించిందిగాని, అయినా ఇందులో తన తప్పంటూ ఏమాత్రంలేనపుడు నేనెందుకు జంకటం? ఇదేదో తేల్చాల్సిందే, వీనికి శాస్తి జరగాల్సిందే! అని తీర్మానించుకొంది.

రాత్రి పదిగంటలయింది. వెంకటేశం సినిమా కెళతా నని చెప్పి రాత్రి తొమ్మిదిగంటలకే యిల్లువిడిచి వెళ్ళాడు. వెంకటేశం సినిమా కెళ్ళటానికి కారణంకూడా లేకపోలేదు. ఆ పక్కింటి అబ్బాయి ఈ మిషపైనే అతన్ని సినిమాకి తీసు కెళ్ళాడు. అతణ్ని సినిమాహాల్లో విడిచిపెట్టి తను ఊరి రంగంలో ప్రవేశించాలని అతని అభిప్రాయం.

వెంకటేశంకూడా ఇల్లువిడిచి వెళ్ళటం శారదలో అమిత భయాన్ని కల్గించింది. "ఈరోజు వెళ్ళొద్దండి" అందా మనుకొందిగాని ఏమంటాడోనన్న భయంచే పూరకుండి పోయింది. ఇందిరకూడా ఇదే మనస్థితిలో తయారయింది. అంతవరకు వదినతో తనివిషయం చెప్పలేదు. అన్నయ్యతో ఈ విషయం చెప్పగలిగివుంటే బావుండేదేమో అనుకొంది గాని ఆ అవకాశంకూడా మించిపోయింది.

గదిలో మంచంపై పడుకొని శారద ఈ విషయా లన్నీ ఆలోచించసాగింది. ఇందిర వంటపనులన్నీ ముగించు కొని గదిలోకివచ్చింది. శారద ఉలికిపడి, "నీవా ఇందిరా," అంది.

"ఇంకెవరనుకున్నావు" అని అడిగింది ఇందిర. తనకు సంభవించినస్థితి వదినకుకూడా సంభవించిందేమోనన్న అను మానం ఆమెకు తట్టింది. ఈ మాటకు హృదయంలోని బాధ దుఃఖంగా పరిణమించి భోరున, చంటిపిల్లలా, ముఖాన్ని చేతుల్లో యిరికించుకొని ఏడ్వసాగింది శారద. ఇందిర తెం బేలుపడిపోయింది, కారణాన్ని గురించి ఆలోచించేందుకు ఆమెకు అవకాశమూ, కాలమూ లేకపోయింది. వదిన ఎందు

కేడుస్తూందో అర్థంగాలేదు. శారదప్రక్కగా కూచొని, "ఏమిటొదినా! ఇలాఏడుస్తున్నావు, అన్నయ్య యేమైనా అన్నాడా? అసలు యేంజరిగింది" అని గాభరాగా అడిగింది ఇందిర.

తన ఈ బాధతో గుండె ఒక్కసారిగా బ్రద్దలై పోతుం దేమోనని భయపడింది శారద. ఇందిరను చూడగానే ఆమె దుఃఖం మరీ త్రీవతిమించింది. ఇందిర ఆమె ముఖంమీది చేతులు తొలగించి, "యేంజరిగిందొదినా! నాతో చెప్పవూ" అని అడిగింది. రెండుక్షణాలు నిశ్శబ్దంగా గడిచింది. శారద కన్నీళ్ళు తుడుచుకొని "ఇందిరా! నేనొకవిషయంచెబుతాను. ఎవరితోనూ చెప్పవుగదూ!" అంది. ఈ మాటలోకూడా యింకనూ దుఃఖస్వరం మిళితమైఉంది. "చెప్పనులే వదినా" అంది ఇందిర. శారదఆగి, తన జాబ్లోవున్న ఒక కాగితం తీసి ఇందిర కందించింది.

ఇందిర ఆ ఉత్తరంచదివి ఆశ్చర్యపోయింది. ఒక విధంగా నవ్వుకూడా వచ్చింది. కాని అంతలోనే ఆమె స్థితి జూచి, అణువణువునాకోపరేణువులు ఆ దౌర్భాగ్యునిపై విజృం భించాయి. ఈ నీచుడుచేసే ఈ దౌష్ట్యచర్యలకు యేవిధంగా నయినా ప్రతీకారం చేసితీరాలనిపించింది. శారదవైపుబాధగా జాలిగా చూసింది. తనలోని సవాలక్ష ఆలోచనలన్నీ ఒక్క సారిగాచెప్పివేయాలనిపించింది.

శారద ఆమె ముఖంలో సంచరిస్తున్న భావాలను పసి గట్టి నిశ్చలంగాచూస్తూండిపోయింది.

ఇందిరలోని శక్తులన్నీ ఒక్కచోట కేంద్రీకరింపబడ్డా యేమోననే విధంగా కోపంతో "వదినా! ఈ పాపాత్ముణ్ని పాదరక్షప్రయోగం చేసేవరకు నా మనసు శాంతించదు. ఇటు వంటి అవినీతి చర్యలవల్ల వానికి ఫలితం తెలిసేలా గట్టిగా దవడలు వాయించాలి...దుర్మార్గుడు...నీచుడు" అని పళ్లు పటపట కొరికింది. శారద క్షణంమౌనంగావుండి, "ఔను ఇందిరా" అంది, "కానిఎలా?"

"వదినా! నీకొకదానికే ఈ స్థితి సంభవించలేదు. వాడు నాకూ యిలాంటి ఉత్తరంవ్రాశాడు" అంది కోపంగా.

"నేనప్పుడే అనుకొన్నాను ఇందిరా" బాధగా అంది. "కాని ఇందిరా! యిప్పుడేంచేయాలో నాకు బొత్తిగా అర్థం గాలేదు. గుండెల్లో ఏదోభయంస్పందిస్తోంది. మీ అన్నయ్యా కూడా ఇంట్లోలేరు. వాడేమి అఘాయిత్యం సాగిస్తాడోనని కలవరంగా వుంది..."

ఇందిర ధైర్యంతో, అన్నయ్యాలేనిదే మంచిదయిం దొదినా! నీవు నాతో సహకరిస్తే వాణ్ని ఒక్కపెట్టున మట్టు బెట్టగలను" అంది ఆవేశంగా.

"ఎలా ఇందిరా! ఏ సహాయం కావాలన్నా చేస్తాను. వీని పీడ విరగడచేసుకుంటేగాని మనకు శాంతిలేదు" అంది.

ఇందిర, "వదినా! వాడు వ్రాసినట్టు ఈ రాత్రి 12గం టలకు సరిగ్గా పెరట్లోకివెళ్ళు! ఆవలపని నేను ముగిస్తా" అంది.

"ఏమిటీ...నన్ను వెళ్ళమంటున్నావా!... వాడు..."

"నీకేం భయంలేదొదినా. నేను ఆలోచించే చెబు తున్నాను. వాడు వస్తాడు, నీవువెళ్ళు, చేసేపని నేనుచేస్తాను"

"ఏంచేస్తావు?"

"నీకే తెలుస్తుంది చూడు"

"అయినా నాకు భయంగా వుంది"

"ఫరవాలేదు. నీకుగాని, నాకుగాని యేవిధమయిన అపాయం వుండదు. ధైర్యం ప్రధానం. ఈ దెబ్బతో వాణ్ని ..."

* * *

'స్త్రీ అబల' అన్నారు పెద్దలు. కాని ఆ అన్నవారే "శక్తి స్వరూపిణి" అని కూడా అన్నారు వెనువెంటనే!

"కొద్దినిమిషాలు అటోయిటో తేడాతో 12 గంటలయింది. శారద, ఇందిర సలహా ప్రకారం ధైర్యంచేసి మెల్లగా దొడ్డితలుపు తెరచి ప్రక్కయింటి పెరట్లో అడుగుపెట్టింది. అంతకుముందే గన్నేరుచెట్టు క్రింద కూర్చొన్న ఒక వ్యక్తి తన కళ్ళను తానే నమ్మనట్టుగా కళ్ళు తాటించి మరీమరీ చూసి, ఆశ్చర్యంతోపాటు ఆనందంకూడా చెందాడు తన వాంఛ ఈనాటికి త్రం అయిందనుకొని విజయగర్వంతో అతను కూర్చొన్న చోటునుండి పైకిలేచి, తడబడు మాటలతో అస్పష్టస్వరంతో "వచ్చావా శారదా" అన్నాడు. అంతవరకూవున్న ధైర్యాన్ని చిక్కబట్టుకొని రెండడుగులు ముందుకు వేశాడు. శారద కంపించింది. శరీరమంతా స్వేదజలం స్రవించనారంభించింది. ఇందిర ఎప్పుడొస్తుందా, కథ ఎప్పుడు రక్తికడుతుందా అనుకొని వేయికళ్ళతో చూస్తు

సాగింది. ఒకవేళ ఇందిర రాకపోతే..."అమ్మో...!" గుండె జలదరించింది. తన ఈ విపత్కర పరిస్థితి తనకే అసహ్యంగా కన్పించసాగింది. ఆ వ్యక్తి కాస్త దగ్గరకువచ్చి, "నేనుఅపుడే అనుకొన్నాను, నీవు నన్ను కాదనలేవని. అవునా శారదా" అంటూ ఇంకొంత దగ్గరగా వచ్చాడు. శారద ఈసారి పూర్తిగా గడగడవణికింది.

"ఏమిటి భయపడుతున్నావా? రోట్లోకి తలదూర్చి రోకటిపోటుకు వెరవడం మనలాంటివారి సాంప్రదాయానికే విరుద్ధం" అంటూ చేతులు రెండూ ఆమె భుజాలపై వుంచ బోయాడు... అంతే! ఆ చేతులలాగే ఆగిపోయాయి. వెనుక నుంచి, ఏదో భయంకరహస్తం చొక్కా-కాలరుపట్టి, బలంగా వెనక్కు-ఈడ్చి, ముఖం బ్రద్దలయేలా ఒక్కతన్ను తన్నింది. ఊహించని సంఘటనకు ఆ వ్యక్తి పూర్తిగా గాబరా చెందాడు. గాభరాతోపాటు భయంకూడా ఆవ హించింది. ఆ తాపుకు క్రిందపడినవాడు వెంటనే పైకిలేచి ఎదుటనున్న భయంకరస్వరూపాన్ని చూశాడు. నల్లటిపాంటు, నల్లటికోటు, తలకు హేటు, మెడకు మఫ్లర్, కాళ్లకుబూట్లు, చేతులో లావుపాటి దుడ్డుకర్రతో ఎదుటకన్పించిన ఆ ఆకా రాన్ని చూసి స్థంభించిపోయాడు.

అతను మళ్ళీ పైకిలేవబోతుండగా, ఆ నూతనవ్యక్తి దుడ్డుకర్రతో, "అనుభవించు" అంటూ బలంగా చావమోద సాగాడు. ఇదంతా రెండుక్షణాలలో జరిగింది.

"ఏయ్! ఇంకోనాటికిలాంటి పోకిరీవేషాలువేశావా! జాగ్రత్త..." అంటూ కర్రయెత్తి నెత్తినగట్టిగాబాది, ఇంకో

దెబ్బ వేయబోతూండగా, అంతవరకు యీ పోట్లాట నిశ్శబ్దంగా చూస్తున్న శారద "ఇకచాల్లే ఇందిరా! మరీ ప్రాణం పోయేను! వెళదాంపద" అంది.

అప్పుడే స్మృతితప్పపోతూన్న ఆ వ్యక్తి యీ మాట విని అస్పష్టంగా "ఇందిరా" తన్ను బాదిందనుకొని "ఆడదానిచేతిలో..." ఆ మాట పూర్తి కాకుండానే మూర్ఛపోయాడు.

"నీలో యింతధైర్యం వుందనుకోలేదు ఇందిరా! అబ్బ! వాణ్ణలా మోదుతూంటే నీ స్వరూపంజూచి నాకే భయంవేసింది" అంది శారద.

"అవునోడినా! అవసరమొస్తే 'స్త్రీ శక్తిస్వరూపిణి' అన్నపేరు నిలబెట్టుకోవాలి. కాని పక్షంలో ఈ లోకంలో బ్రతకటమేకష్టం" గంభీరంగా అంది ఇందిర.

*  *  *  *  *

ఆ నాటిరాత్రి సంఘటన ఇందిరలో ఎంతో ధైర్యాన్ని తెచ్చిపెట్టింది. పక్కింటి పోకిరీ అబ్బాయి వారంరోజులవరకు ఆ దెబ్బలకు కోలుకోలేకపోయాడు. అసలురహస్యం మరెవరికీ తెలియదు. చెప్పటానికి అతనికి సిగ్గేసి యింట్లో ఎవరికీ చెప్పలేకపోయాడు. ఏదో అబద్ధంచెప్పి తప్పించుకొన్నాడు. అతనితల్లి సుందరమ్మవల్ల ఈ విషయం శారదా, ఇందిరలకు తెలిసింది. వారు నవ్వుకొన్నారు. మంచిశాస్తి జరిగింది. ఇక జన్మలో ఆడపిల్లల జోలికి వెళ్ళడు అనుకొంది ఇందిర.

ఈ విషయమిలావుండగా, ఇందిరలో ప్రకాశం ఒక సమస్యగా పరిణమించాడు. ఆమెలో ఏదోబాధ ఈర్ష్యకలసి గూడుకట్టుకుపోయింది.

"ఆమెపేరురాధట! క్లాస్‌మేట్ అట..." ఆమెతో పరిచయం ఎలాసంభవించిందో!... అది కేవలం పరిచయమేనా, లేక... ఏమో! ఏ పుట్టలో ఏ పాముందో! బావ తన కిన్నాళ్ళూ ఎంత అమాయకంగా కన్పించాడు! తనను నవ్విస్తూ, నవ్విస్తూనే ఘెరోకరితో సరససల్లాపాలలో మునిగి పోయాడు. అది అతని తప్పా?... అతను నిజంగా ఆమెను ప్రేమించాడేమో!... ఏం? ఆమె తనకన్నా అందగత్తా! ఏ విషయం తనలో పరిపూర్ణత చెందలేదు.

"ఒకవేళ యాదాలాపంగా వారిరువురూ కలసి అలా సినిమాకొచ్చారేమో! కాని వారిసంబోధనలు గమనిస్తూంటే తః కలాగనిపించలేదు' వీరిద్దరిమధ్య ఏదో ఘనమైన సంబంధం వుండితీరాలి."

"మరి బావ తనతో ఎందుకంత చనువుగా ప్రేమగా మాట్లాడతాడు? ఎన్నిఛలోక్తులు... ఎన్నిహాస్యాలు ... అలాంటి బావ తన్నుకాదని అలా ఆమెతో... ఛా... ఛా... బావ అలాంటివాడుగాదు. ఆమే, బావా కేవలం పరిచయస్థు లేనేమో! ఒక క్లాసుకనుక ఆ మాత్రం పరిచయం ఎందు కుండకూడదు?... ఏమయినా బావ తనవాడు. బావకూ తనంటే 'యిష్టమే...' తనపై బావకు పరిపూర్ణ 'అనురాగం.' అతని ధోరణే ఆ విషయం పట్టిస్తుంది. రాధ కేవలం మిత్రు రాలు కావచ్చు... తనే బావకు... తనీవిషయం తెలియచేస్తే

...అబ్బ! ఎలాంటి ఆలోచన... ఏ స్త్రీ సిగ్గువిడిచి తన ప్రణ యాన్ని చెప్పగలదు... తనడగవలసిన అగత్యమే లేదు. బావ రాగానే సందర్భానుసారంగా ప్రశ్నించి అతని అసలు హృదయం సిగట్టాలి!..."

ఇవీ ఇందిర ఆలోచనలు. ఆమెలో ప్రకాశం తన వాడు అన్న భావన హత్తుకుపోయింది. ఇన్నిరోజులుగా లేని ఆలోచనలు ఈనాడు ఆమెలో ఉద్భవించి నిద్రాణమయిన ఆమె అంతర్ప్రేమను మేల్కొలిపేలా చేశాయి. ప్రకాశం రూపు ఆమె హృదయమంతా ఆవరించుకుపోయింది.

ఆ రోజు సాయంత్రం ప్రకాశం అక్కడకు వచ్చాడు. వచ్చేసరికి ఇందిర హాల్లో కుర్చీలో కూచోని ఏదో చదువు తూంది. శారద వంటింట్లో వుండిపోయింది. వెంకటేశం యింకా ఆఫీసునుండి తిరిగిరాలేదు.

ప్రకాశం ప్రవేశించగానే, ఇందిర ఉలికిపడి లేచి, అంత లోనే సిగ్గుపడింది. ప్రకాశం తన సహజధోరణిలో "ఏం ఇందిరా! అలానిలబడ్డావ్! వెళ్ళి ఒకగ్లాసు వేడిగా కాఫీపట్రా, తలమండిపోతోంది"- గబగబ అనేసి అక్కడేవున్న ఈజీ చైర్‌లో కూలబడ్డాడు ఆయాసంగా! ఈ సంభాషణలో ఆమెకేదో గాఢ ఆత్మీయత కనిపించి, ఆనందంతో వెల్లివిరిసి అలాగే అతని ముఖంవేపు చూస్తూండిపోయింది. ప్రకాశం ఆమెవేపు నిశ్శబ్దంగాచూసి, "అమ్మాయిగారూ! ఏమిటా వ్రతం!" అన్నాడు. ఇందిర చూపులు తప్పించుకొని, "ఏం బావా" అంది.

"అయితే మళ్ళీ చెప్పాలన్నమాట"

"అయితే ఇంతకుముందేదైనా చెప్పావా"

"అడిగావూ? కాఫీ తీసుకురమ్మని చెప్పలేదూ"

"ఓహ్! ఎంతమతిమరపు. యిదో యిప్పుడే తెస్తా" అంటూ వంటింట్లోకి వేగంగా వెళ్ళింది.

"వదినా! వెంటనే ఒకకప్పు కాఫీ తయారుచెయ్యి. అర్జంట్" అంది. ప్రవేశిస్తూనే యిందిర.

"ఎవరికే"

"బావకు"

"ఎప్పుడొచ్చాడు"

"యిప్పుడే"

"అయితే మీ బావకు నీవే సుకెళ్ళు, మధ్య నేనెందుకూ?"

"ఫో వదినా," అంది సిగ్గుతో!

పదినిముషాలలో కాఫీ తయారుచేసి పెద్దకప్పు నిండుగా తీసుకువచ్చి, ప్రకాశం చేతికందించింది.

ప్రకాశం రెండు గుటకలు చప్పరించి, "కాఫీ అద్భుతంగావుంది యిందిరా! నీవే తయారుచేశావా?" అనడిగాడు. యిందిర మౌనంగా తలూపింది అతనివేపేచూస్తూ. ఈనాడెందుకో ప్రకాశం సరికొత్తగా కనిపిస్తున్నాడు. అతని ప్రతి మాటనూ తూచితూచి మననం చేసుకుంటూంది. ఆనాడు సినిమాహాలుదగ్గర కన్పించిన తర్వాత మళ్ళీ ఇదే మొదటిసారి చూడటం. యిప్పటికైదురోజులు కావస్తోంది.

"యిన్నాళ్లూ రాలేదేం బావా"

"ఎన్నాళ్లు?"

"ఆనాటినుండీ రానేలేదుగా"

"ఏనాటినుండీ"

"అదే! ఆనాడు సినిమాకెళ్ళినప్పటినుంచీ"

"ఓహో!"

"రాధగారు బావున్నారా?"

"నీ కెందుకా సమాధానం?"

"ఏం అడగడం తప్పా?"

"అప్పుడే ఫ్రెండ్స్ అయ్యారన్నమాట"

"యింతకూ చెప్పలేదు"

"బాగానేవుంది"

యిందిర ఈ ఒక్క సమాధానంతో తృప్తిపడ దలచుకోలేదు. ఎన్నో అనుమానాలు తీర్చుకోవాలనిపించింది.

"ఆమె దీపూకేనా బావా"

"అవును"

ఇందిర ఈసారి కాస్త ధైర్యంచేసి, "ఆమెకూ మీకూ పరిచయం ఎలాకలిగింది బావా" అని అడిగింది అతని కళ్ళవేపు సూటిగాచూస్తూ!

ఈప్రశ్నకు ప్రకాశంనవ్వుతూ, "నన్నుక్రాస్ఎగ్జామిన్ చేస్తున్నట్టున్నావే. యింతకూ యిది ఏవిధమయిన కేసు" అన్నాడు. ఈ నర్మగర్భ జవాబుకు యిందిర ఉలికిపడి బెదిరింది. తన భావాలను బావ పసికట్టాడేమో!

"లేదు... లేదు... ఊరకే అడుగుతున్నాను" అంది తొట్రుపడుతూ. ఆమె మాటల్లో కన్పించిన తొందరకు ప్రకాశం పకపకా నవ్వాడు. ఆ నవ్వు హేళనగా కన్పించింది

యిందిరకు! యిందిర ఏదీ మళ్ళీ అడగాలనుకోలేదు. యిదే మంత ముఖ్యమైన ప్రశ్నగాదు కాబట్టి ప్రకాశం జవాబివ్వదలచుకోలేదు. యిందిర ఖాళీ కప్పు తీసుకొని ఏదో ఆలోచిస్తూ వంటింట్లోకి వెళ్ళింది, రెండునిముషాల తర్వాత మళ్ళీ బయటకొచ్చింది. వచ్చేసరికి ప్రకాశం అక్కడలేడు. ఆశ్చర్యపోయింది! హృదయంలో ఎవరో చెయ్యిపెట్టి కెలికినట్లయింది.

# 10

ఆనాడు సినిమాకువెళ్ళి తిరిగి వచ్చినప్పటినుండీ రాధ హృదయం పేలవంగా తయారయింది. ఆమె తప్త నిస్త్రాణ హృదయంలో సముద్రపు కెరటాలు, చెలియలికట్ట నతిక్రమించినరీతిగా, అనుమాన కెరటాలు సుళ్ళుతిరిగి ఆమె ఆలోచనలకు హద్దును కల్పించలేకపోయాయి. యిన్నాళ్ళు ప్రకాశంపట్ల తను నిర్మించుకొన్న స్వప్న, సుందర, ఆశాభవనాలు ఒక్కసారిగా, పేకమేడల్లా కూలిపోతాయేమోనన్న సంధిగ్ధంలో జీవన్మరణ సమస్యలోవున్న రోగిలా కొట్టుమిట్టాడింది. ఒకవేపు ఆవేదన, యింకొకవేపు మిణుకుమిణుకుమనే జ్యోతివలె అస్పష్ట సమర్థన. యివి రెండూ ఏకీభవించి, మనసు డోలాయమానంగా అటూయిటూ స్పందించసాగింది. ఏనాడైతే ప్రకాశం తమ యింట్లో ప్రవేశించాడో, ఆనాడే తన హృదయంలోకూడా ఒక సుందరస్వరూపం కవాటాలు తెరచుకొనివచ్చి సంచరించసాగింది. ఆ కమనీయ మనో

విగ్రహం, కాంతులు వెదజల్లుతూ తనను పూర్తిగా ఆక్ర మించుకొంది.

కాని ప్రకాశం, ఇందిరల బాంధవ్యం ఆ విగ్రహాన్ని ముక్కలుముక్కలుగా చేయటానికి ప్రయత్నించే కఠోర ఆయుధంలా తయారయింది. ఆ బాంధవ్యం ఎంతవరకు పటుత్వమైనది? ఏమో! ఊహించరాని, విడీవిడని సమస్య యిది.

ఈ ఘర్షణాపూరత వేగంలో వారంరోజు లామె ఊగిసలాడింది. ఏ పని చేయాలన్నా, ఏదో ఒకబంధం తన్ను అజ్ఞాతంగా ఆపి, ఆలోచనలను అతని వేపు మళ్ళించేది.

ఈ వారంరోజుల్లో ప్రకాశం తన యింటి వేపే రాలేదు. ఈ కారణం ఆమెను మరీ కృంగదీసింది.

కాలేజిలో మూడురోజులుగా కన్పిస్తూనేవున్నాడు. మామూలుగానే కనిపించాడు. కళ్ళతోనే పలుకరించాడు. చిరునవ్వుతోనే సమాధానమిచ్చాడు. అతనిలో మార్పు లేదు. అయితే మార్పంతా తనలోనే ఏర్పడిందా?

మొదటి నాలుగురోజులూ అతనెందుకో కాలేజిలో కనిపించలేదు. ఇన్నాళ్ళూ మరి యిక్కడికెందుకు రాలేదు? ఒకవేళ వారి యింటికే వెళ్లాడేమో! వారికిగల సంబంధం తనకెక్కడిది? ఇందిరా ప్రకాశంలకు ఏదో బలిష్టమైన బాంధ వ్యం వుంటుందని తనకెందుకో అనుమానం. ఇది నిజమేనా? ...కాదు... లేదు... ప్రకాశం అలాంటివాడుగాదు. తన మనసతనికి తెలుసు. అతని పలుకులలోని మధురత, చూపుల్లోని నిర్మలత్వం, నవ్వులోనిస్నిగ్ధతఅంతా తనను అభి

మానిస్తున్నవే! ఈసారి రాగానే ఆతని అంతర్యాన్ని కని పెట్టాలి! ఇన్నాళ్ళూ తనేదీ ఆలోచించలేదు. తనలో అలాంటిది నిండివున్నదన్న విషయమే ఈ సంఘటనవల్ల అది తన హృదిలోంచి పొంగి పొరలుతూంది!

వింత విచిత్రం? స్త్రీ హృదయం తనంతతాను బయట పడదు. అది అగాధం... పరిస్థితులు, ప్రదేశం, కాలం ఏకీభవిస్తేగాని స్త్రీ ఆంతర్యం స్పష్టమవదనే సత్యం ఎంతనిజం!

సాయంత్రం తనగదిలో కూచొని, నిశ్శబ్దంగా, నిర్వికారంగా వారపత్రిక చూస్తూండిపోయింది రాధ. ఆమెలో ఆలోచనలువున్నా అవి తారస్థాయిలో చెలరేగలేదు. ఒకవిధమైన నిర్ణయం, సమర్థన, ఆమె ఆలోచనలను అరికట్టింది. వాటికొక అందమైన రూపకల్పన గావించుకొంది.

"ప్రకాశం రచయిత. ఎదుటి హృదయాలను వెంటనే పసిగట్టే విమర్శాత్మకదృష్టి, సునిశిత విజ్ఞానం అతనిలో వున్నాయి. తను అతనికి అర్థం- టీకాటిప్పణితోసహా అతను తన్ను పఠించాడు. అతను తన్ను ఏనాడూ అసహ్యించుకోలేదు. తనంటే అతనికి అభిమానమే! తనను అభిమానించని వాడయితే తమ పరిచయం యింత ఎత్తుగా పెరగలేదు! ఈనాడిది పూర్తిగా పెరిగింది! అది కూలకూడదు. ప్రకాశం కూల్చలేడు. అందుకే ప్రకాశం తనవాడు. అతనంటే తనకు పరిపూర్ణ విశ్వాసం! ఆ విశ్వాసం అంతంగాదు. ఆ విశ్వాసానికి తార్కాణం ప్రకాశం చూపులే!" ఈ విధమైన నిర్ణయం ఆమెలో శాంతిని ప్రవేశపెట్టగలిగింది.

హాల్లో గడియారం ఐదుగంటలు కొట్టటమూ, బయట పాదరక్షల శబ్దం వినిపించటం ఒకేసారి జరిగింది. రాధకా పాదరవళి సుపరిచితమే!

ప్రకాశం గదిలో అడుగుపెట్టగానే, కృత్రిమ కోపాన్ని అభినయిస్తూ, "ఏంమహాశయా! ఈనాటికి మేము జ్ఞప్తికి వచ్చామన్నమాట! వస్తే జడివానలా వస్తావు, వెళితే శ్రావణ వర్షాల్లా అలాగే వెళతావ్" అంది రాధ.

"క్షమించు రాధా! ఒకమిత్రుని వివాహానికి వెళ్ళ వలసి వచ్చింది" అంటూ ఆమె కెదురుగావున్న కుర్చీలో కూచొన్నాడు.

"మూడు రోజులనుండి కాలేజీలో కన్పిస్తూనే వున్నారే మరి"

"అంతకుముందే వెళ్ళాను. మూడురోజులయిందివచ్చి"

"మరెందుకిక్కడకు రాలేదు"

"ఈ ప్రశ్నలతో నన్ను నల్చుకుతింటున్నావ్ రాధా! నీ ఎదురుగా నేనొక ముద్దాయినైపోయాను. నిన్న శారద యింటికి వెళ్ళాను. మొన్న బద్ధకంగావుండిరాలేదు. ఈనాడు రాకతప్పిందిగాదు. అమ్మయ్య! ఇక సంజాయిషీ యిచ్చుకో వాల్సిన అవసరం లేదనుకొంటాను. ఆగ్రహం తీరిందా"

"ఇన్ని కారణాలు చూపిన తర్వాత ఆగ్రహానికి అవ కాశం ఎక్కడుంది. ఇంతటితో ఈ కేసు కొట్టివేసి మిమ్మల్ని నిర్దోషిగా ఋజువుపరుస్తున్నాను" అంది రాధ నవ్వుతూ. అరక్షణం తర్వాత ఏదో జ్ఞప్తికి వచ్చినదానిలా, "ఆ మీ చెల్లాయి యింటికి వెళ్ళామన్నారు. మీ మరదలు క్షేమ

మేనా!" ఈ ప్రశ్న అడుగుతూ ప్రకాశం ముఖంలో ఏదైనా నూత్న భావం తనకు గోచరిస్తుందేమోనని సూటిగాచూసింది,

నిజంగా ప్రకాశం ఈ ప్రశ్నకు ఆశ్చర్యపోయాడనే చెప్పాలి. ఎంచేతనంటే నిన్న యిలాంటి ప్రశ్నే ఇందిర నోటి గుండా వచ్చింది. ఏమిటి వీరిద్దరిమధ్యా ఈ అప్రయత్న అవ్యాజానురాగాలు కొంపదీసి కూడబలుక్కోలేదుగదూ! అనుకొని, "ఈ ప్రశ్న ఎందుకడిగావు రాధా" అనడిగాడు.

"ఏం! అడుగరానిదా?"

"కాదుగాని, ఎంతలోనే ఎంతఅవ్యాజప్రేమ ఆమెపై ఒలకపోస్తున్నావ్"

"అంటే నాది కపటప్రేమనేనా మీ అర్థం!"

"ఏమైనా అనుకోవచ్చు. సరిగా మాట అర్థం చేసుకోనపుడు"

"ఇది మరీ బాగుంది! పరిచయస్థుల కుశలం తెలుసుకోవటంతప్పా"

"ఇక అన్నిమాటలెందుకుగాని, ఆమె క్షేమంగా వుంది" అన్నాడు ప్రకాశం.

రాధ ఆ ఒక్క జవాబుతోనే ఆగిపోలేదు. ఆమె తనలో శేషించిన ప్రశ్నలను వెళ్ళగ్రక్కటానికి జంకింది. తన హృదయం ఎక్కడ బయటపడిపోతుందోనని బెదిరింది. అప్పుడే ప్రకాశం ఏదో గుర్తించినట్లు 'క్రాస్' చేశాడు. ఎంతైనా అఖండుడు! ఒక్కక్షణం యిద్దరూ మౌనంగా వున్నారు.

రాధ ముఖకవళికలలో సంభవిస్తున్న పరివర్తనను చూచాయగా గ్రహించగలిగాడు ప్రకాశం. అయితే గ్రహించిన విషయాన్ని గురించి అతనేవిధమైన భావశాబల్యంతోనూ ఊహించలేదు. అందుకు కారణాలుగాని, విషయాలుగాని తన మనసుకే పట్టించుకోలేదు ప్రకాశం. కాని రాధ కళ్ళు వెదజల్లే ఏవో నిఘూఢభావాలు, ఆ పెదవులు వర్షిస్తున్న అర్థాంతధార అతనిలో ఒక విచిత్రమైన అనుభూతి, లేక సంచలనాన్నో రేకెత్తించాయని చెప్పాలి. అలా జరిగిందనిగాని వాటి అర్థం 'ఫలానా' అనిగాని ఆ నిర్వికార చిత్తానికి తట్టలేదు. అయినా ఈనాడు రాధముఖంలో, కళ్ళలో చూపుల్లో, పలుకులలో ఏదో అది తను యింతవరకు కాంచనిది యీనాడు గమనిస్తున్నానని అతని మస్తిష్కంలో చిన్న భావరేఖ పొడసూపింది. రెండుక్షణాలు గాఢమౌనం. వారి మధ్య సుళ్లుతిరిగింది. ఆ కాలంలో యిద్దరూ కనీసం పదిసార్లయినా ఒకరిముఖం ఒకరు చూసుకొనటం, దృష్టి నిలిచేలోగానే, చూపులు మరలించుకొనటమూ జరిగింది. ఈ అచేతనస్థితి అతనిలో ఒక విచిత్రమైన సంధిగ్ధావస్థను, కొంతవరకూ బిడియాన్నికూడా కల్గించింది. ఆ రెండు క్షణాలలో కలిగిన వారి మనోభావస్థితిని గురించి యింతకంటె నిర్దుష్టంగా నిర్వచించలేము.

రాధ యీ మౌనానికి, ప్రకాశం చూపులకు కాస్త జలదరించింది. యీ గంభీర వాతావరణాన్ని యిక పెంపొందించలేకపోయింది. ఏదో లోకంనుండి అప్పుడే వూడిపడ్డ

దానివలె అట్నుంచి పైకిలేచింది. "ఉండండి కాఫీ తెస్తా" అంటూ గబగబా గదివీడి వెళ్ళింది.

ప్రకాశం కుర్చీలో వెనక్కువాలి ఇంటి చూరువేపు చూస్తూండిపోయాడు. గతక్షణంలోగలిగిన ఏ సంచలనమూ అతనిలో యిప్పుడు పూర్తిగాలేదని చెప్పలేము. కాని అన్ని విషయాలనూ పనిగట్టుకొని ఆలోచించటం ప్రకాశం మన స్తత్వానికే విరుద్ధం!

నాలుగయిదు నిముషాల్లో, ట్రేలో కాఫీ కప్పులతో సహా రాధ ప్రవేశించి, ప్రకాశంకెదురుగానున్న మేజాపై వుంచి తనూకూచొని "సేవించండి" అంది. ప్రకాశం రెండు గుటకలు స్వీప్ చేశాడు.

"కాఫీ బావుందాండీ?" రాధ ఇది నిత్యమూ వేసే ప్రశ్న.

"పంచదార తక్కువయింది"

"తేవాలామరి"

"సంపూర్తిగావస్తున్న ఈ అసంపూర్ణానికి యిక అనవసరం"

"అంటే"

"అసంపూర్ణంగావున్న యీ కాఫీ సంపూర్తయింది. దాని అవసరాన్ని గుర్తించేలోగానే" అంటూ క్రిందపెట్టాడు ఖాళీ కాఫీ కప్పును.

రాధ అరక్షణం ఆ వాక్యాన్నే ఆలోచించింది గాబోలు, "జీవితం కూడా యింతేనంటారా" అనడిగింది అప్రయత్నంగా!

సరైనవిషయం గమనించావురాధా! జీవితంలో మనకు తెలియకుండానే ఎదుట పరిణామాల ప్రసక్తి ఆలోచించకుండానే మనం చేసేపని మంచికే దారితీస్తుందంటూనే పనులన్నీ చేసేస్తాం. కాని నిజంగా అందులో లోపమేవుంటే ఆ పని పూర్తికాగానే అసలుతప్పు, వాటిస్థితి మనకు అర్థమవుతుంది. ఆ తర్వాత మళ్ళీ దానిని సరిదిద్దాలన్నా అది అతుకు బొతుకులగానే తయారవుతుందికాని సరైనస్థితి అందుకోదు. నిజానిజాలు గమనించేలోగానే ఎదుటి పరిణామాలు పూర్తిగా తారుమారవుతాయి. అందుకే అన్నీ ఆలోచించి, తూచి, గ్రహించి, మనసును ఒకదారికి తెచ్చుకోమన్నారు"

"మీరనేమాట బాగానేవుంది! మనసనేది తాము చేయవలసిన కార్యక్రమాన్ని ఆలోచించాల్సినమాట నిజమే గాని కొన్నివిషయాలలో మనసుకు ప్రమేయం లేకుండానే కొన్నికొన్ని పనులు చేసేస్తాం! ఆ విషయం ఎప్పుడోగాని మనసుకు తట్టదు. ఆ తర్వాతనే ఏ విషయమైనా ఆలోచించాలిగదా మనసు... కాబట్టి" అని మళ్ళీ ఏదోఅనబోతుండగా ప్రకాశం అందుకొని, "నీ భావం అర్థమయిందిరాధా! మనసుకు ప్రమేయంలేకుండా ఈ జగత్తులోనే ఏ మానవుడూ ఏ పనీ చేయలేడు. కాని అది మనసు గుర్తించటం కొన్నికొన్ని సందర్భాలలో ఆలస్యమవవచ్చుగాని అంతమాత్రం చేత అది మనసుకే సంబంధించలేదనుకోవటం వట్టిభ్రమ-" అన్నాడు.

"మీ కిలాచెబితే అర్థంగాదు. మీ ధోరణిమీదే! ఒకస్త్రీ ఒక వ్యక్తిని, తనకు అంటే తన మనసుకు తెలియ

కుండా అప్రయత్నంగా ప్రేమిస్తుందనుకోండి...”

“అక్కడే పొరపడుతున్నావ్ రాధా! తనకు తెలియకుండానే అనుకోనేందుకు బదులు తన మనసుకు ఆలస్యంగా తెలిసింది అనుకోవటం సరి”

“అలాగేకానీండి. మీ పట్టుదల మీది! ఇక మీరా విషయం విడిచిపెట్టి మన స్త్రీత్వరీత్యా ఈ విషయానికికూడా సమాధానం యివ్వండి. ఒకస్త్రీ తను ప్రేమించిన వ్యక్తిని, తనను ప్రేమిస్తున్నాడా లేదా అని గ్రహించ ప్రయత్నించాలంటే ఏంచేయాలి?” ఈ ప్రశ్న కాస్త తటపటాయిస్తూనే అడిగింది.

“ఈ ప్రశ్న చాలా అమాయకంగావుంది రాధా! ఆ వ్యక్తి ఆమెను ప్రేమించే వున్నట్టయితే ఆమె ఆ విషయం తెలుసుకోవాలని ప్రయత్నించటం వెర్రితనం! తనంత తానే అతడా విషయంలో బయటపడతాడు”

“ఒకవేళ ప్రేమించకపోతేనో”

“అతడావిషయాన్ని గమనించకపోవచ్చు”

“అంటే!”

“ఆమె తన్ను ప్రేమిస్తూందన్న విషయాన్ని గుర్తించి వుండకపోవచ్చు”

“కాని ఆ యిద్దరిమధ్యాగల పరిచయం అలా అనుకోటానికి ఆస్కారంగాదే!” యీ విషయం ఆవేశంతో అంది రాధ.

“అతడా పరిచయాన్ని కేవలం స్నేహధర్మం క్రింద లెక్కించి వుండవచ్చు” వాలుకుర్చీలో వెనక్కువాలుతూ

తాపీగా జవాబిచ్చాడు ప్రకాశం. ఈ ప్రశ్నల తాలూకు అసలుభావం అతనికి లేశమాత్రమైనా స్ఫురించలేదను కుంటాను.

ఈ జవాబువినగానే తన ప్రక్కనే అకస్మాత్తుగా ఒక పెద్ద పిడుగుపడ్డట్టు, ఏదో అజ్ఞాత విలయకాల వినాశ కెరటం ఉత్తుంగమై వచ్చి విసురుగా సోకినట్టు, హృదయంలో ఏదో సుళ్లుతిరిగి, ఏదీ తెలియని అజ్ఞాన స్థితిలో నుండి వేగంగాలేచి ప్రకాశాన్ని అదోకవిధంగా చూసి వెంటనే తడబడుతున్న అడుగులతో బయటకు పరుగెత్తింది రాధ.

"ఈ హఠాత్ పరిణామం ప్రకాశంలో ఏ విధమైన సంచలనాన్నిగానీ, సంక్షోభాన్నిగాని ఏ మాత్రమూ కల్గించ లేదు. అసలామె స్థితిని ఇతడేమాత్రమూ గమనించలేదు. ఆమె వెళుతూన్నపుడుమాత్రం, "ఎక్కడికి రాధా!" అని పిలిచాడు. కాని అది వినిపించేలోగా ఆమె అక్కడ లేదు.

అలా విసురుగా వెళ్ళిన రాధ వంటింట్లోకివెళ్ళి హృదయంలో పొంగి పొరలే ఆవేదనను ఏడుపురూపంలో వెళ్ళగక్కింది. అలా ఐదునిముషాలు నిశ్శబ్దంగా ఏడ్చింది.

"ఇంతలో బయటనుండి, "రాధా నే వెళుతున్నాను" అన్న ప్రకాశం పిలుపు వినిపించింది. ఆ పిలుపులో మామూలుగా ధ్వనించే మార్దవంతప్ప మరేమీలేదు. రాధ ఆ స్థితిలో వెంటనే ఏమీ జవాబివ్వలేకపోయింది. దుఃఖాన్ని అణచుకొని "ఆగండి!" అంటూ బయటికొచ్చేలోగా, గృహానికి పదిగజాలదూరంలో పెద్దపెద్ద అంగలువేసూ వెళుతూన్న ప్రకాశం కనిపించాడు

ఆమె రొమ్ములపై కుంపటి వెలిగించినట్టయింది.

*            *            *

మరురోజు కాలేజీలో రాధ కన్పించలేదు. ఆమె రాక పోవటానికిగల కారణాల సతడు ఆలోచించలేదు. కాని కాస్త ఆశ్చర్యపోయాడు. రాధ ఏనాడూ ఊళ్ళోవుంటూ కాలేజీ ఎగ్గొట్టలేదు. ఆమె చాలా 'పంక్చ్యుయల్ స్టూడెంట్' అని అతని అభిప్రాయం. అనారోగ్యంగావుండి రాలేదనుకోటానికి వీల్లేదు. నిన్న తను వెళ్ళినపుడు అలాటి ఛాయలేమీలేవు.

"ఆ మరుసటి దినం కూడా రాధ కాలేజీలో కన్పించకపోవటం ప్రకాశానికేదో లోటనిపించింది. సాయంత్రం వరకూ బరువుగానే వుండిపోయాడు.

కాలేజీ విడువగానే పుస్తకాలు రామకృష్ణకప్పగించి నేరుగా రాధ యింటివేపు బయలుదేరాడు.

ఇంటిగేటు సమీపించగానే లోపల్నుండి అప్పుడే బయటకు వస్తున్న ఒకవ్యక్తి ఎదురుగా వచ్చాడు. అతని చేతిలోని బ్యాగ్‌ను చూడగానే అతడు డాక్టరని గుర్తించటానికి ప్రకాశానికెంతోకాలం పట్టలేదు. దాదాపు పరిస్థితి అవగాహనయింది. ఇంత స్వల్పకాలంలో రాధకేలాటి జబ్బు సంభవించిందో అనుకుంటూ వాకిట్లో కడుగుపెట్టాడు. ఎదురుగా రాజారావు విషాదంగా కన్పించాడు. "రావోయ్! అమ్మాయి నిన్నే కలవరిస్తోంది. నేనే ఎవర్నయినా పంపి

నిన్ను పిలిపిద్దామనుకొన్నాను. అదృష్టవశాత్తు నీవేవచ్చావు" అన్నాడు.

ప్రకాశం మౌనంగా అతన్ని అనుసరించి రాధగదిలో కెళ్ళాడు. మంచంపై బెడ్డుమీద రాధ దాదాపు నిద్రా భంగిమలో పడుకొనుంది. రాజారావు దగ్గరగా వెళ్ళి "అమ్మాయ్ రాధా! ప్రకాశం వచ్చాడు చూడమ్మా" అన్నాడు.

ఆ మాట వింగానే రాధ తన కళ్ళువిప్పి ఎదురుగా వున్న ప్రకాశాన్నిజూచి, ఏదో మాటాడే ప్రయత్నం చేయబోయింది. అంతలోనే ఆమె ముఖమండలంలో ఏదో విషాద మేఘం గాఢంగా క్రమ్ముకొని భారంగానిట్టూర్చింది. ప్రకాశం ఆమెవేపే చూస్తూ, దగ్గరగా వెళ్ళి, "రాధా!" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా అతని కళ్ళవేపు చూసింది. ఆమె కళ్ళు అతని ముఖంలో ఏదో అతిశ్రద్ధగా గాలిస్తున్నాయి. అరక్షణం మౌనం.

"ఎప్పట్నుంచీ ఈ జ్వరం"

"మొన్న రాత్రినుండీ!" అకస్మాత్తుగా ఫిట్స్‌వచ్చిన దానిలా అరచి పడిపోయింది. ఏదీ అర్థంగాలేదు. ఏ నడిగినా అందరివేపూ పిచ్చిదానిలా చూస్తుందిగాని జవాబివ్వదు ఉదయానికి 103 డిగ్రీల జ్వరం దాపురించింది. అప్పట్నుంచీ అలాగేవుంది. డాక్టరుగార్ని నడిగితే ఏదో మనసులో వుంచుకొని యిలా బాధపడుతోంది. ఫరవాలేదు. తగ్గిపోతుంది అన్నారు. అదేమిటో నీవేకనుక్కో" అని బయటికెళ్ళాడు రాజారావు.

"ఏమిటి రాధా యిది"

రాధ చిన్నగా నవ్వింది. "ఏమీలేదు ప్రకాశం... ఏమీలేదు... మీరు బావున్నారా?" అని అడిగింది. అది ప్రశ్నాగాదు- జవాబూకాదు.

రాధ మెల్లగా లేచికూచొంది. ఆమె చూపులతని పైనే ప్రసరిస్తున్నాయ్. ప్రకాశం ఒక కుర్చీ ఆమె దాపు కీడ్చుకొని కూచొన్నాడు.

"ఎందుకిలా జరిగింది రాధా?"

ఈ ప్రశ్నకుకూడా రాధ జవాబివ్వలేదు. అతని కళ్ళ వేపు సూటిగా, దీర్ఘంగా చూసింది. నిస్తబ్దంగా ప్రకాశం ఆమెనుచూస్తూ, "రాధా! నీస్థితిచూస్తుంటే నాకేదో బాధగా వుంది" అన్నాడు జాలిగా.

రాధ భారంగా కళ్ళుమూసుకొంది. ప్రకాశం ఆమె తలపై తన చేయివేసి ఆప్యాయంగా నిమిరాడు. రాధ ఉలికి పడినట్టు అతనివేపుచూసి, అతని చేతిని తనచేతుల్లోకి తీసు కొని "ప్ర... కా... శం" అంటూ బావురుమని ఏడ్చింది! ఈ అయోమయస్థితికి ప్రకాశం పూర్తిగా జాలిచెందాడు.

"భయంలేదులే రాధా! రేపీవేళకు నయంకాదూ" అని ఓదార్చబోయాడు.

"అదిగాదు ప్రకాశం" బొంగురుబోయిన కంఠంతో అంది.

"మరేమిటి రాధా!"

"మీరు... మీరు... హుఁ..." మరీ భారంగా నిట్టూర్చి, "నేను... నేను... ఏమీలేదు... లేదు" అంటూ

అతని చేతుల్ని తన ముఖంపై చేర్చుకొని కళ్లనిండా నీరు నింపుకొంది!

"ఇలా ఏడిస్తే ఎలా రాధా! ఏదో అస్వస్థతవల్ల యిలా అయ్యావ్! అంతమాత్రానికే యిలా బెంబేలుపడితే ఎలా? తప్పక నయమవుతుంది. మరేమీ గాభరాపడకు... నేనున్నాగా"

రాధ అతని మాటలను ఏదో అర్థంచేసుకొనేదానిలా ప్రయత్నించి, అతనివేపేచూస్తూ "ప్రకాశం" అంది మెల్లగా.

"ఏం రాధా!"

"నే నంటే..." ఆగింది.

"ఆ తర్వాత"

"నే నంటే మీ కిష్టమేనా ప్రకాశం" దాదాపు ఏడుపుస్వరంతోనే అడిగింది.

"ఎంత పిచ్చిప్రశ్న రాధా, నీ లాంటి స్నేహితురాలు దొరికినందుకు నే నెంతో గర్విస్తున్నాను"

"స్నేహితురాలిగా మాత్రమేనా?"

"అన్నివిధాలా నీ వంటే నాకు అభిమానం రాధా నీ వంటే నా మనసెప్పుడూ ఆహ్లాదాన్ని పొందుతుంది. నీవు రెండురోజులుగా కాలేజీలో కన్పించటం మానేస్తే యేదో లోటనిపించింది"

"నిజంగానా ప్రకాశం!" కన్నీరు తుడుచుకుంటూ అంది.

"అవును రాధా!"

"నే నంటే..."

"మళ్ళీ అదే ప్రశ్నిస్తున్నావ్"

"కాదు ప్రకాశం! నేనేమేమో అనుకొన్నాను. నన్ను క్షమించవూ"

"ఇదేమిట్రా్రాధా! నీవేం తప్పుచేశావ్, నేను క్షమించ టానికి. అనవసరంగా ఏవేవో ఆలోచిస్తూ మనసును పాడు చేసుకోకు..."

రాధ ప్రకాశం చేతుల్ని మృదువుగా స్పృశిస్తూ, యేదో ఆనందాన్ని, అనుభూతిని పొందసాగింది. ఆమె ముఖంలో, కళ్ళలో, యేవో వినూత్న రేఖలు గోచరిస్తు న్నాయ్!

"ఇక నాకేమీ భయంలేదు ప్రకాశం"

"నేను ముందే అన్నాగా! కాస్త విశ్రాంతి తీసుకో. నేను మళ్ళీ ఉదయంవస్తా" అంటూ లేచినిలబడ్డాడు.

"ఉండండి, కాఫీత్రాగి వెళుదురుగాని. ఈసారి పంచ దార తక్కువచెయ్యను" అంది చిన్నగా నవ్వుతూ.

"నిత్యమూ త్రాగేదేగా! ఫరవాలేదు. నే నొస్తా రాధా" అని బయటకు నడచాడు.

# 11

శారదా, ఇందిరలు పక్షంరోజులనుండి ఇంతవరకూ తమను పీడిస్తున్న దుష్టగ్రహంవల్ల ఏవిధమైన అలజడీ లేక సుఖశాంతులతో వున్నారు. వారి మనసులలో అప్పుడే వాన వెలిసి నిలచినట్టయింది.

ఇందిరలో ఈ అలజడి ఛాయలు ఏమాత్రం లేక పోయినా మనసులో అజ్ఞాతంగా వేరొక అలజడి బయలు దేరింది. అది ఆమె యిప్పుడిప్పుడే గ్రహిస్తోంది. ఆ సంచలనం తన బావ ప్రకాశానికి సంబంధించినదని ఆమెకు బాగా గ్రాహ్యం! ఎంతసరిపెట్టుకుందామనుకున్నా రాధ రూపం ఆమె కళ్ళముందు లీలగా మెదలుతూ మనసంతా అల్లకల్లోలంచేసి కలవరపెట్టేది. కాలేజీచదువుల్లో యిలాంటి మిత్రత్వాలు సహజమేమోననిఒక్కొక్కసారి సమర్థించుకో ప్రయత్నిస్తుంది. స్త్రీ సహజమైన ఈర్ష్య అందుకు స్థానం కల్పించలేకపోయింది. బావను సూటిగా అడగాలని ప్రయత్నించి, తన మనసునప్పుడే బయటపెట్టుకుంది. ఏమైనా బావ అలాంటి వాడుగాదు. ఏదో తియ్యనిభావం బావపట్ల ఆమెలో రాను రాను అభివృద్ధి కాజొచ్చింది.

ప్రకాశం తీరికా, ఓపికా వున్నపుడల్లా యిచ్చటకు రాకపోకలు సాగిస్తూనే వున్నాడు. ఈ రాకపోకలన్నీ తన కోసమేనని భావిస్తూ ఇందిర తన్మయత్వం చెందేది.

ఇకపోతే శారద భర్తగారి విషయంలో ఎక్కువ చెప్పాల్సిన అవసరంలేదు. అలాంటి మూర్ఖుణ్ని, అనుమాన ప్రాణి గురించి యే విధంగాచెప్పినా తక్కువే అనిపిస్తుంది. మళ్ళీ పక్షంరోజులుగా అతని ఆలోచనలు చాలా వక్రంగా నడకసాగిస్తున్నాయి. ఈ అసహజపు అనుమానాలను భార్య ముందు నిస్సంకోచంగా చీవాట్లరూపంలో బయటపెడుతూండేవాడు.

ఆనాడు ప్రకాశం వచ్చీరావటంతోనే బావగారితో ఈ ప్రస్తావన తెచ్చాడు.

"బావా! నాలుగురోజులతర్వాత మాకుసెలవులిస్తారు. సెలవుల్లో నాతోపాటు శారదను కూడా పిల్చుకురమ్మని నాన్నగారు ఉత్తరం వ్రాశారు" అన్నాడు.

"అంటే తీసుకువెళతావన్నమాట"

"నీ వంగీకరిస్తే"

"ఇక్కడ వంటపనో?"

"ఇందిర వుంటుందిగా"

"దానికి మాత్రం సెలవుల్లేవా! అదీ వూరెళ్ళచ్చు"

"నే వెళ్ళనులే అన్నయ్యా!" ఇందిర వంటింట్లోంచి కేకేసింది.

వెంకటేశం శాస్త్ర ఆయోమయంలో పడ్డాడు. అతనికి ప్రయాణం సుతరామూ యిష్టంలేదు. కాని తనే ఈ విష యంలో బోల్తాపడ్డాడు.

"అయినా..." అని ఏదో గొణగబోయాడు.

"వారంరోజులుండి వస్తుందిలే బావా! సంక్రాంతికి నీవూ రావాలని నాన్న వ్రాశాడుకూడా!"

వెంకటేశం, మరేమీ మాటాడలేదు. ప్రయాణం నాటికి తాను వస్తాననీ, సిద్ధంగా వుండమనీ శారదను హెచ్చ రించి, ఇందిరచేతి కాఫీ సేవించి నిష్క్రమించాడు ప్రకాశం.

* * *

రాధ రెండురోజులలో పూర్తిగా కోలుకుంది. తెల్లని తెలిమేఘంలా ఆమె హృదయం స్వచ్ఛంగా, ప్రశాంతంగా తయారయింది. ఏవిధమైన మార్పువల్ల తనింత ప్రశాంతంగా వుండగలుగుతోందీ రాధ మనసుకు బాగా తెలుసు.

ఆ ఉదయం ప్రకాశం రాధ యింటికి వచ్చాడు. అంతకుముందురోజే పరీక్షలు పూర్తి అయ్యాయి.

"ఈరోజే నేను ఊరికి వెళుతున్నాను రాధా"

"మళ్ళీ ఎప్పుడొస్తారు?"

"సెలవులు పూర్తికాగానే"

"కాలక్షేపం బాగా జరుగుతుందన్నమాట"

"లెస్సగా. మా చెల్లాయితోసహా వెళుతున్నాను"

"ఇందిర కూడానా"

"లేదు."

"అయితే నేనిక్కడ ఒంటరిగా మిగిలిపోవాలన్న మాట. సెలవుల్లో మీా రిక్కడే వుంటారుగదా కాలక్షేపం బాగా జరుగుతుందనుకొన్నాను"

"అదేమిటిరాధా! నా పరిచయమే లేకముందు ఎన్ని సెలవులు గడువలేదు"

"అదిప్రశ్నగాదు ప్రకాశం"

"అయితే నేను జవాబివ్వలేను రాధా"

"మీా యిష్టం" రాధ నిట్టూర్చింది. "మీా కోసం ఎదురుచూస్తూంటాను" అంది.

* * * * *

రామయ్యగారి ఇంటిముందు బస్సుఆగింది. ప్రకాశం, శారదలు బస్సుదిగి ఇంట్లో అడుగుపెట్టారు. వారిరాక ఆ యింటిల్లిపాదినీ చాలా ఆనందపరచింది. వీరు వచ్చేవేళకు రామయ్యగారు యింట్లోలేడు. ఏ కార్యకలాపాలమీదనో గ్రామంలోకి వెళ్ళాడు.

నాలుగుమాసాలుగా రామయ్య మనోస్థితిపూర్తిగా దెబ్బతింది. ఎప్పుడూ కోర్టువ్యవహారాలకు సంబంధించిన ఆలోచనలతో పూర్తిగా కృంగి, నీరసించిపోయాడు. 'నిండా మునిగాక చలేమిటి' అనే ఒకరకమైన ధైర్యంతప్ప మన సంతా వ్యథే! డబ్బు పుష్కలంగా చేతిలోవుంటే ఈ బాధ వుండేదిగాదు తిరగటంవల్ల యింతకుముందు చేస్తున్న హోల్ సేల్ వ్యాపారంకూడా పూర్తిగా మానివేశాడు. అందుచే ఆర్థికంగా చాలాదెబ్బ! ఈ వ్యవహారాలకప్పుడే ఐదారువం దలుమించి ఖర్చయింది. గత నాలుగుమాసాలలో అరభాగం తాలూకాటవున్‌లో వుండిపోయాడు.

రామయ్య తన జీవితంలో ఎన్నడూ కోర్టువ్యవహారా లలో దిగి ఎరగడు. వాటి ఛాయలే యింతవరకూ అతనిపై పడలేదు. ఆ సమస్యలతనికేమాత్రం తెలియవు. అకస్మాత్తుగా అనుకోనివిధంగాపడిన ఈపెద్దబరువుతో విచలితుడైపోయాడు. డబ్బువిషయంలో బావమరది సహాయంచేయటానికి సిద్ధంగా వున్నా, అడగటానికి మొహమాటంవేసి, మరీమరీ అప్పులు చేయటం యిష్టంలేక ఇంట్లోని బంగారాన్ని కొద్దికొద్దిగా అమ్మకం సాగించసాగాడు.

ఈ వ్యవహారంవల్ల గ్రామంలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. గ్రామంలో రానురాను అసలుసంగతి చాలా మందికి తెలిసిపోయింది. అగ్రిమెంట్లు దొంగగా, వెంకట రెడ్డి సాయంతో సృష్టింపబడ్డాయని, ఆనోటా ఆనోటాపడి రామయ్యకు కూడా తెలిసింది. గ్రామంలో ఎక్కువభాగం రామయ్యపైన సానుభూతి ప్రదర్శించారు. దుష్టూపోయి దుమ్ముపట్టినట్టుందని జాలికనబరచారు కొందరు

కొద్దిగా ప్రారంభమైన ఈ కక్షలు యిప్పటికి తీవ్ర రూపం ధరించాయి. ఇరుపార్టీలూ మాంచి విజృంభణలో వున్నాయి. ఎవరికి ఎవరూ తీసిపోయేట్టులేరు. ఒకరిగాలిసోకితే ఒకరు బుస్సుమని లేచేట్టున్నారు. పంచాయతీ వ్యవహారాల దగ్గర చెరువునీళ్ళగురించి కొద్దిగా పోరాటాలు జరగటంతో పగ పూర్తిగా ప్రజ్వరిల్లింది.

పార్టీల బలగం విషయం ఆలోచిస్తే రామయ్య పార్టీ కంటే సాంబయ్యవేపే అధికబలగం వుందని చెప్పాలి. అతనిం నిమ్నజాతుల అండజాస్తి! అందుకే వారికి మితిమించిన పొగరు! తాముచేసినదీ, చేస్తున్నదీ అన్యాయమని వారికి స్పష్టంగా ప్రత్యక్షంగా తెలుసు. కాని ఆశ మానవుని వ్యక్తిత్వాన్ని, మానవత్వాన్ని చంపుతుంది. ఆశ మంచిని నిగ్రహించలేదు. చెడుకూడా మంచినిమించినదని దాని ఆత్మవిశ్వాసం! 'దీపం పురుగుల్లా' సాంబయ్యపక్షం ఈ ఆశా వ్యామోహంలోపడి జయంమనదేనని విర్రవీగుతున్నారు.

నిజానికి బంధుత్వరీత్యాచూస్తే సాంబయ్య, రామయ్యకు బావమరిది అవుతాడు. క్రిందటి తరంవరకు వీరి బంధు

త్వం చాలా పటుత్వమైనది. అప్పట్లో సాంబయ్య కుటుంబా లలో జరిగిన శుభకార్యాలలోనూ, వివాహవిషయాలలోనూ అన్నిటా రామయ్య కార్యనిర్వాహకుడుగా వుండేవాడు. ఈ కక్షలవల్ల అవన్నీ ఈనాడు నశించాయి. రామయ్య గతంలో చేసిన ఎన్నోసహాయాలను వారు కృతఘ్నులై విస్మరించారు. ఈ భూముల వ్యవహారాలకుతోడు, అప్పుడప్పుడు పోట్లాడు కున్న రైటింగ్ కేసులుకూడా జతకావటంచే తిరగటానికి ఖర్చులు యిరువర్గాలనూ క్రుంగదీశాయి.

ఈ వ్యవహారాలుగాని, కక్షలుగాని యింక యేవిధమైన విషయాలుగాని, ప్రకాశానికి గ్రామం వచ్చేవరకు యే మాత్రమూ తెలియవు. గ్రామంరాగానే తన తండ్రికూడా ఈ విషయాలేవీ చెప్పలేదు. కాని మిత్రులవల్ల, గ్రామం లోని కొందరు వ్యక్తులవల్ల ఈ వివరాలన్నీ పూర్తిగా తెలి శాయి.

ప్రకాశం బాల్యం చాలా విచిత్రంగా గడచింది. బాల్యంలో మూడవతరగతివరకూ యిక్కడే చదివాడు. ఆ తర్వాత చదువు, తన మేనమామగారి ఊళ్లోనూ, పట్నం లోనూ గడచింది. అందుచే అతనేనాడూ ఎక్కువగా తన స్వగ్రామంలో పెరుగలేకపోయాడు. అతనికి తమ గ్రామం లోని ఏ వ్యక్తుల గురించిన వివరాలుకూడా అధికంగా తెలి యవు. తమ యెదుటిపార్టీవారైన సాంబయ్యగురించి అతనికి కొద్దిగా మాత్రమే తెలుసు. అంతతప్ప పెద్దపరిచయాలేమీ లేవు.

ఈ పార్టీ వ్యవహారాలు తెలియగానే, తన తండ్రికి సంభవించిన ఈ స్థితికి పూర్తిగా బాధచెందాడు ప్రకాశం. ఎదుటివర్గం వారిపై ఎంతో ఆవేశం పొర్లింది. ఈనాటి గ్రామాలు, "కక్షలూ, మోసాలూ, కుతంత్రాలకు నిలయాలన్న" విషయం అతనికి ఋజువైంది.

ప్రకాశం వచ్చిన నాటిరాత్రి అతనూ, తండ్రీ ఏదో సంభాషణలలో దిగారు. ప్రకాశం సందర్భవశాత్తూ రాజారావుగారిని గురించి ఏదో చెప్పాడు. వెంకట్రామయ్యగారు ఆశ్చర్యపొయ్యారు.

"అయితే వాడు ప్రస్తుతం అక్కడున్నాడన్నమాట! వాడు అసాధ్యుడుసుమా! ఇంతకూ వానికో అమ్మాయి కూడా వుండాలిగదూ?"

"అవును. ఆమె నా క్లాస్‌మేట్"

వెంకట్రామయ్యగారు ఏదో ఆలోచనలో పడ్డారు.

"నీకూ ఆ యింటికీ రాకపోకలు సాగుతున్నాయా?"

"అప్పుడప్పుడు వెళుతూంటాను"

"ఏ మవసరముంది?"

"అదేం ప్రశ్న నాన్నా"

"ప్రకాశం? తండ్రిగా నేను నీకు వివరించి చెప్పలేను, నీవే అర్థంచేసుకో! రాజారావు నీ వనుకున్నంత సత్పురుషుడు కాడు. వాని సంగతి ఈ గ్రామంలో ఎవర్నడిగినా బాగా చెబుతారు. ప్రయోజనం లేనిదే వాడెవర్నీ చేరదీయడు. ఇక ముందు అతిగా అటువెళ్ళకు"

"మీ మాటలు నాకర్థంగాలేదు"

"ఆ అవసరంవస్తే నీకే అర్థమవుతుంది. 'రాజారావు మాత్రం అసాధ్యుడు ఏమైనాచేయగలడు' అనిమాత్రం గుర్తుంచుకో! ఇకపడుకో"

ఆ తర్వాత వారిద్దరిమధ్య సంభాషణ జరుగలేదు. తండ్రిమాటలే ఆలోచిస్తూ నిద్రాదేవిని ఆహ్వానించాడు.

# 12

పండ్రెండుగంటల దీర్ఘప్రయాణంలో అలసిపోయిన భానుడు, తనకోసం నిరీక్షిస్తున్న సంధ్యాకాంత కౌగిలి చేరుటకై అడ్డుగానున్న పశ్చిమసానువుల తలదన్ని క్రిందకురికాడు.

మెల్లమెల్లగా సంధ్యాకాంత గాఢశ్వాసలో లోక మంతా చీకట్లు క్రమ్ముకోసాగింది.

అంతవరకూ కనిపించని శుక్రతార తనదే యిక రాజ్యమంటూ పడమటివేపున తెల్లగానవ్వింది.

ప్రకాశం కాలువగట్టుపై తమతోటలో నిర్లిప్తంగా కూచొని ఆకాశంలో క్షణక్షణమూ రంగులు మార్చుకుం టూన్న మేఘవల్లరి వైచిత్రిచూస్తూ నిశ్శబ్దంగా వుండి పోయాడు.

పచ్చని పైరులగుండా వీచే నునువెచ్చని గాలిలో ప్రకృతికన్య వింతగా ప్రశాంతంగా తలూపుతోంది. కాలు వలో నిండుగా గర్భిణిలా మందంగా నీరు ప్రవహిస్తూ, గాలి తూపుకు చిన్నగా వలయాలు సృష్టించుకుంటూంది. అప్పుడే

తలస్నానంచేసిన యువతిలానిర్మలంగా మామిడిచెట్టు తనతలను విదిలించుకుంటూంది. కొద్దిగా 'టప్ టప్' మని శబ్దంచేస్తూ ఎండిన ఆకులు క్రిందకు రాలుతున్నాయి.

ప్రకృతిలోని ఈ రామణీయకతా పరామర్శకై ప్రకాశం కవితాహృదయం ఉత్సుకత చూపలేకపోయింది. ఆతనిలో మొదలు, కొన రూపంలేని ఏవేవో ఆలోచనలు వేగంగా దొర్లుతున్నాయి. ఆ ఆలోచనలకు యిదమిద్ధమైన కారణమంటూ ఏదీలేదు. కాలక్షేపం కావటానికి తనకు తెలియకుండాదొర్లే ఆలోచనలే, మానవునకు కాలక్షేప సాధనాలు.

"తనుగ్రామంవచ్చి వారంరోజులయింది. కాలక్షేపం కావటం కాస్త కష్టమేఐనా, అందులోనే ఏదో కొత్తరుచి అనుభూతీవుంది! తోటదగ్గర తిరగటం, పంచాయత్ ఆఫీస్‌లో పత్రికలు చదవటంమించి తనకు గమ్యస్థానాలు లేవు. తనకు మిత్రులిచ్చట చాలా కొద్దిమంది. ఉన్నవారిలో రఘు ఒక్కడే చాలా సన్నిహితుడు. వాడూ నాలుగురోజులుగా గ్రామంలో లేనందువల్ల పెద్దచిక్కే ఏర్పడింది. ఈ మధ్య ఇంట్లో పరిస్థితులుకూడా ఆశాజనకంగా లేవు. ఈ పార్టీలూ, కక్షలూ ఏనాడంతరిస్తాయోగాని అంతవరకూ నాన్నకు మనశ్శాంతి వుండదు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూంటాడు. నాలుగురోజులక్రితం పట్నంవెళ్ళాడు. నిన్నవచ్చాడు మళ్ళీ ఈ రోజు ఉదయం వెళ్ళాడు. ఏమిటో ఈ ప్రకృతి? కక్షిదారు సాంబయ్య, ఎవరోగాదు! బాల్యంలో ఎప్పుడూ తన్ను భుజంపై కూచోపెట్టుకొనే సాంబయ్యమామే! ఎంతలో ఎంత

కాలం మార్పు? వీటి పర్యవసానం? దీనికి అంతం ఏనాడో? అబ్బా! అంతా అయోమయం! నాన్నస్థితిని తలచుకుంటేనే తనకు గుండెలు బరువెక్కుతాయి. ఈ స్థితి ఇక మారదా?"

"నిజానికి తనకు సాంబయ్య కుటుంబ వ్యవహారాలేవీ తెలియవు! బుద్ధివచ్చిన తరవాత ఏనాడూ తనకు సాంబయ్య తటస్థపడలేదు. అసలుతనిక్కడ ఏమాత్రంవున్నాడు? అంతా పట్నంలోనూ మామగారిఊళ్ళోనూ గడచిపోయింది బాల్యం! సాంబయ్య యిల్లుకూడా తనకేనాడూ సరిగాజ్ఞప్తిలేదు. నిన్న వీధిలో తారసపడ్డాడు. అతను కొంతవరకూ తనకు బాగా గుర్తు. తన్నేదోవిధంగా, వెక్కిరింపుగా చూశాడు. ఎంత విపరీతం! ఎంతకక్ష! ఎంత నిర్లక్ష్యం!"

చీకట్లు పూర్తిగా కమ్ముకొన్నాయి. మామిడిచెట్టు స్వరూపం విరబోసుకున్నదయ్యంలా భయంకరంగా వుంది. దగ్గర్లోవున్న లింగయ్యగారి మామిడివనం అతనివేపదోలా చూస్తోంది.

చంద్రుడింకా ఉదయించలేదు. తారకలు కొన్ని ఆకాశంలో అప్పుడప్పుడే పొడుస్తున్నాయి.

ప్రకాశం ఆలోచనలనుండి పూర్తిగా తేరుకోలేదు. మాటుమణిగిందన్న విషయం గమనించినా అలాగే వుండి పోయాడు. ప్రతిరోజూ యింతే! బాగా చీకటిపడిన తర్వాత గాని యింటిదారిపట్టడు. అంతవరకూ ఏవో ఆలోచనలూ, ఊహాగానాలూ.

మేఘాలు ఒక్కసారిగా, అకస్మాత్తుగా గర్జించాయి. తలెత్తి ఆకసంవేపు చూశాడు. మేఘాలు దట్టంగా, నల్లగా

అలుముకొని వున్నాయి. వర్షచ్ఛాయలు గమనించిన ప్రకాశం ఉన్నపళంగాలేచి నడకసాగించబోయాడు. ఒక్కసారిగా పెద్దఉరుము. దిగంతాలనేకంచేసే తెల్లటిమెరుపు! కుంభవృష్టి వర్షం! ప్రకాశం నిశ్చేష్టుడై వెంటనే మామిడిచెట్టు ప్రక్కగావున్న గుడిసెలో ప్రవేశించాడు. ఇలాంటి అవసరాలకే ఆ పాక అచ్చట వేయబడివుంది. వర్షం వచ్చినా, తను తడువనులే అన్నధైర్యంతో అందులో ఒకమూల నక్కినిల బడ్డాడు.

పదినిమిషాలు గడిచాయి. వర్షం విపరీతంగా కురుస్తుంది. జనవరినెలలో ఇలాంటి వర్షంరాగా తనెన్నడూ చూడలేదు. అసలే చలికాలం! అందుకుతోడు వర్షం!! చలితాపుకుఆపుగా సిగరెట్ వెలిగించాడు ప్రకాశం. మెరుపుల వెలుతురులో వర్షధాటి అస్పష్టంగా కన్పిస్తోంది.

రెండుక్షణాలు గడిచాయి. ఎక్కడో అప్పుడే పెద్దగా పిడుగుపడిన భయంకరారవం! ప్రక్కనేమామిడికొమ్మ 'ఫెళ్' మనివిరిగిన శబ్దం! వెనువెంటనే "అమ్మో!" అన్న గావు కేక...! ఒక్కసారిగా ప్రకాశం చలించాడు... ఒళ్ళంతా గగుర్పొడిచింది... ఇంతలో ముందుకంటె కాస్త తగ్గు స్థాయిలో "అమ్మా...!" అన్న హీనస్వరం వినిపించి, ప్రకాశం పరిస్థితి అర్థంచేసుకొని, వెంటనే ఆ వర్షపుధాటిలోనే బయటికొచ్చి "ఎవరూ?" అని గట్టిగా అరచాడు. చుట్టూ అంధకారం. ఆకాశం భూమి ఏకమై వర్షధాటిలో లీనమై పోయినట్టుంది. మళ్ళీ అదేబాధాస్వరం వినిపించిందిమెల్లగా. ప్రకాశం ఆతురతగా ఆ స్వరం వినిపించినవేపే ముందుకు కది

లాడు. ఒక్కసారిగా పెద్దమెరుపు మెరిసింది. ఆ వెలుగులో తనకు పదిగజాలదూరంలో కాలువగట్టుపై బోర్లాపడ్డ ఒక స్త్రీ, ఆమె ప్రక్కగా ఒకపెద్దకొమ్మా ప్రకాశానికి కనిపించాయి. ప్రకాశం గబగబా ఆ విపరీతస్థితి సంభవించిన ప్రదేశానికివెళ్ళి ఆ శరీరాన్ని కాస్త కుదుపుతూ పిలిచాడు. ఏమాత్రం ప్రతిజవాబులేదు. గాలిహోరుమని గింగురుపెడుతోంది. వర్షం వుజ్వలంగా కురుస్తోంది. ప్రకాశం పూర్తిగా తడిసిపొయ్యాడు. ఆమె పూర్తిగా స్మృతితప్పిపడిందని గ్రహించాడు. ఆమెను మెల్లగా లేవనెత్తి భుజంపై ఆన్చుకొని, రెండుచేతులా పట్టుకొని, పాకలోకి తీసుకొచ్చి మూలనున్న చాపను కాళ్ళతోనేపరచి ఆమెనందుపై నిదానంగా పరుండబెట్టాడు. చాలా చీకటిగావుంది. అగ్గిపుల్ల గీయబోయాడు. అదితడిసివుంది. నాలుగైదుసార్లు ప్రయత్నించేసరికి ఒకటి వెలిగింది. దానితో గూట్లోవున్న దీపం వెలిగించాడు. ఆమెముఖంవేపు చూశాడు. కాని గుర్తుదొరకలేదు ఇప్పుడేంచేయాలి. ఈమేమో స్పృహతప్పివుంది. ఎప్పుడు తెలివొస్తుందోఏమో! ప్రకాశం కింకర్తవ్యతా మూఢుడైపోయాడు.

ప్రకాశం గోడకానుకొని సిగరెట్ వెలిగించాడు. ఐదునిమిషాలు గడిచింది. సిగరెట్ పూర్తయింది. ఆమెవేపు చూశాడు. ఆమె అదేస్థితిలోనేవుంది. ఇంకొక సిగరెట్ వెలిగించాడు.

బయటవర్షం నిలిచిపోయింది. ప్రకాశం వరుసగా మూడు సిగరెట్లుకాల్చి, నాలుగో సిగరెట్ అప్పుడే వెలిగించాడు. ఆమెలో ఏమాత్రం చలనం కన్పించలేదు. అతనిలో

ఏవేవో ఆలోచనలు లింకులు తప్పిన గొలుసులా పారాడు తున్నాయి... ఎవరీమె?...

ప్రకాశం పొగపీలుస్తూ, ఆమెవేపే దృష్టినిలిపి పరీక్షగా చూశాడు. వయసు పదునెనిమిది మించివుండదు. ఎరుపు, పసుపు కలిసిన శరీరచ్ఛాయ, గుండ్రటిముఖం, మామిడిపిందెలావున్న చుబుకం, నూవుపూవులాటి కొనదేలిన సుందరనాసిక, ముత్యపుచిప్పల్లాంటి నిమీలిత నేత్రాలు, తడిగావున్న ఎర్రని పల్చటి పెదవులు. పిరుదుల క్రిందివరకూ వ్యాపించిన నీల కేశసంపద... ముగ్ధుడయ్యాడుప్రకాశం! తడి దుస్తుల్లో ఆమె ప్రతిఅవయవమూ స్పష్టంగా కన్పిస్తోంది. ప్రకాశం ఒక్కక్షణం ఏదో స్వర్గలోకంలో తారాడినట్టు ఫీలయ్యాడు. "అబ్బ! ఎవరీ అపురూప ముగ్ధసౌందర్యరాశి!" తన కవితా ధోరణిలో అనుకున్నాడు.

సిగరెట్ చేయికాలేవరకూ అతడామెవేపే దీక్షగా చూస్తూండిపోయాడు. వేళ్లు చుర్రుమనగానే దాన్ని విసిరేసి అబ్బ అన్నాడు.

ఇంతలో "అమ్మా" అంటూ ఆ యువతి కొంచెం ప్రక్కగా ఒరిగి కళ్ళువిప్పింది మెల్లగా! అప్పుడేవిచ్చుకొంటూన్న కమలంలావున్నాయి ఆమెకళ్లు! అలానే అనుకొన్నాడు ప్రకాశంకూడా. విప్పగానే ఆమె దృష్టికి ఎదురుగా ప్రకాశం కన్పించాడు. అరనిముషం రెప్పలు తాటించి చూసి అంతలోనే ఉలికిపడి భయపడుతూలేచి కూచొంది. శరీరమంతా జలదరించింది. నవనాడులూ ఒక్కసారిగా స్పందించాయి...

"ఎ...ఎవరు...మీ... మీరు" అంటూ తత్తర పాటుతో లేచినిల్చొంది, అతనివేపు భయంగా, బెదురుగా చూస్తూ, చెదరిన పమిటను సర్దుకుంటూ.

"భయపడకండి..."

"నే... నేను...నేను...యిచ్చటి కెలా వచ్చాను" ఆమెలో యింకా భయంపోలేదు. ఆమె స్వరంలో అది స్పష్టంగా ప్రతిధ్వనిస్తూంది.

"పిడుగుశబ్దానికి మీరు కాలవగట్టుపై పడుండగా యిక్కడికి తీసుకువచ్చాను. ఇంతకూ మీ రెవరు?"

"నేను... నేను..." ఆ తర్వాత ఆమె ఏమీ జవాబివ్వలేకపోయింది.

"ఎందుకలా బెదరిపోతారు. నేను మీకేహానీ చెయ్యను. మీ దేవూరు?"

"ఈవూరే" ఆమె సర్దుకొని జవాబిచ్చింది. అతన్ని ఎగాదిగా చూసింది.

"ఈ వూరేనా?" ఆశ్చర్యపోయాడు ప్రకాశం

"అవును...మీరు రామయ్యగారి కుమారులా?"

ఆమె తన్ను గుర్తించినందుకు ప్రకాశం మరీ ఆశ్చర్యపోయాడు. ప్రకాశం ఏదో అడగబోయాడు...

"పట్నంలో చదువుతున్నారుగదూ!" ఆమె అడిగింది. ఆమెలో ఇప్పుడేమాత్రం భయంలేదు. ధైర్యంగా నిల్చునుంది కాస్త సిగ్గుపడుతూ.

"అవును..." అని ఆగి, వెంటనే "మీ పేరు...?" అన్నాడు.

"... ..." ఆమె సిగ్గుతో కుంచించుకుపోయింది.

"చెప్పవచ్చు"

"సా...వి...త్రి" ఎంతో సిగ్గు ఆమె స్వరంలో ధ్వనించింది. "మీరు చేసినసహాయానికి కృతజ్ఞురాలను. మీ మేలు ఈ జన్మలో మరచిపోలేను. వర్షం నిల్చిపోయింది, వెళదామాండీ" అంది.

ఆమె మాటల్లో గోచరిస్తున్న సభ్యతకు ఎంతో విస్మయం పొందాడు ప్రకాశం. అంతవరకూ ఆమె ముఖంవేపే చూస్తున్న అతను ఉలికిపడి "వెళ్దాంపదండి" అన్నాడు.

వర్షం పూర్తిగా నిలిచిపోయింది. తడిసిన బట్టలవల్ల ఆమె కొద్దిగా వణుకుతోంది.

"మీ తండ్రిపేరు చెప్పలేదు?" అన్నాడు ప్రకాశం ముందుకు నడుస్తూ.

"అసలు మీ పేరు చెప్పలేదు" ఆమె తిరుగా ప్రశ్నించింది. ప్రకాశం తన పేరు నిస్సంకోచంగా చెప్పాడు. ప్రకాశం మళ్ళీ మొదటి ప్రశ్ననే అడుగబోయాడు. ఆమె అతని ప్రయత్నానికి తావివ్వకుండా, "మీరు గ్రామం ఎప్పుడొచ్చారు?" అనడిగింది.

"వారంరోజులయింది."

చీకట్లో ఒకరిముఖాలొకరికి స్పష్టంగా కనిపించలేదు. ఆ తర్వాత వారిద్దరిమధ్యా సంభాషణ జరుగలేదు. ఇద్దరి మనసులలోనూ ఎన్నో ప్రశ్నలూ, సందేహాలూ వున్నాయి గాని యిద్దరూ బిడియంతో మౌనంగా వుండిపోయారు.

దాదాపు రెండు ఫర్లాంగులదూరం నడచిన తర్వాత ఆమె, "నే నిక వెళతానండీ, మా యిల్లు ఈ వేపే!" అంది అటువేపు చేయిచూపిస్తూ.

"మరి..." ప్రకాశం అస్పష్టంగా ఏదో అన్నాడు.

"మరీ?" ఆ మాటే హెచ్చిస్తూ ఆమె ప్రకాశం కళ్ళ వేపు సూటిగా చూసింది. ఆ చూపు ప్రకాశంలో ఏదో నవ్య చైతన్యాన్ని కల్గించింది.

"మళ్ళీ ఎప్పుడు కన్పిస్తారు?" అడిగాడు కాస్త తట పటాయిస్తూ.

"అవసరమా?"

"కాదు."

"అయితే"

"అసాధ్యులేనే! ఏమో అనుకొన్నాను"

ఆమె కిలకిలా నవ్వింది. "రేపుసాయంత్రం తోట దగ్గరకరండి" అని ఆమె వేగంగా నడుచుకుంటూ వెళ్ళి పోయింది. ప్రకాశం ఆమె కనుమరుగయేదాకా చూసి ఇంటి దారి పట్టాడు. వెంటనే అతనికి జ్ఞప్తికొచ్చింది. "ఇంతకీ ఆమె యెవరా" అని...

ఆ రాత్రంతా ప్రకాశానికి సరిగా నిదురపట్టలేదు. గతించిన ఆ సంఘటన అతనికొక మధురస్వప్నంలా కన్పిస్తూ హృదయంలో అనిర్వచనీయమైన, తీయటి అనుభూతిని రేకెత్తించింది. ఆ నాలుగు గంటలలోనే కనీసపక్షం నలభైసార్లయినా ఆ సంఘటనను నెమరు వేసుకొనుంటాడు. కళ్ళు మూసినా, తెరచినా ఆ యువతి ముగ్ధమనోహరస్నిగ్ధ

సౌందర్యరూపం మెదలి ఏదో తెలియని బాధకు గురిచేయ సాగింది. ఏదోవస్తువుపోగొట్టుకొన్నట్టుగావుంది అతనిమనస్థితి. యెన్నడూలేని మనోవికారం తనలో ఈనాడు యెందుకు కలుగుతోంది? అని పదేపదే ప్రశ్నించుకొన్నాడు. అందుకు జవాబుగా ఆమె సుందరరూపం కళ్ళముందు మెదిలేది. పాల భాగంపై జీరాడుతున్న వెంట్రుకలూ, దరహాసచంద్రికలు వెదజల్లుతున్న ప్రఫుల్లవదనం... హృదయంలో నవ్యచైతన్యాన్ని కల్గింపచేసే ఆ వాడివేడిచూపులు... అబ్బ! ప్రకాశం నిజంగా తన్నుతాను మరచాడు. అతని హృదయం కవితానుభూతికోసం తపించే ప్రబంధకవిలా తయారైంది. యెన్నో యుగాలుగా నిరీక్షణచేసి సాధించిన ఒకమహత్తర వస్తువు చేజిక్కిన విధంగా ప్రకాశం సంతృప్తి చెందాడు. ఆ వస్తువు ఆమే... ఆమెరూపం!... యెంత స్వేచ్ఛగా మాటాడింది. పల్లెటూరి యువతులు చాలా అమాయకులనీ, యెక్కువ బిడియం అని, అసలువారికి సభ్యతా సంస్కారం అంటూవుండవని యింతకుముందు తన అభిప్రాయం. కాని ఒక్కసారిగా తనలోని ఈ సంకుచితాభిప్రాయం ఆమె మార్చివేసింది. యెంత స్వతంత్ర నిష్కల్మష, నిర్మల తరుణి ఆమెది. ఓహ్! తను పూర్తిగా పరవశుడైపోయాడు.

ఇంతకూ ఆమె...పేరు సావిత్రిగదూ ... యెవరు? యెవరికుమార్తె! తన్నింతకుముందు చూసినట్టుగానే మాటాడిందామె? మరి తనకేనాడూ ఆమెను చూసినట్టు జ్ఞాపకం లేదే! తన మెదడులో జ్ఞాపకశక్తి భాగం దెబ్బతిందా!... ఏదీ అర్థంగాలేదు.

తన జీవితంలో ఈ రాత్రి ఒక మధురఘట్టం. ఒక దివ్య సాక్షాత్కారం! ఒక మరపురాని అనుభూతి.

రేపుసాయంత్రం తోటలో... అంతవరకూ... ఏమి నా మనసింత అల్పమైపోతోంది. ఏమిటో తెలియని వియోగాన్ని అనుభవిస్తోంది. "లవ్ అట్ ఫస్టుసైట్" అంటే ఇదే నేమో! అయితే తనెంతమందిని చూడలేదు. ఎందరు స్త్రీలు పరిచయస్తులు లేరు! ఎవరిగురించీ ఈ విధంగా ఆలోచించని తన మనసు ఈనాడీ విధంగా ఆరాటపడటానికి కారణం? ఏదో అనుబంధం, ఏదోబంధం... లేక ఇది తన మనో దౌర్బల్యమా! తన ఆలోచనల గొలుసులో ఎక్కడో ఒక లింకు జారిపోయింది. అందుకే ఈ ఆలోచనలూ, ఆరాటం.

పన్నెండుగంటలుదాటినా ఈ విధమైన ఆలోచనల తోనే సతమతమౌతున్నాడు ప్రకాశం. ఆలోచనలన్నీ ఒక ప్రక్కగానెట్టి నిద్రించాలని ప్రయత్నించాడుగాని సాధ్యం గాకపోయింది. ఒక స్త్రీ గురించి యింతగా ఆలోచించటం తన జీవితంలో యిదే ప్రథమంగాబోలు.

ఈ ఆలోచనలలో ఇంకొక పెద్దసమస్య ఒక్కసారిగా అతనిలో మెదిలింది. ఇంతకూ ఆమె వివాహితా? అవివాహితా? ఈ ప్రశ్న వుద్భవించగానే గుండె ఒక్కసారిగా జల దరించింది. కాదు, కాదు. ఆమె అవివాహిత. ఏదోసమర్థన. అదే సత్యమనే భ్రమ.

ఆమె చూపుల్లో, మాటల్లో ఏమిటంతఆకర్షణ. తనకు తెలియకుండానే మళ్ళీ ఎప్పుడు దర్శనం! అవడిగాడు. ఎంత ధైర్యం!

ఒంటిగంట కావస్తోంది. నిద్రపట్టేట్టులేదు. లైటు వెలిగించి కళ్లు నులుముకున్నాడు. లేచి గదితలుపు తెరచి బయటకొచ్చాడు. అప్పటికే దశమిచంద్రు డుదయించాడు. బయట పదినిముషాలు పచారుచేశాడు. "కనులనిదుర రాకపోతే పడ్డావనుకో ప్రేమలో" అని ఎక్కడో విన్నమాట జ్ఞప్తికొచ్చి చిన్నగా నవ్వుకొన్నాడు. మళ్ళీ గదిలోకివెళ్ళి పడుకోబోయాడు, బయటవరండాలోంచి, "ఎవరూ!" అన్న అమ్మ స్వరం వినిపించింది. "నేనేనమ్మా" అంటూ లైట్ ఆర్పి పరుపుమీద వాలిపోయాడు. ఏ దశలో ఆలోచనలు రూపొందాయోగాని వెంటనే నిద్రపట్టింది.

# 13

ఉదయం నిద్రనుండీ లేచేసరికి యెనిమిది గంటలైంది. తన ఈ మొద్దునిద్రకు ప్రకాశం తన్నుతానే నిందించుకొన్నాడు. రాత్రంతా ఏవేవో ఆలోచనలు... నిద్రపట్టగానే ఏవేలోకలలు! నిద్రనుండి లేచినా ఆ మత్తులోంచి పూర్తిగా తేరుకోలేదు. వచ్చినకలలన్నీ మననంచేసుకుంటూ కొద్దిక్షణాలు పక్కమీదే వుండిపోయాడు. కలలో సావిత్రి కనిపించినట్టు జ్ఞాపకం. తన్నుజూచి నవ్వింది. తను దగ్గరగా వెళ్ళాడు. ఆ తర్వాత అంతసరిగా జ్ఞప్తికి రాలేదు. కాని ఏదో మధుర భావనలో తన్ను ముంచెత్తినట్టు బాగా జ్ఞాపకం!

ఈ ఆలోచనలలో వుండగా, "అన్నయ్యా! ఇంకా నిద్రలేవలేదూ?" అంటూ లలిత ప్రవేశించింది. ప్రకాశం

అట్నుంచీ లేచి చిన్నగా నవ్వుతూ ఆమె అందించిన పండ్ల పొడిపొట్లం తీసుకొని దంతధావనం ప్రారంభించాడు.

కాలకృత్యాలన్నీ పూర్తిచేసుకొని కాఫీ సేవించేసరికి తొమ్మిదిగంటలు కావస్తోంది కాఫీ సేవిస్తూండగా రఘు వచ్చాడు.

"లలితా! రఘువచ్చాడు. కాఫీపట్రా" అని కేకేసి, "ఏమిటోయ్! నాలుగు రోజుల్నుండీ కన్పించలేదు. యెప్పు డొచ్చావ్" అంటూ పరామర్శించాడు.

"రాత్రివచ్చాను" అంటూ రఘు కుర్చీలో కూల బడ్డాడు. లలిత కాఫీతెచ్చి మేజామీదవుంచి వెళ్ళింది. ఇద్దరూ కాఫీ పూర్తిచేసి వీధినబడ్డారు.

"ఏమిటోయ్ విశేషాలు!" యధాలాపంగా అడి గాడు ప్రకాశం.

"ఆ ప్రశ్న నేనే అడగాలి"

ఇద్దరూ పంచాయత్ ఆఫీసుకొచ్చి రేడియో ఆన్ చేసుకొని కుర్చీలలో కూలబడ్డారు. అప్పుడు వీరుదప్ప మరె వ్వరూ లేరు.

రఘు ప్రకాశంకంటే రెండు మూడు సంవత్సరాలు పెద్ద. ఇద్దరూ మెట్రిక్యులేషన్ వరకూ కలిసే చదువుకున్నారు. ఏవో కారణాలవల్ల రఘు అంతటితోనే చదువు చాలిం చాడు. వీరిద్దరిమధ్యగల ఘనిష్ఠసంబంధం పురాతనమైనదైనా అందులో యెప్పుడూ నవ్యత్వమే కన్పిస్తుంది. "బావా, మరదీ" సంబోధనలతో ప్రారంభమైన సంబంధం 'రేయ్! వోయ్' అనేవరకూ వచ్చింది. అంతకంటే దిగజారినా

అందులో విప్రతిపత్తి ఏమీ లేదు. బంధుత్వమంటూ లేక పోయినా యిద్దరూ ఒకే కులస్థులు కావటంచే బంధువుల్లా సంచరిస్తారువీరు. బంధుత్వాన్ని మించి మిత్రత్వమే పటుత్వమైనదనవచ్చు.

ఇక్కడ రఘును గురించి కాస్త చెప్పాల్సుంటుంది. నిజానికి రఘుజీవితం చాలా విచిత్రమైనది, బాధా కరమైనది. లోకం అంటే ఏమిటో తెలియని చిన్నవయసులోనే తలిదండ్రులను కోల్పోయాడు రఘు. వారు విడిచిపోయిన ఆస్తి అంటూ కూడా పెద్దగా ఏమీ లేదు. తలిదండ్రుల మరణం తర్వాత మామగారి యింట్లో పెరిగాడు. అతని మామగారు మంచి ఆస్తిపరులే! అదీగాక మామగారు ఆ గ్రామానికి ప్రస్తుతం ప్రెసిడెంటుకూడా! ప్రెసిడెంటుగా అతని విధులు బాగా నిర్వర్తించాడు. హాస్పిటల్, హైస్కూల్, వెటర్నరీ హాస్పిటల్ యింకా యెన్నో నూతనమైన మార్పులు గ్రామంలో చేశాడు. ఐనా గ్రామంలో అతనంటే చాలా మందికి సరిపడదు. అతని మంచిగుణాలను కప్పివేసే అహం అసూయలే లేనిపక్షంలో మహారాజుకుండాల్సిన లక్షణా లతనిలో వున్నాయి. రఘు అంటే అతనికి పంచప్రాణాలు. కుమార్తెలు లేరుగాని వుంటే రఘుకేయిచ్చి పెళ్ళిచేసేవాడు. చదివించాలని ప్రయత్నించాడుగాని ఫెయిలయి కూచొన్నాడు. తర్వాత యెంత ప్రయత్నించినా చదువుసాగలేదు. అంతటితో ఆగిపోయింది.

రఘు దర్పాకరకమైన మనస్తత్వం. బాల్యంనుండీ అతనేనాడూ ఏ విధమైన కష్టమూ.. అనుభవించి యెరుగడు.

అందుచే ఈనాడూ ఏ పనీ సరిగా చేయలేకపోతున్నాడు. రఘు గుణం యెంతో గొప్పది. ఈ విషయం అందరూ ఒప్పుకొంటారు. "తండ్రిలాంటి మామగారున్నారు, ఆయ నకేం" అంటారు అందరూ! కాని సంసారం అన్న తర్వాత మనస్పర్థలు మామూలుగా సంభవిస్తూనే వుంటాయి. రఘు యింకా ఆ యింట్లో వుండటం ఆ యింటి కోడలికిగాని, ఆమె భర్త (రఘు మామగారి కొడుకు) కుగాని సుతరామూ యిష్టంలేదు. వివాహంచేసి అతని ఆస్తిపంచి వేరేసంసారం ఏర్పాటుచేస్తే మంచిదని వారి ఉద్దేశం. కాని మామగారు ఆ ధోరణిలో లేరు. అసలావిషయమే ఆయన విస్మరించి నట్టుండిపోయారు. ఇక రఘు కూడా అంతే! అదే గ్రామంలో రఘు చిన్నమామగారి కుమార్తెకూ రఘుకూ వివాహం చేయాలని యిప్పుడిప్పుడే అనుకుంటున్నారు. కాని రఘు అందుకు సుముఖంగాలేడని అందరకూ తెలుసు, ప్రకాశం ఈ విషయం ప్రస్తావనతెచ్చినా విని వూరకుండేవాడు, చిన్నగా మందహాసంచేసి.

ఇక్కడ ప్రకాశానికి కూడ తెలియని యదార్థ విష యం ఒకటుంది. రఘు ప్రకాశం చెల్లాయి లలితను మన స్ఫూర్తిగా ప్రేమించాడు. లలితకూ అతనంటే యెంతో ప్రాణం. వీరు మరీ పెద్దప్రేమవ్యవహారాలలో పడలేదు. వారు కేవలం చూపులతోనే సంభాషణలు ముగించుకొనే వారు. అందుచే గ్రామంలో ఏ ఒకరికీ యిలాంటి విషయం ఒకటుందని తెలియదు. రఘు తన చిన్నమామగారి కుమా ర్తెను వివాహం చేసుకోడానికి యిందువలననే అంగీకరించ

లేదు. తన మామగారికీ విషయం చెప్పాలనుకుంటాడుగాని, అతని గంభీరవదనం చూసేసరికి ఆగిపోతాడు. అందుచే వీరి ఈ విచిత్ర ప్రణయం మనసుల్లోనేదాగి పుష్పిస్తోంది.

పంచాయతీ ఆఫీసులో కూచొని సిగరెట్లు పీలుస్తూ ఇద్దరూ మాటల్లో మునిగిపోయారు.

"పట్నం యెప్పుడు వెళతావ్ ప్రకాశం!"

"సెలవులు పూర్తికాగానే"

"ఒక విషయం అడుగుతాను, ఏమీ అనుకోవుగదూ"

"అడగవచ్చు"

"పట్నంలో రాజారావు అనే ఆయనగారి కుమార్తె రాధ అనే అమ్మాయికీ..."

"ఆగిపోయావేం"

"అర్థంచేసుకోగలవనుకుంటాను"

"మా నాన్నగారీవిషయం నీతో అన్నారా"

"అవును. యెంతవరకూ నిజమో తేల్చుకోమన్నాడు. మీ నాన్నగారి ఉద్దేశం ఏమిటంటే అలాంటిదేదైనావుంటే వెంటనే తెంచుకోమని. మీ నాన్నగారి మనసు నీవు గ్రహించగలవనే..."

"పొరపడుతున్నావ్ రఘూ! అయినా ఆ విషయాల గురించి నేనాట్టే చెప్పదలచుకోలేదు"

"అయితే మీ నాన్న..."

"అలాంటిదేమీ లేదని చెప్పు"

"సరే!"

"మరి రాయబారం పంపారుగా"

"బలేవాడవోయ్! ఇంతకూ ఆమెకూ నీకు..."

"ఇక ఆపవోయి నీ కుసందేహాలు! ఇలాంటి పిచ్చిపిచ్చి మాటలు వినాలంటే నాకు బహుచిరాకు. నా మనసెరిగీ నీ విలా..."

"క్షమించు ప్రకాశం! మీ నాన్నగారు నాతో పని గట్టుకు ఈ విషయం అన్నారు. ప్రకాశంతో రొంలాగైనా నచ్చచెప్పి..."

"ఇకచాలు నా కర్థమయింది. మీ రనుకున్న ఏ విధమైన సంబంధమూ మా యిద్దరిపట్ల లేదు. నాకు నీ వెంతో ఆమె అంత. అంతే"

రఘు నిర్ఘాంతపోయాడు. ఏమిటి వీని విచిత్ర మనస్తత్వం అనుకొన్నాడు. ఆ తర్వాత వారి సంభాషణ గ్రామ రాజకీయాలకు దారితీసింది.

*　　　*　　　*

సాయంత్రం ప్రకాశం తోటలో కాలువగట్టుపై కూచొని, సావిత్రికై నిరీక్షిస్తున్నాడు. ఆ నిరీక్షణ వ్యథాబాధ నిపించినా అందులోనే ఏదో అస్పష్ట, నిరాకార మధురత తనలో మెదలుతూన్నట్టు గోచరించింది ప్రకాశానికి.

మామిడిచెట్టు గాలికి గలగలాశబ్దం చేస్తూ ఎండిన ఆకు లనువర్షిస్తోంది. దగ్గరలోనేవున్న లింగయ్యగారి మామిడివనం నుండి ఏవో పక్షుల కిలకిలశబ్దాలు స్పష్టంగా వినిపిస్తు న్నాయి. కాలువలో నీరు వలయాలు సృష్టించుకుంటూ

క్రమేణా తెగిగి విరిగిపోతున్నాయి. ఈ విషయం బాగా గమ
నిస్తే మానవ జీవనరహస్యం యిందులోనే గుర్తించవచ్చు.

వీటిపై ప్రకాశందృష్టి, ఆలోచన యిప్పుడులేవు. కళ్ళూ, హృదయమూ సావిత్రి స్నిగ్ధ సౌందర్య సాక్షాత్కారంకై పరవళ్ళు తొక్కుతున్నాయి. అతనచ్చటకువచ్చి పది నిముషాలే అయినా ఆ కొద్దికాలమే కొన్నిగంటలను మరపించింది అతనిదృష్టికి. ఒక్కసారి తన్నుతానే చీదరించుకొన్నాడు, కోపగించుకొన్నాడు. ఒక్కక్షణం సావిత్రిపై పట్టరాని ఆగ్రహం వచ్చిందిగాని ఇంతత్వరలో ఆమెపై అధికారం ఏర్పరచుకోటానికి తనెవరు? అనుకొని సర్దుకొన్నాడు. ఏవేవో ఆలోచనలతో అతని హృదయం పతిసరాలను విస్మరించింది తనెన్నో రచనలలో యిలాంటి నిరీక్షణల గురించి వ్రాశాడుగాని ఆ రాతకూ, ఈ అనుభవానికీ హస్తిమశకాంతరవాసి వుందనుకొని చిన్నగా నవ్వుకొన్నాడు.

అరగంట గడిచింది. సావిత్రి రాలేదు. ఇక రాదేమో అనుకొని నిస్పృహచెందాడు. ఒకవేళ ఆమె ఈ విషయం విస్మరించిందేమో? తన్నుగురించి అపోహచెందిందేమో? తనంటే సదభిప్రాయం కలుగలేదేమో? ఛా ఛా... ఏమిటీ ఆలోచనలు! తనపిచ్చిగాని ఆమె ఎందుకలా చేస్తుంది? ప్రకాశం యిక భరించలేక వున్నచోటునుండి లేచినిలబడ్డాడు.

ఎవరో వెనకాల, అతిదగ్గరలో చిన్నగా నవ్వినట్టు వినిపించింది. ప్రకాశం తన్నుతాను నమ్మలేక వెనుదిరిగి చూశాడు. ఆశ్చర్యం! ఎదురుగా ఆమె! ఆ కమనీయ సౌందర్యరాణి! ఆ అపురూపముగ్ధరాశి! ఆ నవ్యకవితాకన్య!

సావిత్రి!... ప్రకాశం కళ్ళు చెదిరాయి. ఆమె తలలోని జాజి మల్లెలు ఫక్కుననవ్వాయి. వదులుగా వేసుకొన్న వేణీ భరమూ, నుదుట రాగిదమ్మిడీ పరిమాణంలో ఎర్రటి సింధూరం, ముఖానికి కొద్దిగా రాసుకున్న పసుపువర్ణంలో ఆమె ముఖకాంతి స్వచ్ఛమైన బంగారులా మెరిసిపోతూ సంధ్యారుణ కిరణాలకాంతిని దిగతుడుపు చేస్తున్నట్టుంది. ఆమె చిరునవ్వునుచూసి సహించలేనట్టులు భానుడు ప్రక్కనేవున్న మేఘంచాటున దాక్కొన్నాడు. ప్రకాశం ఒక్కక్షణం నిశ్చేష్టుడైపోయాడు.

"ఏమిటలా చూస్తున్నారు!"

"అదే ఆలోచిస్తున్నాను"

"అరే అదేమిటి! ఆ గుడ్లు అలా అప్పగించి చూస్తున్నారు. నేనేం దయ్యాన్నా? భూతాన్నా!" ఆమె చిరుకోపం ప్రదర్శించింది.

"కాదు దేవతవు"

"ఊ... ఇది మరీ బావుంది. మరి మీరో"

"నేనా! నేను ఆరాధకుడ" కవిత్వధోరణిలో అన్నాడు ప్రకాశం.

"ఓహో! కవిత్వం ముదిరిపోతోందే. ఎలాగైనా రచయితలుగదూ"

ప్రకాశం నిర్ఘాంతపోయాడు. "అయితే వివరాలన్నీ తెలుసన్నమాట"

"అంతా తెలుసు. మీ పుస్తకాలుకూడా చదివాను"

"ఎంతవరకూ చదువుకొన్నారు!"

"మీలో అర్థం"

ప్రకాశంకు ఎంత ఆలోచించినా ఆమె ఎవరో అర్థంగాలేదు. తనగురించేమో అంతా తెలిసినట్టే మాటాడు తోంది.

సావిత్రి మామిడివనంవేపుదారితీస్తూ "అలా వెళదాం రండి" అంది ముందుకు నడుస్తూ. ప్రకాశం మౌనంగా ఆమెను అనుసరించాడు.

"ఏమండీ" ప్రకాశం పిలిచాడు.

"నా పేరు సావిత్రి మాత్రమే"

"సావిత్రిగారూ!"

"నా పేరు ఉట్టిసావిత్రి మాత్రమే"

"సావిత్రీ" అని పిలిచి, వెంటనే నాలిక కరచు కొన్నాడు.

"అది తప్పేంగాదు. అలాపిలిస్తేగాని నేను పలకను"

"మరి..."

"అలా కూచోండి" అంటూ ఆమె పచ్చికపై కూచొంది. ప్రకాశం అమె కెదురుగా కూచొని ఆమె కళ్ళ వేపు ఏదో వెదుకుతున్నట్టు పరిశీలనగా చూశాడు.

"ఏమిటలా వెదుకుతున్నారు"

"ఆ కళ్ళలోని దివ్యకాంతులు ఎక్కడనుంచి ఎరువు తెచ్చుకున్నారా అని"

"ఓహో అప్పుడే"

"ఆగారేం"

"అదికాదు"

"మరేది? ఇంతకూ తమరెవరు?"

"జవాబు అవసరమా"

"గుర్తింపుకోసం"

"ఇప్పుడు గుర్తుదొరకలేదా"

"లేదు"

"అయితే నేనెవరో మీ కింతవరకూ జ్ఞప్తికిరాలేదన్న మాట"

"అవును"

"నిజంగానా!" ఆమె చిన్నగా నిట్టూర్చింది. ఆనిట్టూర్పులో లేశమాత్రం వ్యథ గుర్తించాడు ప్రకాశం.

"నిజం"

"అయితే మీకు కుడిచేయిలేదన్నమాట"

ప్రకాశం నిర్విణ్ణుడై పోయాడు. "కనిపించలేదూ" అంటూ చూపించబోయాడు.

"ఇంకా నేను గుర్తురాలేదూ" నిట్టూర్చింది మళ్ళీ.

"అంటే మీ అర్థం"

"మీ మణికట్టుపైమచ్చ..."

"మచ్చా...! ఆఁ అది"

"అదే దీపావళి..." ఒక్కక్షణం నిశ్శబ్దం.

అతనిలో గతం ఒక్కసారిగా కళ్ళముందు మెదలింది.

*　*

ప్రకాశం అప్పుడు మూడోతరగతి చదువుతూండే వాడు. సావిత్రి అప్పటికింకా అక్షరాభ్యాసంలోనేవుంది. ఎనిమిది సంవత్సరాలు వయసు. బొడ్డువరకూ పరికిణీ, పాదాల వరకూ పావడా, కాళ్ళలో నడకకు లయవేసేలా గొలుసుల రవ్వడి, చెవులలో కాంతులీనే లోలకులు, అప్పటికే పిరుదుల వరకూ పొడుగాటిజడ చూడటానికెంతో ముచ్చటగా వుండేది సావిత్రి. ఆ వయసులోనే సావిత్రీ ప్రకాశాలకు జంట కుదిరింది. అప్పట్లో తమ మధ్య ముడివేసుకొన్నది అనుబంధమో, ఆకర్షణో, బాంధవ్యమో, స్నేహమో ఏదీ తెలియని చిన్నవయసులు.

స్కూలు విడువగానే యిద్దరూ మర్రిచెట్టు క్రిందకు ఆటల కొచ్చేవారు. ప్రకాశంకు అప్పట్లో ఒకచిన్నముఠా వుండేది. ఆ ముఠాకు అతనే నాయకుడు! అతడు కోపిస్తే అందరూ గజగజవణికేవారు. కోపంలో ముఖంఎర్రగా, కళ్ళు చింతనిప్పుల్లా తయారయ్యేవి. అతని అప్పటి ఆకారం చూసి సావిత్రి వణికేది. అందుకే సాధ్యమైనంతవరకూ అతనికికోపం తెప్పించ ప్రయత్నించరెవరూ! కోపంలో కన్నూ మిన్నూ గానక చావమోదుతాడని వారికి బాగా తెలుసు. అప్పట్లోనే ప్రకాశంకు అధికారం చలాయించేశక్తి, తనమాట చెల్లించుకొనే పట్టుదల అధికంగా వుండేవి. అతనే ఆదేశం యిచ్చినా సావిత్రి తూ.చ తప్పకుండా ఆచరించేది. అతనంటే గౌరవానికి మించినభయం! ఒక్కొక్కపుడు చీదరించుకున్నా అతని స్నేహంమాత్రం వదిలేదిగాదు. అదే ప్రకాశంలోని గాఢఆకర్షణ.

ఆనాడు దీపావళి. రామయ్య కుమారులకోసం మందు సామాను, మతాబాలు చాలా తెచ్చివేశాడు. ప్రకాశంకు వాటిని చూడగానే సంతోషం మిన్నుముట్టింది. ఓపికున్నన్ని కాల్చాడు. తన మిత్రులకు వీటిని చూపించి తన ఆధిక్యతను నిరూపించుకోవాలన్న జిజ్ఞాసతో పెద్దపెద్ద టపాకాయలతో జేబులునింపుకొని, సావిత్రిఇంటిదగ్గరకుపరుగెత్తుకుంటూవచ్చి, "సావీ!" అని గట్టిగా పిలచాడు. అంతవరకూ మతాబాలు కాలుస్తూన్న సావిత్రి ఒక్కపరుగునవచ్చి అతనిముందు నిల్చింది. "మన తడాఖాచూడు" అన్నట్టుగా ప్రకాశం ఫోజు పెట్టి, జేబుల్లోంచి పెద్దటపాకాయలుతీసి ఆమెకు చూపిస్తూ "నా దగ్గర ఎంతపెద్ద మతాబాలున్నాయో చూడు" అన్నాడు ధీమాగా. సావిత్రి విరగబడినవ్వింది. "ఓస్! అంతేనా మా నాన్న దీని అబ్బలాంటివి తెచ్చాడు. తెస్తా నుండు" అంటూ వేగంగా యింట్లోకి వెళ్ళింది. ప్రకాశం ఉత్సాహమంతా చప్పునచల్లారిపోయింది. ఆమె నవ్వుకు అతని గుండెల్లో టపాకాయలు పేల్చినట్లయింది. సావిత్రి కొద్ది క్షణాలలో చేతిలో ఒక పెద్దటపాకాయ పట్టుకొని పరుగెత్తు కుంటూ వచ్చింది. దాన్ని చూసి ప్రకాశం నిలువునా గుడ్లు తేలవేశాడు. తన జీవితంలో యింతవరకూ అంతపెద్దది చూడనేలేదు. అసలు యిలాంటివి వుంటాయని కలలోకూడా అనుకోలేదు. అది ఒక అడుగు పొడవు, ఒక అంగుళం వ్యాసార్థంతో ఎంతోబరువుగా, ఆకర్షణీయంగావుంది. అబ్బ! దానిముందు తనవన్నీ బలాదూర్.

సావిత్రి సగర్వంగా, పెద్దకోతలు కోశావ్ గాని, ఏదీ నీ దగ్గర యిలాంటిది చూపించు" అంది. తన్ను ఎత్తిపొడిచినందుకు ప్రకాశానికి కోపం వచ్చింది. కాని ఏంచేస్తాడు. తనదగ్గర అలాంటిదిలేదు. ఉంటే ఆ మాటలకు చెంప వాయించి మరీచూపించేవాడు. కోపంతోపాటు అతనిలో దానిపై ఆశకూడా చిగురించింది, "చాలా బావుంది సావీ! దాన్ని నా కివ్వవూ?" ఎంతో ప్రేమ కనబరుస్తూ అడిగాడు.

"అమ్మో! నీకా! మా నాన్నకు తెలిస్తే వీపుచిట్లగొడతాడు. నే నివ్వను"

"నే నున్నాను, లే"

"ఊహూఁ..."

"ఇవ్వవూ!"

"నేనివ్వను. నాకు మాత్రం కావద్దూ!" అంటూ భద్రంగా దాచుకోబోయింది

"సావీ! మర్యాదగా అడుగుతున్నాను, ఇవ్వు" గట్టిగా గద్దించి అడిగాడు.

"నేను యివ్వనంటే ..." ఏడుపు లంకించుకోఁది సావిత్రి. ప్రకాశంకు కోపం ప్రతిఘటించింది. "ఇవ్వవూ, సరే" అంటూ గట్టిగా వీపుమీద నాలుగుదెబ్బలు బాదేసరికి సావిత్రి గట్టిగా అరుస్తూ దాన్ని జారవిడిచింది. ప్రకాశం దాన్నిలాక్కొని కొంతదూరంవెళ్ళి కోపంతో వెంటనేదాన్ని మట్టిలోపూడ్చి, అగ్గిపుల్లగీసి దాన్ని వెలిగించి ప్రక్కగా వచ్చాడు. సావిత్రి ఏడుస్తూ అక్కడప పరుగెత్తుకుంటూ వచ్చింది. దగ్గరున్న పిల్లలంతా ఒక్కక్షణంలో ఆ ప్ర

నికి గుమిగూడారు. ప్రకాశం వత్తికి నిప్పుపెట్టివచ్చి రెండు నిముషాలయినా అది ప్రేలలేదు. నాలుగు నిముషాలయింది. అది ఏవిధమైన శబ్దమూ చెయ్యలేదు. ఎవరో, "అసలు వత్తికి నిప్పంటిందో లేదో" అన్నారు గుంపులోంచి. "చూస్తానుండు" అంటూ ప్రకాశం వెంటనే దాని దగ్గరగా వెళ్ళాడు. అంతే! లోపలనే రగుల్కొన్న నిప్పుకు అది ఒక్కసారిగా "ఢాం," అని దిక్కులుపిక్కటిల్లేలా ప్రేలింది. "అమ్మో!" అని గట్టిగా అరచి నేలకూలిపోయాడు ప్రకాశం. ఆ శబ్దానికి ఆ వీధి వీధంతా వణికింది. పిల్లలంతా ప్రకాశాన్నిజూచి కెవ్వుమన్నారు. సావిత్రి భయంతో గట్టిగా అరచింది. ఆ శబ్దం విన్న కొందరు పెద్దలు పరుగెత్తుకుంటూవచ్చి ప్రకాశాన్ని ఆ స్థితిలోజూచి వెంటనే భుజాలపై వేసుకొని దగ్గరేవున్న సావిత్రి తండ్రి 'సాంబయ్య' ఇంటికి చేర్చారు. కుడిచేతి మణికట్టుమీద దెబ్బ పెద్దగా తగిలింది. సావిత్రి బిగ్గరగాఏడ్చింది, ప్రకాశానికి సంభవించిన ఈ దురవస్థకు.

ఆ గాయమే యిప్పుడు మచ్చగా తయారయింది. బాల్యంలో జరిగిన ఆ సంఘటన సావిత్రి మనసులో చెరగని ముద్ర వేసుకుంది. ప్రకాశాన్నెప్పుడు చూసినా ఆమెకా విషయమే జ్ఞప్తికొచ్చేది.

* * * * *

"సావిత్రీ! నీవేనా అబ్బ! ఎవరో అనుకొన్నాను. ఎంత మారిపోయ్యావ్ సావీ!" ప్రకాశం సంభ్రమాశ్చరా

లతో అన్నాడు ఆమె ముఖంవేపే చూస్తూ. సావిత్రి సిగ్గుతో తలవంచుకొంది.

"నిన్నుజూచి నిజంగా ఎవరో కొత్తవ్యక్తి అనుకొన్నాను సావీ! పేరుచెప్పినా గుర్తుపట్టలేనంత మూర్ఖుడనై పోయాను. మరి నన్ను నిన్నచూడగానే గుర్తించావా?"

"చూడగానే గుర్తించలేదుగాని, పరీక్షగా చూశాక గుర్తించాను. ఎన్ని సంవత్సరాల తర్వాతనైనాసరే మీ కళ్ళనుబట్టి మిమ్మల్ని గుర్తించవచ్చు"

"అసాధ్యురాలవేనే"

"కాకపోతే మీ కెలా సాధ్యమవుతాను"

"ఓహో!" అంటూండగా అతనిలో ఏవేవో ఆలోచనలుదొర్లాయి. సావిత్రితండ్రి సాంబయ్యరూపం కళ్ళముందు మెదిలింది.

"ఏమిటాలోచిస్తున్నారు!"

"అబ్బే! ఏంలేదుసావీ"

"అబద్ధం చెబుతున్నారు"

"లేదు"

"నా కంతా తెలుసు"

"ఏమిటి తెలుసు"

"చెప్పమంటారా"

"చెప్పమరి"

"మీకూ మాకూ మధ్యగల కక్షలూ, పార్టీలూ జ్ఞప్తికొచ్చాయ్‌గదూ"

"సావీ!"

"అబద్ధమాడుతున్నానా"

"కాదుగాని"

"ఏంచెయ్యమంటావ్ బావా! ఎందుకొచ్చిన వ్యవహారాలు. వీటితో మధ్య బంధుత్వమే నశించింది" అంటూండగా ఆమె కళ్ళనుండి నీరు జలజలా క్రిందకు కాలింది.

"ఛా! ఛా! ఏమిటా కన్నీళ్ళు సావీ. ఇవెంతకాలం వుంటాయిగనుక. కాలంతోపాటే అన్నీ సర్దుకుపోతాయి"

"కాని బావా"

"ఆ బాధ నీ కక్కరలేదుసావీ"

"బావా!"

"నిజం సావిత్రీ ఈ విధంగానైనా ఈ అంతులు అంతరిస్తాయని నా ఆశ"

"ఏ విధంగా"

"అదీ నేనే చెప్పాలా" కొంటెగా అన్నాడు.

"సాధ్యమవుతుందంటారా"

"పిచ్చి సావీ! అనుకొని ఏదీ సాధించకుండాఉండలేదు ఈ ప్రకాశం. కాని పరిస్థితులుఏకీభవించేదాకా ఓపికపట్టాలి"

"బావా మ... మరి"

"ఏమిటి సావిత్రీ"

"నేనంటే..."

"నిన్ను చూడగానే నాలో ఆ భావం అప్రయత్నంగా ఆవేశించింది. అది ఏనాటికీ అంతంగాదు"

ఆమె కనుకొలకులలో నీరుఇంకా పూర్తిగాఇంకలేదు. ప్రకాశం తన కొనగోటితో వాటిని మృదువుగా తుడిచివేసి,

"శే సావీ! వెళదాం. భయపడాల్సిన అవసరంగాని, దుఃఖం చాల్సిన అగత్యంగాని యిక అనవసరం. మున్ముందు అన్నీ ఒకకొలిక్కి తేప్రయత్నిస్తాను" అంటూ ఆమె రెట్టబట్టిపైకి లేవదీశాడు. సావిత్రి చిన్నగానవ్వి అతనివేపు విస్ఫారిత నేత్రాలతో చూసింది.

"పట్నంఎపుడెళ్తావ్ బావా"

"ఎప్పుడెళ్ళమంటావ్"

"అదీ నా యిష్టమేనా"

"సెలవులింకా నాలుగురోజులు మాత్రమేవున్నాయి"

"ఆ తర్వాత"

"వెళ్ళక తప్పదు" అని ఆగి, "రేపుసాయంత్రం మామిడీవనంలో వుంటావుగదూ" అన్నాడు.

"సావిత్రి అంగీకార సూచకంగా తలూపింది.

* * * * *

ఆ రోజు ఉదయం ఎనిమిదిగంటలు దాటిన తర్వాత ప్రకాశం, సావిత్రి లింగయ్యగారి మామిడీవనంలో దట్టంగా పెరిగిన మల్లెపొదలనీడలో పచ్చికపై ఎదురు బొదురుగా కూచొని ఏదో సంభాషిస్తున్నారు.

సావిత్రి ముఖంలో కళాకాంతులు ఎప్పటిలాగా లేవు. ఆమె ముఖంలో విచారం ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. అంత వరకూ స్వచ్ఛంగా, పాలమీగడలావున్న తెల్లటి తెలి మేఘంపై నల్లటి కారుపంగులోవున్న ఒకమబ్బుతునకవచ్చి దాని అందాన్ని రూపుమాపినట్టుంది ఆమె ముఖవైఖరి

ఆమె స్వరంలో దిగులు ఉట్టిపడుతోంది. హృదయంలో గుబులుగుబులుగా వుంది.

"వెళ్ళకతప్పదు సావీ" అన్నాడు ప్రకాశం ఒక నిట్టూర్పువిడిచి.

"నువ్వే ఇంత బాధచెందితే ఆడదాన్ని నా స్థితి ఎలావుండాలి బావా? మానాన్నగారితో చెప్పి ఒప్పించటానికి నా శాయశక్తులా ప్రయత్నిస్తాను" అంది కళ్ళనీళ్ళు పెట్టుకొని.

"నేనూ అన్నివిధాలా ప్రయత్నిస్తానుసావీ! నీకు నాపై అభిమానమూ, ప్రేమూవుంటే ఈ పార్టీలూ, కక్షలూ ఎన్నడూ మనల్ని వేరుచేయలేవు. అలాకన్నీరుపెడితే ఎలా?" అన్నాడు ఆమె కన్నీరుతుడుస్తూ.

ఆమె మనసులోనిదుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. "బావా" అంటూ ప్రకాశం ఒళ్ళో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడ్చింది సావిత్రి.

"వన్నొదలివెళ్ళిపోకుబావా" అన్నది అతని ముఖాన్ని తన చేతులతో స్పృశిస్తూ.

"ఇక ఎన్నాళ్ళులే ఈ వియోగం. పరీక్షలు పూర్తి చేసుకొని రెక్కలుగట్టుకొని నీ ముందు వ్రాలనూ. ఆ తర్వాత..."

"ఆ తర్వాత..."

"నిన్ను పెళ్ళిచేసుకుంటానుసావీ! తప్పక నిన్ను నా దానిగా చేసుకుంటాను ఇంతకుమించి ఏంచెప్పాలి" అంటూ ఆమెను గట్టిగా కౌగలించుకొని పెదవులను మృదువుగా ముద్దు పెట్టుకొన్నాడు.

సావిత్రి ముఖంలో సిగ్గుదొంతరలు క్రమ్ముకొన్నాయి.

"బావా"

"ఊఁ..." ఆమె వీపును లాలనగా నిమురుతూ అన్నాడు.

"పట్నంలో నేను మీావు జ్ఞప్తికుంటానా?"

"అదేంమాటసావీ! అసలు నీ ఖ్యాసలోపడి పరీక్ష ఈ సంవత్సరం పాస్ కాగలన్నా అన్న అధైర్యంకూడా నాలో యిప్పుడిప్పుడే ఆవహిస్తోంది"

"అలాఅయితే నన్ను మరచిపొండి" అంది విసురుగా, చిరుకోపంతో అతని కౌగిలినుండి బయటపడుతూ.

ప్రకాశం పకపకానవ్వాడు. "కోపంలోకూడా నీ ముఖకాంతి మరీ ప్రస్ఫుటంగా, దేదీప్యమానంగా..."

"ఆ...ఆ... ఆపండి బావగారూ"

"ఏం?"

"నా కోపం మరీ పెరిగిపోయేను"

"అయితే ఇంకేం, ఆ అందం ఎలావుంటుందోకూడా చూడవచ్చు"

"ఏం? ఏదైనా వ్రాయటానికి పనికొస్తుందా"

"అదీపాయంటే"

"మీా కన్నీ పాయింట్లే. నన్నిలా వేధించటం గాడా పాయింటే"

"మరేం చెయ్యమంటావ్ సావీ! నిన్ను చూస్తున్న ప్రతిక్షణమూ నాలో ఏదో కవితానుభూతి పొంగి పరవళ్ళు

త్రొక్కుతూంటుంది" అంటూ ఆమెను మళ్ళీ తన అక్కున చేర్చుకొన్నాడు.

"కొంపదీసి ప్రబంధం ఏదీ మొదలెట్టలేదుగదా!"

"ప్రబంధనాయకి నా ఒళ్లోవుండగా యిక ఆ కావ్యాలూ, గీతికలూ ఎందుకుసావీ!"

"ఊఁ... చాల్లెండి" అంది నునుసిగ్గుతో.

"రేపే నేను వెళ్తాను. కాని అనుక్షణమూ నా హృదయం నీ కోసమే స్పందిస్తూంటుంది. ఉత్తరాలు వ్రాస్తుంటావ్ గదూ?"

"నేను వ్రాస్తానుగాని పిచ్చిముదిరి నా కొక్కడా మీరు ఉత్తరాలు వ్రాశేరు" అంది.

"మరీ దేవదాసునుకానులే" అంటూ ఆమె ఎర్రటి స్నిగ్ధకపోలాలపై గాఢంగా చుంబించాడు.

ఐదారురోజుల వీరిసాన్నిహిత్యమే కొన్ని సంవత్సరాల గాఢబాంధవ్యంగా, పవిత్ర ప్రణయ స్వరూపంగా పరిణమించింది. తీరికున్న ప్రతిక్షణమూ, ప్రకాశానికి సావిత్రి గురించిన ఆలోచనలే జనిస్తుండేవి. ముందు జన్మలో చేసిన పుణ్యఫలమే నాకీజన్మలో సావిత్రిరూపంలో సాక్షాత్కారమైందనుకొనేవాడు. ఆమె నిష్కల్మష, పవిత్రహృదయంఅతన్నెంతో ఆకర్షించి, అనుబంధించింది. ప్రతిరోజూ సాయంత్రం మామిడి వనంలో కలుసుకొనేవారు. యెవరైనాచూస్తారేమోనన్న జంకు ప్రకాశానికి అణుమాత్రమూ లేదు. వారి ఈ నిర్మల ప్రణయం నిత్యమూ చూస్తున్న మామిడివృక్షాలు వింతగా వారిని దీవిస్తున్నట్లు తలలూపేవి.

# 14

ప్రకాశంవచ్చి వారంరోజులయింది. ఆవారం రోజులూ అతను పూర్తిమగతలోనే వున్నట్లుగా వుండిపోయాడు. ఏ పని చేయటానికీ ఉత్సాహంగాని, చైతన్యంగాని అతనిలో అంత రించాయి. వియోగం తననింత బాధపరుస్తుందనిగాని, తన్ను తనుగా లేకుండా మార్చివేస్తుందనిగాని అతను ఆదిలో అను కోలేదు. కాని యిక్కడకు రాగానే అసలు అనుభవం అర్థ మైంది. ఏ స్థితిలోనున్నా సావిత్రి కళ్ళముందు మెదిలేది. జరిగిన సంఘటనలను సంభాషణలను మననం చేసుకుంటూ అదొకరకమయిన తృప్తితో నిట్టూర్చేవాడు. ఈ అయో మయావస్థలోని వేదన, ఆరాటంతో రెండు ఉత్తను గేయాలు వ్రాశాడు. ఆ రెండు గేయాలూ అతిచక్కగా కుది రాయి.

పట్టణంవచ్చి వారంరోజులైనా అందులో ఏ రెండు మూడురోజులో కాలేజీకి వెళ్ళేంటాడు. అంతేతప్ప మిగతా రోజులన్నీ గదిలోనే ఒంటరిగా కూచొని ఏదో 'మూడ్'లో పడిపోయేవాడు. రాను రాను ఈ ధ్యాసనుండి తనెంతో తప్పించుకోవాలని విశ్వప్రయత్నంచేస్తూ ఒకవిధమైనదానికి వచ్చాడు. మిత్రుడు రామకృష్ణ, గ్రుచ్చి గ్రుచ్చి అడిగినా గాని ఏ విషయమూ అతనికి చెప్పలేకపోయాడు.

వచ్చినప్పట్నుండీ రాధ యింటికతను వెళ్ళలేదు. రెండుమూడుసార్లు ఆమె కాలేజీలోతనతో "యింటికిరమ్మని" హెచ్చరించింది. యెందుకోగాని తను వెళ్ళలేకపోయాడు.

ఆ రోజు సాయంత్రం ప్రకాశం రాధ ఇంటికి వెళ్ళాడు.

ప్రకాశాన్ని రెండుసార్లు రమ్మన్నా యింతవరకూ రానందుకు అతనిపై రాధకు బ్రహ్మాండమైన కోపంవచ్చింది. సెలవుల్లో రెండు ఉత్తరాలు వ్రాసినా జవాబివ్వని ఆ ప్రబుద్ధుని తలచుకొనేకొద్దీ ఆమెకు ఒళ్ళుమండుతోంది. ఆ సాయంత్రం ప్రకాశంరాగానే కోపంతో భ్రుకుముడి ముకుటించి వ్యంగ్యంగా అడిగింది.

"వచ్చారా మహాశయా! ఏంకొంప మునిగిందని ఈ రోజు వేంచేశారు"

"అస్వస్థతవల్ల రాలేకపోయానురాధా!మరేమనుకోకు"

"ఆడండి! నోటికొచ్చిన అబద్ధాలన్నీఆడండి"

"లేదురాధా నిజం"

"కాకపోతే ఏమిటండీ, సెలవుల్లో రెండు ఉత్తరాలు వ్రాసినా జవాబుయివ్వలేదు. అంతకొరకరాని కొయ్యలమయ్యామా మేము"

"క్షమించురాధా! వ్రాద్దామనే అనుకొన్నానుగాని మనసుసరిగాలేక, మా గృహవ్యవస్థకు సంబంధించిన వ్యవహారాలు పెరగటంచేత మరచిపోయాను"

రాధ అతను చెప్పిన విషయాలు విని కోపంమరచి, ఏమన్నారూ! మీకూ ఏవైనా వ్యవహారాలూ, కష్టాలూ వున్నాయా" ఉత్సుకతతో ఆశ్చర్యంగా అడిగింది.

ప్రకాశం వాటి గురించి క్లుప్తంగాచెప్పి చిన్నగా నిట్టూర్చాడు. రాధ అంతావిని ఆ దుస్థితికి జాలిపడింది.

ఇంతలో రాజారావు ప్రవేశించాడు. "ఎప్పుడొచ్చావోయ్ ప్రకాశం" అనడిగాడు. ప్రకాశం జవాబిచ్చాడు. రాధ అందు కొని తనకు ప్రకాశం చెప్పిన విషయాలన్నీ తండ్రితో చెప్పింది. రాజారావు అంతావిని, "ఆ సాంబయ్యకిదేం దుర్బుద్ధి పుట్టింది. మీకూ వారికీ బంధుత్వంకూడా వుందను కుంటాను! ఎంతైనా ధర్మం, న్యాయం మీ వేపేవుంది గాబట్టి ఏనాటికైనా జయంమీదే" అన్నాడు.

"ఏమో! కాలాన్ని ఎవరు నిర్ణయిస్తారు" ప్రకాశం భారంగా అన్నాడు.

ఏవేవో విషయాలు చర్చించుకుంటూ ప్రకాశం ఒక గంటకాలం అక్కడే వుండిపోయాడు. ఆ తర్వాత వారిదగ్గర సెలవుతీసుకొని బయటకు వచ్చాడు. రాధ అతన్ని గేటు దాకా అనుసరించి, "రేపు వస్తారుగదూ?" అంది. "రాలే ననుకుంటాను రాధా" అంటూ ప్రకాశం వెళ్ళాడు. రాధ ముఖం నల్లబడింది.

ప్రకాశం గేటుదాటి వీధిలో అడుగుపెట్టగానే వెంక టేశం సైకిల్‌మీద అటువేపేవస్తూ, ప్రకాశాన్ని జూచి ఆగి, "ఏమిటోయ్! ఇక్కడెటువెళ్ళావ్?" అని ప్రశ్నించాడు.

"ఒక మిత్రుని యింటికి"

"మిత్రుడా, మిత్రురాలా?" వ్యంగ్యంగా అడిగాడు సూటిగాచూస్తూ.

"మిత్రురాలే"

"అయితే వ్యవహారం బాగా సాగుతోందన్నమాట"

"బావా" కోపంతో గద్దించాడు ప్రకాశం.

"అపార్థం చేసుకుంటున్నావ్"

"లేదు. అర్థంచేసుకో ప్రయత్నిస్తున్నాను. ఇంతకూ శారదను పిల్చుకురాలేదే!"

"సంక్రాంతికి నీవే వెళ్ళాలట" అని విసురుగా జవాబిచ్చి ప్రక్కవీధిగుండా గబగబా నడచివెళ్ళాడు. వెనకాల వెంకటేశం నవ్వు స్పష్టంగా వినిపించింది ప్రకాశానికి.

"ఛా! ఛా! పాడుమనుషులు, హీనమనసులు" అనుకొన్నాడు ప్రకాశం అసహ్యంతో.

గదికొచ్చేసరికి రామకృష్ణ బయటవరండాలోనిల్చొని ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"ఏమిట్రా వరండాలోనిలబడ్డావ్, తాళంతీయలేదూ?"

"తాళంచెవి పోగొట్టుకొని యిలా తమకోసం వెయిట్ చేస్తున్నా, ఎప్పుడు రాధాదేవిగారుతమర్ని విడుదలచేస్తుందా అని ఆలోచిస్తూ"

"ప్రకాశం చిన్నగా నవ్వాడు. రామకృష్ణమాటల్లో వ్యంగ్యమున్నా ప్రకాశానికి కోపంరాదు. వానిమనసు నిర్మలమైనదని, వాడు అందరిలా అపార్థం చేసుకోడని అతని నిశ్చితాభిప్రాయం.

గదిలో ప్రవేశించి ఇరువురూ కుర్చీలలో కూలబడ్డ తర్వాత, "ఏమిటోయ్! ఇన్నాళ్ళూలేని ఉత్సాహం ఈ రోజు నీలో కన్పిస్తోంది" అడిగాడు రామకృష్ణ.

"అయితే ఇన్నాళ్ళూ చప్పగా వున్నానన్నమాట"

"ఏదో మూడ్‌లో వున్నావుగా. ఏం గ్రామంలో ఏదైనా జరిగిందా?"

"అబ్బే! ఏంజరుగలేదే!"

"దాస్తున్నావ్"

"లేదు"

"నా ముందేమిట్రా నీ అబద్ధాలు. మరి సావిత్రి ఎవరు?"

ప్రకాశం నిర్ఘాంతపోయాడు. వీడికెలా తెలిసిందా అనుకొని. "సావిత్రా...! ఎవరో నీకెలా తెలుసు?"

"అలా దారికి రా నాయనా! ఇప్పుడు చెప్పు అసలు విషయం"

"చెప్తాగాని ముందీసంగతి నీకెలా తెలిసిందో చెప్పు"

"ఇందులో నా డిటెక్టివ్ ఏమీలేదు. కాలేజీలో నీ పేర ఒక కవరువస్తే తెచ్చి రహస్యం ఏముంటుందిలే అనివిప్పి చదివా! తీరాచూస్తే ప్రేమలేఖ. చదివానే అని చింతించాను" అన్నాడు ఆ ఉత్తరం అందిస్తూ. ప్రకాశం దాన్ని రెండుసార్లు చదివి తృప్తిగా రామకృష్ణవేపు చూసి, వానికిక అసలువిషయం చెప్పక తప్పదనుకొని, అన్నివిషయాలు వివరంగా తెలియజేశాడు. రామకృష్ణఅంతావిని "ప్రకాశం! మీ ప్రణయం విషయం ఆలోచిస్తే మీ పార్టీలగురించి నాకేదో భయంగావుంది" అన్నాడు.

"అదీనిజమేగాని, నా జీవితంలో మొదటిలక్ష్యం సావిత్రి. ఆ లక్ష్యం నెరవేర్చటానికిగాను నేనేమైనా చేస్తాను" ఇది నా ఆత్మవిశ్వాసం" అన్నాడు దృఢంగా.

"మరి రాధ"

"రాధకూ ఈ విషయాలకూ ఏంసంబంధం" ప్రకాశం అడిగాడు ఆశ్చర్యంతో.

"అయితే ఇన్నాళ్లూ తమరు రాధతో జరిపిన ప్రేమ వ్యవహారం?"

"అహోహ చెండాన్ రామకృష్ణా! నాకు నీవెంతో రాధ అంతే! అంతకు మించి"

"అంతేనంటావా" రామకృష్ణ నమ్మనట్లు అడిగాడు.

"ఊఁ"

"కాని ప్రకాశం..."

"ఏమిట్రా"

"ఆమె కూడా నీ ధోరణిలోనే వుందంటావా?"

ఈ ప్రశ్న ప్రకాశంలో పెద్దదుమారం లేపింది. ఇన్నాళ్ళుగా తనూహించని ఈ సమస్య! ఏదో చేదుమందులా ఈనాడు తన కగుపిస్తోంది.

"ఏమంటావ్ ప్రకాశం"

"ఏదీ చెప్పలేను కృష్ణా! ఆమెలో కూడా అలాటి భావాలు లేవనుకుంటాను"

"అయితే ముందునుండీ నీ కామెపై ఈ అభిప్రాయం వుందా లేక సావిత్రి పరిచయం తర్వాత ఈ భావన కొచ్చావా?" ఇది అడగవలసిన ప్రశ్నే!

"లేదు కృష్ణా లేదు. ఏనాడూ నా కామెపై ఆ భావం లేదు. అసలా దృష్టితో యేనాడూ ఆమెను నేను చూడలేక పోయాను"

"మరిప్పుడామె సంగతి?"

"ఆమె నా లాంటి భావనలోనే వుండవచ్చు"

"పూర్తిగా పొరబడ్డావ్ ప్రకాశం. పసిరిక రోగం వచ్చినవారికి లోకమంతా పచ్చగానే కనిపిస్తుందట. నీకా భావన వుండొచ్చుగాని, ఆమెకు నీపై పరిపూర్ణ ప్రేమ వుందని నిశ్చయంగా చెప్పగలను"

"ఇందులో నా తప్పేముంది?"

"తప్పులేకపోవచ్చుగాని, ఆ తప్పుకు కారణం నీ వన్న విషయం మరువకు; రాన ఈనాడు నిన్ను వివాహం చేసుకోమని అడిగితే?"

"అది అసంభవం"

"అయితే ఈనాటినుండీ సాధ్యమైనంతవరకూ ఆమెను కలుసుకోవడంమాను. లేకపోతే పూర్తిగా దెబ్బతింటావ్"

ప్రకాశం అతనిమాటలను నిశ్చలంగా ఆలోచిస్తూండి పోయాడు.

* * *

నెలరోజుల తర్వాత ఒకనాడు ప్రకాశం శారద యింటికి వెళ్ళాడు. అంతకు పక్షంరోజులక్రితమే, శారద పుట్టింటినుండివచ్చింది. ఆమె వచ్చివుంటుందన్న భావంలోనే ఈనాడు ప్రకాశం బయులుదేరాడు.

వీధిగుమ్మందాటి లోపలహాల్లో ప్రవేశించేసరికి అక్కడే కూచొని, అద్దం తన ముందుంచుకొని జడఅల్లుకుంటూన్న ఇందిర అతనికికనిపించింది. ఇందిర అతణ్ణి చూడ

గానే సిగ్గుతో లేచినిల్చొని, "ఎన్నాళ్ళకు దర్శనభాగ్యం కలిగింది బావా" అంది ప్రకాశం కుర్చీలోకూలబడి, "శారద లేదూ?" అనడిగాడు.

"బిందెతీసుకొని కొళాయికెళ్ళింది. ఉండుబావా కాఫీ తెస్తా" అని అలంకరణసామగ్రి ఎత్తిపెట్టివంటింటివేపువెళ్ళింది.

ప్రకాశం వాలుకుర్చీలో వెనక్కు వాలి, కళ్ళుమూసుకొని ఏదో ఆలోచనలోపడిపోయాడు. అతని ఆలోచనలు సావిత్రి గురించి దారితీశాయి. 'ఈ మాసం రోజులలో సావిత్రినుండి రెండు ఉత్తరాలొచ్చాయి తనకు. వాటిలో ప్రత్యేకమైన విశేషాలంటూ ఏమీలేకపోయినా, ఒక్కొక్క ఉత్తరాన్ని డజనుసార్లయినా చదివుంటాడు. ప్రతిఉత్తరం చివరా, "నన్ను మరువరుగదూ! మీ కోసం ఎదురు చూస్తుంటాను" అని వ్రాసి ముగించేది. అప్పుడామె మూర్తి కళ్ళముందు మెదిలేది. వెనువెంటనే, "నా బొందిలో ప్రాణముండగా నిన్ను మరువగలనా సావీ" అనుకొనేవాడు. ఉత్తరాలలో, "పొరపాటునగూడా మీరు నాకు ఉత్తరాలు వ్రాయాలనుకోకండి. మీ కవిజాతికి కాస్త ఆవేశం జాస్తి. గాబట్టి ఈ విషయం మరీ మరీ వ్రాయాల్సొచ్చింది" అనుండేది. ఉత్తరాలు వ్రాయాలని తనకూ కుతూహలమే. కాని ఉత్తరమంటూ వ్రాస్తే ఆదిలోనే హంసపాదులా తన కార్యక్రమానికే భంగంగా అది నేరుగా సాంబయ్యచేతిలో పడుతుందనుకొని అంతటితో ఆ తలంపు మానుకొనేవాడు ఆమె అక్షరాలు ముత్యాల్లా ఎంతో గుండ్రంగా, ఆకర్షణీయంగా వుండేవి. ఈ విషయంలో సావిత్రి తనకు భవిష్యత్తులో బాగా

ఉపయోగపడుతుంది. (రచనలు ఫేర్ కాపీ చెయ్యటానికి) అనుకొనేవాడు.

ఈ ఆలోచనలతో తనెక్కడున్నది కూడా ప్రకాశం విస్మరించాడు. అర్ధనిమీలితంగావున్న అతని నేత్రాలముందు సావిత్రి సురుచిర, సుందరరూపం మెదలుతూంది.

"బావా కాఫీ"

"......"

"బావగారూ!"

ప్రకాశం యింకా ఈ లోకంలో పడలేదు.

"పాపం! ఏ స్వర్గసీమలో విహరిస్తున్నారో" అనుకొని ఇందిర ఈసారి మరింతగట్టిగా "బావా! కాఫీ" అంది. ప్రకాశం ఒక్కసారిగా ఉలికిపడిలేచి ఎదురుగావున్న ఇందిరను జూచి, క్షణకాలం నిస్తబ్ధుడై తన మతిమరపుకు తన్నుతానే నిందించుకుంటూ చిన్నగానవ్వి, "ఆమె యిచ్చిన కాఫీ కప్పు అందుకొన్నాడు.

ఇంతవరకూ ఏ లోకంలో వున్నారు బావగారూ ఏదైనా ప్రబంధం వ్రాయదలచుకొన్నారా?"

"ఆఁ వ్రాయదలుచుకొన్నా, కాని 'నాయిక' కోసం ఎదురుచూస్తున్నా"

"మరి లభించిందా"

"అబ్బే! అంత తేలికా? చాలా ఓపికా, ప్రయత్నం కావాలి"

"అయితే అందుబాటులో లేదన్నమాట"

"ఉండకో! అయినా పురుషప్రయత్నం అంటూ వుండాలిగా"

"ఫో బావా! నీ మాటలూ, నువ్వూను" అంటూ ఖాళీకప్పు తీసుకొని వెళ్ళింది ఇందిర. ఆ అమాయిక ఈమాట లన్నీ తన్ను గురించేనన్న పిచ్చిభావనలో భ్రిమతో మధుర హర్మ్యాలు నిర్మించుకోసాగింది. కాఫీ కప్పు వంటింట్లో పెట్టి బయటకు వచ్చింది. ప్రకాశం చూపులు శూన్యభావాలతో వంటింటిమీదపైనే వుండటంచే ప్రవేశించిన ఇందిరకళ్ళు, అతనికళ్ళూ ఒక్కసారిగా కలిశాయి. ఇందిరసిగ్గుతో, తత్తర పాటుతో తలవంచుకొంది.

"పరీక్షలు దగ్గరపడుతున్నాయ్, బాగా చదువు తున్నావా ఇందిరా!"

"అదెక్కడ చదువుతుందన్నయ్యా. ఎప్పుడూ నిన్ను గురించే దాని ప్రశ్నలూ, జవాబులూ, ఆలోచనలు... పాపం: రెండు నెలలుగా చూడక కళ్ళుకాయలుకాచాయి. అని నిన్ననే నాతో అంది" అంటూ బిందెతో ప్రవేశించింది శారద నవ్వుతూ.

"అలాంటివేం కాదరవు మరదలుపిల్లా! ముందు నీవు బాగాచదివి పాసవ్వాలి. ఆ తర్వాత ఆలోచనలన్నీ ఏం..." అన్నాడు పరిహాసంగా ప్రకాశం.

"ఫో బావా" అంటూ తుర్రుమంది ఇందిర.

"పిచ్చిపిల్ల" అంది శారద బిందె క్రిందకుదించుతూ.

"ఇంటి దగ్గర అంతా క్షేమమేనా శారదా!"

"అంతా క్షేమమేగాని, సావిత్రి నీకు తెలుసుగదూ!"

"ఏ సావిత్రి?" అమాయకంగా ప్రశ్నించాడు.

"అదే సాంబయ్య కుమార్తె"

"ఏదో కొద్దిగా తెలుసు, ఏంజరిగిందింతకూ"

"ఆఁ మరేంలేదు. వచ్చేముందు తోటలో కనిపించి నిన్ను గురించి అడిగిందలే! "ఆయనగార్ని బాగా చదువుకో మని చెప్పు వదినా" అంది నాతో! అంతే!" శారద అర్థోక్తిలో ఆగింది.

"అంతేగింతే ఏంలేదు శారదా! అదంతే! మళ్ళీ వస్తా" అంటూ లేచి గబగబ బయటకు వెళ్ళిపోయాడు ప్రకాశం' ఇక అక్కడేవుంటే యిందుకు సంబంధించిన క్రాస్ ఎగ్జామినేషన్ తప్పక జరుగుతుందనుకొని.

శారద నివ్వెరపోయింది.

# 15

యూనివర్సిటీ పరీక్షలకు పదహారోజులు మాత్రమే గడు వుంది. ప్రకాశం దీక్షగాచదువుతున్నాడు. తన తండ్రిఉద్దేశం అతనికి బాగా తెలుసు. డాక్టరీ చదవాలన్న కోర్కె' తనకూ సంపూర్తిగా వుంది. అందుకు కష్టపడి చదివితే తప్ప లాభం లేదు. ఏనాడూ ఈ కర్తవ్యంలో ప్రకాశం ఆదమరువలేదు. ఈ సమయంలో సాధ్యమైనంతవరకూ సావిత్రి గురించిన ఆలోచనలు విస్మరించాడనే చెప్పాలి. దీక్షకుతోడు అతడు స్వతహాగా చురుకైనవాడు. ప్రతి సబ్జక్టునూ కూలంకషంగా చదువసాగాడు.

రాధ సహజంగా తెలివైనది. కొన్ని సబ్జక్టులలో క్లాసులో ఫస్టుమార్కులు ఆమెవే. ఆమె కూడా శ్రద్ధగా చదువులో మునిగిపోయింది.

ప్రకాశం ఈ మూడుమాసాలలో ఏ రెండుసార్లో తప్ప ఎక్కువగా ఆమె ఇంటికి వెళ్ళలేదు. రామకృష్ణ సలహా నతను అనుసరించాడు.

రాధకిది భారంగా, బాధగానేవుంది. పరీక్షలు దగ్గర పడుతున్నందువల్ల రాలేదేమోననుకొంది. ఇక పూర్తిగా రాడేమోకూడా అనుకొని విచలిత అయింది.

రాజారావుకు కూతురు మనస్తత్వం బాగా అవగాహనయింది. అతను ఆవులిస్తే పేగులు లెక్కించేరకం. ప్రకాశాన్ని ఎందుకో అతను బాగావిశ్వసించాడు. ఆదర్శభావాలు గల యువకుడని, రాధను తప్పక పరిగ్రహిస్తాడనీ అతని ఆశ, ఆత్మవిశ్వాసం కూడా! ఈ విషయమై అతనితో చర్చించి, తన ఆశయాన్ని అతని ముందుంచి, అభిప్రాయం తెలుసుకోవాలనుకున్నాడు. కాని ఈ మధ్య ప్రకాశం కన్పించడామె. సందర్భవశాత్తూ రాధ నీ విషయమై కదిపిచూశాడు. రాధ సిగ్గుపడింది. రాజారావు తృప్తిగా నవ్వుకొన్నాడు. ఆ రోజు మనసులో ఏది నిర్ణయించుకున్నాడోగాని, వెంటనే ఒక మనిషిని ప్రకాశంకోసం పంపాడు. వెంటనే రావాల్సిందని కబురు పెడుతూ. వచ్చినమనిషి చెప్పిన విషయంవిని ప్రకాశం కారణం ఏమిటా అనుకొని విస్మయం చెందాడు. బహుశారాధకు జబ్బుగా వుందేమో వెళ్ళనిదో బావుండదనుకొని ఆ వ్యక్తి వెనకాలే బయలుదేరాడు.

ప్రవేశించేసరికి హాల్లో రాధా, రాజారావులు సోఫాలపై తీరికగా కూచొని ఏదో సంభాషిస్తుండిపోయారు. ప్రకాశం రాకజూచి సిగ్గుపడుతూ రాధలేచి అట్నుంచి వెళ్ళిపోయింది.

'కూచో ప్రకాశం'

ప్రకాశం అతని కెదురుగా సోఫాలో కూచొన్నాడు.

''పిలిపించారట ఎందుకూ?'' అని అడిగాడు.

రాధ తెచ్చిన కాఫీచూపిస్తూ, ''ముందుగాదీన్ని ముగించు'' అన్నాడురాజారావు. ప్రకాశం అతనివేపే చూస్తూ కాఫీ పూర్తిచేశాడు. రాజారావు తన సంభాషణ ప్రారంభించాడు.

''చూడు ప్రకాశం! మీకా యిక పరీక్షలు దగ్గరపడుతున్నాయి. అవి పూర్తికాగానే సెలవులు. ఆ సెలవులొస్తే నీవు గ్రామం వెళ్ళిపోతావు. ఇక ఎవరిదారి వారిదవుతుంది. ఏమంటావ్?''

ప్రకాశానికి ఈ ఉపోద్ఘాతం ఎందుకో అర్థంగాలేదు. జవాబంటూ ఒకటి ఇవ్వాలిగాబట్టి, ''నిజమే!'' అన్నాడు ముక్తసరిగా.

''కాబట్టి ముందుగానే అన్నివిషయాలూ చూసుకోవటం మంచిదిగదూ?'' రాజారావు ఆగి, ప్రకాశంవేపు చూశాడు.

''ఏ విషయాలు?'' ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాశం.

రాజారావు తన భావాలను బయటుంచటానికి యేమాత్రం సంకోచించలేదు. ''పెళ్లివిషయం'' అన్నాడు.

ప్రకాశం అతిసాధారణంగా, "ఎవరిపెళ్ళి?" అనడి గాడు.

"అయితే, పూర్తిగా నేనే వినిపించాలన్నమాట. ఎంత అమాయకంగా అడుగుతావోయ్" చిన్నగా నవ్వాడు. ఆ నవ్వు ప్రకాశానికి సహించలేదు.

"క్షమించండి. మీ మాటలు నాకు పూర్తిగా అర్థంగాలేదు"

"పూర్తిగాకాకపోతే కొంతయినా అర్థమయిందా"

"ఏ మాత్రమూ కాలేదు."

"అయితే నా నోటిగుండానే అంతా చెప్పమంటావ్. మొత్తానికి బలేవాడవోయ్! చూడూ, మా అమ్మాయి రాధ నీకు బాగా తెలుసు. ఆమె మనస్తత్వం నీకు బాగా అర్థం. మీ యిద్దరకూగల పరిచయాన్ని, సన్నిహితత్వాన్ని గురించి నేను మరీ మరీ చెప్పాల్సిన అవసరంలేదనుకుంటాను. మొదట్నుంచీ నీవంటే నాకు సదభిప్రాయమే! రాధకూఅంతే! ఏమంటావ్?"

"ఆ విషయం నే నెలా చెబుతానండీ?"

"మొత్తానికి అసాధ్యుడవే. అంతా నన్నే చెప్పనిస్తున్నావ్! ఇక అసలు విషయానికొద్దాం. నీ వంటే రాధకు ఎంతో యిష్టమూ, ప్రేమా. నీకూ అంతే. ఆ విషయం నీకూ నాకూ అమ్మాయికీ అందరకూ తెలుసు. ప్రేమించి పెళ్ళిచేసుకోవటమనేది నిజంగా పూర్వపుణ్యావిశేషం" రాజారావు ఆపాడు.

ప్రకాశానికి లీలగా ఏదో అర్థమయింది. అతని మనసు విచలితమైంది. మనసును బరువుగా అదుపులో పెట్టుకొని "ఇంతకూ మీ భావం?" అన్నాడు.

"ఆ కాస్తకూడా నా నోటిగుండానే అనాలా? కాబొయ్యే మామగారిని అప్పుడే అదుపులోపెట్టచూస్తున్నావ్. పిడుగులాంటివాడవోయ్"

"రాజారావుగారూ! మీ రిలా డొంకతిరుగుడుగా మాటాడటం నా కిష్టంలేదు. ఉన్నమాటేదో సూటిగా చెప్పండి. అంతేగాని యిలా తలాతోకా లేకుండా మాటాడితే నా కర్థంగాదు. అలాఅయితే నే వెళ్తా" అంటూ లేవబోయాడు. రాజారావు నిర్ఘాంతపోయాడు. "కూచోవోయి, అలా కోప్పడితే ఎలా? ఎంతయినా మీ కుర్రకారుకు సిగ్గూ ఆవేశమూ జాస్తిగదూ" అంటూ భుజాలుపట్టుకొని కూచోపెట్టాడు.

"చెప్పండి" విసుగ్గా అన్నాడు.

"సరే చెబుతాను, రాధకూ నీకూ పెళ్లి చేయాలని నా అభిప్రాయం" అని ప్రకాశం కళ్ళవేపు చూశాడు. ప్రకాశం యిలాంటిమాట అతని నోటిగుండా వస్తుందని ముందుగానే వూహించినవాడవటంచేత ఏమాత్రం తడబడక ఆ ముఖం వేపు ఒక్కక్షణంపాటు చూసి వెంటనే చూపులను ప్రక్కకు తిప్పుకొని "క్షమించండి రాజారావుగారూ! మీరు నన్ను అపార్థం చేసుకొన్నారు" అన్నాడు గంభీరంగా.

వంటింటితలుపుప్రక్క ఓరగా నిల్చొన్న రాధ చేతిలోని ఖాళీకప్పు, ఈ మాట వినగానే ఆమె చేతినుండి తటా

లున జారి క్రిందపడింది. ఆమె తన ప్రక్కనే పిడుగుపడినట్లుగా వణికింది.

రాజారావు అయోమయ స్థితిలోపడి అంతలోనే సంబాళించుకొని, "ప్రకాశం! ఈ అంటున్నది నీవేనా" ఎంతో నెమ్మదిగా అడిగాడు.

"మళ్ళీ మళ్ళీ చెప్పలేనండి"

"అంటే?"

"నేను ఈ యింటికి కేవలంమిత్రత్వంవల్ల రాకపోకలు సాగిస్తున్నానేగాని మీ రూహించిన భావనలో నే నిటు ఏనాడూ రాలేదు. మీ రిలాంటి అపోహతో వున్నారని ముందే తెలిసుంటే నన్ను నేను సరిదిద్దుకొని అంతటితో ఆ పరిచయాని కపుడే స్వస్తిచెప్పి వుండేవాణ్ని"

"ప్రకాశం" కోపంతో గద్దించాడు రాజారావు.

"ఆగ్రహపడకండి రాజారావుగారూ! అసలువిషయం చెబుతున్నాను. నేను రాధను ఒక ఉత్తమ మిత్రముగా, భావిస్తూ వచ్చానుగానీ ఏనాడూ నేనామెను ఆ దృష్టితో చూడలేదు. ఏనాడైనా ఆమెలాంటి మిత్రులు లభించటం కష్టమే! అన్నివిధాలా ఆమె ఉత్తమురాలు. నేను మీ రను కొన్న విషయానికి మాత్రం వ్యతిరేకుణ్ని. నా కలాంటి భావాలు లేవు. మీ విషయంలో నేను క్షంతవ్యుణ్ని. రాధతో నన్ను క్షమించమని చెప్పండి. వస్తా, మళ్ళీ యిక రానేమో శలవ్" అని లేచి బయటకెళ్ళబోయాడు. రాజా రావు ముఖం కోపంతో కందగడ్డలా తయారయింది. కళ్ళు విస్ఫులింగాలను వెదజల్లుతున్నాయి.

"ప్రకాశం ఆగు" కోపంతో ఖంగున మ్రోగింది అతని కంఠం. ప్రకాశం ఆగిపోయాడు.

"ప్రకాశం! బాగా ఆలోచించుకో"

"ఇది ఈనాడు ఆలోచించి మీతో చెప్పలేదు. ఎన్నడో ఆలోచించినదే. అసలు ఈ విషయానికి ప్రత్యేకాలోచనఅంటూ అనవసరం"

"ప్రకాశం! మంచిగా అడుగుతున్నాను. మీ నాన్న గురించి భయపడకు అన్నీ నేనే సర్దగలను. అవకాశాన్ని జారవిడచుకోకు"

"నాకెవరి భయమూ అవసరంలేదు. నన్ను సరిగా అర్థంచేసుకొనుంటే మీరిన్నిమాటలు అనేవారుగాదు" అంటూ ద్వారగుమ్మం దాటబోయాడు! రాజారావు కోపంతో క్రుద్ధుడైపోయాడు.

"ప్రకాశం రేపు సాయంత్రంవరకూ గడువిస్తున్నాను. బాగా ఆలోచించి నిర్ణయానికిరా. కానిపక్షంలో మున్ముందు వచ్చేచిక్కులు నీకే అర్థమవుతాయి"

"ఇక నాకేగడువూ అవసరంలేదు. ఇదే నిశ్చితాభిప్రాయం" అని చకచకా పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్ళిపోయాడు,

"సరే, నీ ఖర్మనీది. అనుభవిస్తావ్ అందుకుతగ్గట్టు" ఆఖరున అన్న రాజారావుమాటలు ప్రకాశానికి అస్పష్టంగా వినిపించాయి.

ప్రకాశం అటువెళ్ళగానే "నాన్నా" అంటూ బావురుమంది రాధ.

"ఊరుకోమ్మా రాధా, ఊరుకో. మంచివాడూ ఆదర్శప్రాయుడూ అని తలచానుగాని, యిలా నన్నవమాని స్తాడనుకోలేదు. ఈ అవమానానికి ప్రతీకారమేదో అతను కొద్దిరోజులలోనే తెలుసుకుంటాడు" అన్నాడు కోపంతో భీకరంగా.

"లేదు నాన్నా! ఆయన మనసెందుకో ఈ రోజు బాగున్నటులేదు. అందుకని"

"ఇంకా ఏమిటిరాధా వానిపై ..."

"నాన్నా! అనవసరంగా వారిని దూషించకు. నేనే అతన్నడిగి ఏదో తేల్చుకుంటాను"

*　　　*　　　*

ప్రకాశం ఏ 'మూడ్' లో వున్నాడోగాని రెండు అంగల్లో తనగది చేరుకొన్నాడు. ఇంతకుముందు ఏర్పడ్డ విప రీత సంఘటనవల్ల అతనిముఖం జేవురించింది. కళ్ళు పెద్ద సుడిగాలిలో ప్రయాణం చేసినవానివలె, ఒకవిధమైన ఎఱ్రటి రంగులో విపరీతభావాలు వర్షిస్తున్నాయి. భ్రుమముడి ముకు టించటంవల్ల స్పష్టంగా రేఖలు కన్పిసూ ఏవో సుదీర్ఘ ఆలోచనలలో మునిగివున్నాడని తెలియపరుస్తూంది.

ఈ విధమయిన ఆకారంతో విసురుగా ప్రవేశించి బరువుగా వాలుకుర్చీలో కూలబడ్డ ప్రకాశాన్ని ఏమిటలా గున్నావ్? అని వెంటనే ప్రశ్నించే ధైర్యంలేకపోయింది రామకృష్ణకు. అతనేనాడూ ప్రకాశాన్ని ఈవిధమయిన ఆకా

రంలో చూడలేదు. ఉన్నముఖానికి కృత్రిమంగా, ప్లాస్టిక్ తొడుగు ధరించినట్టుగావుంది అతని ముఖవైఖరి. తను గదిలో కూడా వున్నట్టు విస్మరించిన ప్రకాశానికి రామకృష్ణ అసలే కన్పించలేదు.

ఐదునిముషాల దీర్ఘమౌనం తర్వాత ప్రకాశం అస్పష్టంగా, "లేదు, లేదు... అలాజరగనివ్వను" అన్నాడు. రామకృష్ణ ఉలికిపడి ప్రకాశంముఖంవేపుచూస్తూ, "ఏమిత్రా అలాపలవరిస్తున్నావ్?" అని అడిగాడు గాబరాగా. ప్రకాశం రామకృష్ణముఖంవేపు చూశాడు. అలాగే రెండుక్షణాలు పిచ్చివానిలా చూశాడు. రామకృష్ణలో జాలి, సానుభూతి జనించాయి.

"ఏమిత్రా ఇలాఅయ్యావ్?"

ప్రకాశం కాస్త తేరుకొని, "ఏంలేదు కృష్ణా, ఏంలేదు అంతా ఒకపీడకల, అంతే" అన్నాడు భారంగా ఒక శ్వాస వదలి.

"అసలేంజరిగింది?"

"ఏదిజరగకూడదో అదే జరిగింది. నీ వన్నట్టే జరిగింది. అంతకుమించి మరేంజరగలేదు. ప్చ..."

"ఏమిత్రా ఈ డొంకతిరుగుడు, అసలు విషయం చెప్పక"

ప్రకాశం క్షణమాగి, జరిగిన విషయమంతా ఒక్క అక్షరం పొల్లుబోకుండా చెప్పాడు. అంతావిన్న రామకృష్ణ నిట్టూర్చి, "నేననుకున్నంతా అయిందన్నమాట. నేనుముందే చెప్పాను. యిలాంటి వైపరీత్యం తప్పక ఏర్పడుతుందని,

ఐనా ప్రకాశం! నీలో నిజంగా ఏమాత్రం తప్పులేదు. నీ నీ ఆత్మవిశ్వాసం నిర్మలప్రవృత్తి నీదయినపుడు ఇందులో భయపడాల్సిన అవసరంలేదు''

ఈ మాటవినగానే ప్రకాశానికితనతండ్రి "రాజారావు అసాధ్యుడు, ఏమయినా చేయగలడు అనిమాత్రం గుర్తుంచుకో'' అన్నమాటలు చెవుల్లో గింగురుపెట్టాయి

"ఇందులో భయపడాల్సిన అవసరమేముంది. కాని మా నాన్న రాజారావు గురించి అన్నమాటలు జ్ఞప్తి కొస్తూంటే ఏమో అన్న సందేహంకూడా కలుగకపోలేదు'' అన్నాడు రామకృష్ణ నుద్దేశించి.

"మీ నాన్నగారేమన్నాడతని గురించి?'' ప్రకాశం చెప్పాడు.

"ఓరి పిచ్చిప్రకాశం! అతను నిన్నేంచేయగలడురా. ఎవరితోనైనా కొట్టిస్తాడనా నీ అనుమానం? నేనుండగా నీ కేలాంటిహానీ జరుగదు'' అన్నాడు రామకృష్ణ.

రెండుక్షణాల తర్వాత ప్రకాశం, "అవును. అతను నన్నేంచేయగలడు? నా పిచ్చిగాని'' అస్పష్టంగా గొణుక్కున్నాడు.

ప్రకాశం అలాబయటకు వెళ్ళగానే రాధకిక తన తండ్రిముందు నిల్చొని మాటాడాలనిపించ లేదు. తన గదిలోకి వెళ్ళి మంచంపై పడుకొని అంతవరకూ మనసులోవున్న బాధనంతా ఏడుపురూపంలో వెళ్ళగక్కి గుండెచెరువయ్యేలా ఏడ్చింది.

రాజారావూ, అతని భార్యా బయట నిల్చొని ఆమె ఆక్రందనను ఆలకిస్తున్నారేగాని వెళ్ళి ఎలాసముదాయించాలో తెలియక నిశ్చేష్టులై వుండిపోయారు. రాజారావు మనసులో యింకా ఆ అగ్గి ఆరలేదు. అది రగుల్కొంటూనేవుంది. ఏవేవో దీర్ఘ ఆలోచనలతో అతని బుర్ర వేడెక్కిపోతోంది. దీనికి ప్రతీకారం ఏమిటి? ప్రకాశంగాడికి శిక్షయేమిటి? ఇలా అతని ఆలోచనలు దొర్లుతున్నాయి.

అరగంటదాకా రాధ అలాగే చిన్నగా ఏడుస్తూనే వుండిపోయింది. ఆమె మనసులో సవాలక్ష ఆలోచనలు దొర్లుతున్నాయి. యేవేవో తీర్మానాలు, ఏవేవో పరిష్కారాలు, యేవేవో సమస్యలు. అంతాగజిబిజి. తికమక. వాటికొక నిర్దుష్టస్వరూపం అంటూలేదు. అందుకే ఆ బాధ, తపన, ఆక్రోశం, ఆవేదన, నిట్టూర్పులు, నిస్పృహాలు. యేడ్పులు, పెడబొబ్బలు.

ఎనిమిదిమాసాల తమ మైత్రికి చిహ్నం ఇదేనా? ఎన్ని ఆశలతో, ఊహాలతో, మధురభావాలతో తను ప్రకాశాన్ని హృదయంనిండా చిత్రించుకొంది. ఆ చిత్రణకేనాడూ రంగులులేవు, భావాలులేవు, ఆకారంలేదు. ఎంతవైపరీత్యం? తనేనాడైనా యిలా జరుగుతుందని పొరపాటునైనా వూహించిందా! ప్రకాశం తనతో ఎంత చనువుగా వ్యవహరించాడు? ఎన్నితీయని మాటలన్నాడు! నీలాంటి వారు లభించటం నా అదృష్టం రాధా" అని నోరారా అన్నాడే! "నీ విజ్ఞానం, ఆశయాలూ, ఆదర్శాలూ అమూల్యం రాధా" అని ఎన్ని సార్లు అన్నాడు. అంతా తన నీనాడు గొంతుకోయడానికే

నన్న మాట. ఎంత ద్రోహం! ఎంతనయవంచన! ఎంత కృత ఘ్నత! ఎంత నైచ్యం! ఎంతహైన్యం! అబ్బ! తలచుకుంటేనే హృదయం స్పందిస్తుంది. గుండెలు బరువెక్కుతాయి. నిజంగా ప్రకాశానికి తనపై యింత అయిష్టతా? తను కేవలం స్నేహితురాలేనా? తగుదునమ్మా అని రోజుకు నాలుగుసార్లు వచ్చి వెళ్ళటం ఈ పాడు స్నేహభావంతోనేనా? తడిబట్టతో గొంతుకోయటానికి యిన్నిమాటలా! యిన్ని అబద్ధాలా! ఎవరో అతని మనసును విరిచివేశారు. అతనిహృదయంలో విషబిందువులు దొర్లించారు. అందుకే ఈ మార్పు. ఎంత మోసం! తను నిజంగా మోసపోయింది. ఎన్ని ఆదర్శభావాలతో ఉపన్యాసాలుదంచేశాడు. అంతా కేవలంమాటలేనన్న మాట! కేవలం నన్ను మోసపుచ్చటానికేనన్నమాట! ఇదేనా ఆదర్శం! ఇదేనా పురోభివృద్ధి! అంతాకపటం! అంతా నటన!

ఏమో! ప్రకాశానికి స్వంతంగా జనించిందేనా ఈ మార్పు. కేవలం ఆవేశంతో యిలా అన్నాడా? ఇదేదో తనే ముఖాముఖి తేల్చుకోవాలి. అంతవరకూ తన హృదిలోని ఈ ఆరాటం చల్లారదు. అతని గదికివెళ్ళి అతన్నే అడగాలి. 'ఎందుకు నన్నింత ద్రోహం చేశావ్? నేను నీకేం అన్యాయం చేశాను' అని అప్పుడు చాలాఅడగాలి అంతవరకూ... అంత వరకూ..."

*   *   *   *   *

సాయంత్రం ఆరుగంటలు కావస్తోంది. ప్రకాశం, అర్ధ నిమీలిత నేత్రాలతో వాలుకుర్చీలో పడుకొని గంభీరంగా నిర్లిప్తంగా నిశ్శబ్దంగా వుండిపోయాడు. రామకృష్ణ ప్రక్కనున్న కుర్చీలో కూచొని, అతని ముఖం వేపు అప్పుడప్పుడు చూస్తూ, ఏదో ఆలోచిస్తున్నాడు.

మెట్లపై ఏదో శబ్దమయింది. రామకృష్ణ తలసాచి. తలుపుగుండా అటువేపు చూశాడు. శబ్దం యింకా దగ్గర యింది. ఎవరో వస్తున్నారు. రామకృష్ణనిదానించి చూశాడు. ఎవరో స్త్రీ. ఆమెను వెంటనేగుర్తించాడు. రామకృష్ణ ప్రకాశంవేపు ఒక్కసారి చూశాడు. అతనింకా అలాగే వున్నాడు. అతనిదేం గమనించలేదు తనిక అక్కడ వుండటం సవ్యం గాదనుకొని, వెంటనే లేచి ఆమెను తప్పుకొని మెట్లుదిగబోయాడు. "వారున్నారా?" చాలా చిన్నగా అడిగిందిఆమె. రామకృష్ణ మౌనంగా తలూపిమెట్లు దిగిపోయాడు.

ఆమె మెల్లగా గదిలో ప్రవేశించింది. ప్రకాశం ఆమెను గమనించలేదు. రెండుక్షణాలు నిశ్శబ్దంగా అతని ముఖంవేపు చూసి, ప్రక్కగా దగ్గి, "ప్రకాశం" అని పిలిచింది. ప్రకాశం కళ్ళు తెరచి ఎదురుగావున్న ఆమెను ఆశ్చర్యంతో పరకాయించి, "నువ్వా, రాధా" అన్నాడు కాస్త తొణుకుతూ.

"అవును, నేనే! ఏంభయమేస్తోందా?"

"అబ్బే! నాకు-!"

రాధ చిన్నగా నవ్వింది, "అవును మీకే! మీ కళ్ళే చెబుతున్నాయ్"

"రాధా!"

"ఏంఉలుకుపాటూ"

"నన్నెందుకిలా చంపుతావ్"

"ఆ మాట ఆలోచించే అన్నారా! ఎవరు ఎవర్ని చంపుతున్నారో?"

"రాధా! నీ మాటలు నా కర్థంగావు"

"అవును, చచ్చినవాకి మాటలెలా అర్థమవుతాయి. మీ మాటలూ, మీ చర్యలే మీ కర్థంగావాలిగాని"

"ఏమిటి రాధా యిదంతా"

"ఎంత అమాయకునిలా ప్రశ్నిస్తారు ప్రకాశంగారూ! పాపం! నమ్మించి, ద్రోహంచేయటమే మీకు తెలుసుగాని ఏదిఏమిటో ఎలా తెలుస్తుంది"

"రాధా!" ప్రకాశం కోపంతో లేచినిలబడ్డాడు

"ఏం! నా మాటలు చేదుగావున్నాయా? అవును, సత్యం ఎప్పుడూ చేదుగానే వుంటుంది"

"ఏమిటీసత్యం?" ఉక్రోషంతో అతని కంఠం కాస్త రుద్ధమయింది.

"తెలిసీ యిలా అడగటమే సత్యం. నా మాటలు మింగుడుపడకపోవటమే యింకా గొప్పసత్యం! నేనిలా రావటమే అసలుసత్యం"

...ప్రకాశం మౌనంగా గంభీరంగావుండిపోయాడు.

"ఏంమాటాడరు? నటనలో చివరి అంకానికి యింకా ఉపహతి ఎవరూ పలుకలేదనేగదూ మీ ఆరాటం" రాధ కంఠంలో స్పష్టంగా ఆక్రోశం ధ్వనిస్తోంది.

"రాధా! నీవూ నన్నిలా అపార్థం చేసుకుంటావనుకో లేదు"

"మీరు చేసిన అన్యాయానికి నిజమైన అర్థం నేనీ నాడు నిజంగా గ్రహించాను"

"ఏమిటి నేను నీకు చేసిన అన్యాయం?"

"ఆ ప్రశ్న మీకు తేలికేగావచ్చు ప్రకాశం! కాని అదేప్రశ్న నా గుండెల్ని పిండిచేస్తుందని మీకు తెలియదు. తెలుసుంటే మీరిలా ఈనాడు ప్రవర్తించేవారుగాదు"

"... ..."

"ప్రకాశం!" ఆమెస్వరంలో దైన్యంతొణికిసలాడింది.

"... ..."

"నేను మీకేం ద్రోహం చేశాను ప్రకాశం! నన్నిలా ఎటూగాకుండా పారవేయటం మీకున్యాయమేనా! మిమ్మల్ని నే నేనాడు చూశానో ఆనాడే పూర్తిగా నన్ను ఆక్రమించు కొన్నారు. హృదయమంతా మీకే సమర్పించాను. మీ ఆదర్శాలను, మీ ఉన్నతభావాలను నమ్ముకొని ఎన్నోఆశలు కల్పించుకొన్నాను. చివరకు మీ రిలా..." ఆమె కంఠం బొంగురుపోయింది. స్వరంలో విచారం ఉట్టిపడుతోంది. కళ్ళలో నీళ్ళు నిలచాయి.

"రాధా!" ఆ మాటలో ఏదో జాలి, సానుభూతి...

"నన్ను పరీక్షించదలచుకొన్నారా ప్రకాశ్! అదైనా చెప్పండి నిప్పుల్లో దూకమన్నా దూకుతాను"

'అయ్యో రాధా! ఎంత పొరపడ్డావ్!"

"అవును నేను పొరపడ్డాను, పూర్తిగా పొరపడ్డాను. కాని పొరపాటుబడటం మిమ్మల్నిచూశే. మీరే యింతకూ కారణం..."

"నేనా!"

"అవును మీరే! మీ గుండానే నేనిలా తయారయ్యాను. మిమ్మల్నే నమ్ముకొన్న నాకు చివరకు మీరు ఏదో మనసులో వుంచుకొని యిలా నా గొంతుకోస్తున్నారు"

"ఎంతమాటన్నావ్ రాధా! నా హృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు ప్రయ్యలౌతున్నాయో నీకెలా చెప్పను నేనేనాడూ నిన్ను ఆ దృష్టితో చూడలేదు. పొరపాటున కూడా నిన్నావిధంగా ప్రేమించలేదు. ఇక ప్రేమించలేను కూడా. నిన్ను కేవలం ఒక ఉత్తమ మిత్రురాలిగా, స్నేహ ప్రియగా మాత్రమే ఆరాధించాను. ఇకముందు కూడా నీ లాంటి మిత్రులు లభించాలని ఎప్పుడూ కోరుకుంటాను"

"ఎందుకూ? నాలాగే అందరికొంపలూ కూల్చటానికా?"

"రాధా!" కోపంలో పిచ్చివానిలా గర్జించాడు ప్రకాశం.

"ఎందుకిలా గొంతుచించుకు అరుస్తావ్! ఇక మీ నిర్ణయం ఇదేనా"

"రాధా! ఇక నా మనసు బాధపెట్టి ప్రయోజనం లేదు. నా మనసు మారదు"

"అవును మీ మనసు మారదు. అసలు మీది మనసు గాదు, కఠినశిల, పాషాణం, మీరు గోముఖవ్యాఘ్రం, పయో

ముఖ విషకుంభం, తేనెపూసిన క   రాధ ఆవేశంలో యింకా ఏదో అనబోయింది.

"రాధా!" ఆమె చెంప చెళ్ళుమంది.

"హుఁ ప్రకాశం! ఇంతేగదూ మీరు చేయగలిగేది! ఇంతే మీరిచ్చే ప్రతిఫలం. ప్రకాశ్! వలచివచ్చాను, కాల దన్నావ్. ఇంతవరకూ నా లోని స్నిగ్ధత్వాన్నే చూశారు. అసలు స్వరూపం త్వరలోనే రుచిచూస్తావ్"

"రాధా! అనవసరప్రసంగం మాని బయటకుపదు. ఇంతవరకూ నీ మీద నాకు గౌరవభావమే వుండేది. కాని నీ స్వార్థం నీ కళ్ళుగప్పింది. నీ మనసు నిన్ను మభ్యపర చింది. నీ మానవత్వంలో పశుత్వం వేళ్లుబాతుకొంది, ఇక చాలు. స్వార్థంతో నిండుకున్న నీ ముఖాన్ని యిక నాకు చూపకు. నీ శక్తి ఏదో, నీ స్వరూపమేదో, నీ కక్షఏదో వీలుంటే సాధించుకో. వెళ్ళు రాధా యికవెళ్ళు వెళ్ళిపో" గదిఅదిరేలా గర్జించాడు కోపంతో.

"వెళతా, ప్రకాశం! వెళతాను! ఇప్పుడే వెళతాను. కాని నీలాంటి కృతఘ్నులను భగవంతుడుకూడా క్షమించ లేడు. ఆడది సాధించనిదంటూ ఈ భువిలో లేదనిమాత్రం గుర్తుంచుకో! తర్వాత నీవే పశ్చాత్తాపపడ్తావ్‌వస్తా, 'శలవ్'" అంటూ కోపంతో గబగబా వెళ్ళిపోయింది. ప్రకాశం ఆమె వెళ్ళిన శూన్యద్వారంవేపు చూస్తూ నిస్సబ్ధుడై, నిర్వీణ్ణుడై, నిశ్చేష్టుడై, ప్రమాన్పడిపోయాడు.

# 16

పై సంఘటన జరిగిన సరిగ్గా వారంరోజుల తర్వాత ఆనాటి ఉదయం కాలేజీలో ఒక నోటీసుబోర్డు ప్రత్యేకంగా అతికించబడింది. రామకృష్ణ దానిని చదువగానే హతాశుడై పోయాడు. తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు. 'ఏమిటీ వైపరీత్యం!' అనుకొని నాలుగయిదుసార్లు చదివాడు. అతనికి కళ్ళనీళ్ళపర్యంతమయింది. ఎవరూ చుట్టూ లేనిదిచూసి దానిని ఊడబెరికి, జేబులో మడచిపెట్టుకొని గబగబా గదికివచ్చాడు.

అప్పటికి రెండురోజులక్రితమే ప్రిపరేషన్ హాలీడేస్ విడిచారు. అందుకై ప్రకాశం శ్రద్ధగా చదువులో మునిగి పోయాడు.

రామకృష్ణ గదిలోకి వచ్చేసరికి ప్రకాశం ఏదో మహానంగా పఠిస్తూండిపోయాడు. రామకృష్ణనుచూసి, "ఎక్కడికెళ్ళావట్రా?" అనడిగాడు.

రామకృష్ణ కళ్ళనిండా నీరు నింపుకొని బాధగా, "ప్రకాశం!" అన్నాడు. అని ఆడపిల్లలా బావురుమని ఏడ్చాడు. ప్రకాశం నిర్ఘాంతపోయాడు.

"ఏమిట్రా! ఏంజరిగింది? అలా ఏడుస్తున్నావ్"

రామకృష్ణ ఏదోచెప్పాలని నోటువిప్పాడుగాని, ఎలా చెప్పాలో, ఏమనిచెప్పాలో, చెబితే ప్రకాశంస్థితి ఏమవు తుందోనన్న సందిగ్ధంలో పడిపోయాడు. ఈ అయోమయపు సంకటావస్థకు ప్రకాశం తల్లడిల్లిపోయాడు. ఏదోచెప్పరాని

భరింపరాని విషయం రామకృష్ణపట్ల జరిగివుంటుందన్న భావం అతనిలో పొడసూపింది.

"చెప్ప రామకృష్ణా! నీ స్థితిచూస్తే నాకు చాలా భయంగా వుంది"

రామకృష్ణ అతనిముఖంవేపుదీనంగాచూస్తూ చొక్కా జేబులోంచి ఆ కాగితంతీసి ప్రకాశంచేతికిచ్చాడు. ఇంకేమీ చెప్పలేకపోయాడు. అతని ముఖంలో ఏవిధమయిన కళగాని, ఉత్సాహంగాని లేక యింకిపోయిన కాసారంలావుంది.

ప్రకాశం ఆ కాగితం చేతికి తీసుకొని మడతలువిప్పి ఒక్క-గుక్క-లో చదువుకున్నాడు. అంతే! రామకృష్ణ అతని ముఖంచూడలేక తలప్రక్కకు తిప్పుకున్నాడు. అప్పటి ప్రకాశాన్ని ఒక శిలావిగ్రహం అంటే సరిపోతుంది.

ప్రకాశం నమ్మలేనట్లుగా మళ్ళీ మళ్ళీ చదివాడు. అది ఆంగ్లంలోవుంది. క్లుప్తంగా తెలుగులో దాని సారాంశమిది:

"క్లాస్ అటెండెన్స్, ఫిజికల్అటెండన్స్ తగ్గిన కారణంగా ఇంటర్ విద్యార్థి "ప్రకాశం" 'డీబైన్' చేయబడ్డాడు. పరీక్షా ప్రవేశమునకతడనర్హుడు" క్రింద కళాశాల ప్రిన్సిపల్ సంతకం వుంది.

క్షణంలో ప్రకాశం ముఖంలో వ్రాయలేనన్ని మార్పులు సంభవించాయి. రామకృష్ణ బాధా సంకులిత హృదయంతో బరువుగా వుండిపోయాడు.

"ఇదెలా జరిగింది ప్రకాశం?" అతనికంఠం గాద్గదికమయింది.

"దీనికి కారణం రాధ"

"రాధా!" నమ్మలేనట్లు గొణిగాడు రామకృష్ణ.

"అవును, రాజారావు తనపలుకుబడి నుపయోగించి నన్నీస్థితికి తెచ్చాడు"

"ప్రిన్సిపాల్ గారితో, ఎంక్వయిరీ చేయమని చెప్తే"

"లాభంలేదు"

"ఏం"

"ప్రిన్సిపాలుగారూ, రాజారావు చాలాసన్నిహితులు"

"అయితే ఇదంతా ఆ దుర్మార్గుని కుట్రన్నమాట! వాణ్ణి .."

"ఆవేశపడి లాభంలేదుకృష్ణా! అంతాముగిసిపోయింది. రాజారావు ఏమీ చేయలేడనుకున్నాను. కాని అంతా చేశాడు" నిస్పృహగా అన్నాడు ప్రకాశం. సంవత్సరమంతా డబ్బువెచ్చించి కష్టపడినచదువంతా కన్నీటిబొట్లు రూపంతో క్రిందకు దుమికింది.

"యూనివర్శిటీ కప్లయిచేస్తే"

"అన్నీ అప్పుడే ముగిసివుంటాయి కృష్ణా! నా హాల్ టికెట్ కూడా కాన్సిల్ చేయబడుంటుంది. ఇక ఆ ఆశలేదు. ఎంతప్రయత్నించినా, మన పరీక్షలకు నాల్గురోజులే గడువుంది. అంతలో ఏమీ చేయలేను" భారంగా కళ్లునూసుకొని బరువుగా వెనక్కువాలిపోయాడు ప్రకాశం. అతని కళ్ళముందు వికటాట్టహాసంగావిస్తూ రాధరూపం ప్రత్యక్షమైంది. ప్రకాశం కించిత్ కూడా ఆవేశపడలేదు. "పిచ్చిరాధా! ఏదో సాధించానని యిప్పట్లో తృప్తిపడ్డావుగాని, ముందు ముందు అదే నిన్ను దహించి నీ జీవితాన్నే కాల్చిపారవేస్తుందనేసత్యాన్ని

విస్మరిస్తున్నావ్. ఈ పనికి నిన్ను నేను క్షమించగలనుగాని, భగవంతుడుమాత్రం నిన్ను క్షమించలేడు రాధా! క్షమించ లేడు"

రామకృష్ణకి మాటలు అస్పష్టంగా వినిపించాయి.

"ప్రకాశం"

"ఊఁ"

"నాకేదో చాలా భయంగావుంది"

"భయపడటం అనేది అప్పుడే దాటిపోయింది కృష్ణా! చింతించవలసిన సమయం మాత్రం చివరకు మిగిలింది."

"మరిపుడేం చేస్తావురా" అతని కంఠం బొంగురు పోయింది.

"అదే ఆలోచిస్తున్నాను"

"ఇంకా ఆలోచనెందుకు! ఆ రాజారావుగాణ్ని డొక్కచీల్చి బుద్ధిచెపుదాం"

"దానివల్ల లాభం?"

"అదేం ప్రశ్నరా, అలాంటివాణ్ని ఏంచేసినా..."

"తప్పుగా ఆలోచిస్తున్నావ్ కృష్ణా! ఆ పనికాస్తా మనమూచేస్తే అతనికీ మనకూ ఆట్టేతేడావుండదు. అందువల్ల మనకు లాభమూవుండదు, కేవలం చెడ్డపేరుతప్ప!"

"ఇలాంటి ధర్మపన్నాలతోనే నీ పీకలమీదికి తెచ్చు కున్నావ్! నాకే యిలా జరుగుంటేనా ఈ పాటికి వానికోసం స్వర్గ ... కాదు కాదు నరకద్వారాలు తెరచుకొనిస్వాగతం పలికేవి"

“కృష్ణా. ఇక ఆ ఆలోచనమానుకో! ఎవరిఖర్మకెవరు కర్తలు!”

“మరిప్పుడు కర్తవ్యం? మీ నాన్నగారికీ విషయం తెలిస్తే!”

“అదే నా బాధ! నా గురించి నాకేనాడూ ఏచింతా లేదు. ఈ విషయం తెలిస్తే అసలే సంక్షోభంలోవున్న మా నాన్నగారి స్థితి ఎలాగవుతుందోనని...”

ప్రకాశం తండ్రిని తలచుకొని వేడి అశ్రుబిందువులు తర్పణచేశాడు. రామకృష్ణకు అతన్ని చూస్తూంటే గుండె తరుక్కుపోతోంది. అతను ప్రకాశాన్ని ప్రాణాధికంగా ప్రేమించాడు. ఇలాంటి సాధు మిత్రునకు జరిగిన ఈ అన్యాయాన్ని తలచుకొనే కొద్దీ అతనిలో ఒకవేపు ఆవేదన, యింకొకవేపు ఆక్రోశమూ, ఉద్రేకమూ పొంగిపొరలుతున్నాయి. ప్రకాశమే తనకు అనుజ్ఞ యిస్తేచాలు ఈ క్షణంలో వెళ్ళి ఆ రాజారావుకు దేహశుద్ధి చేసిరావటానికిసిద్ధంగావున్నాడు. ఇలాంటి సమయంలోకూడా, ప్రకాశం నోటిగుండా ఉదాత్తమైన మాటలు వెలువడటం విని అతడు ఆశ్చర్యపోయాడు.

“మా నాన్నగారికి నేనంటే చాలా ప్రేమ! నాకోసం తన సర్వమూనైనా త్యాగంచేయగల ప్రేమ ఆయనకు నా పట్ల వుంది. నన్ను డాక్టరీ చదివించాలని ముందునుండీ ఎంతో ఆశ వుంచుకొన్నాడు. అలాంటి పవిత్రమూర్తి మానాన్నకు తీరని మాయని మరువనిద్రోహంచేశాను. నాఈ ద్రోహానికి నిష్కృతిలేదు, ప్రాయశ్చిత్తం అసలే లేదు. మా నాన్న ఆశలకు గొడ్డలిపెట్టుపెట్టాను. ఆయన మనసుకు వజ్రా

ఘాతం కలిగించాను. పనికిమాలిన వ్యవహారాలలోపడి నిర్మలుడైన మా నాన్నగారి కోరికలను త్రుంచివేశాను. మా నాన్నేగాదు, లోకమేగాదు, నన్ను భగవాన్‌కూడా క్షమించలేడు. క్షమించడు. అబ్బ! నాన్నా! ఈ ద్రోహి ముఖం నీకు చూపలేను. మీ ఉదాత్తమైన ఆత్మముందు ఈ చీడపురుగుకు స్థానంలేదు. నన్ను క్షమించకు నాన్నా, క్షమించకు" పసిపిల్లవానిలా బావురుమన్నాడు ప్రకాశం!

రామకృష్ణకు కూడా కన్నీరు ఆగలేదు. ప్రకాశాన్ని చూస్తుంటే యేవిధంగా మారుతాడో, యే అఘాయిత్యం తలపెడుతాడోనని అతనికి గుండెల్లో గుబులుగా వుంది.

ప్రకాశం చెక్కిళ్ళమీదఎండి, ఆరిన కన్నీటిధారకరగి ప్రవహించిన లోహద్రవంలా వుంది,

"ప్రకాశం..."

"......"

"ఊరికెళ్దాం పదరా! ఇక ఈ స్థితిలో నీ విక్కడుంటే యేమవుతావో యేమో! నాకు అదురుగా వుంది. నేనూ వస్తానుపద! మీ నాన్నగారికి అసలు విషయమంతా నేను చెప్తాను. ఆయన తప్పక క్షమిస్తారు"

"మా నాన్నగారు క్షమించరనిగాదు కృష్ణా నాబాధ! ఆయన తప్పక క్షమిస్తాడు. కాని ఆ క్షమను, మంచితనాన్ని నా దుర్బలఆత్మ భరించలేదు. యే ముఖంపెట్టుకొని మా నాన్న ముందు నేను నిల్చోగలను. యేమని ఆయనతో ఈ సంగతి చెప్పగలను!"

"అలా అంటే ఎలారా! జరిగిందేదో జరిగిపోయింది. యేనాడైనా నేనీ ప్రతీకారం తీర్చుకోకపోను"

"మరొకసారి నీవీ మాటంటే నీ ముందే ఉరిపోసుకు చచ్చిపోతాను"

"అయ్యో అవేం మాటలురా సరే! నేను నీకు ప్రతిగా యేమీ చేయను మరిపుడు నీ కర్తవ్యం!"

"మా నాన్నగారికి నాపి ముఖం ఈ జీవితంలో చూపించలేను. ఎక్కడికైనా వెళతాను"

"ఇంత అసమర్థునిగా అల్పునిగా ఆలోచిస్తున్నావురా ప్రకాశం! నీ నోటిగుండా రావాల్సిన మాటలేనా ఇవి? ఎక్కడికో వెళ్ళి నీవు సాధించేదేమిటి? మీ నాన్నకు యింతకు మించి ద్రోహంచేయటానికి నీ కింకేవీ అవకాశాలు కన్పించ లేదూ? అసలే క్షోభిస్తున్న ఆయన గుండెలలో నిప్పులు పోస్తావట్రా! ఈ పని నీవుచేస్తే నేనుకూడా నిన్ను క్షమించలేను"

"కృష్ణా!"

"నిజం అంతే ప్రకాశం"

అదేసమయంలో "పోస్టుసార్" అని తలుపు దగ్గర కేక వినిపించింది. రామకృష్ణ వెళ్ళి ఒక కవరు తెచ్చాడు.

"నీకేరా ప్రకాశం"

"అలా పారవేయ్, మళ్ళీ చూడొచ్చు"

"మీ ఊరి స్టాంప్ వుంది. బహుశా సావిత్రి రాసుంటుందేమో! చూడు"

"సావిత్రి! అవును, సావిత్రి! యేదీ యిలా తే"

కవరు చేతికితీసుకొని చించి, అందులోంచి ఒకకాగితం తీసి మడతలువిప్పి చదువుకోసాగాడు ప్రకాశం.

"బావా! చాలా రోజులయిందిగదూ ఉత్తరం వ్రాయక! క్షమించగలరు. ఈ ఉత్తరం పూర్తిగా చదువగానే మీరు బాధపడతారని నాకు తెలుసు. ఐనా వ్రాయక తప్పదు. ముందే క్షమాభిక్ష కోరుతున్నాను.

మొన్న సాయంత్రం చెరువు కాలువ విషయంలో నీటి పంపిణీలో మీకూ మాకు పెద్దపోట్లాటజరిగింది. మాటా మాటా పెరిగి కట్టెలు తీసుకొనే స్థితికి వచ్చారు. మీ నాన్న గారు కోపంతోముందుకువచ్చారు. బావా! ఎలావ్రాయాలో నా కర్థంగా లేదు. ఆవేశంలో మా నాన్నగారు (బావా మమ్మల్ని క్షమిస్తారుగదూ!) మామగారితలపై, బలంగా కట్టెతో కొట్టారు. మామగారికి నెత్తిపై బలంగా గాయం తగిలింది. ఆయనగారు అస్వస్థతగా వున్నారు. ఈ సమయంలో పరిస్థితులుకూడా చాలాఅల్లకల్లోలంగా వున్నాయి. ఈ ఉత్తరంచూడగానే మీ నాన్నగారికోసమైనా మీరు వెంటనే రావాలని, అల్లకల్లోలంగా, ఉద్రిక్తంగావున్న ఈ పరిస్థితులను అదుపులో పెట్టాలని, మీరాకకొరకు వేచియుంటాను. మమ్మల్ని క్షమిస్తారుగదూ బావా!

మీ 'సాఫీ'

"నాన్నా!" గాభరాగా భయాందోళనలతో బిగ్గరగా కేకపెట్టాడు. ఆ స్వరంలో ధ్వనించిన అదిరిపాటుకు రామకృష్ణ భీతిచెందాడు.

"ఏంజరిగింది?"

ప్రకాశం కళ్ళు చెమర్చాయి. రామకృష్ణ ఉత్తరం చదివి, "ప్రకాశం ఆలస్యంచేస్తే యిలాంటి పరిస్థితులలో మంచిదిగాదు. వెంటనే బయల్దేరు! పరిస్థితులెలా పరిణ మిస్తాయో" అన్నాడు.

"అయ్యో! నాన్నా! ఎంతపని జరిగింది"

"నా మాటవిని వెంటనే బయలుదేరు ప్రకాశం. మిగతా ఆలోచనలు నిదానంగా యోచించవచ్చు! నన్ను రమ్మంటావా!"

"ఎందుకులే కృష్ణా! నీకు పరీక్షలున్నాయిగా అయిం దేదో అయింది. నేనే వెళతాను"

"ఇక ఈ పాతవిషయాలుకూడామరిచిపో. వచ్చే సంవ త్సరం మళ్ళీ కాలేజీలో చదవచ్చుగాని, నీ పెట్టె బేడా నేనే మీ గ్రామం పంపిస్తాను. ముందు నీవెళ్ళు"

"సరే" ప్రకాశం బయలుదేరాడు.

"ప్రకాశం అలా వెళ్ళగానే రామకృష్ణ యేదో ఆలో చించి కలం, కాగితం చేతికి తీసుకున్నాడు.

* * *

"స్త్రీ బుద్ధి నవ్యనవనీతం" అన్నారు పెద్దలు. కాని ఆ అన్నవారే "ప్రళయాంతకః" అని కూడా అనకపోలేదు.

రాధబుద్ధి ప్రకాశంపట్ల ఈవిధమయిన వైపరీత్యాన్నే ఏర్పరచింది. ప్రకాశాన్ని అమాయకుడనీ అజ్ఞానుడనీ ఎవరూ అనలేరు. చరిత్రకు పడగలెత్తిన పురుషులే జీర్ణంచేసుకోలేని స్త్రీ హృదయాన్ని ప్రకాశం అర్థంచేసుకోలేక పోయాడంటే

అదిఅతనితప్పుగాదు. ఇందులో విజ్ఞానానికీ, ప్రతిభకూ, వ్యక్తిత్వానికీ సంబంధంలేదు.

'జీవితం పూలబాటగాదు' 'అనురాగం అమృతం గాదు' మనసు మంచినిమాత్రమే యోచించదు. కాలం ఒకే స్థాయినే నడువదు. విభిన్నదృక్పథాలలో భిన్నమార్గాలతో సాగిపోతుందది. వాటికి తలవంచక జీవితం అంతుదేల్చగల వాడే మానవుడు. అదే మానవత్వపు పరిపూర్ణత.

ఆ రోజు సాయంత్రం రామాపురం పెద్దవీధిగుండా విషణ్నవదనంతోవున్నా గంభీరతమొక్కవోని, ఒక యువకుడు పెద్దపెద్ద అంగలువేస్తూవచ్చి, రామయ్యగారి యింటి ముందుఒక్కక్షణమాగి ఆగృహంలో ప్రవేశించాడు.

ప్రకాశం రాక ఈ సమయంలో ఆ యింటిల్లిపాదినీ ఆనందంతోపాటు, ఆశ్చర్యంలో కూడా ముంచెత్తింది. ఈ బాధా సమయంలో కుమారుని రాక వెంకట్రామయ్యగారికీ ఆనందం కలిగించినా పరీక్షలు దగ్గరుంచుకొని యిలా రావటం అంత సవ్యంగా కనిపించలేదు.

"బాగున్నావా బాబూ!" రామయ్య హీనస్వరంలో ప్రశ్నించారు.

"మీకు దెబ్బలు తగిలాయటకద నాన్నా" కళ్ళ నిండా నీరు నింపుకొని బాధగా అడిగాడు, తండ్రి చెంతనే కూచుంటూ.

"ఏదో జరిగిపోయింది. ఇప్పుడు ఫరవాలేదు. ఇంతకూ నీ కెలా తెలిసింది?"

ఈ ప్రశ్నకు జవాబివ్వలేదు ప్రకాశం. మాటతప్పిస్తూ "గాయానికి మందు వేయించారా నాన్నా" అన్నాడు.

"ఆఁ వేశారుగాని, మీకు పరీక్షలు దగ్గరపడు తున్నాయిగదూ"

"అవును నాన్నా" మాటను దిగమింగుతూ భారంగా అన్నాడు.

"మరిలా ఎందుకొచ్చావ్ బాబూ!"

"మీకు దెబ్బతగిలిందని తెలిసి వచ్చా నాన్నా"

"నాకేంగాని, తగిలింది బాగుగాక మానదు. కాని నీ పరీక్షలు..."

"వాటికేమిలేనాన్నా"

"ఇంకా ఎన్నిరోజులుంది"

"వారంరోజులు" ప్రకాశం హృదిలో చెలరేగే బాధను ఎంత నివారించుకోవాలన్నా బయటపడుతోంది. కళ్ళలో నీళ్లు సుడిగుండాల్లా తిరుగుతున్నాయి.

"ఎందుకేడుస్తావట్రా! 'నాకుతగిలిన దెబ్బకేనా! ఇంత వరకూ కలిగిన మానసికవ్యథలకంటే యిదేమంత గొప్పది గాదు" నీకు సమయం మించిపోతే చదువుకుదెబ్బ! రేపే వెళ్లు నాయనా!"

"వెళతానునాన్నా!"

"నాకేం ఫరవాలేదు. నీవేం గాబరాపడకు"

ప్రకాశం తన తండ్రితో అసలు స్థితి చెబుదామా వద్దా అని తటపటాయించాడు. కాని ఎలా చెప్పాలో అర్థం గాలేదు. చెబితే ఈ స్థితిలో నాన్న మనసు ఎంత బాధనను

భవిస్తుందో తనకు బాగా అర్థం. ఈ విషయంవిని చలించ గలడు. అబ్బ! ఎన్ని సమస్యలు! తనిపుడేం చేయాలి? తన్నె వరు ఈ స్థితినుండి బయటవేయగలరు! నాన్న ముందు యిలా అబద్ధాలతోనే తనిక జీవించాలా! తన్ను నమ్ముకొన్న ఆయన్ను అబద్ధాలతో, మోసాలతో, మభ్యపుచ్చి ద్రోహం చేయటమా! అయ్యో! భగవాన్! ఏమిటీ పరీక్ష! నేనేం చేయాలి ఇప్పుడు? నాన్నగారితో ఎలా చెప్పాలి! నేను రేపు మళ్ళీ పట్టణం వెళ్ళి ఏం చేయాలి? మళ్ళీ మోసం చేయాలా! అబ్బ! హృదయం నిండా సూదులు గ్రుచ్చినట్లుంది. - ఉన్న పళంగా భూమి విచ్చుకుపోయి తనందులో పాతుకుపోయినా తనకీ బాధక్కుండదు.

* * * * *

మరురోజు ఉదయం పదిగంటలకు వెంకట్రామయ్య గారి కేదో పోస్టు వచ్చింది. ప్రకాశం అప్పటికే పట్టణం వెళ్ళేందుకు సిద్ధంగా వున్నాడు. అబద్ధాలు చెబుతూ తండ్రి ముందు ఉండటం అతని మనసుకే మాత్రం న్యాయంగా కనిపించలేదు. ఇప్పటి పరిస్థితులలో పట్నం వెళ్ళటమే ఉత్తమం! ఆ తర్వాతే ఏదయినా దారి వెదుకవచ్చు.

"ప్రకాశం" వెంకట్రామయ్యగారు ఎంత అను నయంగా పిలవాలని ప్రయత్నించినా కంఠంలో అదోక విధంగా బాధ స్ఫురించింది.

"ఏం నాన్నా"

"నీవు పట్నం వెళ్ళవలసిన అవసరంలేదు"

ప్రకాశం నిర్ఘాంతపోయాడు.

"నీ మిత్రుడు రామకృష్ణ నాకు అన్ని విషయాలూ వ్రాశాడు"

"నాన్నా" అని భోరున ఏడ్చాడు ప్రకాశం.

"ఇందులో నీ తప్పేంలేదు. నా కంతా తెలుసు. నీవు చేసినపనికి, నీ వ్యక్తిత్వానికి, నేనెంతో గర్విస్తున్నానుకూడా"

"నన్ను క్షమించగలరా నాన్నా!"

"ఎవర్ని క్షమించటానికీ నే నిపుడసర్హుణ్ని బాబూ! మనమీద మానపులూ, భగవంతుడేగాక కాలంకూడా కక్ష గట్టింది. నీ విలా దుఃఖిస్తే నా బాధను మరింత పెంచుతావ్! రాజారావు యింత అన్యాయం తలపెడతాడనుకోలేదునేను. సరే, వానిబుద్ధిఅంత! రేపుసంవత్సరం ఇక్కడొద్దు - గుంటూరువెళ్ళి చదవొచ్చుగాని ఇకఊరుకో.

వెంకట్రామయ్యగారు భారంగా, వేడిగానిట్టూర్చాడు.

# 17

"ప్రకాశం దురదృష్ట జాతకుడు. భవిష్యత్ గురించి పూర్తిగా చెప్పలేముగాని, ఇప్పట్లోమాత్రంపూర్తి దురదృష్టవంతుడు" ఈవిషయంతెలిసిన కొందరిలాఅని చప్పరించివేశారు.

"వయసా! వల్లకాదా! వాడేం చేస్తాడు? తండ్రిపంపిన డబ్బు జల్సాగా మెక్కుతూ ఈ స్థితికివచ్చాడు" ఇది ఆ గ్రామం పోస్టుమాస్టరుగారి ఉవాచ!

"కాలం కలసిరానపుడు ఏదయినాఇంతే! పాపం!" కొందరు శ్రేయోభిలాషులు ఈ స్థితికి సానుభూతి కనబరచారు.

"ఎవరికిఖర్మ కెవరు కర్తలు!" ఇవి మూడో వర్గంవారి మాటలు.

గ్రామంలో ఏ ఒక్కరికీ ప్రకాశం "డీలైన్" గావటానికిగల అసలుకారణం తెలియదు. ప్రతిఒక్కరూ కాలేజీ ఎగ్గొట్టటంవల్లనే డీలైన్ అయ్యాడనే అపోహలో పడ్డారు. నిజం ఒక్క వెంకట్రామయ్యగారికి మాత్రమే తెలుసు.

గ్రామంలో చాలామంది అతన్ని ఇన్నిమాటలన్నా ఏ ఒక్కరూ ప్రకాశంముందుగావచ్చి అన్నదిలేదు. కాని వారి మాటలు గ్రహించనంతటి మూర్ఖుడూ, అనుభవరహితుడూకాదు ప్రకాశం.

"ఇక ఇంతటితో చదువుఆపి, పెళ్ళిచేస్తే మంచిది" అని కొందరు హితులు రామయ్యకు సలహా ఇచ్చారు. రామయ్య ఎవరికీ ఏ జవాబూ యివ్వలేదు. అంతావిని మౌనంగా తలూపేవాడు చిన్నగానవ్వి!

కాని ఆ చిన్న నవ్వువెనుక అగాధమయిన బాధ వుండేది. ఒక్కప్రకాశానికి మాత్రమే తెలుసు. తండ్రిలోగల ఈ మనోవ్యధను చూడటంవల్లనే, ప్రకాశంకూడా అదే వ్యధకు గురిఅయ్యాడు!

ప్రకాశం మళ్ళీ మామూలు స్థితి అందుకోటానికి నాలుగయిదు రోజులు పట్టింది. ఈ నాలుగురోజులూ ఒక విధమయిన సుషుప్తిలో మునిగినట్టుగా వుండిపోయాడు!

ఓ మూడ్రోజుల తర్వాత, మళ్ళీ మొదటిసారిగా తోటవేపు వెళ్ళాడు సావిత్రి జ్ఞప్తికివచ్చి! సావిత్రికి తన 'ఘనకార్యం' తెలిసే వుంటుందని ప్రకాశం వూహించాడు.

ప్రకాశానికి గతం ఇప్పుడు భవిష్యత్తుకంటె బాధగా తయారయింది 'గతం గతః' అనే సత్యం అతనికి తెలియనిదిగాదు. కాని విస్మరించటం అంతసులభంగాదని ఈ అనుభవం ద్వారా తెలిసింది.

సావిత్రికోసం అతనిప్పుడు ఎదురుచూస్తున్నమాట నిజమేగాని, అందులో ఇప్పుడు ఉత్సాహంగాని, ఆకాంక్షగాని లేవు. ఆమె రానేవస్తే తప్పక తన్ను ఆ విషయం గురించి ప్రశ్నిస్తుంది. ఆ ప్రశ్నవింటేనే తనకదోలా వ్యథ ఏర్పడుతుంది. ఆమెకు తనేమని జవాబివ్వగలడు. అసలువిషయం చెబితే అమె తన్ను అపార్థం చేసుకోదుగదూ! ఇందులో ఎంతనిజం వుందని ఆలోచిస్తుందేమో! మొదటికేమోసం అన్నట్టు ఆమె రాధను గురించి తనపట్ల అనుమానిస్తే! అన్నీ భరించగలడు గాని తను ఈ అనుమానాన్ని, సావిత్రి అపార్థహృదయాన్ని భరించలేడు.

అనుకున్నట్టుగానే సావిత్రి రానేవచ్చింది. అంత దూరాన అతన్ని చూడగానే ఆమె వదనం ప్రఫుల్లమైంది.

"ఎన్నాళ్ళకు దర్శనమిచ్చారు బావా!" విస్ఫారిత నయనాలతో సావిత్రి ప్రశ్నించింది అతనిచెంతనేకూచుంటూ! ప్రకాశం ఏమీ జవాబివ్వలేదు. చిన్నగానవ్వాడు.

"మీరొచ్చి వారం రోజులయిందిగదూ!"

"అవును సావీ"

"మరెందుకీయాళ రాలేదు! ఈ వారం రోజులూ నే నిటు మీ నిరీక్షణలో కళ్ళకు కాయలు పుట్టించుకొన్నాను"

"నిజంగానా సావీ"

"అబద్ధమని ఎలాగనుకొన్నారు? అయినా మీరు మగ వారు. కాలుగడిపితే అన్నీ విస్మరిస్తారు" అంది బాధగా.

"ఏ తప్పు అన్నావ్ సావీ! అంత తేలికగా మరోసారి ఆ మాటన్నావంటే నా గుండె బ్రద్దలవుతుంది" అంటూ ఆమె రెండు భుజాలనూ పట్టుకొని, ఆమెను తన హృదయంపై వాల్చుకొన్నాడు.

"మరెందుకీయాళరాలేదు" అతని చొక్కా బొత్తాలను సరిచేస్తూ అడిగింది సావిత్రి.

"వచ్చినప్పటినుండి మనసులో మనసులేదు"

"ఘనకార్యం సాధించావుగా మరి!" అతనికళ్ళ వేపు చూసింది సూటిగా.

"సావీ!"

"ఏంబావా! ఉన్నమాటంటే అంతలికిపడతావ్! మామ గారు మీమీద ఎన్నో ఆశలుంచుకొని చదివిస్తే, చివరకు మీరు కాలేజీ ఎగ్గొట్టి..." అంటూండగా ఆమె కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

"సావీ నన్ను అపార్థం చేసుకుంటున్నావ్ సావీ" అతనిస్వరంలో బాధ జనించింది

"ఇంతకంటే ఏవిధంగా అర్థం చేసుకోను బావా! కనీసం పరీక్షలు వ్రాసి ఫెయిలయివున్నా నాకీబాధ, మామ గారికావ్యధ వుండేవిగావు... కాని"

"నిజమే సావీ! తప్పంతానాదే! అందుకు నేనూ విచారిస్తున్నాను. కాని మీ రందరూ అనే కారణంతో నేను డిజైన్‌గాలేదు సావీ"

ఆమె అతని ఎదపైనున్న తన తలను ప్రక్కకు తీసుకొని ఆశ్చర్యంతో "అంటే" అని అడిగింది.

"ఆ కథంతా చెప్పాలంటే నాకే ఎలాగోఅనిపిస్తుంది. నా దౌర్బల్యహృదయమే అందుకు కారణం!"

"అసలు కారణం చెప్పకుండా ఏమిటిబావా ఈ మాటలు! నాకేదీ అర్థంగాలేదు"

ప్రకాశం చిన్నగా నిట్టూర్చాడు. ఒక్కఅరక్షణంఆగి రాధ విషయమంతా ఆమెతో చెప్పాడు.

అంతావిని సావిత్రి చాలా బాధపడింది. "ఇంత కారణం ఈ కథ వెనుక వుంటుందనుకోలేదు నే నేవేవో అన్నాను నన్ను క్షమించరూ"

"నీ తప్పు ఏముంది సావీ, తెలియనపుడు అందరూ అంతే"

"నిజంగా మీరు చాలా అమాయకులు బావా"

"ఏం...?"

"అమాయకులుగనుక నే రాధమిమ్మల్నలా ఆడించింది"

"నీవు మాత్రం నన్ను ఆడించలేదూ! పెద్దకోస్తున్నావ్" అంటూ ఆమె బుగ్గపై చిన్నగా చిటికెవేశాడు.

"ఛో బావా" అంటూ సిగ్గుతో అతని ఒళ్ళో తల దాచుకుంది. "పిచ్చిసావీ" అంటూ ఆమెను పొదివి తన

బాహువులలో వుంచుకొని చెంపలపై గట్టిగా ముద్దుపెట్టు కొన్నాడు.

"విడు బావా! ఎవరో వస్తున్నట్టుంది"

"ఎవరొస్తే మనకేమిటి సావీ! కాబోయే"

"అలాకాదు బావా" అంటూ అతని బంధంనుండి బయటపడింది. ఎవరో దగ్గరనేవున్న జొన్నపైరు దగ్గర కదలినట్టయింది. సావిత్రి గాబరాపడింది.

"ఎందుకలా గాబరాపడతావ్ సావీ"

"అమ్మయ్యో" అని నిట్టూర్చి, "ఎంతయినా కాస్త లోకానికి భయపడాలిబావా! ఎందుకోగాని భవిష్యత్ తలచు కుంటూంటే నా వళ్ళంతా భయంతో స్పందిస్తుంది. ఈ పార్టీలు కక్షలవల్ల చివరకు మీరు నాకు" అంటూండగా, ఛ! ఛ! అవేం మాటలుసావీ! నా జీవితంలో పెళ్ళి అంటూ జరిగితే నీతోనే జరుగుతుంది. ఇక ఇలా ఎన్నడూ ఆలోచిం చకు! ఈ కక్షలూ, స్పర్థలూ, ఏవీమనల్నీ, మన ప్రేమనూ నాశనం చెయ్యలేవు. మా నాన్నగారు నా మాటనెన్నడూ కాదనరు. ఇక మీ నాన్న సంగతి నా కనవసరం! నాకు కావా ల్సింది నీవుగాని, మీ నాన్నగాదు. కొద్ది మాసాల్లో అన్నీ ముగిస్తానుసావీ! తప్పక నిన్ను వివాహం చేసుకుంటాను.

"అంత అదృష్టమా బావా నాకు" అంటూ ఆమె సంతోషంతో తన్నుతాను మరచింది.

* * *

వెంకట్రామయ్యగారు పూర్తిగా కోలుకున్నాడుగాని ఆయనలో మానసిక వ్యథ ఏ మాత్రమూ తగ్గలేదు. కుమారునిలో ఏ తప్పూ లేదని అతనికి నిర్దుష్టంగా తెలుసు, అతనికీ విషయంలో కొడుకుపై కోపంలేదు. ఏ అజ్ఞాతశక్తి తన్నిలా ఈనాడు ఆడిస్తోంది అనుకొని నిస్పృహ చెందేవాడు.

తండ్రి స్థితిచూసేకొద్దీ, ప్రకాశం గుండెతరుక్కుపోతోంది! తండ్రికిక అన్నివిధాలా శాంతిఅవసరం అనే భావనతో గృహకృత్యాలూ, కార్యకలాపాలూ అన్నీ తనమీదే వేసుకున్నాడు. తోటపనులన్నీ సక్రమంగా నిర్వర్తించసాగాడు. తనుండగా పాలేరు అనవసరమనుకొని అతన్ని తీసివేసి, అతనిస్థానంలో అన్నీ తనే నెరవేర్చుకోసాగాడు. ఇంతలో రామంకూడా బి. యల్. మొదటి సంవత్సరం ఎఫ్. ఎల్. పరీక్షలువ్రాసి గ్రామంరావటంచే అన్నిపనులూ సులభంగా, సక్రమంగా జరుగుతున్నాయి. అన్నిటికీ ఈనాడు ఆ గృహానికి ప్రకాశం అండగా వుంటూవస్తున్నాడు. అదే అతనికి తృప్తి ఈనాడు.

గ్రామంవచ్చి మాసంరోజులుదాటింది. ఈనెలరోజులు అతని కేమాత్రమూ విశ్రాంతిలేదు. ఈసారి ఏమదృష్టమో గాని రెండుపంటలకు సరిపడేన్ని నీళ్ళు చెరువుకొచ్చాయి.

తండ్రి అప్పువ్యవహారాలు ప్రకాశానికి పూర్తిగా తెలియవు. కాని అవి కూడా ఈ మధ్య అతనికి అప్పుడప్పుడు తన తండ్రికివచ్చే ఉత్తరాలవల్ల తెలుస్తున్నాయి. కాని ఎంత అప్పువుండేదీ పూర్తిగా తెలియదు. తెలిస్తే భయపడే

వాడేనేమో! తమవల్ల నేగదా తండ్రి ఇన్ని అప్పులు చేశాడు అనుకొని కృంగిపోయేవాడు.

ఆ వ్యథను సావిత్రిని చూడటంవల్ల తొలగించుకుంటాడు. సావిత్రిని చూడకపోతే అతనుండలేడు. అది అతని దినచర్యలో ఒకభాగమైపోయింది.

# 18

గ్రామంలో సావిత్రీ, ప్రకాశంల గురించి రానురాను విపరీతమయి వదంతులు ఏర్పడసాగాయి. మొదటి నెలరోజులలో అక్కడక్క ఎవరో ఏదో అన్నా ఈ విషయాల్ని పట్టించుకున్నదీ లేదు. పట్టించుకున్నా నమ్మినదీ లేదు, నమ్మినా ప్రచారమూ సాగ లేదు.

కాని రెండుమాసాలు దాటేసరికి పరిస్థితి విజృంభించింది. గ్రామంలో ముప్పాతిక భాగం ఈ విషయాన్ని పనిగట్టుకొని చర్చించుకోసాగారు. తీరికవున్న ప్రతిఒక్క వెధవకి యిప్పుడీ సమాచారమేగా వాలి.

కొంతమంది ఈ విషయంలో ప్రకాశాన్ని మెచ్చుకున్నారుకూడా! ఈ విధంగానైనా వీరి పార్టీలు కాస్తవల్ల పడవచ్చునని ఆశించారు. మరికొందరు ఇందువల్ల పార్టీలు మరీ విజృంభించవచ్చుగదా అనికూడా అపోహపడ్డారు. ఇంకొందరు ఉన్న విషయానికి లేనివి నాలుగు కల్పించి కల్లబొల్లి కబుర్లల్లి, సావిత్రి శీలం గురించి కూడా అప్రాచ్యమయిన వదంతులు లేవదీశారు.

ప్రకాశానికి తన పరిస్థితి దాదాపు అవగాహనయింది. తన్నర్థం చేసుకోనేవారు లేనపుడు ఎవర్ని ఏమనీ లాభం లేదనుకొన్నాడు. తన్ను సరిగా అర్థంచేసుకున్నది ఒక్క-రఘు మాత్రమే. అందుకే రఘు అంటే ప్రకాశానికిఎంతో ప్రేమా గౌరవమూను.

ఆ రోజు పంచాయతీ ఆఫీసులో కూచొని రఘూ ప్రకాశంలు ఏదోవిషయాన్ని దీర్ఘంగా చర్చిస్తున్నారు. ప్రకాశంకు చాలా రోజులుగా గ్రామంలో ఒక యువజనసంఘం స్థాపించాలనీ, తద్వారా గ్రామపునరుద్ధరణకు తోడ్పడాలనీ ఎంతో ఉత్సాహంగావుంది. గ్రామంలో చాలా ప్రదేశాలలో వీధులు అపసవ్యంగా, ఇరుకుగా మురికిగా వున్నాయి. వాటిని సంస్కరించాలనే ఉద్దేశ్యం అతనికి మొదట్లోనే మెదిలింది. ముఖ్యంగా స్త్రీలసౌకర్యార్థంవున్న పాయిఖానాలు చాలా శిధిలావస్థలోవున్నాయి. అది ముఖ్యంగా స్త్రీలకెంతో యిబ్బందిగావుంది.

ఈ విషయాలన్నీ రఘుతో ప్రస్తావించాడు. రఘుకు చాలా ఆనందం వేసింది. సాధ్యమైనంత త్వరలో సంఘ స్థాపన చేయాలని అతనూ ఆశించాడు.

ఆరోజు మొదలుకొని దారిద్దరూ దీక్షతో ఈ విషయమై శ్రమించారు. గ్రామంలోని యువకులందరినీ కలుసుకొని తమ ఆదర్శాలనూ ఆశయాలనూ ఎంతో ఓపికగా వివరించారు. చాలామందికి నచ్చచెప్పారు. కొందరునవ్వి ఎగతాళి చేశారు. చాలామంది తప్పక తాము అందులో చేరగలమని వాగ్దానం చేశారు.

పక్షంరోజుల దీర్ఘకృషిఫలితంగా ఏభయిమంది సభ్యులు లభించారు. ఎవరూ యిలాంటి కొత్తపథకాన్ని ఇంతకుముందు విన్నది లేదు. అందుకే ఉత్సాహంతో ముందుకు వచ్చారు.

సంఘ కార్యాలయమునకుగాను ఒక పెద్దగది బాడుగకు తీసుకొన్నారు. నిర్ణయించిన తేదీనాడు సభ్యులందరూ తమ చందాలతోసహా సమావేశమయ్యారు. సంఘ ప్రధాన కార్యదర్శిగా ప్రకాశాన్ని, ప్రెసిడెంటుగా రఘునూ ఏకగ్రీవంగా ఎన్నికచేశారు. ఆ తర్వాత పక్షంరోజులవరకూ జరగవలసిన కార్యక్రమ నివేదికను రఘు సమర్పించాడు.

నిర్ణయించిన పక్షంరోజులలో అపసవ్యంగావున్న వీధులన్నీ సంస్కరించపడ్డాయి. ఎగుళ్ళు దిగుళ్ళు అతుకుబొతుకులు వున్నచోట్ల పెద్దబండలుపరచి మట్టివేసి గచ్చుచేశారు. మురికినీటి గుంటలను వీధుల్లో లేకుండా నిర్మూలనం చేశారు.

గ్రామంలో చాలామంది ఈ పనికి హర్షించి చేజేతులా తామూ సహాయం చేశారు. కొందరు అసూయపడ్డారు. "పెద్ద సంస్కర్తలుబయలుదేరారురోయ్" అని వ్యంగ్యంగా అరచాడు పోస్తుమాస్టరు. అవన్నీ ప్రకాశం పట్టించుకోలేదు.

సభ్యులు పనిచేసేకాలం ఒక నిర్ణీతమైన పద్ధతిలో జరుగుతుంది. తమ గృహకార్యాలకు భంగం కలుగకుండా సాయంత్రంవేళలా, వెన్నెలరాత్రులలోనూ మాత్రమే ఈ పనులు జరుగుతాయి. అందుచే ఎవరకూ యిందువల్ల నష్టం వుండదు. సభ్యులను రెండువర్గాలుగా విభజించి, రోజుకొక వర్గం పనిచేసే ఏర్పాటు నిర్ణయించుకోవటంచే సభ్యులకు

అంసటకూడా స్పందదు. మొదట్లో ఎగతాళిచేసినవాళ్లలో కొందరు మళ్ళీ ఈ సంఘంలో చేరినారు.

సంఘం ప్రారంభమయిన నెలరోజులతర్వాత "శిథిల పాయిఖానాల పునర్నిర్మాణం గురించి ఆ సమావేశంలో చర్చించుకొన్నారు. అందుకు డబ్బు చాలా అవసరం. వెంటనే మరురోజునుండీ ఈ విషయమై చందాలు వసూలుచేయ నారంభించారు. ఇళ్ళలోని ఆడవారి ప్రోత్సాహంవల్ల దాదాపు అందరూ చందాలు యివ్వవలసి వచ్చింది. చందాలు వసూలయిన తర్వాత పని ప్రారంభించారు.

సంఘ సభ్యులు తీరిక సమయాలలో చదువుకోటానికి గాన, దిన, వార, పక్ష పత్రికలు తెప్పించబడుతున్నాయి.

సావిత్రి కీ విషయాలన్నీ ఎప్పటికప్పుడు ప్రకాశం తెలియచేస్తూనే వున్నాడు. ఈ విధంగా సావిత్రిదృష్టిలో ప్రకాశం ఎంతోగొప్ప ఆదర్శవ్యక్తిగా కనుపించాడు.

ఆ గ్రామ ప్రెసిడెంటుగూడా [రఘు మామగారు] ఎంతో ప్రోత్సహించి పంచాయతీద్వారా చాలా మొత్తం ప్రకాశానికి అందజేశాడు. ఆ గ్రామానికి సంబంధించిన బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసువారు సభ్యులందరికూ ప్రత్యేకదుస్తులు, మరికొన్ని పరికరాలూ అందజేశారు.

"ఇలాంటి యువజనసంఘాలు ప్రతిగ్రామంలో కూడా వుంటే దేశం ఎంతో అభివృద్ధికి వస్తుంది. ప్రకాశంగారిని మేము అభినందిస్తున్నాము" అన్నారు బ్లాక్ బి.డి.ఒ. గారు

ప్రకాశానికి గ్రామంలోనేగాక, చుట్టుపట్ల పల్లెల్లో కూడా మంచి పలుకుబడి గౌరవమూ లభించాయి. ఇందువల్ల

అతనంటే ఎదుటిపార్టీ వాళ్ళకి గుండెల్లో నిప్పులుపోసినట్లయింది. "చందాలు వసూలుచేసి మధ్యలో అర్ధమొత్తం తనే మింగేస్తున్నాడని" ప్రకాశంపై దుష్ప్రచారం సాగించారు.

ముఖ్యంగా సాంబయ్యకు ప్రకాశం అంటే అరికాలి మంట నెత్తికెక్కుతోంది. తన కుమార్తె సావిత్రికీ అతనికీ వున్న సంబంధం గురించిన మాటలు అంతోయింతో అతని చెవినపడటంతో ఆగ్రహంతో చిందులుతొక్కి "వాని అంతు తేలుస్తా" అని ఎగిరాడు.

ఆ రోజు సాయంత్రం కాలువమడి చూడటానికి వెళ్ళి లింగయ్యగారి మామిడివనం ప్రక్కగా తిరిగి వస్తున్న సాంబయ్యకు, దూరంగా ప్రకాశం, పక్కనే కూచొని వద్దోసంభాషిస్తున్న సావిత్రి కనిపించింది. అతనికళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. ముఖం కుంచించుకుపోయింది. ఎంత రెగించాడు, అప్రాచ్యుడు అనుకొని పళ్ళు పటపటగొరుకుతూ యిక అక్కడ నిలువలేక యింటికి తిరిగివచ్చాడు.

సావిత్రి సాయంత్రం ఇంటికిరాగానే ఇంటికప్పు ఎగిరేలా "ఎక్కడికెళ్ళావ్?" అని భయంకరంగా గర్జించాడు.

"నా... న్నా!" సావిత్రి వణికింది.

"ఛీ...! సిగ్గూ బిడియమూలేకుండా, ఆ దౌర్భాగ్యునితో నీకేంపనుందే" అంటూ కన్నూమిన్నూగానక ఆమెను చావమోదాడు. ఆ సమయంలో అతని భార్య అడ్డు రాకపోతే సావిత్రి ప్రాణం తీసివేసేవాడే.

"ఇల్లుకదులు గాడిదా! నీ చర్మం ఒలుస్తా. అప్రాచ్యుడు తెగించిన దున్నపోతులా యిలాపడతావా! ఉండు

వానిపనిచెప్తా! అంతుతేలుస్తా'' అని భీకరంగా అరచాడు కోపంలో సాంబయ్య, "ఎంతఅవమానం, ఎంతఅప్రతిష్ట! కులానికే కళంకం తెచ్చిపెట్టావుగదే''

సావిత్రి తన గదిలోకివెళ్ళి "బావా!'' అని భోరున ఏడ్చింది.

# 19

శారదా, ఇందిరలు ప్రకాశం 'డిస్మిస్' కావటం విని చాలా చింతించారు. ఇందిరకు అసలు విషయం ఏమిటాఅని ఎంత ఆలోచించినా అర్థంగాలేదు. ప్రకాశం కాలేజీ ఎగ గొట్టటంవల్లనే యిలా అయ్యాడనే విషయాన్ని ఆమె ఏ మాత్రం నమ్మలేకపోయింది. వెంకటేశం కసలు ఈవిషయం గురించి బాధేలేకపోయింది. "నేనప్పుడే అనుకొన్నాను వాడా ప్రేమవ్యవహారంలోపడి కాలేజీ ఎగగొట్టి చివరికిలా ఏదో అనర్థం తెచ్చుకుంటాడని'' అన్నాడు శారదతో. శార దకు ప్రకాశం ప్రేమ వ్యవహారాలేమిటో అర్థంగాలేదు. ఇందిరకేమైనా తెలుసేమోనని అడిగింది. ఇందిర రాధగురించి చెప్పింది. కాని వారిమధ్య ప్రేమవ్యవహారం వుండదని తేల్చింది.

"ఏమో! ప్రకాశం ఇంలాటివాడంటే నేను నమ్మను'' అంది శారద.

ఇందిర బావను తలచుకొని ఏడ్చిందికూడా! తనకు దూరమైపోతాడేమోనని బాధపడింది.

ఇదిలావుండగా పులిమీందపుట్రలా, వెనుకవీరిచే చావు దెబ్బలు తిన్న ప్రక్కింటి అబ్బాయి గోల ఈ మధ్య శ్రుతి మించింది. శారద చాలా భయపడింది. ఇందరవుంటే అంత భయపడేదిగాదుగాని ఆమె పరీక్షలువ్రాసి సెలవుల్లో వూరి కెళ్ళటంచే ఏదైనా వాడు మళ్ళీ అఘాయిత్యం తలపెడతా డేమోనని వ్యథచెందింది శారద.

ఆ రోజు మధ్యాహ్నం శారద ఒంటరిగా యింట్లో కూచొని బియ్యం చెరుగుతూండిపోయింది. వెంకటేశం ఆఫీసుకు వెళ్ళాడు. ఆమె కీ మధ్య ఒంటరిగా యింట్లో ముళ్ళ మీద కూచున్నట్లు వుండేది. "మొన్న తను కొళాయిదగ్గర కెళ్లి నీళ్ళు తెస్తుండగా వాడు ఒక గులకరాయి తనమీదకు విసిరాడు. అదొచ్చి బిందెకు తగిలి ఖంగుమంది. ఆ శబ్దానికి అందరూ తనవేపు అదోవిధంగా చూశారు. బాధతో అవమానంతో కృంగిపోయింది తను"

ఈ విషయాలన్నీ మళ్ళీ ఇప్పుడు ఆలోచిస్తూంది శారద.

ఇంతలో ఎవరో తలుపుతట్టిన శబ్దమయింది. శారద గుండెఝల్లుమంది.

"ఎవరూ?" అంది మెల్లగా.

"నేను శారదా," వెంకటేశం స్వరం వినిపించింది.

శారదకు ధైర్యంవచ్చి తలుపుతీసింది. వెంటనే "ఆఁ" అంది కీచుగొంతుతో భయంగా.

"ఆఁ నేనే శారదా" అంటూ వాడు విసురుగా లోపలకువచ్చి తలుపులుమూసి ఆమె చెయ్యిపట్టుకోబోయాడు.

"నువ్వా దుర్మార్గుడా! వెళ్లు, బయటికెళ్లు" అరచింది శారద కోపంతో.

"ఎందుకు శారదా నేనంటే నీకంతకోపం! నీ వంటే నాకెంత యిష్టమో తెలుసా! నీకోసం ఆనాడు చావుదెబ్బలు తిన్నాడన్న కనికరమయినా లేదా" అంటూ ముందుకు వచ్చాడు.

"దుర్మార్గుడా! ఈ కల్లిబొల్లి మాటలతో నన్ను మభ్య పుచ్చాలని ప్రయత్నించకు వెళ్ళు, బయటకు వెళ్ళు" ఒకొక్క అడుగే వెనక్కు వేస్తూ కళ్ళతో నిప్పులు చెవజల్లుతూ కోపంగా అంది శారద.

"శారదా! అనవసరంగా గొడవ చేయకు! నీ వెంత మొత్తుకున్నా నిన్ను రక్షించేవారు ఈ చుట్టూ ఎవరూ లేరు. గట్టిగా అరిచావంటే నీకే అప్రతిష్ట! మర్యాదగా నా మాట విని" అంటూ ఆమె చేయి గట్టిగా పట్టుకున్నాడు.

"ఛీ! వదులు దుర్మార్గుడా! అప్రాచ్యుడా" అంటూ కుడిచేత్తో అతని ఎడమ చెంపను చెళ్ళుమని వాయించింది.

"అబ్బ! ఎంతమృదువుగా కొట్టావు శారదా! ఏదీ యింకో దెబ్బ" అంటూ ఆమె నడుంచుట్టూ తన చేతులు వెవ వేసి దగ్గరగా లాక్కోబోయాడు.

"అయ్యో! నన్నొదలరా నీచుడా!" అని అరుస్తూ అతని చెయ్యి గట్టిగా కరచింది.

"అబ్బా" అంటూ వాడి చేతులు వదిలించుకోవటం శారద ఒక్కపరుగులో వంటింట్లోకి వెళ్ళి తలుపు వేసుకొని గడి పెట్టుకోవటం అంతా అరక్షణంలో జరిగింది.

"శారదా ఈ నాటికి తప్పించుకున్నావ్‌గాని సరే, అనుభవిస్తావ్" అని గబగబా బయటకు వెళ్ళిపోయాడు.

అతనలా బయటకురాగానే కొంతదూరంలో వస్తున్న వెంకటేశం అతన్ని పసిగట్టాడు. వెంకటేశం క్షణకాలం అతడు వెళ్ళినవేపే చూస్తూ నిస్సబ్దుడై, ఉన్నచోటే నిలబడి పోయాడు.

వెంటనే అతనిముఖం క్రోధంతో ఎర్రగా తయారయింది. రెండు కనుబొమలూ వికృతంగా ఒకచోట కలిశాయి. గబగబా ఇంట్లోకివచ్చి "శారదా" అని గట్టిగా పిలిచాడు.

వంటింట్లో ఏడుస్తూన్న శారద ఈ పిలుపుకు ఒక్కసారిగా అదిరిపోయింది. బహుశా వాడే మళ్ళీ తన భర్త గొంతుతో తన్నిలా కేకవేస్తున్నాడేమోననుకొని భయంతో అక్కడే వుండిపోయింది,

"శారదా! బయటికిరా" ఉన్మత్తునిలా గర్జించాడు వెంకటేశం.

ఈ పిలుపుకు శారద వణికింది. నిజంగా తన భర్తగారే వచ్చారేమో ననుకొని వెంటనే తలుపుతీసి, ఎదురుగా భీకరాకారంతో కళ్ళలో నిప్పులు చెరుగుతూ నిలబడ్డ భర్తను జూచి ఆశ్చర్యంతో పాటు భీతావహురాలైంది.

"ఏమండీ..." అంది తొణుకుతున్న స్వరంతో.

"ఏంచేస్తున్నావేలోపల?"

"ఏ...ఏ...ఏం లేదండీ"

"శారదా నిజంచెప్పు? వాడెందుకొచ్చాడిక్కడికి" కోపంతో అతను తన్ను తాను మరచి అరచాడు.

"ఎ... ఎవరండీ!"

"ఛీ! ఎంత నయంగా అడుగుతున్నావే! నా కళ్ళ ముందే సత్యాన్ని దాచాలని ప్రయత్నిస్తావటే! నిజంచెప్పు"

"నిజంగా నాదేం తప్పులేదండీ వాడొచ్చి"

"ఇంతకుముందే ఎవరండీఅన్నావ్! అప్పుడేవాడొచ్చి అంటున్నావ్, ఎంతవగలాడివే కులటా! నీ వాలకం చూసి నపుడే అనుకొన్నాను. యిలాంటిదేదో జరిగింపని," అంటూ కోపంతో ఆమె కొప్పుపట్టుకు ముందుకు ఈడ్చాడు.

"అయ్యో! నాకేం తెలీదండీ, నేను చెప్పేదివినండి"

"ఇంకేమిటే నీవు చెప్పేది! అంతా కనిపిస్తూనేవుంది. ఎన్నాళ్ళనుండీ జరుగుతోందే ఈ వ్యవహారం! నాకీరోజు ఉత్తరంరాబట్టి తెలుసుకొన్నానుగాని, చూడవే, చూడు" అంటూ ఒకకాగితం ముక్క ఆమె చేతికందించాడు.

శారద కళ్ళనిండా నీరుంచుకొని దాన్ని చదువుకో సాగింది.

వెంకటేశం!

విరామంలేని ఈ ఆఫీసు గొడవలలోపడి కుటుంబ వ్యవహారాలలో విస్మరిస్తున్నావ్. ఒంటరిగా భార్యను ఇంట్లో వుంచినందుకు నీకు మంచిశాస్తి జరిగింది. కాస్త కళ్లు తెరచి చూడు. మనసువిప్పి ఆలోచించు. ఒంటరిగావున్న తమ భార్య కార్యకలాపాలు అర్థమవుతాయి. నమ్మకంలేకపోతే

వెంటనే ఇంటికి వెళ్ళి తమ భార్యామణి ఎవరితో సరసస్లా పాలు సాగిస్తోందో చూడు.

మీ శ్రేయోభిలాషి.

ఉత్తరం పూర్తిగా చదువగానే శారదకు కళ్ళు తిరిగాయి. వణుకుతున్న కంఠంతో, "ఏమండీ మీరు నిజంగా దీన్ని నమ్ముతున్నారా" అంది.

"ఇంకా నమ్ముతున్నారా అంటున్నావా వంచకీ! వాడెవడో నేను కళ్ళారా జూచీ నిన్ను విశ్వసించమంటావా"

"అయ్యో! ఇదేమిటండీ, ఇలా మాటాడుతున్నారు. అసలు సంగతి తెలుసుకోకుండా-"

"ఇంకా అసలు సంగతేమిటే ద్రోహీ! నా నోటి మీదుగా అన్నీ చెప్పించాలని చూస్తున్నావటే! ప్రాణం కన్నా మిన్నగా నిన్ను ప్రేమించినందుకు ఇదా ప్రతిఫలం" అంటూ రెట్టబట్టుకొని బరబరా ఈడ్చి వీపుపై చావ మోదాడు.

"అయ్యో! నన్ననుమానించకండి. నిజంగా అలాంటిదేమీ జరుగలేదు. నేనే వాణ్ని..." అంటూండగా.

"ఆఁ... అంటున్నావ్! ఎంత తెగించావ్? నీవే వాణ్ణి పిలిపించుకొన్నావ్! ఎంత ధైర్యం! ఎంత స్వేచ్ఛాస్వైరిణి వయ్యావే! నీ: వాడదానివేనా? రాక్షసివి! భూతానివి..."

"ఏమండీ, అన్నిమాటలనకండి. మీకు పుణ్యముంటుంది. మీ కాళ్లుపట్టుకుంటాను. నా మాట పూర్తిగా వినండి. పదిమందిలో మన పరువు మంటగలుపకండి" వెక్కి వెక్కి ఏడ్చింది శారద.

"ఇంకా పసువెక్కడ మిగిల్చావే! ఉన్నదంతా ఈ విధంగా మట్టిగలిపి ఇంకా ధర్మపన్నాగాలు కూడానా! ఛీ నీ పాపిముఖం చూస్తేనే నరకం వెళ్ళవచ్చు" అంటూ ఆమె కొప్పుబట్టి బయటకు ఈడ్వబోయాడు.

"ఏవండీ..." అని అతని కాళ్ళపైబడి "మీ రనవన సరంగా నన్ను అనుమానిస్తున్నారు. నిజంగా నాలో తప్పు లేదండీ. ఎవరో గిట్టని వారిలా వ్రాశారు. నా మాటవినండీ" బావురుమంది శారద.

"ఇంకా ఎన్ని మాటలు వినాలే! కాళ్లు పట్టుకొన్నంత మాత్రాన నా గుండె కరుగుతుందనుకున్నావా! నిన్ను క్షమి స్తాననుకున్నావా! ఇక ఈ పవిత్ర గృహంలో నీకు స్థానం లేదు. నా కాళ్లు వదులు" అంటూ ఆమె నుండి ప్రక్కగా తప్పుకొని రెట్టబట్టి బలంగా ఈడ్చాడు.

"అయ్యో! ఇదేమిటండీ, నా మీద మీ కనుమాన మంటే నిలువునా నన్ను చీల్చేయండిగాని నన్నిలా..."

"నీ ఏడ్పులూ, పెడబొబ్బలతో నా మనసు మార్చా లని వ్యర్థప్రయత్నం చేయకు. వెళ్ళు నా యింటినుండికదులు ఏ నూతిలోనో గోతిలోనో రైలుక్రిందో పడిచావు" అంటూ తలుపువేపు తోశాడు ఆమెను.

"ఏమండీ" అంటూ విసురుగా ఆమె పడబోతూండగా రెండుచేతులొచ్చి ఆదుకొని ఆమెను పట్టుకొన్నాయివెంటనే.

"వెంకటేశం" బ్రహ్మాండం బ్రద్దలయేలా గర్జించాడు ప్రకాశం.

అకస్మాత్తుగావచ్చి ఆదుకొన్న తన అన్నయ్యను జూచి శారద గుండెపగిలేలా "అన్నయ్యా" అంది.

"ఓహో! నువ్వటోయ్! ఇంకేం సమయానికొచ్చావు. ఇద్దరూ కట్టగట్టుకొని ఏ చెరువులోనన్నా దూకరాదూ! మీ అన్నా చెల్లెళ్ళలో ఎవరూ ఎవరికీ తీసిపోరు. నీ వొక దాన్ని, ఇదొకణ్ణి-"

"వెంకటేశం" అతని కంఠస్వరంలో మేఘగర్జన ప్రతిధ్వనించింది.

"ఏమిటోయ్ అలాఅఘోరిస్తావ్! ఏం బెదిరింపులకు జడుస్తాననుకొన్నావా, చేసిందిచాలక అది కులికింగిచాలక"

"నోర్ముయ్" వెంకటేశం చెంప ఛళీమని మ్రోగింది ఉన్నపళంగా పడిన ఈ దెబ్బకు దిమ్మతిరిగాడు వెంకటేశం.

"అన్నయ్యా"

"వెంకటేశం! కొట్టడం, తిట్టడం నీ కొక్కనికే చేత గాదు, అందరకూ చేతనవును. ఎవరోకూసిన మాటలునమ్మి భార్యను అనుమానించే నీవూ ఒకమనిషివేనా! అర్థంలేని అపోహాలతో అసలు విషయాన్ని చెబుతున్నా వినకుండా భార్యను ఈడ్చికొట్టడమేనా నీ మానవత్వం"

"నోర్ముయ్! నీ అధికప్రసంగం యింతటితో కట్టిపెట్టు. నీవేం నాకు నీతులు బోధించవలసిన అవసరంలేదు. నేను మంచివాణ్ని గాబట్టి నీవు కొట్టినా సహించి నిన్ను క్షమించి వదలుతున్నాను. వెళ్ళు ఈ యింట్లోనుంచి యింకొక్కక్షణం కూడా ఆగకుండా ఆ ముండను తీసుకెళ్ళు. వెళ్ళు"

"వెంకటేశం! అనవసరంగా అప్టేవాగావంటే ఈసారి నీ ప్రాణాలు నిలువునా చీల్చేస్తాను. నీ లాంటి మూర్ఖునకు అప్రాచ్యునకు నీచునకు సంకుచితునకు నా చెల్లాయినిచ్చి పెళ్ళి చేయటమే మా తప్పు. ఏనాటికైనా ఈతప్పును నీవు గ్రహించకపోవు. పద శారదా! ఈ మానవత్వంలేని పశువుదగ్గర యింకో క్షణంకూడా వుండకూడదు"

"గెట్ అవుట్" బిగ్గరగా గర్జించాడు వెంకటేశం.

"నా చెల్లాయినిజూచి నిన్ను విడిచిపెట్టానురా! లేని పక్షంలో ఈ పాటికి నిన్ను..."

"అన్నయ్యా వారిని..."

"నువ్వూరుకోమ్మా!... ఇకచాలు పదశారదా" అంటూ ఆమెను వెంటబెట్టుకొని అంతవరకూ ఈ వింత చూస్తూన్న గుంపును తోసుకొని గబగబా బయటకువచ్చి, అప్పుడే అక్కడ ఆగిన జటకాలో కూచొన్నాడు.

"అన్నయ్యా నన్నిలా"

"ముందు ఇక్కణ్నుండి వెళదాంపదమ్మా!ఆ తర్వాత ఆలోచిద్దాం"

జటకా ముందుకు కదిలింది. శారద కళ్ళనుండి బొట బొటా కన్నీటిబొట్లు చెంపలమీదుగా సహస్రపాదులై స్రవిస్తున్నాయి. ప్రకాశం ఇంకా ఆ ఆవేశంలోనే ఊగిసలాడుతున్నాడు.

జటకావాలా "ఎక్కడ ఆపమంటారుసార్" అని ప్రశ్నించేసరికి ఈ లోకంలోపడ్డాడు.

"బస్ స్టాండ్ కు తీసుకుపో"

"జటకా 'బస్ స్టాండ్' లో ఆగింది. శారద బరువుగా క్రిందకు దిగింది.

"ఎక్కడకన్నయ్యా"

"ఊరికెళదామమ్మా"

"ఊరికా"

"అవును"

"మరి వాటు"

"అవి మళ్ళీ ఆలోచిద్దాం"

*　*　*　*　*

ప్రకాశంతో పాటు శారదకూడా పట్టణంనుండి రావటం అందరినీ ఆశ్చర్యపరచింది. ప్రకాశం ఎవరికీ ఏమీ చెప్ప లేదు. అతనింకా ఆ మూడ్‌లోనే వున్నాడు. అదే విషయమై తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. చెల్లాయిపై అతనికి యిసుమంత కూడా అనుమానం లేదు. ఏదో శుభకోణం జరిగుండాలి. అసలే వ్యథతో వున్న శారదతో మళ్ళీ విషయమై ప్రస్తావించ తలచుకోలేదు.

శారద, తల్లిని చూడగానే అంతవరకూవున్న ఆవేదన పొంగి పొరలి, "అమ్మా" అంటూ భుజంపై తలాన్చి పసిపిల్లలా ఏడ్చింది. ఆమె ఈ విపరీతానికి ఆశ్చర్యపోయింది.

"ఏంజరిగింది తల్లీ" అంది వంటింట్లోకి తీసుకువెళ్ళి.

శారద నిదానంగా అన్నివిషయాలూ తల్లితో చెప్పి, "ఇక నా గతేమమ్మా" అని బావురుమంది.

"అయ్యో! ఎంతపని జరిగిందితల్లీ! అల్లుడేదో ఆవేశంలో ఇలా చేసుంటాడు. మీ నాన్నగారువెళ్ళి అసలు విషయం నచ్చచెప్పి వస్తాడులే అమ్మా" అంది సముదాయిస్తూ. అక్కకు జరిగిన దురవస్థకు లలిత ఎంతో విచారించింది.

వెంకట్రామయ్యగారికి ప్రకాశం ఏ విషయమూ చెప్ప లేదు, అడిగాడుగాని ప్రకాశం మౌనభావంగా వుండిపోయాడు.

ఆ రాత్రికి తన భార్యద్వారా విషయంవిని నిశ్చేష్టుడయిపోయాడు రామయ్య! కేవలం భారంగా నిట్టూర్చడం తప్ప అతనేం మాటాడలేదు. కష్టాలన్నీ ఒకేసారి కలసివస్తాయనేది ఇదేకాబోలు అనుకున్నాడు అస్పష్టంగా. రామం ఈ విషయం విని, "వెంకటేశం యింత మూర్ఖుడనుకోలేదు. అసలు తప్పంతానాదే! మిత్రుడని మంచివాడని నేనే ఈ సంబంధం నిశ్చయించాను. ఆ మూర్ఖుడు చివరికిలా .." అని అన్నాడు. తర్వాత ఒక క్షణంఆగి, "నాన్నా! నేనువెళ్లి వెంకటేశంతో మాటాడి వస్తాను" అన్నాడు.

"నా అభిప్రాయం కూడా అదే రామూడూ! మిత్రుడు నీ మాటకే విలువయిస్తాడని నా అభిప్రాయం. కాని ఇలాంటి సమయాలలో ఆవేశం పనికిరాదు సుమా! కార్యం మనది గాబట్టి చాలా నేర్పుగా వ్యవహరించాలి. ఎటుతిరిగీ మనస్థితి అరటి ఆకులాంటిది. జాగ్రత్త అనవసరంగా ఉద్రేకం తెచ్చుకోకు. అసలు విషయాన్ని నచ్చచెప్పటానికి ప్రయత్నించు వెళ్ళిరా!"

"అలాగేనాన్నా! నాకు మాత్రం తెలీదూ" అని ఆ రోజే పట్నం బయలుదేరాడు రామం. ప్రశాంతంతృప్తిగా శ్వాసపీల్చాడు.

రామం పట్టణం చేరేసరికి మధ్యాహ్నం దాటింది. నేరుగా వెంకటేశం పనిచేసే ఆఫీసుకెళ్ళాడు. వెంకటేశం క్యాజువల్ లీవుపెట్టాడని తెలిసింది. వెంటనే ఇంటివేపు దారి తీశాడు.

గృహంలో అడుగుపెట్టేసరికి వెంకటేశం హాల్లో అటూయిటూ పచారు చేస్తున్నాడు.

"వెంకటేశం"

"ఓ నువ్వా! రామూ"

నా"

"సీతతో మాటాడిపోదామని వచ్చాను"

"రామం! మిత్రునిగా నీతో ఎన్నివిషయాలయినా నేను మాటాడటానికి సంసిద్ధమేగాని, బావగా సీతతో ఏ విషయమూ చర్చించదలచుకోలేదు. ఈ విషయమై నీవు నన్నే విధంగా తలంచినాసరే"

"వెంకటేశం"

"క్షమించురామూ, నా కంతా తెలుసు. నా మనసు పూర్తిగా విరిగిపోయింది"

"అసలు విషయాన్ని గ్రహించకపోతే, మనసేగాదు జీవితంకూడా..."

"రామం!"

"నేను రామంగా ఇక్కడికిరాలేదు. శారద అన్నగా నీ బావగా యిక్కడకు వచ్చాను. వెంకటేశం! శారదకు నిజంగా ఆ విషయం ఏ మాత్రమూ తెలియదు, అంతా మాతో చెప్పింది. ఏదో తెలియని ఆవేశంలో ఉడుకు ఉద్రేకంలో నీ విలా చేశావుగాని..."

"మీ సంజాయిషీలు నా కనవసరం బావా! ఒకరి మాటలు విని ఆచరించేంత దుర్దశ నా కింతవరకూ సంప్రాప్తించలేదు. నాకూ యోచనా శక్తి వుంది. దేవుడిచ్చిన కళ్ళున్నాయి. మంచిఏదో చెడ్డేదో తెలుసుకోగలజ్ఞానం వుంది. మీ మాటలు నేను వినదలచుకోలేదు. కావగా నీవు ఇక్కణ్ణుంచీ వెళ్ళవచ్చు."

"వెంకటేశం! మిత్రునిగా, బంధువుగా, నిన్ను అర్థిస్తున్నాను. నేను చెప్పేది పూర్తిగా విను. శారదకూ ఆ దురాత్మునకూ నీ వనుకున్న ఏ విధమైన సంబంధమూ లేదు. వాడెవడో నాకు తెలుసుంటే నేనే అన్ని ఋజువులూ చేసే వాణ్ని"

"నీ ఋజువులూ సాక్ష్యాలూ నా కనవసరం! నా కళ్ళను మించిన ఏ ఋజువూ నా కక్కరలేదు"

"బావా! ఏమిటాపట్టుదల! పెళ్ళయినప్పటినుండీ ఏనాడయినా చూచాయగానైనా శారదలోఅలాంటి మార్పుగాని భావంగానిచూడగలిగావా! నీ ఆత్మపరిశీలనచేసుకో నీకే ఆవిషయం తెలుస్తుంది. ఎవరో పిచ్చిగావ్రాసినకాగితాన్నిపట్టుకొని భార్యను అవమానించి, అనుమానించి బయటకు గెంటటం నీలాంటి సభ్యునకూ చదువరికీ సమంజసమేనా! నామాట

విని గతం మరచిపో! అదొక పీడకలగా భావించు నా వెంట వచ్చి శారదను తెచ్చుకో బావా! పాపం అది ఎంతో బాధ పడుతోంది. దాని దుఃఖం చూస్తూంటే నా గుండె బ్రద్దలై పోయింది. నా మాటవిను బావా!" రామం కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

వెంకటేశం క్షణకాలం రామం ముఖంచూసి, ఆసహ్యంగా తలప్రక్కగా తిప్పుకొని కిటికీవేపు నడిచాడు.

"వెంకటేశం" యెంతో బాధ, దీనత్వం అతని స్వరంలో ప్రతిబింబించాయి.

"రామం! నన్ను పదేపదే ప్రార్థించిగాని, అర్థించిగాని లాభంలేదు. నా కళ్ళనూ, ఆత్మనూ నేను వంచించుకోలేను. నా స్థితిలో నీవున్నా ఇంతకంటేమించి ఏమీ చేసేవానివిగాదు. ఇంతకంటే నేను నీ కేమీ చెప్పలేను. అది నా కనవసరం. మీకు పిలుంటే ఆమెకు వేరే పెళ్ళి చేసినా నాకు సమ్మతమే"

"వెంకటేశం" యెంతో కోపంగాఅని, అంతలోనే సర్దుకొని తగ్గుస్థాయిలో, "యెంతమాటన్నావ్ బావా! నీవు మాటాడేదేదో నీ కర్థమవుతుందా! అలాగంటే ఆమె గతి ఏంగాను? భారతస్త్రీపై అలాంటి ప్రయోగాన్ని రుద్దడం భావ్యమేనా! బావా! నీ కాళ్ళు పట్టుకుంటాను. నా చెల్లాయి జీవితాన్ని నిలబెట్టు, మా వంశగౌరవాన్ని కాపాడు..."

"రామం! నాకు నీతో వాదించాలనిలేదు. అలాంటి కులటను నేనే ముఖంపెట్టుకొని మళ్ళీ స్వీకరించగలను"

"వెంకటేశం!" రామం కోపంతో నిలువెల్లా వణికిపోయాడు. "నీలోని మానవత్వం కరుడుగట్టిపోయింది. నీ

కళ్ళు నిన్ను మోసంచేశాయి. నా చెల్లాయిని ఇంకోసారి అలా అన్నావంటే నేనేం చేస్తానో నాకే తెలియదు. నా చెల్లాయిస్థితిలో నీ చెల్లెలేవుంటే ఈ మాటలు భరించగల వానివేనా! మూర్ఖత్వంతో పశువుకంటే నీచంగా..."

"రామం! అనవసరంగా అక్కరలేని అరవకు! నాకూ మీకూ ఈ క్షణంనుండీ ఏమాత్రం సంబంధంలేదు. మర్యాదగా బయటకునడు"

"వెంకటేశం! ఆఖరిసారిగా అడుగుతున్నాను. నన్ను జూచైనా శారదను కాపురానికిదెచ్చుకో! పొరపాటున నీవు తప్పుచేసినా సహజమనేఉద్దేశ్యంతో నిన్ను క్షమిస్తున్నాను"

"నీ క్షమాపణగాని, అభ్యర్థనగాని, నీ చెల్లాయిగాని నీ బంధుత్వంగాని - మిత్రత్వంగాని నాకు అక్కర్లేదూ, అవసరమూలేదు. వెళ్ళు ఇక ఇక్కడ్నుంచి వెళ్ళండి"

"వెంకటేశం! నీవేనా! ఈ మాటలంటూండేది"

"ఇంతవరకూ తమరు ఎవరితో మాటాడుతున్నారో గూడా గమనించకపోవటం నీ దురదృష్టం. ఇక తమరు దయ చేయవచ్చు"

"వెళ్తాను, కాని వెంకటేశం! నీవుచేసిన ఈ పనికి ఈ లోకంలో ఎవరూ నిన్ను హర్షించలేరనిమాత్రం గుర్తుంచుకో! ఏనాడో ఒకనాడు నీవు తప్పక పశ్చాత్తాపపడతావ్! అప్పటికి సమయంమించిపోయివుంటే నేను చేయగలిగిందేమీ లేదు. వస్తా" అంటూ విసురుగా బయటకు వచ్చాడు.

రామం విషణ్ణవదనంతో, ఉన్నదంతా కోల్పోయిన బయిరాగిలా ఆ సాయంత్రం ఇంట్లో అడుగుపెట్టాడు. అతని

ముఖవైఖరి చూడగానే ప్రకాశం దాదాపు పరిస్థితి అంతా అర్థం చేసుకొన్నాడు.

వెంకట్రామయ్యగారు, "ఏంజరిగింది రాముడూ?" అనడిగాడు, అతనికి రామంను చూడగానే మనసులో మనసు లేదు.

రామంక్షణమాగి మెల్లగా, "అన్నివిధాలా అర్థించాను, ప్రార్థించాను. కాని లాభంలేకపోయింది నాన్నా" అన్నాడు హీనస్వరంతో! వంటింట్లోంచి ఈ మాటవిన్న శారద ప్రాన్పడి, నిశ్చేష్టురాలై అలాగేక్రిందపడిపోయింది.

"వానికేదో శనిగ్రహంపట్టుకొని ఇలా ఆడిస్తోంది నాన్నా"

"వానికిగాదురా శనిగ్రహం పట్టింది. మనకుపట్టింది. అంతామనకే. అయ్యోభగవంతుడా!" ఏడ్చాడు రామయ్య.

"ఇంతదౌర్భాగ్యంగా ప్రవర్తిస్తాడని కలలోకూడా అనుకోలేదునాన్నా. వానికెవరో బాగా నూరిపోశారు"

"మరిపుడేంచేయాలిరా?"

"కాలంకలసివచ్చేదాకా ఆగాలినాన్నా! అంతకు మించి మానవులుగా మనమేం చేయలేము. అయితే దానవులుగా కావాలి, లేదా దేవతలగానన్నా మారాలి! అంతకు దప్ప మరో మార్గంలేదు"

"నేను కూడావెళ్ళి అల్లునితో..."

"వద్దునాన్నా! వద్దు! ఈ ప్రాయంలో అర్థిస్తూ వాని దగ్గరకెళ్ళటం నాకేం బాగులేదు. వెళ్ళినా ఫలిస్తుందని నేను అనుకోను. ప్రాణమిత్రుడైన అన్నయ్యనే ఇలా అవమానించి

పంపించాడు. ఇక మీరు వెళ్ళినా ఇంతకుమించి ప్రయోజ నాన్ని సాధించలేరు" అన్నాడు ప్రకాశం.

"అంతా నా ఖర్మ! ఏ జన్మలో ఏపాపం చేశానో! అయ్యోభగవాన్!" అని బాధగానూ్గి బరువుగామంచంపై వాలిపోయాడు రామయ్య.

ప్రకాశం కళ్ళనుండి అశ్రుబిందువులు వేడిగా స్రవిం చాయి.

"పుత్రుల భవిష్యత్ కోసమని ఆస్తికొంటే అలా అఘోరించింది. నడివిస్తే వృద్ధికొస్తారని ఆశిస్తే ఒకడిలా అయ్యాడు, ఇంకొకడు కాస్తా ఫెయిలయ్యాడు వైభవంగా పెళ్ళిచేసి, ఆమెకోసం నాలుగువేలు అప్పుచేస్తే అదిలా అఘోరించింది. ఒకమార్గంలోపయనిస్తే గమ్యస్థానం కోరింది గాక వేరేఎదురవుతోంది. అంతా చుక్కెదురే! ఈ పరి స్థితిలో నేనేంచెయ్యాలి? ఈ సంసారాన్ని ఎలా ఒక మార్గా నికి తేగలుగుతాను? ఈ వ్యవహారాలనెలా పరిష్కారం చెయ్యాలి? ఈ అప్పులెలాతీర్చాలి? బిడ్డల భవిష్యత్ ఎలా దిద్దాలి? అయ్యో! శారద ముఖంచూస్తుంటే హృదయం తరుక్కుపోతోంది. ప్రకాశాన్ని చూస్తే మనసంతా భారమవు తోంది! ఇక లలిత— పాపం! దానికింకాపెళ్ళే చెయ్యలేదు. రోమ్ముమీద కుంపటిలా ఏమిటి భగవంతుడా ఈ సమస్యలు? దీనికి పర్యవసానంఏమిటి? అబ్బా...!" తనలో తాను గొణు క్కుంటూ తలబాదుకున్నాడు రామయ్యగారు. ఈ మాట లెవరికీ వినిపించలేదు.

ప్రకాశం, ఈ విషాదమౌనాన్ని భరించలేక బయటకు నడిచి ఏదో ఆలోచిస్తూ తోటదగ్గరకు చేరుకున్నాడు. అక్కడకు రాగానే అతనికి సావిత్రి జ్ఞప్తికి వచ్చింది. సావిత్రిని తాను చూడక దాదాపు వారంరోజులుగావస్తోంది. ఈ వారంలో రెండురోజులు పట్నంలోనే గడచిపోయాయి. అంతకు మునుపు నాలుగురోజులుగా తనిటువచ్చినా ఎందుకోగాని సావిత్రిరాలేదు.

చాలాకాలం సావిత్రి గురించి ఆలోచిస్తూ వుండిపోయాడు. ప్రొద్దుగూకింది. కాని ఆమె ఛాయలే కన్పించలేదు ప్రకాశంకు.

*    *    *    *    *

ఆ రోజుఉదయం ఎనిమిదిగంటల సమయంలో ప్రకాశం తమ యువజనసంఘంకై కేటాయించిన ప్రత్యేకగదిలో వాలుకుర్చీలో పడుకొని ఏదో ఆలోచిస్తూండిపోయాడు! కుటుంబవ్యవహారాలను తలచుకొనేకొద్దీ అతనిలో విపరీతమైన వ్యధకలుగుతోంది. ఆర్థికంగా నాన్నగారుపడే బాధ తనకు ప్రత్యక్షంగా తెలుసు. అప్పులేమాత్రమున్నాయో తనకు పూర్తిగా తెలియదు. తనకు తెలిసినంతవరకూ పదివేలరూపాయలుంటాయని అంచనా! అసలు ఇన్ని అప్పులు కావటానికి కారణం తనూ, అన్నయ్యా. తామిరువురూ ఈ సమయంలో నాన్నగారికేవిధంగానూ సహాయపడలేకపోతున్నారు. ఇక ఈ పరిస్థితులలో తను మళ్ళీ కాలేజీలో చేరటం చాలా కష్ట

మయినపని. మళ్ళీ సంవత్సరంకొనసాగించాలంటే వేయి రూపాయలకు మాత్రం తక్కువగాదు. తనకు తెలిసినంత వరకూ నాన్నగారిదగ్గర ప్రస్తుతం ఏమాత్రమూ డబ్బులేదు. చదవాలంటే అప్పుచేయాలి. అప్పుచేసిపప్పుకూడులా ఈ కాలేజీ చదువు చదివితే ఎంత? చదవకపోతేఎంత? తనవల్ల మళ్ళీ తండ్రిగారు అప్పులోపడటం తనకేమాత్రం ఇష్టంలేదు. ఇక తను ఏదయినా ఉద్యోగంలో చేరాలి. ఆ విధంగానైనా తండ్రికి అంతో ఇంతో చేయూతనిస్తేదప్ప తనకు నాన శ్శాంతివుండదు. ఇక తాను కాలేజీలో చేరాలన్నా వారం రోజులు మాత్రమే గడువుంది. నాన్నగారికేమో తన్నెలా గయినా చదివించాలనేవుంది. అందుకు ప్రయత్నిస్తున్నాడు కూడా! వద్దని తను చెప్పాలి. మొదట్లో ఆయన బాధపడ్డా అసలు పరిస్థితిదృష్ట్యా ప్రస్తుతం మానటమే ఉత్తమం!"

"ఇక ఈ సంవత్సరంవలె ముందు సంవత్సరం పంటలు సరిగాలేవు. ఈ సారి పంటరాగానే అమ్మి అప్పులు తీర్చ టానికి ప్రయత్నించాలి. అన్నగారు ఈ సంవత్సరం ఫెయి లయ్యారు. మళ్ళీ చదవాలంటే చాలాకష్టం. కాని అన్న చదువు ఆగటానికి వీల్లేదు. ఆగితే ముందుకు తమకేనష్టం. తనేదయినా ఉద్యోగంలో చేరితే అన్నకు అంతో ఇంతో సహాయపడవచ్చు. అదీగాక ఒకటి రెండుమాసాలలో తనిం తకుముందు వ్రాసిన రెండునవలలకూ ఐదారువందలరూపా యలుకూడా పంపిస్తారు ప్రచురణాధిపతులు. వీటితో అన్న చదవవచ్చు"

ఈ విధమయిన ఆలోచనలతో పయనిస్తోంది అతని మనసు. అతని ఆలోచనా పథంలో సావిత్రి మెదలింది.

"తన జీవితంలో మొదటిలక్ష్యం సావిత్రి. సావిత్రి ఈ వారంరోజులుగా తనకు కన్పించనందువల్లనే తనకేదో పెద్దలోటు ఏర్పడినట్లుంది. ఈ వ్యవహారాలు పరిష్కారమయ్యేలోగానే తను సావిత్రిని వివాహం చేసుకోవాలి. గారిని ఒప్పించటం సులభం. కాని సాంబయ్య విషయమే అర్థంగాలేదు. ఆయన ఒప్పుకున్నా, లేకపోయినా తనకు చింతలేదు. తను ఉద్యోగంలో చేరగానే నాన్నగారిని ఒప్పించి సావిత్రిని రిజిస్టర్ మ్యారేజి అయినా చేసుకోవచ్చు. సావిత్రిని తను అన్యాయం చేయలేడు. ఎన్ని అవరోధాలొచ్చినా ఈ జీవితంలో సావిత్రిని వదులుకోలేడు"

ఈ ఆలోచనలతో ప్రకాశం బుర్ర వేడెక్కింది. "ఇంతకూ ఆమె నాలుగురోజులుగా తనకెందుకు కన్పించలేదు? అదీ అయోమయంగావుంది. బహుశా అస్వస్థతగా వుందేమో!" కాని ఆ సమాధానం అతని కెందుకో తృప్తినివ్వలేదు. "తన గురించి గ్రామంలో కాస్తోకూస్తో వదంతులు లేచినట్లే వినికిడి. తన తండ్రికిమాత్రం యీ విషయం తెలియదనే తన భావన. మరి నిజం ఏమిటో!

"బావా!" ఎవరో తలుపుదగ్గర నిల్చుని పిల్చారు. ప్రకాశం అటువేపు చూశాడు. ఎదురుగా పదేళ్ళబ్బాయి సావిత్రి తమ్ముడు.

"ఏమోయ్ సూర్యం!"

"అక్కయ్య నీకీ ఉత్తరం ఇమ్మంది" అంటూ చొక్కా జేబులోంచి ఒక కాగితంముక్క తీసి అందించి, "నే వెళతాను బావా" అని వెళ్ళిపోయాడు. వాడలా వెళ్ళగానే ప్రకాశం దాన్ని చదువుకొన్నాడు.

బావా!

అన్ని వివరాలూ ఇందులో వ్రాయలేను. మీకీ ఉత్తరం అందేసరికి నేను మామిడివనంలో మీ కోసం కాచు కొనుంటాను. మీతో చాలా మాటాడాలనుంది. ఉత్తరం చూడగానే వస్తారుగదూ.

మీ కోసం వేచియుంటా

మీ

సావీ

ఆ నాలుగువాక్యాలూ గబగబా చదివి వెంటనేగదికి తాళంవేసి తోటవేపు బయలుదేరాడు.

జూన్ నెల గావటంచే తొమ్మిదిగంటలేఐనా ఎండ విప రీతంగా కాస్తోంది. సూర్యుడు తన రూక్షణ వీక్షణాలచే ప్రకాశం శరీరంపై తన ప్రభావం చూపిస్తున్నాడు. ప్రకాశం వనం చేరేసరికి చొక్కా వెనుకభాగమంతా పూర్తిగా తడి సింది.

"సావీ!" అని పిలిచాడు వనంలో కడుగుపెడుతూనే.

"బావా! ఇక్కడ"

ప్రకాశం ఆమె దగ్గరగావెళ్ళి, "అమ్మయ్యా" అని నిట్టూర్చి ఆమె ప్రక్కనే చతికిలపడ్డాడు. "ఏం సావీ! యీ మధ్య దర్శనమే లేదు" అంటూ.

"బావా"

"ప్రకాశం ఆమె ముఖంవేపు చూశాడు. ఆమె కళ్ళలో నీళ్ళు నిలచివున్నాయి.

"ఏమిటిసావీ ఈ కన్నీళ్ళు! ఛా! ఛా! నీ కెన్నిసార్లు చెప్పాను. ఇలా ఏడ్వకని" అంటూ ఆమె కన్నీటిని తన చేత్తో తుడవబోతూండగా, మధ్యలోనే ఆమె ఆ చేతిని తన చేత్తోపట్టుకొని, "వాటికేంలేబావా! ఈపాపిష్టికళ్ళకేమాత్రం బుద్ధిలేదు" అంటూండగా కన్నీటిబిందువులొక్కటొక్కటే రాలసాగినై.

"కన్నీరు స్త్రీలసొమ్ము అనే విషయం నాకూ తెలుసు గాని నీ విలా ఏడ్చి నన్ను బాధపెడితే ఎలా సావీ"

"బావా! ఇక మనం కలుసుకోవటానికి వీలుపడ దేమో!"

"అంతలోనే ఏంప్రమాదమొచ్చింది! ఎవరన్నారా మాట?"

"మా నాన్నకు మన విషయం పూర్తిగా తెలిసి పోయింది బావా!"

"చాలా మంచిపని జరిగింది"

"నన్ను ఇల్లుకదలకుండా కట్టుదిట్టాలుచేశాడు. వారం రోజులుగా ప్రయత్నించి, చివరకీనాడు వీలుదొరికి ఇలా వచ్చాను బావా"

"ఓహో! కథ అంతవరకూ వచ్చిందన్నమాట! సరే మీ నాన్నగారినడిగే ఈ విషయమేదో తేల్చుకుంటాను"

"అయ్యో! ఎంతపిచ్చివానివి బావా! ఆయనసలే మీపై కోపంతో వున్నారు"

"అసలు ఆయన కోపంతోగాని, ఆయనతోగాని నాకు మిగిలిపోయిన కార్యమేముంది? నాక్కావాల్సింది నువ్వు. నేనంటే నీకు పూర్తిగా అభిమానమేనా సావీ?"

"అవేంమాటలు బావా! నీవూ నన్ను పరీక్షిస్తున్నావా?"

"లేదుసావీ! నేనేం చెప్పినా చెయ్యగలవా?"

"నిప్పుల్లో దూకమన్నా దూకుతాను"

"మరీ అంతప్రమాదమొద్దుగాని, నేను కొద్దిరోజుల్లో ఉద్యోగం సంపాదిస్తాను. అప్పటికీ అన్నిప్రయత్నాలూ జరిగాయి. నీవు నా వెంటరాగలవా"

"బావా!"

"అవునుసావీ! అన్నీ ఆలోచించే ఈ నిర్ణయాని కొచ్చాను. మనం రిజిష్టర్ వివాహం చేసుకుందాం"

"నిజంగానా బావా! నాకంత అదృష్టమా! మరి మీ నాన్నగారూ ..."

"నాన్న నా మాట గాదనడనే విశ్వాసం నాకుంది. ఆయనకాదన్నా నే చెప్పినది తూ చా జరుగుతుంది. నీవు 'వూ' అంటే చాలు"

"నాకు అన్నివిధాలా సంతోషమే బావా! ఇంతకంటే నేను జీవితంలో సాధించగలిగేది, పొందగలి గేది మరేదీ లేదు" అంటూ అతని హృదయంపై వాలింది.

"సావిత్రీ!" వెనుకనుండి వినిపించిన ఈ భయంకరగర్జనకు సావిత్రి ఉలికిపడి అటువేపుచూసింది. ఎదురుగా నాన్నగారు.

ప్రకాశం ఉన్నవాడల్లా ఒక్కసారిగా లేచినిలబడ్డాడు. ఎదురుగా దుడ్డుకర్రతో భయంకరంగా కన్పిస్తున్న 'సాంబయ్య'ను చూస్తూ.

"అప్రాచ్యురాలా! ఇటురావే" సాంబయ్య క్రోధంతో అరచాడు.

"ఆగుసావీ! వెళ్ళకు" ప్రకాశం చాలా నిదానంగా అన్నాడు గంభీరంగా.

"నువ్వెవడవోయ్ మధ్య..." ఇంకా ఏదో అనబోతూండగా.

"మీ అల్లుణ్ని" అన్నాడు ప్రకాశం.

"నోర్ముయ్..."

"మామగారూ! మీకు గౌరవమిచ్చి పూజ్యభావంతో అడుగుతున్నాను. నాగురించి, సావిత్రిగురించి మీకుపూర్తిగా తెలుసు"

"నోర్ముయ్ గాడిదా! ఆ ట్టేవాగావంటే పళ్ళూడగొడు తాను'

"మీరీ కోపంలో ఏమన్నా ఫరవాలేదు. ముందు నా మాట పూర్తిగావినండి. సావిత్రిని నేను హృదయపూర్వకంగా ప్రేమించాను, సావిత్రికూడా నన్ను అలాగే ప్రేమించింది..."

"ప్రకాశం! ఒళ్ళుదగ్గరుంచుకొని మరీ మాటాడు. పాముతో చెలగాటమాడుతున్నావ్! నీ వనుకున్నవిధంగా

ఏనాటికీ జరుగదు. శ్రుతిమించి రాగానపడితే ఫలితమనుభ విస్తావ్!"

"మామగారూ! మిమ్మల్ని గౌరవంగా అర్థిస్తు న్నాను. ఇప్పటి పరిస్థితులదృష్ట్యా ఈ వివాహం ఎంతో శ్రేయస్కరం. రగిలిన మనకుటుంబాలు ఇందువల్లనయినా"

"ఇకఆపు. నా కంఠంలో ప్రాణముండగా నీకూ సావిత్రికీ వివాహం జరుగనివ్వను. అమాయకురాలయిన నా కుమార్తెలాగా నన్నుకూడా వలలో వేసుకోవాలని ప్రయ త్నించకు. మీ నాన్నా నువ్వూ కలసి ఆడేనాటకం ఇది"

"మామయ్యా! నన్నంటే అన్నావుగాని యింకొక్క సారి మా నాన్నగారినలా అన్నావంటే"

"ఏంచేస్తావోయ్! చేసేటిలాంటి నీచకార్యాలూ, పైగా..."

"మామయ్యా! పెద్దవాడివని యింతవరకూ గౌరవ మిచ్చాను. ఇచ్చేగౌరవాన్ని అతిక్రమిస్తున్నావ్"

"ఏమిటోయ్ పెద్ద నీగౌరవం! ఎవనిక్కావాలోయ్ నీ బోడిమర్యాద! కల్లబొల్లికబుర్లుచెప్పి ఆడపిల్లలను వలలో వేసుకోవటమేనా నీ గౌరవం? చేసిన నీచకార్యంచాలక సిగ్గు లేక బరితెగిన ఎనుబోతులా ఎదురుతిరిగి వాగటమేనా నీ మర్యాద. సిగ్గులేదూ చదివావ్ పెద్దచదువులు. బుద్ధిలేకపోతే సరి"

"సాంబయ్యా!" ప్రకాశం నవనాడులూ కోపంతో స్పందించాయి.

"ఏమిటోయి ఆ బెదిరింపు. ఇంకోసారి మాపిల్ల ప్రక్కగా కనిపించావంటే నిలువునా చీల్చిపారవేస్తాను జాగ్రత్త" అని సావిత్రినుద్దేశించి "సావిత్రీ! సిగ్గులేక ఇంకా ఇక్కడే నిలబడ్డావా! బుద్ధిలేని గాడిదలవెంట తిరుగవద్దని ఎన్నిసార్లు చెప్పినాను ఇలా తెగించివస్తావా! కులానికే కళంకం తెచ్చావే!"

"నాన్నా! నేనేం కులానికి ప్రతిష్ట తెచ్చే పని ఏదీ చెయ్యలేదు. యోగ్యుణ్ణి, సమర్థుణ్ణి, సాటికులస్థుణ్ణే ప్రేమించానుగాని. మన గౌరవమేదీ మట్టిగలుప లేదు"

"నోర్మూయ్"

"నాన్నా నా నోరుమూయ్యగలవు, బంధించగలవు కాని అంతకుమించి మరేం చెయ్యలేవు. నా ఆత్మనూ, మనస్సునూ ఏనాడూ ఏమీ చెయ్యలేవు. నేను ఏనాడైనా ప్రకాశం భార్యనే"

"సావిత్రీ!" చెయ్యిసాచి చెంపపై వేశాడు. "రేయ్ ప్రకాశం! ఇంతస్థితికి తెచ్చావన్నమాట ఈ విషయాన్ని. నే నింతవరకూ అర్థంచేసుకోలేదు. సరే నీ అంతుఏదో తేలుస్తా! సావిత్రీ కదులు..." అంటూ ఆమె రెట్టబట్టుకున్నాడు.

"నేను రాను..."

"ఆఁ ఎంత తెగించావే. వీణ్ని చూసుకొనేగా నీఅండ వీణ్నికర..."

"నాన్నా"

"సాంబయ్యా! నీ గర్వం నీ కళ్ళు కప్పుతోంది. మర్యాదగా సావిత్రిని వదులు"

"లేకపోతే ఏంచేస్తావోయ్!" అంటూ ముందుకువచ్చి సాంబయ్య కర్రపై కెత్తాడు.

"నాన్నా!" కెవ్వునఅరచి అడ్డువచ్చింది సావిత్రి.

"సావీ"

సాంబయ్య నిగ్రహంతో కర్రదింపుకొని "బ్రతికి పోయావ్! యింకోసారి ఇలా కనిపించావా నీఅంతు తేలుస్తా" అని సావిత్రి రెట్టబలంగా పట్టుకొని బరబరా ఈడ్చుకు పోయాడు.

"బావా!" భయంగా రోదించింది సావిత్రి.

"సావీ, నీకేం భయంలేదు, అన్నిటికీ నేనున్నాను" అన్నాడు గంభీరంగా ప్రకాశం.

*　　　*　　　*

ప్రకాశం భారంగా అడుగులువేస్తూ తీవ్రమయిన ఆలోచనలతో యింటికి చేరుకొన్నాడు. తనూహించిన సాంబయ్యకూ ఇప్పుడు ప్రత్యక్షంగా చూసిన సాంబయ్యకూ ఎంతభేదం! చూస్తాను, నాఅంతు తేలుస్తాడటగా సావిత్రి నాకు ఎలా దక్కదో?"

*　　　*

సాంబయ్య సావిత్రిని తీసుకువచ్చి దేవునిగదిలోత్రోసి చిలుకు తగిలించి, "ఈ సారి ఇల్లుకదులు కీళ్లు విరగ్గొడతాను. ఎంత అట్టహాసం, ఎంతధైర్యం..." ఇల్లు అదిరేలా అర

చాడు సాంబయ్య. ఇంట్లోని వారందరూ అతని భయంకర స్వరానికి నిలువెల్లా వణికిపోయారు.

"చూస్తాను వాడెంతో, వాని పొగరెంతో. నన్నే ధిక్కరిస్తాడుగా. ఎవడనుకున్నాడో" మీసాలు మెలివేశాడు సాంబయ్య.

* * * * *

సావిత్రికి మనసులో మనసులేదు. గుండెల్లో గుండెలు లేవు. తన తండ్రి మాటలు విన్నతర్వాత బావపై ఏ అఘాయిత్యం తల పెడతాడో ననుకొని వణకిపోయింది.

తలదిండు తడచేలా "బావా" అంటూ భోరుమని ఏడ్చింది. అబల అంతకుమించి మరేం చేయగలదు?

# 20

వెంకట్రామయ్యగారు ప్రకాశాన్ని మళ్ళీ కాలేజీలో చదివించే వూహలోనూ ప్రయత్నంలోనూ వున్నారు. ఇలా చదువాగిపోతే ఎటూగాకుండా త్రిశంకు స్వర్గంలా తయారవుతాడు. ఇక ఎటొచ్చీ డబ్బుగురించే కాస్తయిబ్బంది. తన బావమరిదిని మళ్ళీ అడగటానికి తన మనసు సంకోచిస్తోంది. తన ఆలోచన ప్రకారం ప్రకాశం ఈ యేడు ఇంటర్ పూర్తి చేసుంటే తను అడుగకనే డాక్టరీ చదివించేవాడు వాని మేనమామ. ఇప్పుడు చూస్తే యిలా అయింది. తనిప్పుడు ఏ మొహంపెట్టుకొని అడుగగలడు? ప్రకాశం భవిష్యత్తే తన కుమార్తె భవిష్యత్ అని అతనికీ తెలుసు. తనై తాను అడి

గితే లోకువ! ఇప్పటికే అతనిదగ్గర ఆరువేలు అప్పుచేశాడు తను. ఈ సారి ప్రకాశంను చదివించమని అడిగేందుకన్నా పెళ్ళిప్రస్తావన తేవటమేఉత్తమం! పెళ్ళిచేస్తే తనకిక ప్రకాశం గురించి ఏ దిగులూ వుండదు. ఎటుతిరిగీ ప్రకాశం, రామం పెళ్ళిగానిదీ ఈ పెళ్ళికి వప్పుకుంటాడా అనేదే తనకు పెద్ద సందేహం. రామంకు కూడా పెళ్ళి ప్రయత్నం ఎక్కడేనా చేస్తే ఉత్తమం! ఐనా పరిస్థితి చెబితే ప్రకాశం అంగీకరించక పోడు. వానిపై తనకు సంపూర్ణ విశ్వాసం. వాని పెళ్ళిచేస్తే చదువూ సాగుతుంది. డాక్టర్ అవుతాడు. ఇక తనకు ఏ బాదరబందీ కూడా ఉండదు.

ప్రకాశం ఉజ్వలభవిష్యత్ గురించి ఈ విధంగా ఆలోచించసాగాడు రామయ్య. అతని ఆలోచనలకు రూపం అప్పుడే ఏర్పడుతున్నట్టుగా అదేసమయంలో అతని బావ మరదికూడా రానేవచ్చాడు. అతనిరాక రామయ్యగారి కెంతో ఆనందం కల్గించింది.

కుశలప్రశ్నలూ, క్షేమసమాచారాలు, కాఫీ సేవించ టాలూ అన్నీ ముగిసిన తర్వాత ఆయనే ప్రకాశం పెళ్ళిప్రస్తా వన తెచ్చాడు.

“అనుకోనివిధంగా ప్రకాశం ఈ సంవత్సరం డిటైన్ గావటం నీకు తెలిసిందే. అంతా నా ఖర్మ. లేకపోతే ఈపాటికి లక్షణంగా ఇంటర్ పూర్తయివుండేది” అని విచారించాడు రామయ్య.

“విచారించి ఏం లాభం బావా! జరిగిందేదో జరిగి పోయింది, గతం తలచుకొనేకొద్దీ కేవలం బాధతప్ప

మరేమీ వుండదు. ఇకముందు సంగతి ఆలోచించాలి గాని..."

"అదే నా ఊహా కూడాను. మళ్ళీ ఈ సంవత్సరం చదివి ఆ ఇంటర్ కాస్తా ముగిస్తే మంచిదేననుకో..."

"మరి పెళ్ళో"

రామయ్యకు కూడా ప్రస్తుతం ఈ మాటేగావాలి. "ఇక ఈ పరిస్థితులలో పెళ్లి ఎటూ చేయక తప్పదు. నా పరిస్థితులు నీకు తెలియనివిగావు. ప్రకాశంను నీ చేతుల్లో పెట్టే వరకే నా భారం. ఇక పెళ్ళిచేయటమూ, ఆ ఇంటరూ డాక్టరీ ముగించటం కూడా ఇక నీ బాధ్యతే ఏమంటావ్?"

"నీ వింతగా చెప్పాలాబావా! నాకు మాత్రం తెలీదూ ఏదో దురదృష్టంకొద్దీ వాడిలా తయారయ్యాడు. ఇక ఈసారి ఇంటర్ పూర్తిచేయించి రేపు సంవత్సరం ఎటూ డాక్టరీ చదివిస్తాను. కాని ఒకషరతు"

"ఎంతచల్లనిమాట చెప్పావోయ్. ఇంతకూ ఆ షరతేమిటి?"

"ముందు పెళ్ళిచేస్తే మంచిదని నా అభిప్రాయం"

"నిక్షేపంగా! ఇప్పట్లో ఎటూ ముహూర్తాలు లేవు. మాఘంలో పెళ్ళిపూర్తిచెయ్యవచ్చు!"

"నా అభిప్రాయంకూడా అదే! ముందు ప్రకాశం అభిప్రాయం కనుక్కో—బావా"

"ఇక వాని అభిప్రాయం ఎందుకోయ్! నా మాట వాడెన్నటికీ కాదనడు"

"అయినా అడగటం, అభిప్రాయం తీసుకోవటం మంచిదిగదూ"

"సరే, అలాగే"

వీరిలా మాట్లాడుకుంటూండగా ప్రకాశం అప్పుడే ఇంట్లో అడుగుపెట్టాడు. మామగారిని చూడగానే చిరు నవ్వుతో "ఎప్పుడొచ్చారు మామయ్యా" అని ప్రశ్నించాడు.

"ఇంతకుముందేనోయ్! నీవు మరచినంతమాత్రాన నేను నిన్ను వదలనులే" అన్నాడాయన చిర్నగవుతో. ప్రకాశంకూడా చిన్నగానవ్వి తనగదిలోకి వెళ్ళాడు.

వెంకట్రామయ్య ఆనందంతో తబ్బిబ్బులైపోతు న్నాడు. వెదకబోయినతీగె కాలికితగిలినట్టుగా, అనుకున్న దంతా సవ్యంగాజరిగిపోయింది. బావమరిది అన్నివిధాల అంగీ కరించాడు. ఇక వెంటనే ప్రకాశంను పట్నం పంపించాలి. తియ్యని ఆలోచనలలో ఆయన మునిగిపోయాడు.

ప్రకాశం అలావెళ్ళగానే మళ్ళీ యిద్దరూ ఏవో సంభాషణలలో మునిగిపోయారు.

ఆ రాత్రి భోజనాలయిన తర్వాత ప్రకాశం గదిలోకి ఒంటరిగా ప్రవేశించాడు రామయ్యగారు.

"ఏం నాన్నా!" అంటూ ప్రకాశం కుర్చీలోంచి లేచాడు.

"కూచో! కూచో! నీతో ఓ విషయం మాటాడి పోదామనివచ్చాను" అంటూ తనూ ఒక కుర్చీలో కూల బడ్డాడు. ప్రకాశం తండ్రి కెదురుగా కుర్చీలో కూచోవటం యిష్టంలేక అలాగేనిల్చొని "ఏవిషయంనాన్నా" అనడిగాడు.

"అదే మళ్ళీ నిన్ను కాలేజీకి పంపటాన్ని గురించి"

"నేనీ సంవత్సరం చదువదలచుకోలేదు నాన్నా"

రామయ్య ఈ జవాబుకు నిర్ఘాంతపోయాడు. "అదే మిట్రా అలా అంటావ్! ఇంతటితో చదువాపి ఏంచేద్దామని నీ ఉద్దేశ్యం"

"ఉద్యోగం చేస్తాను నాన్నా! మొన్న పట్నం వెళ్ళినపుడు అన్నీ చూసుకొనే వచ్చాను. వారం పదిరోజులలో అపాయింట్ చేస్తామన్నారు"

"ప్రకాశం! ఇంతటితో నీ చదువు ఆగటం నాకెంత మాత్రమూ ఇష్టంలేదు"

"ఇప్పటి పరిస్థితులుబట్టి ఈ ఆలోచన కొచ్చాను నాన్నా"

"పరిస్థితుల ప్రధానమా! నీ భవిష్యత్తు ప్రధానమా!"

"వర్తమానాన్ని బట్టి భవిష్యత్తును ఆలోచించమన్నారు పెద్దలు. ఇప్పటి పరిస్థితులలో డబ్బు ఆడుకోవాలంటే ఎంతకష్టమో మీకు తెలిసీ, నన్నిలా చదవమనటం సమంజసంగాదు"

"ప్రకాశం! ఇకఏదీ దాచి ప్రయోజనంలేదు. నాకు నేనుగా ఇప్పట్లో నిన్ను చదివించలేను. అలాగని నీ చదువూ ఆపుచేయలేను. నాకు నీ భవిష్యత్ ముఖ్యం. వర్తమానాన్ని దలమకొని కుములుతూ బంగారంలాంటి భవిష్యత్ నాశనం చేసుకోవటం మంచిదిగాదు. మీ మేనమామగారే నిన్ను చదివించాలనుకుంటున్నారు"

ప్రకాశం అరక్షణం నిశ్శబ్దంగావుండి, "కాని నాన్నా! మనకు లేనపుడు ఒకరిపై ఆధారపడి చదవటం నాకేమాత్రం ఇష్టంలేదు" అన్నాడు.

"ఆ ఒకరూ పరాయివారేమట్రా - స్వయానా మీ మేనమామగారేగా"

"కావచ్చునాన్నా. బంధుత్వానికీ ఇలా ఆధారపడటానికీ చాలాదూరంవుంటేనే మంచిది. చివరకు మీరు అప్పుచేసి నన్ను చదివించినా నేనంగీకరించగలనుగాని ఒకరిని ఆశ్రయించిమాత్రం నేను నా జీవితంలో ఏ పనీ చెయ్యను నాన్నా. ఈ విషయంలో నన్ను క్షమించు" రామయ్య క్షణకాలం నిశ్చేష్టుడై, "ఆశ్రయించమని నిన్నెవరన్నారురా! లక్షణంగా ఆయింటి అల్లునివై చదువు"

"అంటే!"

"మీ మామ కూతురు సరోజ నీకు తెలిసిందేగదూ! మంచిది, గుణవంతురాలూ రూపవతికూడా! ఆ అమ్మాయిని నీకిచ్చి పెళ్ళిచేయాలని నా తలంపు. మీ మామగారు ఇప్పుడందుకే వచ్చారుకూడా"

ప్రకాశం నిలువునా నిర్విణ్ణుడైపోయాడు, "నాకా! పెళ్ళా!"

"ఏం...?"

"ఇదేం విపరీతంనాన్నా, నాకంటె పెద్దవాడు అన్నయ్యవుండగా! నాకసలు యిప్పట్లో పెళ్లిఅవసరంలేదు"

"మీ అన్నయ్య సంగతీ నిజమేగాని, నేనీమాఘంలో పెళ్లి జరిపిస్తానని మాటిచ్చానుగదరా!" ఆ స్వరం వినగానే ప్రకాశం చలించిపోయాడు.

"నాన్నా ఇదేనా నీ అభిప్రాయం?"

"అవును బాబూ! ఇప్పట్లో నిన్ను చదివించాలంటే నా దగ్గర డబ్బులేదు. అదీగాక నీ పేరుతో మీ మామదగర ఆరువేలు అప్పుకూడా చేశాను. అన్నివిధాలా అతనికి వాగ్దానం చేశాను. నీ పెళ్ళి జరిగితే ఆ కట్నం డబ్బుతో మీ మామగారే నిన్ను డాక్టరీవరకూ చదివిస్తామన్నాడు, అన్నివిధాలా నీవీపెళ్ళి తప్పక చేసుకోని తీరాలి. నా మాట గాదనకు"

"నాన్నా! నన్నిలా కట్నం పేరుతో అమ్మడంతోనే నా భవిష్యత్‌కు మార్గం వెయ్యాలనుకుంటున్నారా! నే నిలాంటిపని చెయ్యనునాన్నా! ఇలాంటి డబ్బుతో చదవటం నా ఆత్మాభిమాననానికే విరుద్ధం! నాకీచదువులతో మిగి పోయిందేమీలేదు. నాకు కష్టించి సంపాదించే సమర్థత వుంది, ఉద్యోగం చేయగలిగిన యోగ్యతా వుంది" రామయ్యగారు ఊహించని ఈ జవాబుకు నిర్ఘాంతపడి పోయాడు. "నాయనా ప్రకాశం! అలా అంటే ఎలాబాబూ! నిన్ను సంపూర్ణంగా విశ్వసించి మీమామకు మాటిచ్చాను రా! తండ్రికి కుమారుని భవిష్యత్‌కంటే మించికావాల్సిందే ముంది. కట్నంపేరుతో నిన్నలా అమ్ముతున్నాననుకోకు బాబూ! పరిస్థితులబట్టి నడచుకోవాలి. అసలిది కట్నమెలా అవుతుంది. మీ మామ నిన్ను ప్రేమతోచదివిస్తున్నాడుగాని"

"నాన్నా" ప్రకాశం గొంతు జీరపలికింది. మీ కోర్కెకు విరుద్ధంగా నేనీపని చేస్తున్నందుకు నన్ను క్షమించండి. నేనీ సంబంధాన్ని చేసుకోలేను నాన్నా! నన్నెందుకిలా అన్యాయం చేస్తారు.

"అవున్రా! అంతా నేనేచేస్తున్నాను. మిమ్మల్ని నిలువునా చీల్చివేస్తున్నానురా! మీ జీవితాలను నాశనం చేస్తున్నాను, మీ కన్యాయం చేస్తున్నాను. ఏదీ ఇంకోసారిఅను బాబూ ఆ మాట! అయ్యో ఎవరికోసంరా ఇదంతా నాకోసమట్రా! నా భవిష్యత్ కట్రా! ఏదో నన్నుద్ధరిస్తారనీ నా మాట, నా పరువూ నిలబెడుతారనీ మిమ్మల్నిలా చదివిస్తే ఇదేనేమిట్రా మీరు నాకిచ్చే ప్రతిఫలం? వాడుచూస్తే నాకీ జన్మలో పెళ్ళివద్దురో అని మొత్తుకుంటాడు. నీవుచూస్తే ఇలా ఆత్మాభిమానం అని అరుస్తావ్. మీ ఇష్టమొచ్చినట్టు చావండి. మీ ఇష్టమొచ్చినదానితో ఊరేగండి! మీ ఆట మీదే మీ పాటమీదే. నేను ఉరిపెట్టుకొని చచ్చిన తర్వాత అంతా మీ ఇష్టమొచ్చినట్టు కులకండిరా అయ్యో భగవంతుడా! ఎలాంటివారిని నా కడుపున పుట్టించావయ్యా" బాధతో, కోపంతో నెత్తిబాదుకున్నాడు రామయ్య.

"నాన్నా"

"ఇంకా నాన్నను ఎక్కడ మిగిల్చారురా! అంతా సర్వనాశనంచేసి పారవేశారు. నీ మీదపెట్టుకున్న ఆశలన్నీ ఒక్కమాటతో మంటగలిపావ్! నన్ను కూడా మీ చేతులతోనే చంపండిరా! అప్పటికిగాని మీకు తృప్తివుండదు"

"నాన్నా! నన్ను ఆలోచించుకోనివ్వండి ఒక్కవారం రోజులు గడువివ్వండి"

"ఆఁ... అంతేచాలు బాబూ! వారంరోజులుగాదు, సంవత్సరంతీసుకో! నీవు ఒప్పుకుంటే నా కంతేచాలు" రామయ్యలో మళ్ళీ ఆనందం, ఆశ చిగురించాయి. "మీ మామతో చెప్పమంటావేమిరా"

"ఇప్పుడేవద్దునాన్నా! ఒక్కవారం తర్వాత కబురు పంపుతానని చెప్పు"

"సరే! నా మాట పొల్లుబోనీకు" అని రామయ్య బయటకు వెళ్ళిపోయాడు. ప్రకాశం దీర్ఘంగా నిట్టూర్చి "సావిత్రీ" అని బాధగా, బరువుగా, అస్పష్టంగా గొణుక్కున్నాడు.

*    *    *    *

ప్రకాశం తన తండ్రి నోటిద్వారా ఈ పెళ్ళివిషయం విన్నతర్వాత అతని అంతరాత్మలో ఏదో అజ్ఞాతశక్తి క్షణ క్షణమూ, "నీవు సావిత్రికి ద్రోహం తలపెడుతున్నావ్" అని హెచ్చరించసాగింది.

"లేదు లేదు అలా ఎన్నటికీగాదు. సావిత్రినాది. ఆమెకై ఏ త్యాగమయినా చేస్తాను" అని అనుకొన్నాడు విచలితమనసును అదుపులోపెట్టుకో ప్రయత్నిస్తూ.

"ప్రకాశం" ఎవరో పీపుదట్టి పిలచినట్టయింది.

"ఎవరూ?" ప్రకాశం సన్నగా గొణిగాడు.

"నేను అనుక్షణమూ నీలో కాపురముండి నీ ప్రతి స్పందననూ గమనించే నీ అంతరాత్మను! ప్రకాశం! ప్రేమ అనే పిచ్చిభ్రమలోపడి వాస్తవాన్ని విస్మరిస్తున్నావ్! ముందు వచ్చిన చెవులకంటే వెనుకవచ్చిన కొమ్ములువాడి అన్నట్టు చిన్నప్పట్నుంచీ నిన్ను ప్రేమించి పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించి నీ భవిష్యత్ కోసం, నీ సుఖంకోసం సర్వమూ త్యాగంచేయడానికైనా వెనుకాడని నీ తండ్రిని విస్మరించి, మధ్యలో ఏర్పడిన ఈ ప్రేమ వ్యామోహంలో పడి కృతజ్ఞత అనే పదానికి ఏ మాత్రం విలువనియ్యక కృతఘ్నుడవౌతున్నావ్. ప్రకాశం! మానవునకేదీ శాశ్వతం గాదు. ఎప్పుడైనా ఎన్నికష్టాలొచ్చినా ఈప్రపంచంలో నిన్ను ఆదుకునేవారు నీ ఒక్క తండ్రిమాత్రమే. ఇంకెవ్వరూ నీకు సాయంచేయలేరు. ఇంకెవ్వరూ నిన్ను ఆదుకోరు. నీ కోసం అప్పులుచేశాడే నీ తండ్రి. మీ భవిష్యత్ కోసం భూములు గొని వ్యవహారాల్లోదిగాడే నీ తండ్రి! ఎవరికోసం ఈ శ్రమ? ఎవరికోసం ఈ త్యాగం? అంతా మీ కోసం! మీ సుఖ శాంతులకోసం! మీ భవిష్యత్ కోసం! ఎందులోనూ అతని స్వార్థంలేదు. నీ జీవితం పూలబాటగా నడవాలాని డాక్టరీ చదివించడానికేగా ఈ సర్వప్రయత్నమూ! చివరకు నీవు ఎన్నితప్పులుచేసి డిస్మైన్ అయినా నిన్ను హృదయపూర్వకంగా క్షమించగలిగాడే! ఆ మాత్రం దయాపూరిత క్షమ ఈ విశ్వంలో నీ కెవరివద్దనుండి కూడా ఎన్నితప్పులు చేసినా లభించదు. ఈ జీవితంలో మీ నాన్నే నీకు సర్వస్వం! అతనే దైవం! అతనే ధ్యేయం! నీకు ముచ్చటగా మూడు ముళ్ళూ

వేసి నిన్ను డాక్టరీ చదివించి నిన్ను పెద్ద అంతస్తులో జూచి గర్వించి, కీర్తి సంపాదించుకోవాలనుకున్న నీ తండ్రి ఆశలకు నీ విచ్చే ప్రతిఫలం, నీవుచూపే కృతజ్ఞతా ఇదేనా? సావిత్రి అంటావా! ప్రేమఅంటావా! అదంతా కేవలం యవ్వనో ద్రేకం ప్రకాశ్! మూనాళ్ళ ముచ్చట! మూడుక్షణాల నరాల బలహీనత! శాశ్వతమయినదాన్ని విడిచి క్షణికంలో పడి నీ మానవత్వాన్ని మంటగలుపుకోకు. మానవుడుగా నీవు జీవించగలిగిననాడే మానవత్వం సిద్ధించిన నాడే నీకు పరి పూర్ణత! అది దాటితే నీవు పశుసమానం! నీకీలోకంలో స్థానంలేదు. మీ నాన్నగారి ఆవేదననూ, ఆక్రందననూ అర్థంచేసుకో! అన్నీ విస్మరించి ఆ ప్రేమే నీ సర్వస్వం అను కొని కన్నతండ్రికి ద్రోహంతలపెడితే నీ ద్రోహానికి ప్రాయ శ్చిత్తంలేదు. ఎవరూ నిన్ను క్షమించలేరు. దైవంకూడా నిన్ను క్షమించడు. ప్రకాశ్ బాగా ఆలోచించు. పిచ్చిగా ప్రవర్తించకు! భవిష్యత్‌ను దృష్టిలో పెట్టుకొని అడుగు ముందుకువెయ్యి. కాలుజారావా నీకు ముక్తిలేదు. ఇప్పుడే నీవు నీ జీవితానికి పునాది వేసుకోవాలి. ఇదే నీ జీవితానికి తొలిమలుపు. తర్వాత చింతించీ లాభంలేదు.

"అబ్బా! అయ్యో!" అని తలబాదుకున్నాడు ప్రకా శం. ఎవరోగట్టిగా వికటాట్టహాసం గావించినట్టయింది. ఏదో ఛాయ గట్టిగా గర్జించింది.

"ప్రకాశం! ఎందుకు తలబాదుకుంటావ్? నీకేమనర్థం వచ్చిందని? ఎందుకుచెప్పు ఈ పనికిమాలిన సమస్యలూ బంధాలు. జీవితం అంటేఏమిటి? నీ వక్కనివీ జీవితంకా

గలవా? జీవితంఅంటే మానవమతం. మానవుని కోరికల స్వరూపమే జీవితం. ఆ కోరికలెప్పుడు సిద్ధిస్తాయో, అవి ఎప్పుడు అనుకూలిస్తాయో అప్పుడే జీవితం. కానపుడది వల్ల కాదు. ఎవరికి ఎవరీలోకంలో? ఎవరికెవరు అనుబంధం? అంతా అశాశ్వతం. తను నమ్మినది, ఇష్టపడినది, ఆశించినదే శాశ్వతం. అదేజీవితం. అదే ఆమే నీ ఆశ! ఆమే నీ యిష్టం! ఆమే నీ విశ్వాసం! ఆమె నీ ఛాయ! ఆమే నీ జీవితం! ఆమే నీవు! ప్రకాశం! ఒకరికోసమని ఒకరి సౌఖ్యంకోసమనీ, నీ సౌఖ్యాన్ని, నీ భవిష్యత్‌నూ, నీ జీవితాన్ని త్యాగంచేసి ఇక భవిష్యత్‌లో ఏంబావుకుంటావ్! ఎందుకోసం జీవిస్తావ్! ఎవరికోసమని బ్రతుకుతావ్? అంతామిథ్య అవుతుంది. నీవు నీవుగా లేనపుడు నీది జీవితంగాదు. అదొక కల్పనారూపం, మిథ్యాదర్పణం! ప్రకాశం బాగా ఆలోచించు. మీ నాన్న అంటావా త్యాగంపేరుతో క్షణికంగా ఏదోచేస్తే కొద్దికాలం మాత్రమే మీ మనసులు తృప్తిపడవచ్చు! కాని అందువల్ల జీవితంఅంతా ఆక్రోశించే వారెవరు? అలమటించే వారెవరు? నీవే, నీ మనస్సే. నీ జీవితం ఎడారిపువ్వులా తయారవుతుంది. నీవు జీవచ్ఛవంలా మనగలుగుతావ్! ప్రకాశం జీవించాలంటే అందులో ఒకవిధమయిన తృప్తీ, ఆకాంక్షా, ఉత్సుకతా వుండాలి. జీవితంలో ఏంసాధించానని ప్రశ్న వేసుకుంటే అది ప్రశ్నగా ఎప్పటికీ వుండకూడదు. "నీ జీవిత ప్రథమ లక్ష్యం సావిత్రి" అన్నావే. ఏవీ అప్పటి నీ మాటలు? ఇదేనా నీ దృఢత్వం! ప్రకాశం, ఆత్మవంచన చేసుకోవద్దు! ఎవరి

కోసమో ఏకో చేసి నిన్ను నమ్ముకున్న సావిత్రికి ద్రోహం చేయకు"

"లేదు, లేదు. నేను సావిత్రికి ద్రోహం చెయ్యను. చెయ్యలేను" ప్రకాశం ఆక్రోసించాడు.

"పిచ్చి ప్రకాశం! మళ్ళీ భ్రమలో మునిగిపోతున్నావ్. ప్రేమ అనేది ఎప్పటికీ శాశ్వతంగాదు. అదొక ఆకర్షణ, అదొక భ్రమ, కల్పన, మిథ్య. పిచ్చిప్రకాశం! ప్రేమ అనుబంధంగా రూపొందిననాడే దానికి స్థిరత్వం, సంపూర్ణం! మీ తండ్రీ కుమారుల మధ్య అనుబంధం ఈనాటిదిగాదు. అది వ్రేళ్ళతో సహా పాతుకొని, పెరిగి, పెద్దదై పుష్పించి కాయలు కాస్తోంది. నీ ప్రేమంటావా! అదింకా సరిగ్గా వ్రేళ్ళుకూడా పాతుకోలేదు. అలాంటి పవిత్ర అనుబంధాన్ని క్షణికంగా యోచించి అశాశ్వతమయిన ఆ ఆకర్షణలో పిచ్చిలోపడి నీ జీవితాన్ని, నిన్నుకన్న నీ తండ్రినీ ద్రోహం చేయకు. ఎవరివల్ల నీ వింతంవాడివయ్యావ్? ఎవరివల్ల నీవీనాడు ఈ స్థితిలో వున్నావు. నీకు జీవం ఎవరుపోశారు? నీకీ రూపం ఎవరు కల్పించారు? నీ తండ్రి... ప్రకాశం ఇంకా ఏమిటీ ఆలోచన? నీ ప్రణయం ఇందువల్ల గాయంకావచ్చు గాని కాలవరడిలో అదిమాసిపోతుంది. వెంటనే మీ నాన్నగారి ఆజ్ఞను పాలించి అతని పవిత్రాత్మకు శాంతిచేకూర్చు. ఇదంతా త్రోసి సావిత్రే కావాలంటావా? ముందు మీ నాన్న మెడకు ఉరితగిలించి ఆ తర్వాత సావిత్రి నీదనుకో. అంతేగాని..."

"లేదు నాన్నా, అలాచెయ్యను... చెయ్యను!"

"ప్రకాశం! ఏమిటా ఆక్రోశం! ఏమిటా ఆక్రందన నీ ఆదర్శాలూ, ఆశయాలు ఎక్కడకెళ్ళాయి. అనుబంధాలే ప్రధానమనుకొని ఆదర్శాల్ని త్యజిస్తావా సావిత్రి నీ అనుబంధంగాదూ. సావిత్రి నీ ఆదర్శంగాదూ? ఏమిటి నీ బుద్ధి మొద్దుబారిపోయిందా! ఆనాడు రాధ అన్నమాటలు జ్ఞప్తి లేవూ 'తన ఆదర్శాలకూ, ఆశయాలకూ సంకెళ్ళువేసుకొని పెద్దలు విధించిన హద్దు అనే నాలుగు గోడలమధ్య నలుగుతూ, తన వ్యక్తిత్వాన్నీ, ఆత్మనూ వంచించుకోవటం ఎంతవరకూ న్యాయం? తల్లీ తండ్రీ అంటారా నిజమే. జన్మకు కారకులవారు. తను జన్మించాడు. వారు పెంచారు. ఆ మమకారం ప్రేమ వారిలో వుండవచ్చు. కన్నారుకాబట్టి విధిగా పెంచారు. పెంచారుగాబట్టి ప్రేమిస్తున్నారు. అంత మాత్రంచే తన తల్లితండ్రులే తన ఆదర్శాలనుకొని కృంగి కృశించటం ఎంతవరకూ సమజసం? తన్ను తలిదండ్రులు ప్రేమిస్తే తను అంతకుమించిన ప్రేమతో ఇంకొకర్ని ప్రేమించాడు. తలిదండ్రులే తనకై అంతగా ప్రాకులాడితే తను ప్రేమించినవారికై తనెంతగా ప్రాకులాడాలి? తలిదండ్రులుగా కర్తవ్యం వారు నిర్వహించారు. అదివారి విధి. అంత మాత్రంచే తను ప్రేమించిన అమ్మాయిని, నికృష్ట దౌర్భాగ్య భావాలతో వంచిచటం ఏంమగతనం? ప్రకాశం ఇప్పుడైనా దారికొస్తున్నావా? తప్పుదారిపడితే అది మానవత్వమనిపించుకుంటుందా! సావిత్రి నీ కోసం జన్మించింది. ఆమేనీవు, నీవే ఆమె. ఆమె కన్యాయంచేసి భగ్నప్రేమికునిగా జీవితంఅంతా ఎడారి చేసుకొని, ఒయాసిస్సులకై ఎదురు చూడకు.

కనిపించే సత్యాన్ని కాలదన్నకు. నమ్మిన ప్రణయాన్ని నరికి వేయకు. ఆశలుంచుకొన్న అమాయకురాలిని ఆహుతిచేయకు? ప్రకాశం అది నీ విధి. అది నీ ఆదర్శం! అది నీ ఆశయం. నీ కర్తవ్యానికి గొడ్డలిపెట్టుపెట్టకు! సావిత్రిని దూరం చేసుకోకు. ఎన్ని అవరోధాలు సంభవించినా నీ ప్రథమలక్ష్యం సావిత్రి"

"అవును. సావిత్రే నా జీవితలక్ష్యం. ఆమె నా జీవితాదర్శం! ఆమెకు నేను అన్యాయం చేయను. నా స్వార్థం పేరుతో నిన్ను ఆహుతి చెయ్యను సావిత్రీ, ఆహుతిచెయ్యను"

"అయితే ప్రకాశం మీ నాన్నను నట్టేట్లో ముంచి నట్టేనా?"

"లేదు, మా నాన్నకు నే నన్యాయం చెయ్యలేదు. మా నాన్నకే ద్రోహమూ చెయ్యను. నా సమర్థతతో అతని అప్పులన్నీ తీరుస్తాను. అతని భగ్నహృదయంలో సౌరభాలు వెదజల్లుతాను. ఇప్పట్లో నాది తప్పేఅయిలా ముమ్ముందు ఆ తప్పును రూపుమాపుకుంటాను. ఇటు కుమారునిగా, అటు ప్రేమికునిగా, రెండువిధాలా నా యోగ్యతను, కర్తవ్యాన్ని నిరూపించుకొంటాను. సావిత్రికి మాత్రం నేనన్యాయం చెయ్యలేను. చెయ్యను"

# 21

వెంకట్రామయ్యగారికి ఈనాలుగు రోజులలో పరిస్థితి అంతా పూర్తిగా అర్థమయింది. అతనికి యిన్నాళ్ళూ ప్రకా

శం, సావిత్రిల గురించి ఏవిధమయిన వదంతికూడా తెలియదు. చివరకు ప్రకాశంతో పెళ్ళివిషయం ప్రస్తావించే నాటివరకూ కూడా ఈ విషయాలు చూచాయగానైనా తెలియవు. కాని మొన్న తలవని తలంపుగా తనీవిషయం వినాల్సివచ్చింది. ఆ రోజు పోస్టుమాస్టరుగారు ఈ విషయాన్ని గురించి దీర్ఘంగా చర్చిస్తూండటం, అదేసమయంలో తను ప్రక్కవీధిగుండా వెళ్తూ వారి మాటలు పూర్తిగా వినటమూ జరిగింది. కాని అదెంతవరకూ నిజమో తనకు తెలిలేదు. నిప్పులేనిదీ పొగ ఎన్నటికీరాదు. ఇందులో తప్పక ఏదో వ్యవహారం దాగి యుండాలి. ప్రకాశంకు, సావిత్రికీ మధ్య ఏదో సంబంధం ముండి తీరాలి, లేకపోతే ఆనాడు ప్రకాశం తన మాటల్నిలా తోసివేశేవాడుగాదు. తన మాటకెదురుచెప్పి వుండేవాడు గాదు. అయితే ప్రకాశం వెనుక ఆడుతూన్న అంతర్నాటకం యిదన్నమాట. ఎంతపనిచేశావురా! ఇదా నీ తతంగం? ఇందుకా నిన్ను నమ్ముకున్నది, ఇదానీవాడేనాటకం. అయ్యో! తండ్రిగా నేను నిర్వర్తించిన బాధ్యతలకు ప్రతి రూపం, ప్రతిఫలంఇదేనా? ఎవరికోసం నేనీనాడు ఈవిధంగా తయారయ్యాను. అంతా మీ సుఖంకోసం గదట్రా! మీ భవిష్యత్ కోసం గదట్రా! అంతాకలసి నా గుండెల్లో నిప్పులు పోయాలనుకున్నారట్రా. వాడు రామంచూస్తే ఆ ఎఫ్.ఎల్. అలా ఫెయిలయికూచున్నాడు. నువ్వుచూస్తే ఇలా డిగ్రీను అయి ఇలాంటి వ్యాసంగాలు మొదలుపెట్టి నా మానమర్యాదలను మంటగలిపావు. ఇందుకా నేను మిమ్మల్ని కన్నది? ఇందుకా మీకు విద్యాబుద్ధులు చెప్పించింది. ప్రకాశం నన్ను

అన్యాయం చెయ్యకురా" ఇలా మనసులోనే తపిస్తూ వెంక ట్రామయ్యగారు మానసిక రోగానికి గురయ్యారు

ప్రకాశించు తన రెండుకళ్ళూ అనుకున్నానే! ఇప్పుడు వాడే తన రెండుకళ్ళు పొడుస్తున్నాడు. ఇక ఈ మర్యాద లతో సామ్యం ఉపయోగించీ లాభంలేదు. నామాటవింటేనే వీడు నా కొడుకు. లేకపోతే అందరూ కట్టగట్టుకొనిఏగంగలో నన్నా దూకి చావనిలే... అయ్యో! ఎంత పొరబడ్డాను! ఇంతకంటే తీరని తిరుగని అన్యాయం ప్రపంచంలో ఏదైనా వుందా! అబ్బా! హృదయం మండుతోంది. తలచుకుంటేనే గుండెలు బరువెక్కుతున్నాయి" రామయ్యగారు బాధగా మూలిగి మంచంపై బరువుగా వాలిపోయాడు.

గోరుచుట్టుపై రోకటిపోటులా ఆ రోజే మరోభయంకర మైన వార్త వెంకట్రామయ్యగారికి కర్ణాకర్ణిగా చేరింది.

ఇప్పుడున్న ఎదుటిపార్టీ వారైన, నాంబయ్యవర్గంగాక, వేరే యింకో వర్గంవారు వెంకయ్యను లోబరచుకొని దొంగ పత్రాలు సృష్టించి, తమకు వెంకయ్యఅప్పున్నట్టూ, అప్పులకై అతని ఆస్తిని అనుభవిస్తున్న కొన్నవారిపై కోర్టులో (ఐ. పి.) కి దాఖలు చేశారట. అబ్బా ఎంతమోసం! ఎంత కుతంత్రం! ఇంతకుట్రా? భగవంతుడా! నేనింకేం చేయాలి! ఈ ఉచ్చునుండి ఎలా బయటపడాలి! దీనికిక విరుగుడు లేదా! నలభయ్ వేలకు బాకీపత్రాలు సృష్టించి ఐ పి. కి దావా చేశారటనే. ఇక యిది ఎన్నిసంవత్సరాలకు పరిష్కారమా తుందో! ఐ. పి. ఖాయమేచేస్తే తన విక్రయం గతేంకావాలి! ఇందులో తను గెలుస్తాననే నమ్మకమేమిటి? ఇక యిది

పోయింది అంతా అయిపోయింది. సర్వమూ మట్టిలో కల
సింది. ఆస్తిఅంతా కృష్ణార్పణం!"

"ఇక నేను ఎవర్నీ క్షమించను. నా కెవరిపై కూడా సానుభూతిలేదు. ప్రకాశం ఎలా పెళ్ళిచేసుకోడో నేను చూస్తాను. ఏదో ఒకటి తేలిపోవాల్సిందే, వానికి ఆసావిత్రే కావాలో తండ్రేకావాలో తేల్చుకుంటాను. అంతవరకూ నాకు మనశ్శాంతిలేదు"

*

ప్రకాశం చెదరిన తన మనసును అదుపులో పెట్టుకోవాలని విశ్వప్రయత్నం చేస్తున్నాడు. అతనికి ఈ వారం రోజులనుండి సావిత్రిని చూడటానికి ఏమాత్రం అవకాశం లేకపోయింది. సావిత్రయినా కనిపిస్తే తనకు కాస్త మనశ్శాంతి లభించేది.

ప్రతిఉదయమూ, సాయంత్రమూ మామిడివనంలో మల్లెపొదలదగ్గర కూచొని, సావిత్రి దివ్యసుందర మనోజ్ఞ మూర్తిని తలచుకుంటూ ఆమెకై నిరీక్షించేవాడు. సావిత్రి రూపం అతని కళ్ళముందు మెదలితేచాలు సర్వమూ విస్మరిస్తాడు. ఆ మూర్తిని తలచుకుంటూ ఏవో స్వర్గలోకపు అంచుల్ని అందుకోవాలని ప్రయత్నించేవాడు. ఆమె ముగ్ధ మనోహర సౌందర్యాన్ని ఎంతప్రయత్నించినా కొలతవేయ లేకపోయేవాడు.

ప్రకాశం కవి-కళారాధకుడు. సౌందర్యోపాసకుడు. ఒక వస్తువులోని కళను తూచి గ్రహించగల ప్రజ్ఞ అతనికుంది. కాని అతని కళారాధకత, సౌందర్యోపాసన సావిత్రి ముఖంలోని ప్రకాశాన్ని, దివ్యకాంతులను కళలను తూచి అవి ఎంతో కనిపెట్టడానికి సహాయపడలేకపోయాయి. అతను తన మనో త్రాసులోకూడా ఆమె సౌందర్యాన్ని తూకం వేయలేకపోయాడు.

సావిత్రి సుందరి.

సావిత్రి చూపుకంతు నెరితంతు తూపు
ఆమె నవ్వు వీణ మీటిన సరిగమలు
ఆమె ఉఛ్వాస నిశ్వాసాలు మలయమారుతాలు
ఆమె కనుబొమలు మన్మధుని విల్లులు
ఆమె కులుకు చిలుకపలుకు
ఆమె నడక హంసపోకడ

ఆమె చూస్తే అందులో కాంతులు ధారల్లా ప్రవహిస్తాయి

ఆమె కులికితే తారకలు సిగ్గుతో మొహం మూడ్చుకుంటాయి

ఆమెనవ్వితే మామిడిఆకులు గలగలా శబ్దంచేస్తాయి.
ఆమె నడిస్తే ప్రకృతికన్య అసూయతో చూస్తుంది.
ఆమె ఓరగంటచూస్తే జగత్తుకూడా పులకిస్తుంది
ఆమె వదనంజూచి పున్నమిచంద్రుడు మేఘంచాటుకు వెళ్తాడు

ఆమె ముఖారుణిమ చూడలేక సంధ్యాభానుడు కొండల వెనుక దాక్కుంటాడు

ఆమె విరహంతో వేడినిట్టూర్పు విడిస్తే, ఎదుట వున్న ప్రకృతి అంతా ఆ నిశ్వాసకు భస్మమౌతుంది

ఆమె ప్రకృతి రాణి

ఆమె సౌందర్యరాణి, కవితా వాణి

తన హృదయవీణ!

ఇదే ప్రకాశరావు సావిత్రిగురించి భావన. అదే అతని హృదయంలోని సరాగమల్లిక. ఆ మల్లికకే తన కంఠం చాస్తుంది సావిత్రి.

ఏవేవో తీయని వూహాలతో అతను సావిత్రి గూర్చి ఆలోచిస్తుండిపోయాడు.

“తను ఏనాటికీ సావిత్రిని దూరంచేసుకోలేదు. అలా దూరమయే పక్షంలో తన జీవితం అప్పటికీ సమాప్తం సుమా అని అర్థం! కాని తనీవిషయం తండ్రితో ఎలాచెప్పాలో అర్థంగాలేదు. విని నాన్నగారు బాధపడవచ్చు. అందుకు అందుకు తనేకారణంగావచ్చుగాని, తను అంతకుమించి మరేం చేయగలదు. జీవన్మరణ సమస్యలోవున్నరోగిలా, “ఆదర్శాలూ, అనుబంధాల” మధ్య తన ఆత్మ ఊగిసలాడుతోంది. ఇలాంటి పరిస్థితిలో రఘు తనకున్యాయం చేయాలి. రఘు గురించి తనకింతవరకూ అసలు విషయం తెలియదు. అతను లలితను ప్రేమిస్తున్నాడని తనకిప్పుడిప్పుడే తెలుస్తోంది. కాబట్టి అతనికి తన మనస్తత్వం అర్థంగాక పోదు. తనంటే గనుక ఎంతో అభిమానం అని, వి

యాలూ అతనికిచెప్పి అతనిద్వారా తన తండ్రికి తన అభి ప్రాయం తెలియచెయ్యాలి. అంతకుమించి గత్యంతరంలేదు. తండ్రి ఎదుట తనునిల్చొని ఈ విషయంలో ఒక్క అక్షరం కూడా చెప్పలేదు. భయంచేగాదుగాని, గౌరవంవల్ల!"

ప్రకాశం కోటదగ్గరనుండి నేరుగా గ్రామంలో వచ్చాడు. పంచాయతీ ఆఫీసుదగ్గరకొచ్చేసరికి అతని కెదు రుగా రఘూ, సుబ్రహ్మణ్యంలు ఎదురవుతున్నారు. సుబ్రహ్మ ణ్యం ప్రకాశంకు వరుసకు అన్నగారవుతారు. అదే గ్రామ స్థుడు. హైదరాబాద్‌లో సెక్రటేరియట్‌లో ఏదో ఉద్యోగం చేస్తున్నాడు. పక్షంరోజులు సెలవుపెట్టి ఈ మధ్యనే ఇక్క డకు వచ్చాడు. అతనంటే ప్రకాశానికి మిత్రత్వం అంటూ పెద్దగాలేదుగాని, మంచిగౌరవముంది. దాదాపు ప్రకాశం కంటే పదేళ్ళుపెద్ద! ప్రకాశాన్ని చూడగానే ఆయన చిరు నవ్వుతో పలుకరించారు.

"అలా ఆఫీసులో కూచుందాము రా ప్రకాశ్! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నారు ఆయన.

ప్రకాశం ఆశ్చర్యపోయాడు. తనతో పనిగట్టుకు మాటాడవలసిన విషయం ఏమిటాఅనుకొన్నాడు. రఘువేపు ప్రశ్నార్థకంగా చూశాడు. రఘు తనకేమీ తెలియదన్న ట్టుగా కళ్ళతోనే సూచించాడు.

ముగ్గురూ ఆఫీసులో కుర్చీలలో కూలబడ్డారు. సుబ్ర హ్మణ్యంగారు వెంటనే తనడుగబోయే విషయం గురించి ప్రస్తావించలేదు.

"ఏమిటోయ్ విశేషాలు ప్రకాశం" అన్నాడు చిరు నగవుతో.

"అవేవో మీరే చెప్పాలి" అన్నాడు ప్రకాశం నణుగుతు.

"అయితే చెప్పమంటావా"

"చెప్పన్నయ్యా"

"ప్రకాశం నేను చెప్పబోయేవిషయం కొత్తదేమీ గాదు. నీకూ, రఘుకు కూడా తెలుసుండేదే. అయినా నీతో అనవసరంగలిగే మళ్ళీ నేను చెప్పవలసివస్తోంది"

"నాతో అవసరమా!"

"అవును ప్రకాశం! నీవు చదువుకున్న వాడివి, బుద్ధి మంతునివి, పైగా రచయితవు కూడా. ఎదుటివారి మనసులను అర్థంచేసుకోగలవు"

"ఇంతకూ విషయం..." గొణిగాడు మెల్లగా ప్రకాశం.

"చెబుతాను. మొన్న మీ నాన్నగారు నాతో మీ కుటుంబవ్యవహారాలన్నీ సందర్భవశాత్తూ చెప్పాల్సివచ్చింది. నాకంటే బాగా, మీ పరిస్థితులు నీకు తెలుసు.

"అన్నయ్యా! మీరు చెప్పేవిషయమేదో నాకు అర్థమయింది. నా పెళ్ళిగురించేగా నేను సావిత్రిని పెళ్ళిచేసుకోవాలని పూర్తిగా నిర్ణయించుకున్నాను"

"కాని ప్రకాశం"

అన్నయ్యా మీరు నా కేదీచెప్పి నా మనసును పునరావృత్తం చేయకండి. నిష్పాక్షికంగా మీరూ ఆలోచించండి. మీ అభిప్రాయమేదో న్యాయంగా తెలియచేయండి.

కాని వ్యక్తులను దృష్టిలో పెట్టుకొని విషయాలను ఆలోచిం చకు"

"నా అభిప్రాయానికి విలువనిస్తావా"

"ప్రయత్నిస్తాను"

"అయితే మీ నాన్నగారు నిర్ణయించిన వివాహం చేసుకోవటం ఉత్తమం"

"అన్నయ్యా"

"నా వ్యక్తిగత అభిప్రాయం గురించి అడిగినా, నిజం చెప్పమన్నా, మంచిగాని చెడుగాని మేనత్తా మేనమామ పిల్లలు పుట్టుకతోనే భార్యాభర్తలు. ఇది భగవన్నిర్ణయం! హైందవీయతా సాంప్రదాయకుడనయిననేను దీనికి విరోధంగా ఏ విధమయిన సలహా యివ్వలేను. యివ్వనుకూడా నీ కంటే ఎక్కువగా నాకు అనుభవం సంపాదించిపెట్టిన విజ్ఞానంవుంది. నా అనుభవం పురస్కరించుకొనే యిలా చెప్పాల్సివచ్చింది.

"కాని అన్నయ్యా! ఇంకో విషయంగూడా ఆలో చించు! ప్రేమించిన వారినిలా అన్యాయంచేసి, ఇష్టంలేనిపెళ్లి చేసుకోవటం..."

"పెళ్లి చేసుకోటానికిఇష్టమూ, అయిష్టమూ ఏంటోయ్ బోడియిష్టం! దాంపత్యానికి 'అనురాగం' కూడా ఉండాల్సిన లక్షణాలలో ఒకటిగాని అదే జీవితానికి 'పరమావధిగాదు. 'ప్రేమ' తనంతదా ఏర్పడుతుందిగాని, ఎవ్వరూ తమంత తామై ఏర్పరచుకోలేదు. అసలీ ప్రేమనేదిహంబక్. శూన్యం జీవితాన్నినడుపగలశక్తి మానవులలోగాక మానవాతీతశక్తి యైన భగవాన్ గుప్పిట్లోవుంది. దాన్ని తెలుసుకోవటం, ఎవ

రితోనూగాదు. అందుకని తటస్థించిన ప్రతిప్రాణీ దానికి తల ఒగ్గి తీరాల్సిందే! వివాహ విషయంలో వధూవరుల స్వతంత్ర అభిప్రాయాలకు నేను అధమమయిన విలువనూ, స్థానాన్నీ యిస్తాను. ప్రేలెడు లేని బుడతలకు జీవితాన్ని గురించి యేం తెలుసు? వధూవర నిర్ణయం తలిదండ్రులపైనే వదలి పెట్టి వారు నిర్ణయించిన వారితోనే గడపటం నూటికి నూరు పాళ్ళూ మంచిదని నా తీర్మానం. యువతీ యువకులకు నచ్చే దేమిటి? రూపమూ, అంతకన్నా ముందు కులుకూ, తళుకు. క్షణికమై 'ఇన్సూరెన్స్' కూడా లేని ఈ రెంటికీ ప్రాధాన్యత యివ్వటాన్ని నే సంగీకరించను. భర్తఅయినవాడు కొంపకు కావాల్సిన వస్తువులు తేగలిగివుండాలి. తెగులు పుట్టినప్పుడల్లా కామాన్నిదీర్చి పిల్లలను పుట్టించగలిగి వుండాలి. భార్యకొంపను సరిదిద్దుకోగలిగి అడిగినప్పుడెల్లా నోరెత్తకుండా కామవాంఛ తీర్చగలిగివుండాలి. ఇంతే భార్యాభర్తలు కావటానికి క్వాలిఫికేషన్సు. చీవాట్లు చెప్పుదెబ్బలు కూడా తినటానికి కించపడని భార్యలే పురుషునకు నిజమయిన సుఖాన్ని యివ్వగలిగిన భార్యలు. పెద్దలు నిర్ణయించిన వివాహాన్నే చేసుకోగలిగినవాడు గార్హస్థ్యంలో కొంతవరకూ 'సక్సెస్' కాగలడుగాని, మిడిమిడి అభ్యుదయ భావాలతో 'నాయిష్టం' అని ప్రేమను గురించి ఉపన్యాసాలుదంచే ఏ వెధవా సంసారంలో సుఖాన్నీ శాంతినీ పొందలేడు. ఈ అభ్యుదయాలూ, ఆదర్శాలూ నచ్చటం, నచ్చకపోవటాలూ 'టింగురంగా' అని తలాయించుకుతిరిగే అంగంట దంపతులకేగాని నూరేళ్ళు జీవించే భార్యాభర్తలకుగాదు. భార్యాభర్తల జీవితం యాంత్రి

కంగా జరిగినంతసేపే శాంతిగాని, 'నా ఆదర్శం', 'నా మానవత్వం', అని ఎప్పుడైతే అంటారో, అప్పుడు వారు భార్యాభర్తలూ గాదు, వారిమధ్యది అనురాగమూ కాదు, కేవలం కాముకీ కాముకుల సంబంధం — వారిమధ్యగల భావం ఒక లంజకూ, దాని విటుడికీ మధ్యవున్న సహృదయత వంటిదే, ఏ క్షణాన్నయినా ఒకరినొకరు కాలదన్నుకొని తరిమివేయనచ్చు! అటువంటి జీవితాన్ని కోరేవారికి స్వయం వరాలూ, స్వంత అభిప్రాయాలూగాని, మర్యాదగా సాంసారం నడుపుకోదలచుకున్న వారికి పెద్దలు విధించిన వారే భార్యాభర్తలు—వారిద్దరూ కలసి నిర్వహించేదే సంసారం... అంతేగాని.

"అన్నయా! ఇక ఆపు! మీ సలహాకు నా ధన్యవాదాలు! మీ అభిప్రాయాలకు నా కృతజ్ఞత—" అంటూ కోపంగా లేవబోయాడు ప్రకాశం "రేయ్, ప్రకాశం, ఆగరా! అలా కోపగించుకుంటే ఎలా—చెప్పేది పూర్తిగా విను"

"ఇక మీ చెప్పటం చాలు"

"ముందు కూచో" అంటూ బలంగా కుర్చీలోత్రోసి, "చూడు ప్రకాశం! నేను చెప్పిందంతా నీకు నచ్చకపోతే అందుకు నేనేంచెయ్యలేను కూడా—పరిస్థితులను బట్టి ప్రవర్తించమని నీలాంటి వివేకులకు పదేపదే చెప్పటంకూడా సమంజసం గాదు—ఇప్పటి ఆర్థికపరిస్థితి దృష్ట్యా, మీ సంసారం ఎలాంటిస్థితిలో వుందో నీకు తెలియందిగాదు—అటు భూముల వ్యవహారాలూ, అందుకు తోడు ఐ. పి.

కూడానట ! ఇక మీ అన్నగారా ఫెయిలయ్యారు—వచ్చే ఆదాయమూ అలావుంది - వ్యాపారమూ, అది పూర్తిగా మాని వేశాడు—ఇక నీవూ యిలాచేస్తే ఎలాగోయ్ ! ఈ పరిస్థితు లలో మీ నాన్నగారి మనశ్శాంతి కోసం, మీ భవిష్యత్ కోసం, నీవు తప్పక మీ మేనమామ కుమార్తెను వివాహం చేసుకొని తీరాలి ! అందువల్ల మీ నాన్నగారికి కొన్ని అప్పులూ తీరుతాయి—నీ గురించీ బాధా వుండదు—ఏం చేసినా మీ నాన్న మీ మంచికే చేస్తాడు—ఆ ఒక్క విషయం బాగా గమనించు—ఇక మీ మేనమామ కుమార్తె అంటావా ! ఆ అమ్మాయిని నేనూ చూశాను—సావిత్రి లాగా వుండదనుకో ! అయినా అందం కొరుక్కు తింటా వేమిట్రా ! మూడునాళ్ళు గడిస్తే అంతకుమించిన అందం నీవు లేదనుకుంటావ్ కూడా, ”

“ అన్నయ్యా ! నేను రూపానికి ఎన్నడూ ప్రాధాన్యత యివ్వను—మీరు యింతవరకూ, ఒకే కోణంలో ! ఒక దృక్పథంలో ఒకతి పరంగానే ఆలోచించావ్ గాని, నా గురించి కాస్తా కూడా యోచించ లేకపోయావ్ ! సావిత్రిని నేను హృదయపూర్వకంగా ప్రేమించాను. ఆమె నన్ను పూర్తిగా నమ్ముకుంది ఆమెకు ద్రోహంచేస్తే నాకు శాంతీ, సౌఖ్యమూ, ప్రాయశ్చిత్తమూ వుండవు—అటు వివాహం చేసుకుంటే నా జీవితం, సావిత్రి జీవితమేగాక, నన్ను చేసుకున్న అమాయకురాలి జీవితంగూడా నాశనమవుతుంది - మా నాన్నగారి వ్యధ నాకు తెలియందిగాదు. నా హృదయం మీ రనుకున్నంత పాషాణస్వరూపం గాదన్నయ్యా ! అన్నీ

ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను. అన్నాడు బాధగా—

ఇంతా వింటున్న రఘు, ప్రకాశాన్ని జూచి పూర్తిగా జాలి చెందాడు. అతని మనసు అర్థమయింది.

"రఘు ! మా నాన్నగారి ఎదుటనిల్చొని నేనీవిషయం మాటాడలేను - ఆ వ్యథితప్రాణిని నేను మరీ బాధించదలచుకో లేదు—నేను చేస్తున్నది ఘోరాపరాధమే ! కాని యింతకు మించి మరోనిర్ణయం ఈ జీవితంలో చేసుకోలేను—రఘు ! మా నాన్నగారి కెలాగైనా నీవే నచ్చచెప్పు" అన్నాడు. రఘు జాలిగా నిట్టూర్చి, "ఊరుకోరా ! ప్రయత్నిస్తాను గాని" అన్నాడు—

ప్రకాశం చెమర్చిన కళ్ళను చూస్తూ సుబ్రహ్మణ్యం గారు నిట్టూర్చక పోలేదు—ఆయన మనసులోకూడా ఏవేవో ఆలోచనలు దొర్లాయి.

* * * * *

ప్రకాశం, సాయంత్రందాటి పూర్తీ చీకటి పడేవరకూ, యింటికి చేరలేక పోయాడు. ఇంట్లో వుండాలన్నా తండ్రికి ముఖం, చూపించాలన్నా అతనికిపుడు అదొకరకమైన బాధ ! ఎంత సమర్థించుకొందామన్నా మరీ తండ్రి వ్యథను,గ్రహించ లేని మూర్ఖుడు గాదు ప్రకాశం ! అందుకే ఆ ఆరాటం కూడా !

చీకటి పడేవరకూ, వనమంతా తిరిగి తిరిగి సావిత్రి నిరీక్షణలో వేసారి యింటికి చేరుకున్నాడు ప్రకాశం. ఆ హాల్లో వాలు కుర్చీలో పడుకొన్న తనతండ్రి ముఖంవేపు చూశాడు. వెంకట్రామయ్యగారు ఏదో ఆలోచిస్తూ, ప్రకాశాన్ని గమనించలేకపోయాడు అతనికీనాడు అన్నీ బాధాయుత సమస్యలే !... అన్నీ విడీవిడని చిక్కులే !!... ...

* * * * *

సావిత్రి ఈ వారంరోజులలో పూర్తీ నీరసించి బక్కచిక్కి పోయింది - ఆమెకు ఏర్పడ్డ ఆ వ్యధను ఆ గృహంలో ఎవరూ నివారించలేక పోయారు. ఆమె తల్లికి ఆమెంటే ఎంతో ప్రేమున్నా అది సాంబయ్యగారి కోపవీక్షణాలలో నుసిగా మారిపోయింది, ఆమెకు తనభర్తకు ఎదురుగా మాటాడే శక్తిలేదు - ఇక సాంబయ్యగారు ఎన్నోవిధాల సావిత్రి విషయంలో కట్టుదిట్టాలు చేశాడు. అందుచే ఏ విధంగానూ సావిత్రి బయట కడుగేట్టటానికి వీలులేక పోయింది - ఒకటి రెండుసార్లు ప్రయత్నించింది గాని తండ్రి మధ్యలోనే ఎదురు పడటంచే చెదరి ఆ ప్రయత్నం మానుకుంది—

ఆ రోజు సావిత్రి గదిలో కూచొని ఏదోయోచిస్తూండి పోయాడు. ఇంతలో బయట తన తండ్రితో కలసి ఎవరో నూత్నవ్యక్తి రావటంగమనించింది. ఆ వ్యక్తివయసు నలభై సంవత్సరాలకు ఏ కొద్దిగానో తక్కువ వుండవచ్చు. నల్లగా,

బొద్దుగాపొట్టిగా, లావుగా, పీపాలావున్న ఆ వ్యక్తిని చూడ గానే సావిత్రికి అంతవ్యథలోనూ నవ్వొచ్చింది.

వారిరువురూ వరండాలో మంచంపై కూచొ న్నారు. మంచంపై కూచుంటూ ఆ వ్యక్తి ఎదురుగా కిటికీ గుండా కన్పిస్తున్న సావిత్రిని రెండుక్షణాలు దీర్ఘంగా చూశాడు. సావిత్రి అసహ్యించుకుంటూ అతని చూపులకంద కుండా తప్పుకొంది.

ఇంతలో ఆమె తల్లి గదిలోకి ప్రవేసించింది.

"ఎవరమ్మా వాళ్ళు అనడిగింది సావిత్రి.

ఆమె అరక్షణం మౌనంగా వుండి బిడ్డకళ్ళవేపు దీనంగాచూస్తూ "నీకు పెత్తనం వచ్చారమ్మా! మీ నాన్న గారు నీ పెళ్ళి వెంటనే చెయ్యాలని" ఆ మాట పూర్తిగాక ముందే "నాకా! పెళ్ళా! బావా!" అంటూ స్మృతితప్పి వెంటనే క్రిందబడిపోయింది సావిత్రి.

# 22

వెంకట్రామయ్యగారికి ప్రకాశంనుండి ఆశించినవారం రోజులగడువు పూర్తయింది. ప్రకాశం గురించి ఆయనకు అంతో యింతో ఆశ అస్పష్టంగా మెదలకపోలేదు. కాని దానికి పూర్తి రూపం యివ్వలేకపోయాడు. ఈ విషయం గురించి రామంను అభిప్రాయ మడుగుదామనుకున్నాడుగాని అతను పదిరోజులక్రితం అతని మిత్రుడొకడు సమితి ఎలెక్ష న్లలో పోటీచేయటంచే సహాయంకోసం, ప్రచారంకై వూరు

విడిచి వెళ్లాడు. గ్రామంను ప్రస్తుతం ఏ విధంగానూ ఆసించే స్థితిలో లేదు రామయ్య.

ఆ రోజు మధ్యాహ్నం వెంకట్రామయ్యగారు తల మునకలయే ఆలోచనలతో వాలుకుర్చీలో పడుకొనుండగా, రఘు ప్రవేశించాడు రఘు కుర్చీలో కూర్చున్న తర్వాత వెంకట్రామయ్యగారు లేని చిర్నగవు తెచ్చుకొని అతనివేపు చూస్తూ "ఏమోయ్ రఘు" అన్నాడు. రఘు అంటే ఆయన కెంతో సదభిప్రాయం. వాత్సల్యం, అభిమానం. ప్రకాశాన్ని ఎలాగయినా పెళ్ళికి సుముఖంగా చేయమని రెండుమూడు సార్లు హెచ్చరించాడు. వెంకట్రామయ్యగారు సంభాషణను కొనసాగిస్తూ "ప్రకాశం ఏమన్నాడబ్బాయ్" అనడిగాడు.

"సుబ్రహ్మణ్యం బావకూడా ఎంతో నచ్చచెప్ప ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది మామయ్యా"

"ఏమన్నాడేమిటి?"

రఘు అన్నివిషయాలూ చెప్పి, వాని ఉద్దేశంకూడా ఆలోచించవలసిందే మామయ్యా" అన్నాడు సన్నగా.

"ఇంకా వానిఉద్దేశమేమిటి, అ ప్రాచ్యుడు! నా కడుపున చెడబుట్టినాడు. వాడింటికిరానీ నేనే ఏదో తేల్చుకుంటాను" అన్నాడు కోపాన్ని అదుపులో పెట్టుకోలేక.

"మామయ్యా! ప్రకాశాన్ని ఈ విషయంలో ఏమీ అడిగి లాభంలేదు. తను ప్రేమించిన సావిత్రికి ద్రోహం చెయ్యలేనంటాడు. మీరుకూడా కాస్తయోచించి" రఘు ఆ మాటను పూర్తిచేయకుండానే రామయ్య క్రోధంతో. "ప్రేమట ప్రేమ! ఎక్కణ్నుంచీ వచ్చిందోయ్ అది. కని,

పెంచి. పెద్దచేసిన నా మీద ఆ దౌర్భాగ్యునకు, ఎర్రగా బుర్రగావున్న ఆడపిల్లను చూసేసరికివున్న ప్రేమంతా ఎగిరి పోయిందో! వాణ్ణింతస్థితికి తెచ్చింది నేనుగాని ఆ పిల్లగాదు. వాడు బుద్ధిమంతుడై ఇంతవాడు కావటానికి కారణం నేను గాని, ఆ అమ్మాయి ఎన్నటికీగాదు. నా మూలాన బ్రతు కుతూ నన్నే ధిక్కరిస్తాడా! కానీ, వానితోనే నిక్కచ్చిగా ఏదో తేల్చుకుంటాను. వానికి తండ్రిగావాలో ఆ పిల్లే గావాలో'' అని నోటికొచ్చినట్టు వదిరాడు వెంకట్రామయ్య.

అప్పుడేగృహంలో అడుగుపెడుతున్న ప్రకాశం ఈ మాటలు విని ఒక్కసారిగా నిశ్చేష్టుడైపోయాడు.

"ప్రకాశం!" కోపంగా అరచాడు రామయ్య.

''నాన్నా.''

"ఇట్రా" ఆ స్వరంలో అధికారం, దానివెనుక ఎంతోకోపం ప్రస్ఫుటించాయి. ప్రకాశం నిదానంగా అడు గులువేసుకుంటూ తండ్రికి దగ్గరగా వచ్చాడు.

"ప్రకాశం నే నడిగే ప్రశ్నకు జాగ్రత్తగా ఆలోచించి జవాబుచెప్పు. నేను ఎవర్ని?"

రఘుతోపాటు ప్రకాశంకూడా అయోమయస్థితిలో పడిపోయాడు.

''ప్రకాశం నేనెవరో చెప్పు''

"నాన్నా"

"అది జవాబేనా"

"అవును నాన్నా"

"తండ్రిగా నేను, కొడుకుగా నువ్వు, ఈ మాట ఒప్పుకుంటావా"

"ఒప్పుకుంటానానాన్నా"

"ప్రకాశం! తండ్రిగా నా బాధ్యతలలో ఏమైనా లోపాలు కన్పిస్తున్నాయా?"

"లేదునాన్నా"

"కుమారులను తీర్చిదిద్దవలసిన బాధ్యత తండ్రిదే గదూ!"

తండ్రిఅడిగే ఈ ప్రశ్నలకు చలించిపోతున్నాడు. జవాబులు చెప్పటానికి అతనికి నోరాడలేదు. ఈ ఉపోద్ఘాత మంతా ఎందుకో ప్రకాశానికి తెలియనిదిగాదు. మౌనంగా అతని ప్రశ్నకు తలూపాడు.

"ఆ బాధ్యతలకు చేయూత నివ్వాల్సిన కర్తవ్యం కుమారునిది. కాదనగలవా?" ప్రకాశం తన సజల నేత్రాలతో తండ్రిముఖంవేపు దీనంగాచూస్తూ తలాడించాడు.

"ప్రకాశం! బుద్ధిమంతుడవు, విచక్షణాజ్ఞానంగలవాడవు. నీ కివన్నీ తెలియనివిగావు. ఆనాడు నీవునిర్ణయించిన వారంరోజులూ నిన్నటితోనే ముగిశాయనికూడా నీకు తెలుసు. నా వుద్దేశాలకు రూపం గల్పించగలవనే నా విశ్వాసం. నాయనా ప్రకాశం! మరీ నీ మనోబాధకూడా తెలుసుకోలేని మూర్ఖుడనుగాదు నేను. అన్నివిధాలా సాంబయ్యతో బంధుత్వం చెడ్డకే దారితీస్తుంది. అసలు ఈ పార్టీగొడవలతో, ఈ పరిస్థితులలో యిది జరుగదుకూడా! పరిస్థితులు, ప్రదేశం, కాలంబట్టి వుద్దేశాలను, ఆదర్శాలనుకూడా ఒక్కొక్కసారి

మార్చుకోవలసి వస్తుంది. మేనరికం మనకు అన్నివిధాలా యోగ్యమూ అనుకూలమూ. నీ భవిష్యత్ కది పూలబాట పరచగలదు. నీ వంగీకరిస్తావనే నా ఆశ. ఏమంటావ్ బాబూ!" ఆ స్వరంలో ప్రాధేయత, దైన్యత, జాలివుట్టిపడుతున్నాయి. ప్రకాశం మనసు కొండఅంచునుండి జారి క్రిందబడుతూంది.

"చెప్పరా ప్రకాశా"

"ప్రకాశం ఏమీ జవాబివ్వలేక తలప్రక్కగా త్రిప్పుకొని రఘువేపుచూశాడు.

"ప్రకాశం! నా మాటవినరా! నిన్ను ఈ చేతులతోనే పెంచాను. ఈ చేతులతోనే పెద్దచేశాను. ఈ చేతులతోనే ఈనాడు నీ చేతులు పట్టుకొని అర్థిస్తున్నాను సాయనా"

"నాన్నా"

"మీ మామగారు, మేము నీ మీద ఎన్నో ఆశలుంచుకొన్నాము. ఇన్నికష్టాలొచ్చినా నీ వున్నావనే పెద్ద ధైర్యంతో నేను వాటినికూడా లెక్కచేయలేదు. నేను చేసేదేదీ నా సుఖంగాదు బాబూ! నిన్ను నా మానమర్యాదల కోసం బిచ్చగానిలా అర్థిస్తున్నాను. మన పరువుప్రతిష్ట మంటగలుపకురా! చివరకు నీ కాళ్లు..."

"నాన్నా!... అయ్యో! అయ్యో! ఎంతమాటన్నారు ఈ మాటలకన్నా నా గుండెలు నొక్కసారిచీల్చండినాన్నా"

"ప్రకాశం! మరి నా మాట అంగీకరించినట్లేనా"

ప్రకాశం ఒక్కక్షణం శరీరాన్నంతా నలచుకొని, బరువుగా ఒక్కొక్కమాటే, "నాన్నా! మీతో చెప్పటానికి

న్నాకు నోరు రాలేదు. ఈ విషయంలో మాత్రం నన్ను... నన్ను క్షమించండి నాన్నా"

అరక్షణం అలాగే రామయ్యగారు ప్రకాశం ముఖం వేపు చూశాడు. అతనిలో ఆవేశం. కోపం నిండుగా ముంచుకు వచ్చాయి.

"ప్రకాశం!" భీకరంగా గర్జించాడు రామయ్య.

"నాన్నా"

"ఎవర్రా నీకు నాన్న! సిగ్గులేమా నాన్న అనినోరెత్తి పిల్వటానికి. పెంచిన మమకారమయినా నా మీద లేదుట్రా నీకు! ఆఖరిసారిగా అడుగుతున్నా! చెప్పు! నామాట ప్రకారం నడుస్తావా నడవ్వా"

"నాన్న... నాకీసంగతి ముందే తెలుసుంటే నేనసలు సావిత్రిని ప్రేమించేవాణ్ణిగాదు. ఇప్పుడు సావిత్రికి చేజేతులా ద్రోహంచేసి నేను వంచించుకోలేను"

"వంచనా? దుర్మార్గుడా! కృతఘ్నుడా ఏదిరా వంచన? పిల్లకోసం చివరకు కాళ్లు పట్టుకొని కూడా అర్థించే మీ నాన్నను లక్ష్యపెట్టకుండటం వంచనగాదూ? చీమూ నెత్తురూ సర్వం మీకై త్యాగం చేసిన మీ నాన్నకు ద్రోహం చెయ్యటం వంచనగాదేమిరా! ఇదేనేరా నీచదువు! ఇదేనేమిరా నీ విజ్ఞానం! అయ్యో! ఎంతమోసపోయాను" కోపంతో బాధతో రామయ్య నిలువెల్లా కంపించాడు.

"నాన్నగారూ"

"ప్రకాశం! ఇకనన్నా పేరుతోపిలిచే యోగ్యత, స్థానం నీ కికలేదు. చివరిసారిగా హెచ్చరిస్తున్నాను. నీకు తండ్రి

గా వాల్లో, సావిత్రిగావాల్లో తేల్చుకో. తండ్రిగావాలంటే ఈ ఇంట్లో నీకు స్థానం లభించాలంటే నేను చెప్పినట్టు మీా మామ కూతుర్ని పెళ్ళిచేసుకో. ఆ సావిత్రే గావాలంటావా ఈక్షణంనుండీ నీకూ నాకూ ఏమాత్రంసంబంధంలేదు గుర్తుంచుకో ఈ ఇంట్లోంచి ఈ క్షణమే దాటిపోవాల్సి వస్తుందని మరచిపోకు. ఏదో తేల్చుకో. ఒక్క నిముషం మాత్రమే"

ప్రకాశం కళ్ళనీరు గారుస్తూ తన తల్లి శారద, లలితల వేపుచూస్తూ మౌనంగా వుండిపోయాడు.

"ప్రకాశం! నన్ను నీ కన్నీళ్ళతో కరిగించాలని వ్యర్థ ప్రయత్నం చేయకు. ఏదోఒకటి నిర్ణయించుకో. ఈ క్షణంలో..."

అరక్షణం నిశ్శబ్దంగా గంభీరంగా గడచిపోయింది. అందరూ నిశ్చలంగా ప్రకాశంవేపు ఆతురతతో చూస్తూండి పోయారు.

"నాన్న! మీా మాట వ్యతిరేకిస్తున్నందుకు నేను చాలా బాధపడుతున్నాను"

"అంటే?"

"సావిత్రికి నేను ద్రోహం చెయ్యలేను"

"అయితే నీకు సావిత్రే కావాలన్నమాట"

"అవును నాన్నా"

"ప్రకాశం" వెంకట్రామయ్యగారు ఇల్లంతా కంపించేలా గర్జించాడు. "రేయ్! ఇక నీకు తండ్రిలేడనుకో. కృతఘ్నుడయిన ఒక దౌర్భాగ్యుడు నాకు జన్మించలేదనుకుంటాను. వెళ్ళు, ఈ క్షణంనుండీ నీకూ ఈ ఇంటికీ ఏమాత్రం

సంబంధంలేదు. ఈ తండ్రికీ నీకూ అణుమాత్రం అనుబంధం లేదు. వెళ్ళు, ఇక నీ పాపిష్టిముఖం నాకు చూపించకు. వెళ్ళిపో, ఈ ఇల్లువిడిచి వెళ్ళిపో" రోషకషాయిత నేత్రా లతో నిప్పులు జల్లుతూ గంభీరంగా అన్నాడు రామయ్య గారు.

"మామయ్యా"

"నాన్న"

"నా మాటకు తిరుగులేదు. నన్నా పవిత్రమయిన పేరుతో కలుషితంచేయకు"

"సరే, మీ ఇష్టప్రకారమే ఈ క్షణమే వెళతాను నాన్న"

"వెళ్ళు, నీవు వేశే ముందు అడుగుకూ ఈ యింటికీ ఏమాత్రం సంబంధం ఇక వుండదని గుర్తుంచుకో"

ప్రకాశం తండ్రివేపు నిశ్చలంగాచూసి, "వెళతాను నాన్న, నా ఈ పాపిష్టిముఖాన్ని మీ కిక ఈ జన్మలో చూపించను" అని వెనక్కుతిరిగి అడుగు ముందుకు వేయ బోయాడు.

"ఈ జన్మలోగాదు, ఇక వేయి జన్మలకుకూడా చూపించకు" వెనక్కు మళ్లుతూ అన్నాడు వెంకట్రామయ్య.

ప్రకాశం కళ్ళలో విషాద అశ్రుబిందువులు నిల్చాయి చెల్లెండ్రివేపు, ఒకసారి దీర్ఘంగాచూసి అడుగు ముందుకు వేయబోయాడు.

"బాబూ ప్రకాశం" అంటూ తల్లి దీనంగా పిల్చింది. ప్రకాశం తటాలునఆగి వెనక్కుతిరిగాడు. ఆమె భర్తవైపు

దీనంగాచూస్తూ "అయ్యో! ఇదేమిటండీ. మీకేమయినా పిచ్చిబట్టిందా? బాబును వెళ్ళవద్దని చెప్పండి"

"నువ్ నోరుముయ్"

"అమ్మా"

"ప్రకాశా! నా మాటవినరా! మీ నాన్న మాట కాదనకు బాబూ"

'అమ్మా"

"ప్రకాశం! వెళ్ళిక. నీ ఏడుపులతో ఈ ఇంట్లో పాపాన్ని పెంచకు"

ప్రకాశంకళ్ళలో రెండు నీటిబొట్లు నిలిచాయి. ఒక్కసారి నిశ్చలంగా అందరనూ చూశాడు. కన్నీటితో దీనంగా చూస్తున్న మాతృదేవత, అధరాలు కంపిస్తూ జాలిగాచూస్తున్న రఘు, గంభీరంగా నిలబడ్డ తండ్రి నిశిత దృక్కులూ. బావురుమంటూ ప్రకాశాన్ని గోల్పోయిన యిల్లు. అబ్బ! ప్రకాశం తటాలున తిరిగి చకచకా అడుగులు వేస్తూ గంభీరంగా గడప దాటిపోయ్యాడు.

"అన్నయ్యా!" అని శారదా లలితలు ఒక్కసారిగా గొల్లుమన్నారు

"బాబూ" అంటూ తల్లి వృన్నపళంగా నేలమీద పడిపోయింది.

రఘు నిశ్చేష్టుడై, నిర్వీణ్ణుడై వెంకట్రామయ్యగారి గంభీరవదనంవేపు చూస్తూండిపోయాడు.

*   *   *   *

ప్రకాశం ఇల్లువిడిచి బయటకు రాగానే అతని మస్తి ష్కంలో ఒక్కసారి సవాలక్ష ప్రశ్నలు ఏర్పడ్డాయి.

అవును. తనుచేసినకార్యంలో ఎంతోతప్పుండవచ్చు. కాని తను ఆత్మను వంచించుకో లేదు. తను చేసినపని ఉత్త మమేనని అతని మనసు గ్రుద్దిచెబుతూంది. ఇక తనకూ ఆ యింటికీ ఈనాటితో ఋణం తీరిపోయింది. తనిక క్రొత్త జీవితం ప్రారంభించాలి. ఆ కొత్తజీవిత నౌకకు చుక్కాని సావిత్రి. ఇక తను సావిత్రితో ఏ విధంగానయినా ఈరోజే ఈవూరు విడిచిపెట్టాలి. ఆ తర్వాత జీవితం ఏర్పరచుకోవాలి. తను ఉద్యోగం వెంటనే సంపాదించుకోగలడు. ఇక ఈ దుర్భర వాతావరణంనుండి నిష్క్రమించాలి''

ప్రకాశం ఎలిమెంటరీ స్కూల్ దగ్గరకువచ్చి 'సూర్యం'ను ఉపాధ్యాయుల అనుమతితో బయటకు తీసుకు వచ్చాడు.

"ఏంబావా?" ఆ అబ్బాయి అమాయికంగా ప్రశ్నిం చాడు.

"నాతోపద"

"ఎక్కడికీ"

ఇద్దరూ సుబ్బయ్యవీధి చివరకు వచ్చారు. ప్రకాశం ఒకచిన్న కాగితం ముక్కలో "సావిత్రీ! ఉత్తరం చూడగానే వెంటనే వనం దగ్గరకు రావాలి! ఏమాత్రమాలస్యమైనా నేను నీకు దక్కను " అని వ్రాశి " మీ అక్కయ్యకు చాలా జాగ్రత్తగా అందచేయాలి సుమా " అంటూ ఆ అబ్బాయి కిచ్చాడు.

ఇక ప్రకాశం అక్కడ ఆగదలచుకోలేదు వనం వేపు నడక సాగించాడు... వనంలో ప్రవేశించి మల్లెపొదల క్రింద కూచొన్నాడు ఏదో ఆలోచనలతో

'సూర్యం' తెచ్చియిచ్చిన ఉత్తరం చూసి యిక అక్కడ ఒకక్షణం కూడా నిల్వలేకపోయింది. ఉత్తరం లోని చివరి వాక్యానికి పూర్తిగా గాభరాపడింది. బయట వరండావేపు పరకాయించి చూశి తండ్రిలేడని నిశ్చయించుకొని, ఒక్క అంగతో బయటపడి గబగబా నడక సాగించింది.

ప్రకాశం యింకా అదే ఆవేశంలో ఉద్రేకంలో వున్నాడు. సావిత్రిరాగానే ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఇట్నుంచీ పారిపోవాలి. తనదగ్గర కొంత డబ్బుకూడా వుంది. రెండువందల విలువచేసే రెండు ఉంగరాలుకూడా వున్నాయి. ఇక ఫరవాలేదు అనుకొని సావిత్రికై నిరీక్షిస్తూండి పోయాడు

వాతావరణం చాలా నిశ్శబ్దంగావుంది. పక్షులు కొన్ని వింతరవాలు సల్పుతున్నాయి. ఎండమాత్రం తీవ్రంగా నిప్పులు కురుస్తోంది ప్రకాశం క్షణమొక యుగంగా గడుపుతున్నాడు.

" బావా " అంటూ విసురుగా ప్రవేశించిన సావిత్రిని ఒక్క అదటున తన అక్కున చేర్చుకొని, " వచ్చావాసావీ నాకు తెలుసు నీవు తప్పక వస్తావని! సావీ! నాతో ఈ క్షణంలో ఎక్కడికైనా రాగలవా " అన్నాడు ప్రకాశం ఆమె నుదుటను మృదువుగా తన పెదవులతో తాకుతూ!

" బావా! నన్ను పదేపదే పరీక్షించదలచుకున్నావా! మీరే నా సర్వస్వం "

"అంతాచాలు సావీ! అంతచాలు! ఇక నేను జయించాను. నాకీ లోకంలో యిక ఎవరూ అడ్డులేరు. ఈ సమయంలో దైవాన్నయినా సరే ఎదిరిస్తాను... "

" ఏమిటి బావా! నీ మాటలు ఈ రోజు వింతగా వున్నాయి... "

" అవును సావీ! నీవు నా ప్రక్కనుంటే చాలు... నాలో వేయి ఏనుగుల శక్తి విజృంభిస్తుంది... "

" బావా!... " ఆనందంతో ఆమె కంఠం వీణలా మ్రోగింది.

" సావీ! ఈ నాటితో నాకూ ఈ వూరికి ఋణం దీరి పోయింది "

"అవేం మాటలు బావా!"

"నిజం సావీ! నీ కోసం, మన పవిత్ర ప్రణయం కోసం, నేనీనాడన్నీ ఎదిరించాను"

"ఏమిటి బావా! నీ మాటలు నా కర్థం గాలేదు" సావిత్రి గాభరాగా అంది.

"చెబుతావిను..." అని అరక్షణం ఆగి ఆమె ముఖం వేపు చూస్తూ అన్నివిషయాలూ పూర్తిగా చెప్పి, "సావీ!" ఆలస్యం అమృతం విషం!! ఇక ఆలస్యంచేస్తే లాభంలేదు నేనిక నిన్నువదలను... వెంటనే ఈవూరు విడిచి వెళ్దాం." అన్నాడు ఆవేశంగా ప్రకాశం.

"బావా! ఎంత ఆవేశపడ్డావ్! నాకోసం మీరు తల్లి, తండ్రీ, యిల్లూ, వూరూ సర్వమూ త్యజించి యిలా ఏకాకిగా వెళ్ళటం నాకు చాలా బాధగావుంది. అంతా నా కోసమే చేశారా" ఆమె కంఠం బొంగురుపోయింది.

"అవును సావిత్రీ! కేవలం నీకోసమేగాదు. మనకోసం. యిప్పుడు నేను ఏకాకి నెలానవుతాను. నీవు నాప్రక్కనుంటే ప్రపంచమంతా నాచెంత వున్నట్టే. "బావా!. నాకోసం మీరిన్ని త్యాగాలు చేయటం నేను సహించలేను నా మూలంగా మీ సంసారం విచ్ఛిన్నం గావటం నేను భరించ లేను. వద్దుబావా! వద్దు...! నా జీవితం యిలాగే గడచి పోనీ! మామగారు నిర్ణయించిన అమ్మాయినే వివాహం చేసుకోండి... నా కోసం మీరిలా..."

"సావీ!..."

"మీరింత తెగిస్తారని నేననుకోలేదు! నామూలంగా మీరు మీవారికి దూరం కాకూడదు. నన్ను మరచిపోండి ...మీ నాన్నగారిమాట పాలించండి..." సావిత్రి వలవలా ఏడ్చింది.

"సావీ! నీవేనా ఈ మాటలనేది! మరొకసారి యిలా అన్నావా ఇక నన్ను ప్రాణంతో చూడలేవు...అయ్యో... సావిత్రీ...నీవూ నన్ను మోసంచేస్తే ఈ ప్రపంచంలో ఎలా జీవించగలను... అబ్బా!

"బావా!"

"సావీ! ఇకలే ఎక్కువగా నేను ఏదీ చెప్పదలచుకో లేదు. నిన్నుకూడా నేనిక నిర్బంధించను. నీవంటే అభి

మానం, ప్రేమ, యిష్టంవుంటే ఈక్షణమే నా వెంటరా! లేకపోతే ఎవరిదారి వారిది! మీరంతా నన్ను ఒంటరివాణ్ణి చేసి వెళ్ళండి! అన్నీ విసర్జించిన నాకు ఈ లోకంతో కూడా పనిలేదు. దీన్నికూడా విసర్జిస్తాను."

"బావా! అంతమాటనకు బావా! సరే! ఇక మీ యిష్టమే నా యిష్టం... ఈ క్షణంనుండీ నాకు మీరుదప్ప మరెవ్వరూ లేరు. నాకిక ఈ నాడు ఏచింతా లేదు... మీ రెప్పుడు బయల్దేరమన్నా సరే."

"నాకు తెలుసు సావీ! నీహృదయం నాకు బాగా తెలుసు! ఇక నన్ను ఎవరూ జయించలేరు. పదసావీ! వెంటనే వెళ్దాంపద"

"పదబావా"

సావిత్రి ముందుకు కదిలింది. రెండడుగులు ముందుకు వేశిన సావిత్రికి "ప్రస్నపళంగా సావీ" అన్న ఆర్తనాదం వెనుక నడుస్తున్న ప్రకాశం నోటనుండి గట్టిగా బాధగా వినిపించింది

ఈ హఠాత్ సంఘటనకు సావిత్రి భయాందోళన లతో తటాలున వెనక్కు తిరిగిచూసి నిశ్చేష్టురాలై "బావా" అని కెవ్వున కేకవేయబోయింది. రెండు బలిష్టహస్తాలు తెరు వబోయిన ఆమె నోటిని గట్టిగా బలవంతంగామూసివేశాయి.

ఎదురుగా రక్తపుమడుగులో, తలపగిలి. స్మృతిదప్పి నేలమీద బోర్లాపడిన ప్రకాశాన్ని చూడగానే ఆమెకళ్ళు గిర గిరాతిరిగి, బయిర్లు గమ్మి అలాగే మూర్ఛపోయింది. మూర్ఛ పోయి క్రిందపడబోతున్న ఆమెను ఒకవ్యక్తి నెమ్మదిగా

భుజంపై వేసుకొని ప్రకాశంవేపు నిర్లక్ష్యంగాచూసి వికటాట్టహాసంగానవ్వుతూ, చకచకా అంగలువేస్తూ ఆ ప్రదేశం వీడి బయటకునడిచాడు.

ప్రకాశం గృహపరిత్యాగంచేసి వెళ్ళగానే ఆయింట్లో ఏడ్పులు పెడబొబ్బలూ ప్రారంభమయ్యాయి. వెంకటామయ్యగారుమాత్రం నిశ్చలంగా గంభీరంగా వుండిపోయారు. ఆ గంభీరవదనం చాటున, ఎన్ని అగ్నిపర్వతాలు ఫెళ్ళున బ్రద్దలౌతున్నాయో ఆ గృహ వ్యక్తులెవరూ గమనించలేకపోయారు. శారద, లలిత, చంద్రంలు కన్నీటితో 'ప్రకాశ' శూన్యమయిన ఆగృహాన్ని అభిషిక్తం చేయసాగారు. ఇక తల్లి ఆవేదన ఆక్రోశం ఎలాంటిదో నేను వ్రాయలేను. మాతృహృదయం తెలిసిన ఏమానవత్వమున్నవాడయినా ఆమెహృదయారాటాన్ని అర్థంచేసుకోగలరు.

ఈ విషాద గంభీర వాతావరణంలో రఘు ఎటూగాక నిర్విణ్ణుడై రామయ్యగారివేపు నిశ్శబ్దంగా చూస్తూండిపోయాడు. ఇలా జరుగుతుందనీ, రామయ్యగారింత మొండిపట్టుపట్టగలడనీ అతనూహామాత్రంగానయినా తలంచలేదు. రామయ్యగారిని చూస్తూన్నకొద్దీ అతనిలో ఏవేవోనిరాకార భావాలుజనించాయి. అప్రయత్నంగా కళ్ళలో నీళ్ళు నిలిచాయి.ఆ విషాదం స్థాయినే రామయ్యగారిపై కోపంకూడా కొంతస్థానాన్ని ఏర్పరచుకొంది.

"ఎంతపనిచేసుకున్నావ్ మామయ్యా! ఎవరయినా ఈ పరిస్థితుల్లో యింత అమానుషంగా ప్రవర్తిస్తారా"

"రఘూ! నాకూ విషయపరిజ్ఞానంవుంది. నన్ను ధిక్కరించి వాడలా వెళతాడని నేనూ అనుకోలేదు. అన్నివిధాలా నన్ను ఎదిరించి నా మాటకు కాస్తకూడా విలువియ్యనివాడు నా కొడుకూగాదు, నేను వానికి తండ్రినీగాదు. నీకూ ఆ దౌర్భాగ్యునిపై ఏమయినా ప్రేమా సానుభూతీ మిగులుంటే వానితో కలసి ఏ గంగలోనో దూకు. ఛీ! ఛీ !ఛీ! ఇలాంటి కృతఘ్నులను కన్నందుకే నాకు ప్రాయశ్చిత్తంలేదు. ఏతండ్రీగూడా నాలాగా యిలా కుమారులతో అవమానం పొందుండడు. అంతా నన్ను జూచైనానేర్చుకోండి. పుత్రుల గన్నందుకూ, వారి శ్రేయస్సు నభిలషించినందుకూ, నాకు లభించిన ప్రతిఫలాన్ని అంతా చూడండి. బుద్ధున్నఎవ్వరూ పుత్రులను కంకండి. అంతకంటేపాపం మరొకటిలేదు" పిచ్చిగా అరచాడు రామయ్యగారు.

"ఇలాంటి మొండిపట్టుదలలవల్లే చివరికిలా తెచ్చుకొన్నారు. మీరింత అజ్ఞానంగా, తానుబట్టిన కుందేటికి మూడేకాళ్ళన్నట్లుగా ప్రవర్తిస్తారని నేననుకోలేదు. మీరు చేసిన ఈ ఘోరకార్యాన్ని ఎవరూ హర్షించరు"

"ఎవడో హర్షించాలనీ, ఎవడో ఏడ్వాలనీ నేనేపనీ చెయ్యను నాతో అనవసరంగా వాదించకవెళ్ళు"

"మీలోనిజంగా కరుణ, దయ కరుడుగట్టుకుపోయింది. ఏనాడో ఒకనాడు మీ ఈ స్వయంకృతాపరాధానికి కుమిలి కుమిలి, కృంగి, పశ్చాత్తాపం చెందకపోరు. ఇక ప్రకాశం

మీకుదక్కడు. అసలేవానిది జోలెడంత అభిమానపు మనసు. వాణ్నిక మీరీజన్మలో చూడలేరు. ఇక మీకిదే శిక్ష" ఆవేశంగా అని, యిక అక్కడ వుండటానికి మనస్కరించక బయటకు వచ్చాడు. ప్రకాశం గురించి అతని ఆలోచనలు ప్రవహించసాగాయి.

"అయ్యో! వాడీ ఆవేశంలో ఏదైనా అఘాయిత్యం తలపెట్టుకుంటే... కాదు, వాడలాచేయడు. వాడు నేరుగా సావిత్రికోసం వెళ్ళుంటాడు. తప్పక లింగయ్యగారివనంలో వుంటాడు" అనుకొని ఏదో నిశ్చయంతో ముందుకు నడక సాగించాడు.

లింగయ్యగారి మామిడివనం నిశ్శబ్దంగా, అన్నీ హరించుకుపోయి భోరున విలపిస్తున్న తప్తజీవిలా బిక్కుబిక్కుమంటోంది. ప్రకాశంకు జరిగిన ఈ అన్యాయానికి, మామిడివృక్షం విషాదంగా సానుభూతితో తన పత్రాలను అతనిపై వెదజల్లుతోంది పక్షులు బాధగా విషాదగీతికల నాలపిస్తున్నాయి. భానుడు ఈ అన్యాయాన్ని చూడలేక బయటకు తనమొహం చూపలేక భారంగా మేఘాలచాటునే పయనిస్తున్నాడు.

ప్రకాశం ః ప్పి ఈ లోకాన్నే విస్మరించి రక్తపుమడుగులో నిర్జీవంగా పడున్నాడు.

రఘు వనంలో ప్రవేశించాడు. అంతా నిశ్శబ్దంగా వుంది. "ప్రకాశం" అని గట్టిగా పిలిచాడు. ప్రతిధ్వనితప్ప ప్రతి జవాబులేదు. రెండుసార్లు పిల్చాడు.

వనమంతా తిరిగితిరిగి మల్లెపొదలవేపువచ్చి "ప్రకాశం" అంటూ, ఒక్క ఉదుకు ముందుకువేశాడు. పాదాలకు ఏదో జిగటగా తాకినట్టయి, క్రింది వేపుపడున్న ప్రకాశాన్నిజూచి ఒక్కసారి "ప్రకాశం" అని బిగ్గరగా అరచాడు. ఆ అరుపుకు ఏదయినా మహత్తంటూవుంటే ఆకాశమంతా ఒక్కసారిగా చలించి, బ్రద్దలయ్యేది.

చలనరహితంగా రక్తాభిషేకంతో పడున్న అతన్ని జూచేసరికి రఘుకు దుఃఖం ఆగలేక పసిపిల్లవానిలా విలపించాడు.

"అయ్యో ప్రకాశం! ఎవరుచేశారీ పాపకార్యాన్ని? ఇంతటి సాధుహృదయాన్ని అంత కర్కశంగా, నెత్తురు ఏరులై ప్రవహించేలా హింసించటానికి ఏ దుర్మార్గునికి చేతులొచ్చాయి. అయ్యో భగవాన్! ఇంతదారుణమా?" అని భోరున విలపించాడు రఘు.

ఐదునిముషాలు ఆ విధంగా పరితపించి, కర్తవ్యాన్ని గురించి ఆలోచించాడు. నాడిపట్టుకొనిచూసి సంతోషంతో కన్నీళ్ళు తుడుచుకొన్నాడు. ప్రక్కనేవున్న బావిలో నీరు దెచ్చి తనపంచెచించి నీటితో తడపి, తలకు దెబ్బతగిలిన ప్రదేశంలో జాగ్రత్తగా కట్టాడు.

ఇంతలో వనంలోకి లింగయ్యగారి నౌకరువచ్చి ఈ దుస్థితికి ఎంతో విచారించాడు.

"నీ విక్కడేవుంటావుగదూ! గ్రామంవెళ్లి బండితీసుకు వస్తాను" అన్నాడా రఘు బొంగురుగొంతుతో.

"అలాగే బాబూ" అన్నాడతను ప్రకాశం ప్రక్కగా కూచుంటూ.

రఘు ఒక్కపరుగుతో గ్రామంలో పడ్డాడు. వెంక ట్రామయ్యగారి యింటికివెళ్ళి పరిస్థితి చెబుదామనుకున్నాడు గాని, అక్కడ పరిస్థితి విషమిస్తుందేమోనన్న భయంతో వెళ్ళలేకపోయ్యాడు. యువజనసంఘమిత్రుల్ని యిరువుగ్నను వెంటదీసుకొని బండితోసహా వనంవేపు వచ్చాడు.

ఎలా తెలిసిందోగాని ఒక్కక్షణంలో ఈవార్త ఆ గ్రామమంతా తెలిసిపోయింది. ప్రకాశం తల్లికి మూర్ఛవచ్చి స్తంభనైంది, శారద "అన్నయ్యా" అంటూ గుండెబద్ద లయ్యేలా ఏడ్చింది. రామయ్యగారు మొదట్లో ఈ వార్త వినగానే కాస్త చలించినా, అంతలోనే లేని గంభీరం దెచ్చి పెట్టుకొని "చావనీ, దుర్మార్గుడు! పాపానికి సరయిన ప్రాయ శ్చిత్తం అనుభవించాడు" అన్నాడు పైకి. లోపలమాత్రం గుబులుగానేవుంది.

గ్రామంలో ఈ విషయంవిన్న చాలామంది వనం వేపు దారితీశారు.

ఎదురుగా బండిలో ప్రకాశంతోసహా వస్తున్న రఘును జూచి వారక్కడే ఆగిపోయారు. ప్రకాశం యింకా స్మృతి హీనంగా పడున్నాడు. బండిగ్రామంచేరగానే అప్పుడే పట్టణం వెళ్ళే బస్సువచ్చి అక్కడ ఆగింది. "ఇక్కడుంటె చాలా ప్రమాదం వెంటనే పట్టణం తీసుకువెళ్ళి ఆసుపత్రిలో చేర్పిం చండి" అని చాలామంది సలహా యిచ్చారు

రఘు మిత్రుల సహాయంతో ప్రకాశాన్ని బస్సులో చేర్చాడు.

"నేనూ అన్నయ్యతోపాటే వస్తాను బావా" అంది లలిత.

"ఎందుకులే లలితా, మేమున్నాంగా" అన్నాడు రఘు.

...ధూళిలేపుతూ బస్సుభారంగా కదలింది.

* * *

ప్రకాశాన్ని ఎవరో లింగయ్యగారి వనంలో చావ మోదారనీ, స్మృతితప్పిన ప్రకాశాన్ని రఘు ఆసుపత్రికి తీసుకువెళ్ళాడని గ్రామంలో ప్రతిఒక్కరికీ తెలిసిపోయింది. ప్రతివారూ ఈ విషయాన్ని అన్యాపదేశంగా చెప్పుకో సాగారు.

ప్రతివ్యక్తికీ ప్రకాశాన్ని ఎవరు ఎందుకుకొట్టారోదాని వెనుకగల అసలుకీలకం ఏమిటో బాగా తెలుసు. కాని ప్రతి వారూ "ఎవరో?" అన్నపదాన్ని మాత్రమే ప్రయో గించారు.

ఈ విషయంతోపాటు ఆ తండ్రీకొడుకులమధ్య సంభ వించిన స్పర్ధలూకూడా చాలామందికి తెలిసి, దానికీ దీనికీ ముడిపెట్టప్రయత్నించారు.

చాలామంది ఈ విషయమయి ప్రకాశంపై జాలీ సానుభూతీ కనబరచారు. మరికొందరు మంచిశాస్తిజరిగిందని లొట్టలువేశారు.

జరిగే కార్యాలన్నిటినీ పట్టించుకుంటూ లోకం తమ కార్యక్రమాలను ఎన్నడూ ఆపుకోదు. "ప్చ్" అని చప్పరించటంతో నాటికి స్వస్తిచెబుతారు కొందరు. మరికొందరు చిలవలు పలవలు అల్లి వెదజల్లుతారు. ఇం కొందరు వ్యాఖ్యానాలూ, విమర్శలతోసహా చర్చించి తమ నాలుక దురద తీర్చుకుంటారు. ఏదిఏమయినా ప్రకాశంకు జరిగిన అన్యాయానికి గ్రామంలో ఎక్కువభాగం బాధపడ్డారనే చెప్పాలి.

వెంకట్రామయ్యగారు మాత్రం ఈ విషయంలో ఏ విధంగానూ నోరువిప్పలేదు. మనసొకచోట. మమతొకచోటగా వుంది అతని స్థితి. అభిమానమనేది కాస్త అడ్డొచ్చి పైకి ప్రకాశాన్ని చీదరించుకుంటున్నా మనసులోమాత్రం పితృహృదయంతో కుమిలిపోతున్నాడు. పట్నంవెళ్ళి ప్రకాశాన్నిచూచి వద్దామా అనుకోలేకపోలేదుగాని గతసంఘటన జ్ఞప్తివచ్చి ఆగిపోయాడు.

"నా కొడుకు దగ్గరకు నన్ను పంపించమని" ప్రాధేయపడింది భార్య.

"నోరుమూసుకో. వాడు నాకూ కొడుకుగాదు, నీకూ కొడుకూగాదు" ఇంకా ఏదో అనబోయి బాధతో మౌనంగా వుండిపోయాడు.

* * * * *

సావిత్రి కారోజురాత్రి స్పృహరాలేదు. తల్లి జరిగింది తెలుసుకొని బెంబేలుపడిపోయింది. బిడ్డనుచూస్తూంటే ఆమె

మనసు భీతావహమైపోతోంది. సాంబయ్యమాత్రం తనకేదీ పట్టనట్టుగా గంభీరంగా చుట్టగాలుస్తూండిపోయాడు.

ఆ రాత్రిస్పృహవచ్చీరావటంతోనే "బావా!" అనిబిగ్గరగా కేకబెట్టి లేచింది. ఆమె కళ్ళఎదుట రక్తపుమడుగులో తలపగిలి, స్మృతిదప్పి నేలమీద బోర్లాపడున్న ప్రకాశం రూపు మెదలింది.

"బావా" అని భయంగా కేకబెట్టి లేచిపరువెత్తింది.

"అమ్మా సావిత్రీ!" అంటూ తల్లి చేయిపట్టుకున్నా లెక్కచేయకుండా విడిపించుకొని బయటకుపరువెత్తబోయింది.

"ఆగు" అని గట్టిగా గర్జించి సాంబయ్య ఆమె రెట్ట బట్టుకొని యీడ్చాడు. ఆ వూపుకు విసురుగావచ్చి స్తంభానికి తగిలిం: ఆమె తల. "బావా" అంటూ చిన్నగామూలిగి సావిత్రి మళ్ళీ స్పృహదప్పి నేలవాలిపోయింది.

"దీన్ని బయటకు కదలకుండా గదిలోవేసి తాళం వెయ్యి. బావట, బావ" అంటూ బయటకెళ్ళాడుసాంబయ్య.

# 23

ప్రకాశం భారంగా కళ్ళువిప్పాడు. ఎదురుగా గది చూరుకనిపించింది. ప్రకాశం ఏదీ తెలియని అజ్ఞానస్థితిలో వుండిపోయాడు. ఒక్కక్షణం తలకేదో బరువుగావున్నట్టు తోచింది. తడిమి చూసుకున్నాడు. పెద్దగా కట్టుకట్టబడింది.

ఎడమచేయి ఊతగా దీసుకొని లేవబోయాడు. "అబ్బా" అన్నాడు బాధగా తిరిగి పడుకొంటూ. ఆ చేతికి కూడా కట్టుఉంది.

తన్ను తాను పరిశీలించుకొన్నాడు ప్రకాశం. తనొక పెద్దమంచంపై పరుపుమీదున్నాడు. గది నాలుగుగోడలూ పరికించి చూడగానే అతనికర్థమయింది. తాను హాస్పిటల్‌లో వున్నాడని. ఎలావచ్చాను? ఏమిటిది? అనుకోగానే అతనికేదో లీలగా జ్ఞప్తికొచ్చింది.

తాను తండితో వివాహవిషయమై పోట్లాడటం, ఆవేశంలో ఇల్లువదలిరావటం, సావిత్రిని చూడటం, ఆమెతో సహా పారిపోవటానికి సిద్ధంగా వున్నపుడు... అప్పుడు... జొను వెనుకచాటుగా ఏదో ఆకారం, ఆ తర్వాత తనకేదీ కనిపించలేదు. అంతే...!

"ఎంత ఆలోచించినా మరేదీ జ్ఞప్తికిరావటంలేదు. ఇక్కడికి తనెలా వచ్చాడు.

ప్రకాశంకు ఈ ఆలోచనలమధ్య సావిత్రి మెదిలింది. బాధగా, బరువుగా, అస్పష్టంగా "సావీ" అని గొణుక్కున్నాడు. ఏదేదో జ్ఞప్తికి తెచ్చుకోటానికి ప్రయత్నించాడు. తన్నారోజు వెనుకచాటుగా... ఆఁ...ఆఁ... ఆ సాంబయ్యే కావచ్చు, అతనుదప్ప మరెవరు? సావిత్రికేదయినా...

"సావీ" అని అరచి ఉన్నపళంగా పైకిలేవబోయాడు.

"నో ... నో... అలా లేవకూడదండీ యింకా గాయాలుమానలేదు" అంటూ నర్స్ అతన్ని పడుకోబెట్టింది. అతడామెవేపు అరక్షణం పిచ్చిగాచూసి "సిస్టర్" అన్నాడు.

"ఏమండీ"

"ఒక్కమాట"

"అడగండి"

"ఇదేవూరు?"

ఆమె చెప్పింది.

"నన్నిచ్చటి కెవరు తెచ్చారు"

"నా కెలా తెలుస్తుందండీ ఎవరో మీలాగే వున్నా యన మిమ్మల్ని యిక్కడికి చేర్చారు"

"ఎన్ని రోజులయిందీ"

"మూడు రోజులనుకుంటాను"

"మూడు రోజులే!" ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

"అవును"

"అయ్యో అక్క డేం జరుగుంటుందో" అనుకొని "సిస్టర్! ఒక్కసాయం చేస్తారా" అన్నాడు.

"ప్రయత్నిస్తాను"

"నన్నిక్కడనుండి బయటకు పంపిస్తారా"

"ఎప్పుడు?"

"ఇప్పుడే"

"అదెలాండి! మీరిపుడు ఒక్కడుగుకూడా ముందు కెయ్య లేరు"

'అయినా వెళతాను ప్లీజ్ ..."

"క్షమించండి! నాకా అధికారంలేదు. మిమ్మల్నీ స్థితిలో ఎవరూ కదలనివ్వకూడదు. ఇంకా పక్షంరోజులుండాలి"

"పక్షంరోజులే! అబ్బ!"

"అవును" అని ఆమె వెళ్ళిపోయింది.

ఆమె అలా వెళ్ళగానే రఘు ప్రవేశించాడు, "ప్రకాశం" అంటూ ఆనందస్వరంతో.

"రఘు నువ్వా!"

"ఏం నేనే! అబ్బా! ఎన్నాళ్ళకు కళ్లుదెరచావురా! ఇంతవరకూ నాకు గుండెల్లో గుండెలు లేవనుకో"

"మూడు రోజులుగా నాకు స్పృహ రాలేదా?"

"లేదు, ఇంకా ఇప్పుడే కళ్లుదెరుస్తున్నావ్! ఇక భయంలేదు. దేవుడు నిన్ను రక్షించాడు"

"నన్నెలా దెచ్చావ్ నువ్వు!"

రఘు అంతా వివరంగా చెప్పాడు

"నీ సహాయం మరువనులేను రఘు"

"మిత్రునిగా నా ధర్మం అది"

"రఘు"

"ఏం?"

"సావిత్రికి సంగతి తెలుసా"

"తెలిసేవుంటుంది. అసలీ నిన్నీస్థితికెవరు తెచ్చారు?"

ప్రకాశం నిట్టూర్చి అంతా పూర్తిగాచెప్పి, "రఘు! ఒక్క సహాయం చేస్తావా" అనడిగాడు.

"ఆలోచిస్తాను చెప్పు"

"సావిత్రిని పిల్చుకు రావాలిరా. చూడాలనుంది"

"నేనా?"

"అవును రఘు! నాకీ ఒక్క సహాయం చెయ్యి. నీ మేలీ జన్మలో మరువలేను"

"క్షమించు ప్రకాశం, అది మాత్రం సాధ్యంగాదు"

"నాకోసం ప్రయత్నించరా"

"ఎలారా? ఏ విధంగా"

"నేను పిలిచినట్లు సావిత్రితో ఒక్కమాట చెప్పచాలు ...ఆమే వస్తుంది... ఈ ఒక్క సహాయం చేశిపెట్టరా..."

"నిన్నీస్థితిలో విడిచి ఎలా వెళ్ళగలను?"

"నాకేం ఫరవా లేదు"

"ఎక్కడికైనా పరారైతే"

"ఆ భయమేమీలేదు! సావి వచ్చేవరకూ నేనెటూ కదలను... రెండు రోజులలో సావిత్రితోసహా నీవు నాకు కనిపించాలిసుమా!"

"ఏమో! ఖచ్చితంగా చెప్పలేను ప్రకాశం! సాధ్యమైనంతా ప్రయత్నిస్తాను...ఇప్పుడే వెళ్తాను!" అని అట్నుంచీ లేచి 'నర్స్' కేదో చెప్పి బయలుదేరాడు.

* * * * *

ఇందిర ఆరోజే తన స్వగ్రామంనుండీ పట్నం వచ్చింది! పరీక్షా ఫలితాలప్పటికే తెలశాయి...మంచి మార్కులతో ఉత్తీర్ణురాలైంది! ఇంటర్ చేరాలనే ఉద్దేశంతో కాలేజికి "అప్లై" చేయటానికి పట్నం వచ్చింది.

ఇందిరకు తన అన్న చేశిన ఘనకార్యం అంతకుమునుపే తెలుసు! ఈ విషయమై చాలా బాధపడింది... తలిదండ్రులు కూడా ఎంతో నచ్చజెప్ప ప్రయత్నించారు! కాని అతను ససేమిరా అంగీకరించలేదు. ఇందిర అన్నకు సలహాచెప్పే స్థితిలో లేదు. ఆస్థితే వుంటే చెంపవాయించి చీవాట్లు పెట్టేది. అంత ఆక్రోశం అన్నపట్ల ఆమెకుంది.

పట్నంవచ్చి, వదినలేక బోసిపోయిన ఆ విచ్ఛిన్న గృహాన్నిజూచి, బావురుమంది... వదినను తలచుకొని అశ్రు బిందువులు తర్పణచేశింది!

ఆరోజు కాలేజివెళ్లికి అప్లికేషన్ ఫారమ్ తీసుకొని వస్తూండగా మైన్‌స్ట్రీట్‌లో రఘు తారసపడ్డాడు... రఘునామె తన అన్నయ్య పెళ్ళిసందర్భంలో జూచింది... పెద్ద పరిచయాలంటూ లేకపోయినా యిరువురికూ ముఖపరిచయం మాత్రం బోలెడంతవుంది! రఘు ఆమెను చూడగానే గుర్తుపట్టాడు. కాని పలుకరించటానికి సంకోచించాడు... అతను పలుకరించక పోవటం చూశి తనే ధైర్యంజేసి "ఏమండీ!" అని పిలచింది ఇందిర.

అతను ఆగి ఆశ్చర్యంగా ఆమెవేపే చూస్తూ నిలబడి పోయాడు.

"గ్రామంనుండే వచ్చారా"

"అవునండీ"

"ప్రకాశం బావగారు క్షేమమేనా!"

"ప్రకాశంగురించి నేనిప్పుడన్ని వివరాలూ చెప్పలేను. ప్రస్తుతం ఇక్కడే హాస్పటల్‌లో వున్నాడు... వెళ్ళి కలవండి"

"హాస్పిటల్లోనా... ఏం జరిగింది...!"

"అదంతా ఒకపెద్దకథ! తలపై ఎవరో బలంగా కొట్టారు 9వ వార్డులో 3వ గదిలో వున్నాడు... వెళ్ళండి" అని రఘు ముందుకు కదిలాడు.

ఈ విషయం విన్నప్పట్నుండీ ఇందిర భయంతో కంపించి పోతోంది!. ఎందుకు! ఎప్పుడు? ఎలా? ఎవరు? అన్నప్రశ్నలతో ఆమె మస్తిష్కం వేడెక్కింది.

...హాస్పిటల్ ముందు రిక్షా ఆగింది... అందులోంచి ఇందిర దిగి రిక్షావానికి కిరాయీ చెల్లించి హాస్పిటల్‌లో అడుగుపెట్టింది. కొంతదూరం నడచాక, ఎదురుగా వస్తున్న ఒకనర్సు ముందు ఆగి.

"ఏమండీ! తొమ్మిదవవార్డు ఎక్కడ?" అనడిగింది.

"ఎవరు కావాలి?"

"మూడవ గదిలో మా బంధువులున్నారు."

"బంధువులంటే... మీవారా?"

ఇందిర సిగ్గుపడింది, "కాదండీ... మా బావగారు" అన్నది.

"ఆయన పేరు"

"ప్రకాశంగారు"

"ఓహో! అలాగా!! నాడ్యూటీకూడా అక్కడే! వెళదాం పదండి!! అయితే మిమ్మల్నే నన్నమాట ఆయన గారు అనుక్షణమూ పలవరిస్తూంటాడు"

"నన్నా !" ఇందిర ఆశ్చర్యపోయింది

"ఆఁ... మిమ్మల్నే ఎప్పుడూ" సావిత్రీ... సావీ, "అని పలవరిస్తూంటాడు" అంది ఆమెవైపు వేపే చూస్తూ ఇందిర నిర్ఘాంతపోయింది... 'సావిత్రి' అన్న పేరును ఆమె అధరాలు అస్పష్టంగా ఉచ్చరించాయి.

"ఏమిటలా ఆగిపోయారు..." విస్మయంగా అంది నర్స్!

"అబ్బే! ఏం లేదండీ!!" అంటూ ముందుకు కదలింది ఇందిర.

"పాపం! ఆయనగారు మీకోసం చాలాబాధ పడుతున్నారు. మీరిన్నిరోజులు రాకపోవటంలో చాలా పొరపాటు చేశారు"

ఇందిరకా మాటలు ములుకుల్లా బాధపెట్టాయి. ఏమీ జవాబివ్వలేదు. మౌనంగా ఆమె నడుస్తోంది... "ఎవరీ సావిత్రి?" అని ఆలోచించటంలో ర్ఘ నిమగ్నత చెందింది

ఇద్దరూ ప్రకాశం వుంటున్న గదిలో ప్రవేశించారు. బెడ్డుపై ప్రకాశం నిశ్చలంగా కళ్ళుమూసుకొని పడుకున్నాడు. ఎంతో ప్రశాంతంగా స్వచ్ఛంగావుంది అతని ముఖమండలం. ఏదో ఆలోచిస్తున్నట్టుగా అతని భ్రుమముడి కాస్తా కుంచించుకొనుంది.

ఇందిర నర్స్ వెనుకాలే వెళ్ళి అతని మంచం ప్రక్కగా నిల్చొంది, సంకోచిస్తూ! నర్స్ ఆమె సంకోచాన్ని గమనించి, "ఏమండీ, ప్రకాశంగారూ. మీ ఊహ సుందరి వచ్చింది లేవండి" అంది నవ్వుతూ!

ఆ పిలుపుకు ప్రకాశం ఏదో స్వప్న జగత్తునుండీ వూడి పడ్డవానిలా వులుకుపాటుతో కళ్ళువిప్పి ఎదురుగానున్న వీరిద్దరనూజూచి కాస్త నిరుత్సాహం చెందాడు.

ఇక వీరిమధ్య పానకంలో పుడకలా తననెందుకను కుందేమో నర్స్ అట్నుంచీ వెళ్ళిపోయింది!

"నువ్వా ఇందిరా! కూచో" అన్నాడతను ఆమెవేపు చూస్తూ ఇందిర అతని ప్రక్కగా బెడ్డుపై కూచొంది.

"అంతా క్షేమమేనా ఇందిరా!"

"ఆ...నీకీదెబ్బ ఎలాతగిలింది బావా!" దీనంగా, బాధగా అడిగింది ఇందిర.

"అంతా నాఖర్మ ఇందిరా...ఇంతకుమించి మరేం అడగవద్దు"

"నాతోకూడా చెప్పరాని విషయమా! అంటూండగా ఆమెకళ్ళలోనీళ్ళు సుడిగుండాల్లా తిరిగాయి."

"చెప్పరాని విషయమనిగాదు. మరేమనుకోకు ఇందిరా!"

ఇందిర చిన్నగా నిట్టూర్చింది, "వదిన క్షేమమేనా" అని అడిగింది ఏదీ అడగటానికి అంతకుమించి మరేమీ తోచక.

"ఆ—ఏం క్షేమంలే! పండంటిదాని సంసారం అలా తయారయింది. ఇప్పటికైనా మీ అన్నగారు మనసు మార్చుకొన్నారా"

"ఎలా చెప్పను బావా! అన్నయ్య అదోకరకమైన అనుమానపు మనిషి"

"నిజం నీకైనా తెలుసా ఇందిరా!"

"తెలుసు బావా! వా డెవడైందీ నాకు బాగా తెలుసు! ఇంతకుముందు మాతో కీళ్ళు విరగగొట్టించు కున్నాడు వాడు. వాడాకసితోనే అన్నయ్య కా ఉత్తరం వ్రాసి యిలా తగులపెట్టాడు."

"ఈ విషయం మీ అన్నయ్యకు తెలీదా"

"తెలిసినా నమ్మలేదు"

"హుఁ" భారంగా నిట్టూర్చాడు ప్రకాశం.

ఇందిర ఎంత ఉత్సాహంతో యిక్కడకు ప్రవేశించిందో యిక్కడకు రాగానే అంత నిరుత్సాహం చెందింది. ఆ సావిత్రి ఎవరో ఆమెకూ, బావకూ ఏం సంబంధమో...! బావ అలా ఆమెను కలవరించటానికి ఆమే అంత సన్నిహితురాలా! ఇక ఇందిర తన సందేహాలను మనసులో వుంచుకో లేకపోయింది.

"బావా"

"ఏం ఇందిరా"

"ఒక విషయం అడుగుతాను. నిజం చెబుతావా!"

"నే నెప్పుడైనా అబద్ధం చెప్పానా"

"సావిత్రి ఎవరు?"

"ఒక దురదృష్ట వంతురాలు."

"నా ప్రశ్నకు అది సమాధానం గాదు"

"అంతకంటే యింకా ఎలావిడమర్చి చెప్పాలి ఇందిరా"

"ఆమెకూ నీకూ ఏం సంబంధం"

"భార్యాభర్తల సంబంధం."

ఇందిర నిర్ఘాంతపోయింది "ఆ... అయితే మీకు పెళ్ళయిందా"

"ఐంది"

"కనీసం నన్ను పెళ్ళికైనా పిలనలేదే బావా" ఉన్న సంక్షోభాన్నంతా అణచుకొని అడిగింది. ఆమె ఆపుకోవా లనుకున్నా రెండు కన్నీటిబొట్లు అతని చేతిపై పడ్డాయి.

"అందరిలాగా మా పెళ్ళి కాలేదు ఇందిరా"

"మరి"

"గాంధర్వ వివాహం... అం !"

ఇందిర కన్నీళ్లు తుడుచుకోబోయింది.

"ఎందుకేడుస్తావ్ ఇందిరా"

"ఏడుపొచ్చింది బావా!"

"ఎందుకూ!"

"మీస్థితి జూచి"

"ఊరుకో యిందిరా! జరిగిందేదో జరిగిపోయింది! నాకోసం మరెవరూ ఏడ్వకూడదు! అందువల్ల కేవలం నాకు మనోక్షోభంతప్ప మరేమీ మిగలదు"

ఇంతలో నర్సు ఇంజక్షన్‌తో సహా వచ్చింది. ఇందిర ఏదో అడుగబోయి ఆపుకుంది.

నర్సు ప్రకాశానికి ఇంజక్షన్ చేసి "వీరికి కొద్దికాలం విశ్రాంతి అవసరం. మాట్లాడితే గుండెలలసిపోతాయి" అంది.

"అయితే నేనొస్తా బావా!" అంటూ బరువుగా లేచింది ఇందిర.

"మళ్ళీ వస్తావా ఇందిరా"

ఆ ప్రశ్నకామె జవాబివ్వలేదు. ఒక్క-క్షణం అతని వేపు దీర్ఘంగాచూసి, కళ్ళనిండా నీరునింపుకొని. వెనుదిరిగి, తొణకుతున్న నడకతో భారంగా బయిటకెళ్ళిపోయింది.

"ఎవరండీ ఈవిడ. మీ సావిత్రేనా" నర్సు అడిగింది!

"కాదు సిస్టర్"

"మరి"

"నా మరదలు. ఇందిర"

"అయితే ఈమె సావిత్రి కాదన్నమాట! అందుకే గాబోలు సావిత్రిపేరు చెప్పగానే అలా తెల్లబోయింది!

"ఏమన్నారేమిట"

"అబ్బే నేనేం అనలేదండి" "అని ఆగి," అయితే మీకు ఆమె భావం అర్థంగాలేదా" అంది.

"ఏ భావంని"

"ఎంత అమాయకులండీ! ఆమె మిమ్మల్ని ప్రేమిస్తోంది..."

"ఏమన్నారూ! ఇందిర నన్ను ప్రేమిస్తోందా! మీ కెలా తెలుసు"

హృదయాన్ని ఆమ్మాత్రం ఏ స్త్రీయైనా పసిగట్ట గలదు"

"హు" అని చిన్నగా నిట్టూర్చాడు ప్రకాశం. నర్సు అతనివేపే కొద్ది క్షణాలుచూశి, "పాపం" అనుకొని బయటకు వెళ్ళిపోయింది.

* * * * *

# 24

రఘు వెళ్ళి యిప్పటికీ నాలుగు రోజులయింది. ప్రకాశం అతని నిరీక్షణలో వేసారిపోయాడు. కారణం తెలియక అతని హృదయం క్షుభితమైపోయింది. ఏదో అస్పష్ట, అజ్ఞాత, నిరాకార, అంతర్నిబీడితశక్తి అతని హృదయంలో చెల రేగుతూ ఏవో సుదీర్ఘ భావాలు వెదజల్ల సాగింది. రఘు రాకపోవటానికిగల కారణాలు అతనికి ఎంతవూహించినా స్ఫురించలేదు, నాలుగు రోజులుగా రఘు అక్కడ ఏంచేస్తున్నట్లు? ఏదేనా ప్రతికూలం సంభవించిందా? తనే వెళ్దామను కుంటే యిక్కడ తనకిదొక బంధం! ఇంతకూ రఘు సావిత్రికీ విషయం చెప్పినాడో లేదో! అయితే ఎందుకు సావిత్రి రా లేదు.

ఏవేవో ఆలోచనలు... ఎన్నెన్నో సమస్యలు. ఏమి టేమిటో తీర్మానాలు. ఏవేవో పరిష్కార సూచనలు. వేటికీ సరయినరూపంలేదు, బుర్రవేడెక్కటం మినహా మరేం లేదు.

*

మరి రెండు రోజులు భారంగా దొర్లాయి. రఘు వచ్చే ఛాయలేం కన్పించలేదు. ఇక వస్తాడన్న ఆశకూడా లేదు. మరి తనిక్కడ ఎందుకుండాలి? ఇక తనే వెళ్ళాలి. దొంగగానైనా యిట్నుంచీ బయటపడి సావిత్రిని కలుసుకోవాలి. ఇంతకు మినహా మరో మార్గంలేదు.

ప్రకాశం ఒక తీర్మానానికొచ్చి ఎవరూలేని సమయం జూచి మెల్లగా మంచందిగి నడవటానికి కాళ్ళుసాచాడు. నడవగలిగాడుగాని చాలా భారంగావుంది. శరీరం అంతా మండిపోతోంది.

రెండడుగులు ముందుకువేశాడో లేదో కళ్ళుదిరిగి తూలి క్రింద పడబోతూండగా ఎవరోగట్టిగా భుజాలు పట్టుకొని మరీ మంచంపై పరుండబెట్టి దీర్ఘంగా నిట్టూర్చాడు.

ఒక్కక్షణం తర్వాత ప్రకాశం కళ్ళువిప్పి ఎదురుగా నున్న రఘునుజూచి పట్టలేని ఆనందంతో, అతని ప్రక్కగా సావిత్రి వుందేమోనని అటూయిటూజూచి నిరుత్సాహంగా "ఏది రఘు సావిత్రి" అన్నాడు.

రఘు విషణ్ణ వదనంతో తల క్రిందకు దించుకొన్నాడు మౌనంగా. అతని కళ్ళలో నీళ్లు సుడిగుండాల్లా తిరుగు తున్నాయి, అవి అప్పుడో యిప్పుడో ఒక్కసారిగా జల పాతంలా క్రిందకు దూకవచ్చు.

"రఘు సావిత్రి ఎక్కడ?"

"... ..."

"ఏమిటామౌనం? సావిత్రిఏదీ?"

"ఎందుకురా నన్నిలా మౌనంతో చంపుతావ్! చెప్పు సావిత్రిఎక్కడ?" దాదాపు ఏడుపు స్వరంలో అడిగాడు.

"ప్రకాశం..." ఆ తర్వాత ఏదో అనబోయాడుగాని అతని నోరుపెగలలేదు. అతని అధరాలు కంపిస్తున్నాయి. నాడులు స్పందిస్తున్నాయి. తనుచెప్పబోయే వార్త తలచు కొనేకొద్దీ ఒళ్ళంతా జలదరిస్తోంది.

"ఏమిటి రఘు ఆగిపోయావ్! సావిత్రిరాలేదూ"

"రాలేదు"

"రాలేదా ఎందుకురాలేదు. ఏమంది"

"రఘు! చెప్పరా! ఆ వార్త ఏదో నా చెవినవేసి పుణ్యంగట్టుకోరా"

"ఎలాచెప్పగలను ప్రకాశం"

ప్రకాశం ఆ జవాబుకు పిడుగుపడ్డట్టుగా చలించి పోయాడు. "ఏంజరిగిందసలు" వణుకుతున్న కంఠంతో అడి గాడు.

రఘు చెప్పాలని నోరు తెరచి మళ్ళీ ఏమనుకున్నాడో ఏమోగాని "నీవు విశ్రాంతి దీసుకో ప్రకాశ్ ... మళ్ళీ చెబుతాగాని ..." అన్నాడు.

"విశ్రాంతి... హు... ఎన్నాళ్ళురా ఇక ఈ విశ్రాంతి. విశ్రాంతిగాదిది... నా జీవాన్ని అంతరాత్మనూ అరికట్టిన ఘోర బంధం యిది... నీవూ... అవును... నీవూ నాకు శత్రువువే మీ అందరకూ నా దీర్ఘ విశ్రాంతేగావాలి ... నా చావేగావాలి అంతేగదూ"

"ప్రకాశం"

"వెళ్ళు! ఇక్కణ్ణుంచి వెళ్ళు వెళ్లేముందు నాసావిత్రి నేం చేశావో చెప్పు"

"ప్రకాశం" రఘు కళ్లనుండి నీళ్ళుదుమికాయి.

"అరెర్యో! ఏమిటిది భగవాన్! రఘూ! ఏంజరిగిందో తెలియక నా హృదయం తల్లడిల్లిపోతోంది! నీ కాళ్లప ... కుంటాను. సావిత్రికేంజరిగిందో చెప్పరా"

"ప్రకాశం... సావిత్రి... సావిత్రికి..."

"సావిత్రికి ఏమయింది"

"ఆమెకు... ఆమెకు పెళ్ళయిపోయింది. ప్రకాశ్... పెళ్ళయిపోయింద"

ఆ రెండు మాటలు ఎంత భారంగా ...న్నాడో ... నికే తెలియాలి—

"సావీ" ... హాస్పటల్ అంతా దద్దరిల్లేలా నభో నభోంతరాళాలు. ఏకవ్యాప్తిగా, మెరుపు ... 

చలించి ప్రయ్యాలైనట్టుగా, పెద్దగా పిచ్చి కేకబెట్టి మంచముపై నుండి క్రింద బడ్డాడు ప్రకాశం.

ఈ కేకకు డాక్టర్లూ, నర్సులూ ఏమిటీ విపరీతం అనుకుంటూ గబగబా వచ్చి మంచంప్రక్కగా స్మృతిదప్పిన ప్రకాశాన్నిజూచి వెంటనే అతన్ని మంచంపై పరుండ బెట్టారు.

రఘు కన్నీరు గారుస్తూ దీర్ఘంగా, భారంగా, శ్వాస వదిలాడు.

ప్రకాశం ఆ రాత్రి రెండుగంటలకు కళ్లు విప్పాడు...

ప్రకృతి అంతా నిశ్శబ్దంగా భీతావహంగావుంది. జీవ స్మరణ సమస్యలో కొట్టుమిట్టాడుతున్న రోగుల ఆర్తనాదాలు మాత్రం ఆ నిశ్శబ్దాన్నిచీల్చాలనివ్యర్థప్రయత్నంచేస్తున్నాయి.

ప్రకాశం నాలుగైదుక్షణాలు కళ్ళు అటూ యిటూ త్రిప్పుతూ ఏదో అస్పష్టంగా పలువరిస్తూ పైకి లేవబోయాడు. అతని కుడిచేతికేదో కరకుగా గరగరలాడింది.

ప్రకాశం అదేచేతితోనే దాన్ని తడిమి తీసికొన్నాడు. అదొక మడితలువేయబడ్డ తెల్లకాగితం. అందులోని అక్షరాలు దీపపు కాంతిలో అస్పష్టంగా బయటకు కనిపిస్తున్నాయి.

అనాలోచితంగా మడతలు విప్పి క్షణకాలం పిచ్చిగా దాని వేపె చూచి చదువుకోసాగాడు ప్రకాశం.

బావా! మిమ్మల్ని ఆ పవిత్రమైన నిర్మల నామంతో సంబోధించే యోగ్యతగాని, అదృష్టంగాని నాకిపుడు లేదు!. విధి విడ్డూరమైనది. మానవులను తలక్రిందులుగా చేసి, పిచ్చివారిగా మార్చే ఆఘోరవిధిని నేనిపుడు మనస్ఫూర్తిగా దూషిస్తున్నాను. మానవాతీతమైన ఆ భయంకరశక్తికి తటస్థించిన ప్రతిప్రాణీ తలొగ్గి తీరాల్సిందే! దానిని ఎది రించాలనీ, తెలుసుకోవాలనే అల్ప ప్రాభవంతో మానవుడు ఏంచేశినా అది బలిగాక తప్పదు. పరిస్థితులు, కాలం, దైవం ఇవన్నీ ఒక్కసారిగా ప్రతికూలంగా ఏకీభవించి, వూహించిన దానికి, అభిన్నమైన దృక్పథంలో, భిన్నమైన మార్పులతో, మానవుణ్ణి గుప్పిట్లో వుంచుకొని కీలుబొమ్మలా ఆడిస్తున్నాయి! దైవానికీ, అతని వ్రాతకూ, పరిస్థితులకూ మన మీనాడు బానిసలం. అది మనకు అతీతం!

బావా!!

కలలుపండే వయసులో కాలచక్రపు రాపిడికి, ఈనాడు మనం వేరైపోయినా, మనఆత్మలు ఏనాడూ ఏవిధంగానూ వేరుగావు, కలుషితంగావు. వాటికి ఎడబాటులేదు. ఇదే మానవునిలోగల ఒకేఒక పవిత్ర నిశ్చలశక్తి! నేను మీకు క్షమించరాని ఘోరద్రోహం చేశికూడా యింతధైర్యంగా, ఈ ఉత్తరం వ్రాయవలసివచ్చింది. నిష్కృతిలేని ఈ జీవితంలో। చితికిన నౌకలా, సుళ్ళుతిరిగే సుడిగుండంలాంటి భయంకర సాగరంలో ఈనాడు నేను అడుగుపెట్టవలసి వచ్చింది! ప్రయత్నాలు విఫలంగావటానికి ప్రతి వస్తువూ దోహదం చేశింది.

బావా!!!

నేను నిజంగా దుర్మార్గురాలిని. మీ జీవితంలో ఏ విధమైన శాంతినీ సౌభాగ్యాన్నీ ప్రసాదించలేని దౌర్భాగ్యు రాలిని! అన్నివిధాలా మీకు దూరమైనా నా ఈ పాపపంకిల ఆత్మ ఇంకా మీకోసం ఘోషిస్తూనేవుంది.

బావా!!

చివరిసారిగా నన్ను క్షమించమనీ, నాపాపానికి నిష్కృతి ప్రాయశ్చిత్తం కల్పించమనీ మిమ్మల్ని వేడుకుంటు న్నాను. ఏనాడైనా మీరు నాకు మళ్ళాతడస్థపడాలనీ, మీ పాదాలను కనీసం నా కన్నీటితోనైనా అభిషిక్తం చేయాలని వాంఛిస్తూ

అభాగిని

"సావిత్రి"

"కన్నీటితో అభిషిక్తం. . . పాపానికి ప్రాయశ్చిత్తం అభాగిని . . . సావిత్రి . . . హుః హు . . . "

"ఇంకెక్కడి ప్రాయశ్చిత్తం... ఇంకెక్కడి నిష్కృతి సావీ! నేనిక ఈ జీవితంలో ఎవరినీ క్షమించ లేను. నా యీ జీవితంలో తటస్థపడిన ప్రతి ప్రాణీ నా జీవి తంతో చెలగాటమాడి చివరకు నన్నీస్థితికి దెచ్చారు. నా కెవరి అభ్యర్థనగాని, ఎవరి దయాభిక్షగాని, ఎవరి కన్నీరు గాని యిక అవసరంలేదు. నేనెవర్నీ క్షమించలేను. క్షమించి నాపాపాన్ని మరింత పెంచుకోలేను . . . సావీ నిన్ను నేను

క్షమించలేను ...రాధా... నిన్ను క్షమించను... భగవాన్ నిన్నసలే క్షమించకూడదు....క్షమించకూడదు"

"ఇక నా ఈ జీవితంతో అందరకూ అవసరం తీరిపోయింది. అందరూ కలసి నన్నిలా ఏకాకిని చేశారు నన్ను నిలువునా దహించివేశారు. హే భగవాన్...ఇక నీ ఆటలు సాగనివ్వను. నీవుకాదు గదా యిక ఈ ప్రపంచంలో నన్నిక ఎవరూ ఏమీ చెయ్యలేరు. నేనొక జీవచ్ఛవాన్ని . . .నేనొక కాలాతీత వ్యక్తిని ... నేను నేనుగాదు ... నా హృదయం హృదయంగాదు. ఇంద్రధనస్సులా ఈనాడది కరడు గట్టిన పాషాణం ఇక ఎన్నిమంటలకైనా అది ద్రవించదు, స్రవించదు. దానికిక తిరుగులేదు. అదొక స్వతంత్ర స్వేచ్ఛా వస్తువు. దానికిక సంబంధాలు గాని సహవాసాలుగాని అవసరంలేదు. అన్నిటినీ కలిపి ముద్దచేసి జీర్ణించుకున్న నిండు కుండ అది! అదియిక తొణకదు ...తొణకదు."

"మానవత్వపు పొలిమేరలలో మారణహోమం మహోజ్జ్వలంగా జరిగిపోయింది."

"ఇక నాకు పొలిమేరలు గాని హద్దులుగాని లేవు. వాటికి క్షీణదశ అప్పటికే సంప్రాప్తించింది. బుద్ధివున్న ఓ హృదయమా! అర్థందెలిసిన ఓ ఆత్మా! అనుభవించిన ఓ నవనాడులారా! కంకణం కట్టికదలలేరా! ఆరిపోయిన జ్యోతులను మళ్ళీ వెలిగించలేరా! నూతన సామ్రాజ్యాన్ని స్థాపించలేరా! ఏకచ్ఛత్రాధిపత్యంగా మనం దాన్నేలుదాం, అగ్నిగుండానికి ఆహుతయిన వాటినిగురించి చింతించకండి. మన దొకకొత్త సామ్రాజ్యం. హృదయమా నీవుదానికి మంత్రివి.

నా శరీరంలోని ప్రతి అణువూ దానికి సైనికపటాలం నవనాడులారా మీరు దానికి సైన్యాధ్యక్షులు. ఇక మనకు తిరుగులేదు. హ్హా...హ్హా తిరుగులేదు హాహ్హాహ్హా"

"కదలండిక ముందుకు, తరలండి ముందువేసిన ప్రతి అడుగుకూ వెనుక లక్షల కంఠాలు అరచి అరచి సొమ్మసిల్లి పోవాలి. పదండి ముందుకు, కదలండి ముందుకు. చూడకండి వెనక్కు, ఆరిపోయిన చితిలో ఏదీ లేదు. అంతా నాస్తి గతం గతః, దాని ఛాయలు మనకొద్దు వ్రాం పరువులెత్తండి వినిపించలేదా నాకంఠశోష ..."

ప్రకాశందిగ్గునలేచి హాస్పటల్ ఆవరణ దాటి వీధిన పడ్డాడు.

"విజయపథం మనకు స్వాగతం పలుకతోంది. మనం మనమేనని చాటుదాం విన్నారా వింటున్నారా మరి పరువులెత్తండి"

ప్రకాశం ఆనిశ్శబ్ద నిశీథవాతావరణంలో పిచ్చివానిలా అరుస్తూ రోడ్డువెంబడి పరువెత్తుతున్నాడు.

*    *    *    *    *

'రైల్వేస్టేషన్' ముందు వచ్చే మెయిల్ కోసం ఆగియున్న జట్కావాలీలు ఏదో విద్దశబ్దం వినిపించి ఒక్కసారిగా అటుచూశారు.

ఫుట్‌పాత్‌పై సొమ్మసిల్లి పడియున్న ప్రకాశాన్ని జూచి వారాశ్చర్యపోయారు. అతనిదగ్గరగావెళ్ళి భుజాలు

పట్టిలేవనెత్తిప్లాట్ ఫారమ్‌లోకి తీసుకొచ్చి ఒక సిమ్మెంటు బల్లపై పరుండబెట్టారు. అందులో ఒకతను గ్లాసుతో నీళ్ళు దెచ్చి ముఖంపై చల్లాడు.

పదునైదునిముషాలు... అరగంట... గంట గడచింది. పెద్దకూత వేస్తూ మెయిల్ వచ్చి ప్లాట్‌ఫాంమ్ ముందు ఆగటమూ, ఉలుకుపడి ప్రకాశం గభాలున లేవటమూ ఒక్కసారిగా జరిగాయి.

తలకేదో భారమనిపించింది. తలకు కట్టిన గుడ్డలన్నిటినీ బలవంతంగా తీసి వేశాడు. అందరూ యితన్ని జూచి పిచ్చివాడనుకొని భయపడ్డారు. "ఎవడో భగ్నప్రేమికునిలా వున్నాడనుకొని" ఎవరో చప్పరించారు.

ప్రకాశం ఏదీ ఆలోచించలేదు. అతనేదో భ్రమలో ఊగిసలాడుతున్నాడు. అప్పుడేబయలుదేరుతున్న మెయిల్లో ఒక కంపార్ట్మెంటు పూచపట్టుకొని ఎక్కాడు.

# 25

ఉదయం పంన్రెండు గంటలయింది.

పెద్దకూతవేసి విజయవాడ ప్లాట్‌ఫామ్ ముందు ఆగింది రైలు, అలసిన తన శరీరానికి కాస్త విశ్రాంతి చేకూరుద్దామని.

"ఇదేఊరు" అని ఎవరో అడిగారు.

"విజయవాడ" మరెవరో సమాధానం యిచ్చారు.

కళ్లుతెరుస్తూ ఈ మాటలువిన్న ప్రకాశం ఉలుక్కు పడ్డాడు. అయితే తను మూడువందలమైళ్లు ప్రయాణం చేశాడా!

"టైమ్ ఎంతయింది?"

"పండ్రెండు"

ప్రకాశం ఏదోతీర్థానికి వచ్చినవాడిలా కంపార్టు మెంటునుండి ప్లాట్‌ఫామ్ మీదకొచ్చాడు. తలంతా భారంగా, శరీరమంతా బలహీనంగావుంది. అడుగుముందుకు వేస్తే, ఎక్కడ తూలిపడతాడో అన్నంతా నిర్వీర్యంగా వుంది అతని శరీరస్థితి.

ప్లాటుఫామ్ ఎక్కే, దిగే ప్రయాణీకులతో చాలా రద్దీగావుంది. ప్రకాశం మెల్లగా అడుగులువేస్తూ ముందుకు నడిచాడు.

దిగిన ప్రయాణీకులందరూ గేట్‌దగ్గర టికెట్స్ అంద జేస్తూ బయటకునడుస్తున్నారు. ప్రకాశానికి తనుదొంగలా ప్రయాణంచేసిన విషయంగాని, తనదగ్గరిప్పుడు టికెట్ లేదన్న విషయంగాని జ్ఞప్తికిలేదు.

నిన్న రాత్రినుండీ అతనికడుపులో ఏమీపడనందు వల్ల ఆకలిమండిపోతోంది. తనకవుతున్నది ఆకలనిగాని అం దుకే తనింత నిస్సత్తువగా తయారయాడని అతని జడమస్తి ష్కానికి తట్టలేదు.

ప్రకాశం గేటుదాటి బయటకెళ్ళబోతూండగా, వెనుకనుండి ఎవరో "ఏయ్!" అని పిలిచారు.

ప్రకాశం వినిపించుకోలేదు.

"ఏయ్! నిన్నే" అంటూ టి. సి. చొక్కా కాలరు పట్టుకున్నాడు

ప్రకాశం వెనుదిరిగి అతనివేపు నిర్లిప్తంగా చూశాడు. ఏమనిగాని, ఎందుకనిగానీ ప్రశ్నించలేదు.

"టికెట్ యివ్వు" టి. సి. గద్దించాడు.

"టికెట్టా! హా అయితే లేదు"

టి. సి. ఆ జవాబుకు నిర్ఘాంతపోయాడు. 'అయితే ఆఫీసుకుపద"

"ఎందుకూ?"

"చేసిన నేరానికి"

"నేరమా"

"అవును"

"ఏంనేరం?" ప్రకాశం అమాయకంగా అడిగాడు.

"టికెట్ లేకుండా ప్రయాణం చేసినందుకు"

"ఓహో! డబ్బెంత యివ్వాలి"

"ఎక్కణ్నుంచీ ప్రయాణం చేశారు?"

ప్రకాశం చెప్పాడు.

"ఎలానమ్మటం?"

"మీ యిష్టం"

టి. సి. లెక్కవేసి, "ఇరవై రూపాయలా ఏభయి నయాపైసాలు చెల్లించండి. డబుల్ చార్జీచేస్తున్నా" అన్నాడు.

ప్రకాశం జేబులు తడుముకున్నాడు. చిల్లికానీకూడా లేదు.

"డబ్బు లేదు, ఈ ఉంగరం తీసుకోండి"

"ఇదెందుకు నాకు"

"నా దగ్గర డబ్బుల్లేవు మరి"

ఆ టి. సి. గారికి పూర్తిగా జాలివేసింది. అతని దైన్య వదనం చూస్తూంటే ఏదో సానుభూతి మెదలింది. "మీ అడ్రస్ చెప్పండి. మళ్ళీ చెల్లిద్దురుగాని" అన్నాడు.

"నాకు అడ్రస్ లేదు"

"మీది వూరుగాదా"

"కాదు. మీరు దీన్నితీసుకొని అమ్మైనా చెల్లించండి" అంటూ అతని చేతికి ఉంగరాన్ని అందించాడు.

"మిగిలినడబ్బు"

"మీ దగ్గరే వుంచుకోండి"

"నా దగ్గరా"

"అవును" అని యిక ప్రకాశం అక్కడ ఆగలేక చక చకా బయటకు నడచిపోయాడు. టి. సి. ఏదో అంటున్నా వినిపించుకోకుండా. ఈ వింత చూస్తున్న వారందరూ అతని ధోరణికి ప్రవర్తనకూ విస్మయం చెందారు.

ప్రకాశంకు విజయవాడకొత్త. అతనెన్నడూ ఈప్రదేశం వచ్చిందిలేదు. ప్రకాశం ఎక్కడకువెళ్ళాలోకూడా నిర్ణయించుకోకుండా ముందుకు నడుస్తున్నాడు.

మిట్టమధ్యాహ్నంగావటంచే వేడికి శరీరమంతా సల సలా కాగిపోతోంది. ఎంత ఆపుకుందామనుకున్నా ప్రకాశం కళ్ళు చెదురుతున్నాయి. తన్నుతానుమరచి ముందుకు నడుస్తున్నాడు.

రెండుఫర్లాంగులు భారంగా నడచాడు. "ఏయ్! కారొస్తోంది" అని ఎవడో కేకేశారు. ప్రకాశం అలాగే నడుస్తున్నాడు. వెనక గట్టిగా హారన్! ప్రకాశం ప్రక్కగా తిరుగబోయాడు. ఎదురుగాబస్సు. వెనక్కు అడుగువేయబోయాడు. అంతే తలకేదో భారంగా తాకింది. 'కీచ్' మని కారాగిన శబ్దం. ఆ తర్వాత ప్రకాశానికి ఏదీ జ్ఞప్తికిలేదు.

*　　　　*

"ఆయనగారింకా లేవలేదేమండీ" అంటూ గదిలో ప్రవేశించిన ఆమె తన భర్తనుద్దేసించి అడిగింది. ఆయనగారు లేదన్నట్టుగా తలాడించాడు విచారంగా.

మంచంపై స్మృతివిహీనంగా, పడుకొనున్న ఆనూతన వ్యక్తిని చూస్తూంటే ఆ దంపతులకు గుండెల్లో గుబులుగా వుంది. మంచంప్రక్కనే ఆ గృహయజమాని ఒక కుర్చీలో దీనంగా కూచొని క్షణక్షణమూ అతనివేపు చూస్తూండిపోయాడు.

"పాపం! ఇంతకుముందుకూడా ఈయనతలపై దెబ్బలు తగిలినట్టున్నాయండీ" జాలిగా అంది ఆమె అతనిముఖంవేపే చూస్తూ.

"నాలుగు గంటలు కావస్తోంది. డాక్టరుగారు చెప్పినట్టు ఇంకా స్మృతిరాలేదే" ఆయన తనలోతాను గొణుక్కుంటున్నట్టుగా బయటకు అన్నాడు.

గోడమీదగడియారం ఠంగ్ ఠంగ్ అని నాలుగు సార్లుబాది తన శక్తిని నిరూపించుకొంది.

ఆ దంపతులిరువురూ అతనికేసి మౌనంగా ఆతుర తగా చూస్తూండిపోయారు. అతనిలో ఏవిధమయిన చల నమూ లేదు.

కొద్దిగా పెరిగిన గడ్డం, తైలసంస్కారంలేక ఎర్రపడ్డ ఆ వుంగరాల జుట్టూ. నిస్సారమయిన ఎండిన ఆకుల్లాండి ఆ పెదవులూ, కొద్దిగా గుంటలుపడ్డచక్కిళ్ళూ, కళ్ళూ ఇంత వికార స్థితిలోనూ ఏదో ఆకర్షణీయతను వెదజల్లేముఖం ఈ స్థితిలోనూ అతన్ని చూస్తూంటే ఆ దంపతులలో ఏదో సానుభూతి, జాలిపెనవేసుకొని వారి హృదయాలను దయార్ద్రం చేశాయి.

"చూస్తే అతని వాలకం పిచ్చివానిలా లేదు. ఎంతో బాధననుభవించిన తప్తజీవిలా వున్నాడు" అనుకొన్నారు వారు.

ఒకటి, మూడు, ఐదుక్షణాలు మౌనంగా భారంగా గడిచాయి.

ఆ నూతన వ్యక్తిలో కొద్దిగా చలనం కనిపించింది. వీరికళ్లు ఆనందంతో మెరిశాయి.

"ఏమండీ!" అన్నారు యిద్దరూ ఒకేసారి.

ఆ వ్యక్తి మెల్లగా కళ్ళువిప్పి ఎదురుగా కన్పించిన ఈ నూత్నవ్యక్తులను అరక్షణం పరీక్షగాచూసి వెంటనే గభా లున లేచికూచొని "ఎవరు, ఎవరుమీరు?" అన్నాడు.

"క్షమించండి, మిమ్మల్ని కారుప్రమాదానికి గురి చేసింది మేమే" అన్నాడతను బాధగా, దీనంగా.

"కారు ప్రమాదమా! ఓహ్ మరి ఈ గృహం"

"మాదేనండీ"

"ఆస్పత్రి కాదూ"

"కాదండీ"

"నన్హాస్పిటల్ చేర్చకుండా ఇక్కడి కెందుకు తెచ్చారు?"

"అది మా విధి. ఇక మీకు ఏ భయమూ లేదు. విశ్రాంతి తీసుకోండి. రెండురోజులలో పూర్తిగా నయమవు తుంది. మిమ్మల్నీస్థితికి దెచ్చిన మమ్మ క్షమించండి"

"క్షమ" తనలోతాను చిన్నగా గొణుక్కున్నాడా వ్యక్తి. అతని మాటలు వీరికి వినిపించ లేదు.

"మీరక్షణకు సాధన్యవాదాలు. ఇంతకూ మీ పేరు?"

"శ్రీధర్"

"ఆమె"

"నా సతీమణి అరుణ" అని ఆమె వేపుజూచి "అరుణా వెళ్ళి కాఫీ ఫలహారంపట్రా. మీరు లేవండి స్నానం చేద్దురుగాని" అన్నాడు,

ఆ వ్యక్తిస్నానం ముగించి, శ్రీధర్ గారిచ్చిన దుస్తులు ధరించాడు. వారి ఆదరణకి అతని హృదయం ఆర్ద్రమైంది.

ఆ వ్యక్తిని గురించి అడగాలని శ్రీధర్ గారికి మన సులో వుందిగాని, వెంటనే అవన్నీ బయటకు లాగటానికి అతనికి మనస్కరించ లేదు.

అరుణాదేవి ఫలహారందెచ్చి అతని ముందుంచింది. కృతజ్ఞతా పూర్వకంగా వారివేపుచూస్తూ ఫలహారం మౌనంగా ముగించాడావ్యక్తి. కాఫీసేవిస్తూండగా శ్రీధర్ గారు, "మీ పేరు" అని అడిగాడు.

"ప్రకాశం"

"మీ స్వస్థలం ఇది గాదనుకుంటాను"

"కాదండీ"

"బంధువు లెవరేనా యిక్కడున్నారా"

"లేరండీ"

"ఏదేనా పని మీద వొచ్చారా"

"కాదండీ"

"మరి?"

ప్రకాశం ఈ ప్రశ్నకు గంభీరంగా వుండిపోయాడు. అతనిలో గతం సుళ్ళుతిరుగుతోంది.

"మీరేమీ అనుకోనిపక్షంలో మీ వివరాలు పూరీగా చెబుతారా అన్నయ్యా" అంది ఆమె. ప్రకాశం తలెత్తి ఆమెవేపు సజల నయనాలతో చూశాడు.

"అన్నయ్యా" ఎంతమధురమయిన పిలుపు అది. అతని కళ్ళల్లోంచి ఒక్కసారిగా శారదా లలితలు మెదిలారు.

"చెబుతానమ్మా! మీకు చెప్పక మరెవ్వరకు చెప్ప గలను" అన్నాడు.

శ్రీధర్ గారికి, ప్రకాశం గంభీరవ్యక్తిత్వం, అతని సంభాషణాధోరణి, ఆ నిర్మల నయనాలు వెదజల్లే దైన్య దృక్కులూ ఎంతో ఆకర్షించాయి.

అరుణ అతని వ్యధితహృదయంవేపు చూస్తూండి పోయింది.

"చెప్పండి" అన్నాడు శ్రీధర్ గారు.

ప్రకాశం కాఫీకప్పు బల్లపైవుంచి వారివేపుచూస్తూ చిన్నస్వరంలో ప్రారంభించాడు.

# 26

పక్షంరోజులుగడిచేసరికి ప్రకాశం పూర్తిగా కోలుకున్నాడు. వెనుకటిగాయాలతోసహా పూర్తిగామాని ఆ ప్రదేశాలలో మచ్చలుమాత్రం మిగిలాయి. బలహీనత పూర్తిగా నశించి, మంచి స్వస్థత, శక్తి, ఆరోగ్యం చేకూరాయి. ముఖంలో తిరిగి వెనుకటి కళ వచ్చింది. కళ్ళలో నవ్యతేజస్సు చిగురించింది. అతని జీవితంలో ఒక నూతనాధ్యాయం ప్రారంభమయింది. గతాన్ని పూర్తిగా విస్మరించటానికి సర్వప్రయత్నాలూ చేశాడు. ఎప్పుడయినా గతం స్ఫురణకొస్తే కేవలం ఒకనిట్టూర్పుమాత్రం వదలుతాడు. గతంవల్ల బాధచెందటం అతను విస్మరించాడు. అతనీనాడుగతంతో ఏ విధమయిన చర్యగాని సంబంధంగాని కల్పించుకోలేదు.

ఈ విషయంలో శ్రీధర్ అరుణలకృషిని ఎంతో అభినందించివలసివస్తుంది. ప్రకాశంను మళ్ళీ మామూలు వ్యక్తిగా తయారుచేయటానికి వారెంతో కృషిసల్పారు. అరుణ అతన్ని స్వంతతమ్మునిలా ఆదరించి ఎంతో ప్రేమ, వాత్సల్యం కనబరుస్తూ స్వంతతల్లిని మరపించింది. శ్రీధర్

ఆరాటం అంతా యింతాగాదు. అనుక్షణమూ అతన్నే అంటి పెట్టుకొని ఏవేవో బోధనలుచేసి గతాన్ని విస్మరింపచేశేలా చేయగలిగాడు. వారి దయార్ద్రహృదయాలను చూస్తూంటే ప్రకాశం హృదయంలోనే వారికి జోహార్లర్పించేవాడు.

శ్రీధర్ ప్రకాశంకంటే పదేళ్ళుపెద్ద. అరుణ ప్రకాశం కంటే రెండుసంవత్సరాలుపెద్ద. ఆమెను ఎంతో అభిమానంగా "అక్కయ్యా" అని పిలవటం ప్రకాశంకు తానంత దానే అలవాటయిపోయింది, తనకంటే చిన్నవాడయినా ఆమె అతన్ని "అన్నయ్యా" అనే సంబోధించేది. వీరిద్దరి మధ్య ఏర్పడిన ఈ ఘనిష్ట బాంధవ్యానికి శ్రీధర్ ఎంతో మురిసిపోయేవాడు.

ప్రకాశం తన గత జీవితగాథలో రాధ విషయం మిన హాయించి పూర్తిగా వారికి చెప్పివేశాడు. తన బాధా జీవితానికీ రాధకూ ఏమాత్రం సంబంధంలేదని అతని తలంపు. అందుకే ఆమె విషయమే వారితో ప్రస్తావించలేదు.

అతని జీవితగాథవిన్న వారికి ప్రకాశంపై ఎంతో అభిమానం, వాత్సల్యం, సానుభూతి ఏర్పడ్డాయి. మొదట్లో వారి ఆదరణనూ, మంచితనాన్నీ భరించలేకపోయాడు ప్రకాశం. రానురాను అలవాటుచేసుకున్నాడు. శ్రీధర్‌గారికి ప్రకాశంఅంటే ఏదో నిర్వచింపరాని ఆత్మీయత! అరుణాదేవి గారి సరళ మృదు అనురాగంలో ప్రకాశం పూర్తిగా స్వస్థుడయ్యాడు. వారంటే అతనికి ఎంతోగౌరవం పూజ్యభావం

అతనికి బాగా స్వస్థత లభించాక ఒకరోజు శ్రీధర్ "ప్రకాశం! మీ నాన్నగారు నీ గురించి బాధపడుతూన్నట్లూ

రనే నా ఉద్దేశం, కనీసం ఆయనకు ఉత్తరమేనా వ్రాయ కూడదూ'' అన్నాడు.

"మీ మాట నిజమేగాని ఆయన నన్ను పూర్వంలా స్వీకరిస్తారని నేననుకోను. ఆయనకు నాపై పూర్తిగా విద్వేషభావం ఏర్పడింది. ఆయనకేముఖం పెట్టుకొని ఉత్తరం వ్రాయగలను. వద్దు శ్రీధర్, వద్దు. నా జీవిత మిలా అజ్ఞాతంగానే గడచిపోనీ'' అన్నాడు. ఆ తర్వాత మళ్ళీ శ్రీధర్‌గారతనితో ఆ ప్రసక్తి ఎన్నడూ తేలేదు.

ప్రకాశంకు శ్రీధర్ గురించి ఏ కొద్దిగానో తెలుసు. శ్రీధర్ ప్రస్తుతం విజయవాడలో పెద్దఅంతస్థులో సంఘంలో ప్రముఖవ్యక్తిగా గౌరవంగా జీవిస్తున్నాడు. అతనేదో ప్రత్యేక సంస్థకు మేనేజరుగావుంటూ మాసానికీ ఎనిమిదివందలుమించి సంపాదిస్తున్నాడు. పదిసంవత్సరాల ఆ ఉద్యోగంలో బాగా గడించాడు. అతని యిల్లు చాలా పెద్దది. రెండు అంతస్తుల మేడ. చుట్టూకాంపౌండ్, అందులో పూలమొక్కలు. ఇంటిముందు పోర్టికో. అధునాతనంగా, అందంగావుంది ఆ గృహం. ఈ మధ్యనే కొత్తగా ఒకకారుగూడా కొనటం జరిగింది.

శ్రీధర్‌గారికి యిద్దరు మగపిల్లలూ, ఒక ఆడపిల్ల! ఆ పిల్లలకు ప్రకాశం అంటే ఎంతో గౌరవమూ, అభిమానమూ, ముద్దుగా, "మామయ్యా'' అని పిలిచేవారు, అతి కొద్దిరోజులలోనే వారితో మంచి సాన్నిహిత్యం ఏర్పడింది ప్రకాశానికి.

మొదట్లో ప్రకాశం ప్రతివిషయానికీ ఎంతో సంకోచం కనబరచేవాడు. అరుణాదేవికిది బాధనిపించేది. "ప్రతిచిన్న విషయానికీ మీరిలా సంకోచపడటం బాగులేదన్నయ్యా! ఇదేం పరాయి ఇల్లుగాదు. నీ చెల్లాయి యిల్లనుకొని అభిమానించలేవూ" అనేది ఆమె. రాను రాను అతని సంకోచం సమసిపోయింది.

ప్రకాశంను క్లబ్‌కు తీసుకువెళ్ళేవాడు శ్రీధర్‌గారు. ఏవేవో కబుర్లతో అతనికెంతో ఉత్సాహం కలిగించటానికి ప్రయత్నించేవాడు. ఒక్కమాసం గడవకముందే ప్రకాశం ఆ యింటిలోని ఒక వ్యక్తిలా మసల జొచ్చాడు.

ప్రకాశం యిప్పుడు వెనుకటి ప్రకాశంగాదు. అతనిలో ఏదో గంభీరశక్తి వుద్భవించి అతనిముఖంలో చూపుల్లో, మాటల్లో అది కొట్టవచ్చినట్టు స్పష్టంగా కనిపించేది. ఆ గంభీర వదనంచూచి ఎవరేనా వినమ్రులవుతారు అతనిపుడు ఏ తో అవసరంవుంటేగాని సంభాషణ కొనసాగించడు. అతని నడకలోగల పటుత్వమయిన గంభీరత్వంజూచి అందరూ ఆశ్చర్యపోతారు.

ప్రకాశం ఆ దంపతుల ఆదరణలోనూ, పిల్లల అనురాగంలోనూ పూర్తిగా సంతోషభరితుడయాడు. కాని మంచినిగాని, చెడ్డనుగాని మానవుడు భరించటం కొంత కష్టమే! ఆ గృహావ్యక్తుల మంచితనం అతనికి కాస్త భారమనిపించింది. ఎన్నాళ్ళని తనీగృహంలో ఋణపాతకుడిలా వుండగలడు. ఆ రోజు ఆఫీసునుండీ శ్రీధర్‌గారు రాగానే, "శ్రీధర్‌గారూ" అనిపిలిచాడు ప్రకాశం.

"ఏం ప్రకాశ్"

"నాకేదయినా ఉద్యోగం చూపించగలరా"

అతని నొసలు బాధగా కుంచించుకుపోయింది. "ఉద్యోగమా !" అన్నాడుబరువుగా.

"అవును"

"ఇప్పుడు నీకేం లోటొచ్చిందని"

"లోటేమీ లేదుగాని..."

"చూడుప్రకాశ్! ఈసారికి నిన్ను క్షమించానుగాని యింకోనాటికి నాతో ఆ ప్రసక్తేతేవద్దు. ఏం మేము నీ కంత భారమైపోయామా!" చిరుకోపం ప్రదర్శిస్తూ ఈ మాటని వెళ్ళిపోయాడు. ప్రకాశం నిట్టూర్చాడు.

* * *

ఆరుమాసాలు కాలగర్భంలో గతించాయి.

ప్రకాశం ఈ మధ్యకాలంలో రెండు ఘనవిజయాలు సాధించాడు. అతనిలోగల రచనాశక్తి విజ్ఞానపటిమ వృథాగాలేదు. ఆ యిల్లుచేరిన రెండుమాసాలలో ఒక పెద్ద సాంఘిక నవల రచించాడు. అది ఉగాదినవలలపోటీ నిర్వహించిన ఒక పత్రికలో ప్రథమ బహుమతి రు 1116 లు సంపాదించింది. ఇందుకు ఆ యింటిల్లిపాదీ సగర్వంగా సంతోషించారు. ఆ తర్వాత రచించిన యింకోనవల ఒక ప్రచురణ సంస్థవారు విడుదలచేసి మూడువందలు పారితోషికమిచ్చారు.

ప్రకాశం ఈ రచనలను తనస్వంతపేరుతో చేయలేదు. గుప్త నామం "సావీ సుధామ్" పేరుతో వీటిని రచించాడు.

ప్రకాశం తన కష్టార్జితాన్ని ఎంతో బలవంతంగా శ్రీధర్ గారి చేతుల్లో వుంచాడు. మొదట్లో ఎంతప్రాధేయ పడ్డా "నీ కష్టార్జితం నా కెందుకు ప్రకాశం" అని త్రోసి వుచ్చాడుగాని, ప్రకాశం "మీరు దీన్ని గ్రహించనిపక్షంలో ఈక్షణమే నేనీ యిల్లు విడిచి వెడతాననటంతో శ్రీధర్ తీసుకొనక తప్పిందిగాదు. కాని శ్రీధర్ దాన్ని తనదగ్గరే వుంచుకోలేకపోయాడు. ప్రకాశం పేరిట గుప్తంగా బ్యాంక్ లో వేశి తృప్తిగా శ్వాసపీల్చుకొన్నాడు.

ప్రకాశం ఈనాడు రోజుకు నాలుగయిదు గంటలు రచనలకే వినియోగించసాగాడు. ఈ ఆరుమాసాలలో అతని కథలూ, గేయాలూ, వ్యాసాలూ ప్రతిపత్రికా అలంకరించుకొని తమ్ము తాము అభినందించుకొన్నాయి.

ఈకాలంలో అతను సంపాదించిన రెండువేలూ, అతనికి తెలియకుండానే బ్యాంక్ లో అతనిపేరిట మూల్గుతున్నాయి.

అతనిలోగల ఈ రచనా వైజ్ఞానిక సంపత్తి అందర్నీ ఆకర్షించాయి. "సావీసుధామ్" అనే రచయిత మావాడు అనుకొని, నిజంగా అరుణా శ్రీధర్ లు గర్వించారు.

విజయవాడలోని యువరచయితల సంఘానికి కార్యదర్శిగా, సాహిత్యమండలికి ప్రెసిడెంటుగా అతనా సభ్యులచే బలవంతంగా చేర్చుకోబడ్డాడు.

ఈనాడు "సావీసుధామ్" పేరు తెలియని ఆంధ్రపాఠకుడు లేడంటే అతిశయోక్తిగాదు ప్రతిరోజూ ఏవో ఒక

ప్రచురణకర్తలు అతని దగ్గరకువచ్చి మాకోసవల వ్రాసి పెట్టండని అభ్యర్థనలు దాఖలు చేసిపోతున్నారు.

కొన్ని పత్రికలు అతనిఫోటో ప్రచురించాలని ఆశించాయిగాని ప్రకాశం అంగీకరించక పోవటంతో విరమించుకున్నాయి.

ప్రకాశానికి అప్పుడప్పుడు తనతండ్రి జ్ఞప్తికి వచ్చేవాడు. తండ్రికి డబ్బు పంపించాలని అతనికి కుతూహలంగా వుందిగాని, తనతండ్రి దాన్ని స్వీకరిస్తాడా అనేభావనతో పంపించలేకపోయాడు.

ప్రకాశం విజయవాడ నగరంలో అతిస్వల్ప కాలంలోనే ప్రధానస్థానాన్ని, ప్రముఖ గౌరవాన్ని పొందగలిగాడు.

* * * * *

ఆరోజు ఉదయం ఎనిమిదిగంటల వేళ.

ప్రకాశం, అరుణలు మధ్యహాల్లో సోఫాలమీద కూచొని పిల్లలతో కబుర్లు సాగిస్తున్నారు నవ్వుతూ!

ఆదేసమయంలో శ్రీధర్‌గారూ, మరో క్రొత్తవ్యక్తి ఏదో సంభాషిస్తూ హాల్లో అడుగుపెట్టారు. వీరి రాకతో అరుణ అట్నుంచీలేచి వంటింటివేపు వెళ్ళింది. ప్రకాశం ఆ నూతనవ్యక్తి వేపు చూస్తూండి పోయాడు.

శ్రీధర్‌గారు ఆ వ్యక్తికి సోఫాచూపిస్తూ, "కూచోండి ... ఈయనే ప్రకాశంగారు ఉరఫ్ 'సాహిసుధామ్'. ప్రకాశం! ఈయనగారు విజయవాడలో పేరుమోసిన ప్రసిద్ధవ్యక్తి

విశ్వేశ్వరయ్యగారు" అంటూ పరిచయం పూర్తిచేసి తనూ ఒక సోఫాలో కూచున్నాడు. పరిచయం పూర్తికాగానే ఇద్దరూ నమస్కార ప్రతినమస్కారాలు గావించుకున్నారు.

అప్పుడే అరుణ ట్రేలో కాఫీకప్పులతో సహా ప్రవేశించి వారిముందున్న మేజాపై వుంచివెళ్ళింది. ముగ్గురూ వాటిని పూర్తీచేశిన అనంతరం శ్రీధర్ తన సంభాషణ ప్రారంభించాడు.

"చూడు ప్రకాశ్! నీతో ఒకముఖ్యమైన విషయాం ప్రస్తావించాలనీ, అందుకు నీ సహకారం పూర్తిగా లభించ గలదనే ఆశతో ఈయనగారు యిక్కడొచ్చారు"

"అసలు విషయమేమిటో చెప్పలేదు" అన్నాడు ప్రకాశం సిగరెట్ వెలిగిస్తూ! విశ్వేశ్వరయ్యగారు ప్రారంభించారు, "చూడండీ! మన ఆంధ్రసాహిత్యంలోవున్న పత్రికలన్నిటిలోనూ వారపత్రికలు చాలాతక్కువ... ఏమంటారు"

"నిజమే..."

"ఆలోటు తీర్చాలనే ఉద్దేశం ప్రధానం గాకపోయినా చాలకాలంగా నేనొకపత్రిక స్థాపించాలని ప్రయత్నిస్తున్నాను. అందుకోసం ఈ నాటివరకూ చాలాకృషి చేశానుకూడా! ఇందుకు మీలాంటి ఉత్తమ కళాకారుల, ఉత్తమ రచయితల సహకారం ఎంతో అవసరం! పత్రిక పూర్తిసాహిత్యాభూయిష్ఠంగా వుండాలని నా తలంపు! ఇకపోతే, పత్రికన్న తర్వాత సంపాదకుడైనవాడు గొప్పవాడుగా పేరుప్రఖ్యాతులు సంపాదించినవాడుగా వుండాలి! మీ రచనాశక్తి, విజ్ఞాన పటిమ, మాకు తెలియనివిగావు మీ రంగీకరిస్తే మా పత్రికకు

మిమ్మల్నే సంపాదకులుగా నియమించాలని మా అభిప్రాయం ...మరి మీ రేమంటారు.!"

ప్రకాశం ఒకక్షణం మౌనంగావుండి శ్రీధర్ గారివేపు సాభిప్రాయంగా చూశాడు.

"మరి నీయిష్టం ఏమిటి ప్రకాశ్"

"కేవలం నా యిష్టమేగాదు, ఇందుకు మీసంపూర్ణ అభిప్రాయమూ, అనుమతీకూడా కావాలి!"

"ఇలాంటి అవకాశాలను జారవిడచుకోగూడదని నా అభిప్రాయం"

"అయితే నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తున్నాను..."

"చూడండి విశ్వేశ్వరయ్యగారూ! మా ప్రకాశ్‌ను అందులో కేవలం ఒక సంపాదకునిగానే కాక అంతో యింతో పార్ట్‌నర్‌గా కూడా స్థానమిస్తే మంచిదని నా అభిప్రాయం"

"అంతకంటేనా! తప్పకుండా మీకు పార్ట్‌నర్‌షిప్ యివ్వగలను. నా ఉద్దేశంకూడా యిదే...మీ రంగీకరిస్తే చాలు..."

"సరే! మేమంగీకరిస్తున్నాము" అన్నారు శ్రీధర్ గారు!

"ఏమిటి శ్రీధర్! మీ కేమైనా పిచ్చిపట్టిందా! నాకీ పార్ట్‌నర్‌షిప్ అనవసరం! అసలు నాదగ్గర డబ్బెక్కడిది?"

"డబ్బుగురించి ఆలోచన నీకెందుకు?.

"ఇది నా విషయం గనుక"

"ప్రకాశ్! ఈ విషయంలో నీవు ఎంతఅరచినా లాభం లేదు. డబ్బు నాదగ్గర వుంది..." అన్నారు శ్రీధర్ గారు.

"శ్రీధర్! ప్రతిదానికీ మీరిలా నన్ను..."

"నేనేం నీకు ఉద్దరగా యివ్వను లేవయ్యా! అప్పుగా తీసుకో! లాభాలు రాగానే తీర్చు..." చిఱుకోపం ప్రదర్శించాడు.

ప్రకాశం యికవాదించీ లాభంలేదనుకొని మౌనంగా వుండిపోయాడు.

"ఇక ఇన్నివిధాలా మీరు అంగీకరించినట్టేగదూ" విశ్వేశ్వరయ్యగారడిగారు ప్రకాశం మౌనంగా తలూపాడు.

ఆ తర్వాత గంటవరకూ వారివే విషయాలగురించి చర్చిస్తూండి పోయారు.

*　　　*　　　*

పై సంఘటన జరిగిన రెండుమాసాలతర్వాత "ఆంధ్ర కిరణం" అన్న పేరుతో వారపత్రిక మొదటిసంచిక ఆంధ్రప్రదేశ మంతటా ఉజ్వలంగా వెలువడింది! దానికి సంపాదకుడు "సావీసుధామ్" గావటంచే ఆ పత్రిక అతికొద్ది రోజులలోనే విశేషాదారణ పొందింది.

ఐదువేల కాపీలతో ప్రారంభించిన ఆ వారపత్రిక ఆరు మాసాలు తిరక్కముందే పదివేల కాపీలతో వెలువడ సాగింది.

"సావీ సుభామ్" రచించిన సీరియల్ నవల అందులో వెలువడటంచే ఆ పత్రిక సర్క్యులేషన్ బాగా పెంపొందింది.

ప్రకాశంకు ఆ పత్రికవల్ల ఆంధ్రలో మంచికీర్తి, దానికితోడు పెట్టుబడికి మించినలాభం ఈ ఆరుమాసాలలో లభించాయి. శ్రీధర్ గారికి పెట్టుబడి మొత్తాన్ని ప్రకాశం బలవంతంగా చెల్లించాడు.

ప్రకాశం ఈనాడు పూర్తిగా మారిపోయాడు. అతని వేషధారణ కూడా మార్పుచెందింది. ముందు ధరించే పంచె, జుబ్బాలకు స్వస్తిచెప్పాడు. ఆ స్థాయినే తెల్లటిపాంటు, తెల్లటిచొక్కా, వాటిని టక్ చేసి చొక్కాపై తెల్లటికోటు వాటిపై తెల్లటి, మధ్యఎరగీతలుగల "టై" కళ్ళకు తెల్లటి అద్దాలు, కాళ్ళకు నల్లటి మిలమిలా మెరిసే బూట్లు, నోట్లో నిశ్చలంగా వెలిగేపైపు అంతా అతని హృదయ నిర్మలతను స్వచ్ఛతను నిరూపిస్తూంటాయి.

మొదట్లో ఈ వేషధారణజూచి అందరూ విస్తుపోయారు. ఈ దుస్తులలో అతను ఎంతోగంభీరంగా నిశ్చలంగా, స్వచ్ఛంగా కన్పిస్తూ, చూపరులను వెంటనే ఆకర్షించేవాడు.

"ఈ దుస్తుల్లోనే నీవు బాగా కనిపిస్తావన్నయ్యా! ఎందుకింత అకస్మాత్ మార్పు?" అని అడిగింది తొలి రోజున అరుణ.

"ఏమోనక్కయ్యా!మార్పుగావాలనిపించింది మార్చి వేశాను. మీకు నచ్చిందిగదూ! అంతేచాలు" అన్నాడు చిర్నగవుతో, పైప్‌లోంచి పొగ గుప్పున వదలుతూ.

రానురాను ఈ వేషధారణ అతనికి పూర్తిగా అల వాటయిపోయింది. అతనికీనాడు ఏవిధమయిన దుఃఖంగాని విచారంగాని లేవు. అప్పుడప్పుడు సావిత్రి జ్ఞప్తికివచ్చేది. గతం తలచుకొని చిన్నగా నిట్టూర్చేవాడు. సావిత్రిపైగల అను రాగంకొద్దీ తనపేరును 'సావీ సుధాం'గా మార్చుకొన్నాడు. అదే అతనికి ఈనాడెంతో తృప్తి.

బాఫా! అక్కల్లాంటి ప్రేమమూర్తుల ఆదరణలో, అతను సర్వవ్యథనూ విస్మరించాడు. ప్రత్యేకంగా ఒక ఇల్లు తీసుకోవాలన్న తలంపే అతనిలో నశించింది. కొత్తగా ఒక చిన్న కారుమాత్రం కొన్నాడు. అదీ శ్రీధర్ బలవంతంపైనే! అతనీనాడు ఆ గృహంలో పూర్తిగా ఒక ప్రముఖవ్యక్తి.

# 27

ఆ రోజు సాయంత్రం ఆఫీసుపనులు ముగిసిన తర్వాత విశ్వేశ్వరయ్యగారు ప్రకాశంతో, "అలా మాయింటికివెళ్దాం రండి. రెండుమూడుసార్లు పిలిచినా యింతవరకూ మీరు రాలేదు" అన్నాడు ప్రకాశం చిన్నగానవ్వి "పదండి" అన్నాడు.

ఇద్దరూ కార్లలో కూర్చొన్నారు, ముందు విశ్వేశ్వ రయ్యగారికారు, వెనుక ప్రకాశం కారు వెళుతున్నాయి,

పదునైదు నిముషాల అనంతరం ఆ రెండుకార్లూ ఒక పెద్ద భవంతిముందు ఆగాయి.

"ఇదే మాయిల్లు" విశ్వేశ్వరయ్యగారన్నారు.

ప్రకాశంకు ఇంతవరకూ విశ్వేశ్వరయ్యగారి కుటుంబ పరిస్థితులు ఏ మాత్రమూ తెలియవు. తను ఎన్నడూ అడిగిందీ లేదు, ఆయనగారు చెప్పిందీలేదు. ఇన్నాళ్ళూ తనొక వింతజీవితం గడుపుతూ వచ్చినందుకు తనకు తానే ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

ఇద్దరూ హాల్లోకివచ్చి సోఫాలపై కూచొన్నారు. ప్రకాశం పైవుపీలుస్తూ నిశ్చలంగా వుండిపోయాడు.

"అమ్మాయ్! రమా! కాస్త కాఫీపట్రామ్మా" అని కేకేశాడు విశ్వేశ్వరయ్యగారు.

"తెస్తున్నానాన్నా" అంటూ ఒక యువతి బయటకు వచ్చిచూసి మళ్ళీ లోపలకు వెళ్ళింది. వ్యక్తులెందరా అన్న ఉద్దేశంతో.

విశ్వేశ్వరయ్యగారు తనకుటుంబ పరిస్థితుల గురించి చెబుతూండిపోయాడు. ఆయనకొక కుమారుడూ, ఒక కుమార్తె. కుమారుడు ఎం. ఏ. చదువుతున్నాడట. అమ్మాయి ఇంటర్ పూర్తిచేసి అంతటితో చదువు చాలించింది. ప్రకాశం ఆయనచెప్పే విషయాలనువింటూ మౌనంగా వుండిపోయాడు.

కొద్ది క్షణాలలో ఒక యువతి, రెండు ప్లేట్లలో ఏవో తీపిపదార్థాలూ, మరి రెండుప్లేట్లలో కారా తెచ్చి వారి ముందుంచింది.

"మా అమ్మాయి రమ" అంటూ పరిచయం చేశాడు ఆయన.

"ఈయనగారేనమ్మా నీ అభిమాన రచయిత సాపీ సుధామ్‌గారు"

"నమస్కారమండీ" అంది ఆమె.

ప్రకాశం ప్రతినమస్కారం చేశాడు ఆమెవేపు చూస్తూ.

ఆమెకుదాదాపుఇరవై సంవత్సరాల వయసుండవచ్చు. తెలుపు, ఎరుపు, గోధుమరంగుమిశ్రమమైన శరీరచ్ఛాయ. తామర రేకులాంటి విశాలమైన కనుగవ! సంపెంగ పూవు బోలిన నాసిక. తీర్చిదిద్దిన ఇంద్రధనుస్సులాంటి కనుబొమలూ గులాబీల ఎర్రదనంతో సరిపోలే స్నిగ్ధకపోలాలు ముద్దువచ్చే అందమయిన కోలచుబుకం, లేత రావి ఆకుల్లాంటి నును ఎర్రని పల్చటి అధరాలు, దానిమ్మ గింజలవరుసలా తెల్లటి పళ్ళు, ఏవో సుందర సురుచిర భావాలు వెదజల్లే ఆ ముగ్ధ చూపులూ ఫాలభాగం మధ్య సింధూరం, పిరుదులవరకూ ఆక్రమించుకున్న విశాల నీల కేశరాశి. ఎర్రటిబ్లవుజూ దానిపై తెల్లనిపచ్చఅంచుచీర. మనిషి అంతపొడవూగాదు. పొట్టీగాదు పొడుగుకుతగ్గ దేహసౌష్ఠవం. ఎదుటవారిని వెంటనే ఆకర్షించే ఆ యౌవనచిహ్న వక్షోజాలు. అందంలో ప్రత్యేకఅందం, ఆకర్షణలో ప్రత్యేకఆకర్షణ. ఆమెలో బాగా చూడవచ్చు. పద్మినీజాతి స్త్రీలు యిలాటివారే గావచ్చు.

ప్రకాశం అరక్షణం నిశ్శబ్దంగా నిర్మలంగా ఆమెవేపు చూశాడు.

"ఫలహారం సేవించండి" అంది ఆమె.

"ఓహ్!" అనుకొని వాటివేపు దృష్టిమరలించాడు. ఆమె కాఫీ తేవటానికి వెళ్ళింది.

ఐదునిముషాలలో నిశ్శబ్దంగా ఫలహారంపూర్తిచేశారు. ఇంతలో రమాదేవి కాఫీతెచ్చి మేజామీదుంచి తనూతండ్రి ప్రక్కగా కూచొంది. ప్రకాశం కాఫీ పూర్తిచేసి ఆరిపోయిన తనపైప్‌ను వెలిగించి, గట్టిగా ఒక దమ్ములాగి పొగవదలుతూ ఆమెవేపు చూశాడు.

"మీ రచనలనన్నీ నేను చదివానండీ! నిజంగా అన్నీ నన్ను చాలా ఆకర్షించాయి" అంది అతనివేపేచూస్తూ.

"కృతజ్ఞుణ్ణి"

రమాదేవిగారికి ఆయన గురించి ఎంతో కుతూహలత ఏర్పడింది. మొదట్లో "సావీసుధామ్" గారంటే దాదాపు ఏ నలభయిఏళ్ళవయసో గలిగివుంటాడనీ, తన తండ్రిలాగే బట్టనెత్తి. అక్కడక్క నెరసినజుట్టుగలవాడయి యుంటాడని అనుకొంది. కాని ఇప్పుడు ప్రత్యక్షంగా అతన్ని చూడగానే ఆమె ఆశ్చర్యం అంతాయింతాగాదు. అతని గంభీరవదనం జూచి ఆమె క్షణకాలం పరవశురాలయిపోయింది. అతని చూపులకామె కాస్త బెదిరింది "అబ్బ! ఏమిటాకళ్ళు వాటి కేమిటా మహత్తు. గాజుకళ్ళు" అనుకొంది.

"మిమ్మల్నిచూడాలనీ, మాటాడాలనీ నాకు ఎన్నాళ్ళ నుండో కోరికగావుంది. కాని ఇంతవరకూ మీరు ఒక్కసారి

కూడా మా యింటివేపు రాలేదు" అంది. ప్రకాశం మందహాసం గావించాడు.

ఆ తర్వాత అరగంటవరకూ వీరిసంభాషణ రచనలపై దాడిచేసింది. ఈ మధ్య ప్రచురణ జరిగిన కథలగురించి, బహుమతిపొందిన నవలగురించి ఆమె దీర్ఘంగా చర్చించింది. అందులోగల పాత్రల వైశిష్ట్యతనూ, భావ పటిష్టతనూ శైలి ఉత్కృష్టతనూ ఆమె ఎంతో కొనియాడింది. ప్రకాశం కేవలం ఆమె మాటలువింటూ అప్పుడప్పుడు "ఆ" "ఊ" అనిమాత్రం సమాధానాలిస్తున్నాడు. అతని గంభీర మనస్తత్వానికి ఆమె నివ్వెరపాటుతోపాటు ఏదో ఆకర్షణకుకూడా లోనయింది.

రమాదేవి అతను నోరువిప్పి తేచాలు ఆసక్తిగా అతని వేపు చెవులప్పగించి చూడటం, అతనే రెండుమాటలతోనో ముగించటంతో నిరుత్సాహం చెందటమూ జరుగుతోంది.

ప్రకాశం కళ్ళవేపు ఆమెసూటిగా చూడలేకపోతోంది. ఏదో నిగూఢశక్తి అందులో నిక్షిప్తమయింది అనుకొన్నదామె.

విశ్వేశ్వరయ్యగారు నిశ్శబ్దంగా కేవలం ఒకప్రేక్షకుడిలా వీరివేపు చూస్తూండిపోయాడు.

ఒక గంటతర్వాత ప్రకాశం ఆ యింటినుండీ బయలుదేరాడు. అతనప్పుడే వెళ్ళటం రమాదేవికేదో లోటనిపించింది. కాని అతన్ని ఆగమనటానికి ఆమెకు నోరురాలేదు.

"అప్పుడప్పుడు వస్తూండండి" రమ చిన్నగాఅంది.

ప్రకాశం యిందుకేమీ జవాబివ్వలేదు, పెద్దపెద్ద అంగలువేస్తూ గుప్పుగుప్పున పొగవదలుతూ బయటకువచ్చి తనక్రొత్తకారులో కూచొని ఆక్సిలేటర్ బలంగాతొక్కాడు.

అతని కారు కనుమరుగయేదాకా బాల్కనీలో నిల్చొని చూస్తున్న రమాదేవి ఉస్సురని నిట్టూర్చింది. ఏమిటీరోజు తన మనసింత అల్పమైపోతోంది. అనుకుంది తనలో తానే. అప్పుడామె కళ్ళముందు ప్రకాశం సుందర గంభీరరూపం మెదలి ఏదో తెలియని అజ్ఞానస్థితిలో పడ దోసింది.

* * *

వారంరోజుల తర్వాత ఒకనాడు.

ప్రకాశం ఆఫీసుగదిలో కుర్చీపై కూచొని ఆ వారం విడుదలచేసే పత్రికకు సంపాదకీయం వ్రాస్తున్నాడు. అతని నోట్లో నిశ్చలంగా పైపు వెలుగుతోంది. ఫాన్‌గుండా వీచే గాలికి అతని ముంగురులు ఫాలభాగం జీరాడి అదొకవిధంగా నాట్యంచేస్తున్నాయి.

ఇంతలో రమాదేవిగారు గదిలో ప్రవేశించి అరక్షణం అతనివేపే నిశ్చలంగా పరవశత్వంతో చూసి, అంతలోనే తెప్పరిల్లి రెండడుగులు ముందుకువేసి, "నమస్కారమండీ" అంది. ప్రకాశం తలెత్తిచూసి, "వందనం కూచోండి" అని మళ్ళీ తనపనిలో తాను నిమగ్నుడయ్యాడు, రమాదేవి అతని

కెదురుగానున్న కుర్చీలో కూచొని మేజాపై చేతులూద బొడుచుకొని అతనివేపే చూస్తూండిపోయింది.

నోట్లోపైపు దానంతటదే వెల్గుతూ పొగను గ్రక్కు తోంది. కలం చకచకా సాగిపోతోంది.

ఐదు, ఆరు, పదినిముషాలు నిశ్శబ్దంగా గడిచాయి. రమాదేవిలో సహనం చచ్చిపోయింది. ఆమె ఉత్సాహ మంతా చప్పున చల్లారిపోయింది. మాటాడించాలని ప్రయ త్నంచెయ్యబోయి అతని గంభీరవదనం జూసి ఆగిపోయింది.

వారపత్రికలు తిరుగవేస్తూ ఆ కొద్దికాలం గడిపింది. ఇక ఆ గంభీరమౌనాన్ని భరించలేకవిసుగుతో లేచినిల్చొంది.

అప్పుడే వ్రాయటం ముగించిన ప్రకాశం తలెత్తి "అరె! నిలబడివున్నారే! కూచోండి" అన్నాడు. ఆమె ఆశ్చర్యపోతూ కూచొంది. "ఐతే ఇంతకుముందు తనుకూచొ నుండటంకూడా గమనించలేదన్నమాట ఈ మహాశయుడు" అనుకొంది.

"ఏమండీ మళ్ళీ మీరీమధ్య మా ఇంటివే పేరాలేదే" అంది.

"తీరికలేకపోయింది. మీ రొచ్చారుగమా అంతే చాలు" అన్నాడు ఆమె ఈ మాటకు ఉబ్బితబ్బిబ్బులై పోయింది.

"నేనీమధ్య కథానిక ఒకటి వ్రాశాను. పత్రికలో ప్రచురించటానికి మీ కివ్వటానికై వచ్చాను" అంది తన హాండ్ బ్యాగ్ లోంచి ఒక చిన్న కాగితాలకట్టతీసి అతనిచేతి కందిస్తూ.

"వెరీగుడ్! ప్రతివారూ ఇలా ముందుకురావాలి" అంటూ వాటిని తీసుకొని మేజాపైవుంచి "మళ్ళీ ఎప్పుడైనా దీన్ని పరిశీలించి ప్రచురణార్హమైతే తప్పక ప్రచురిస్తాను" అన్నాడు.

"థ్యాంక్స్" అంది ఆమె.

ప్రకాశం నౌకరును పిలచి రెండుకాఫీలు తీసుకురమ్మని పంపించాడు...రమ అభ్యంతరం చెప్పబోయింది గాని అతను వినిపించుకోలేదు.

కాఫీ వచ్చేవరకూ ఏవో కబుర్లలో పడిపోయాడు. "ఈమధ్య మీ నవలలేవీ పత్రికలో సీరియల్‌గా రాలేదు గదండీ" అంది.

"ఎప్పుడూ నా రచనలతోనే పత్రికంతా నింపితే పాఠకలోకం సహించలేదు. రచయితలు లేక మనదేశ మీనాడు గొడ్డు పోలేదు, రోజుకు వందలాది రచనలొస్తుంటాయి. వాటిని పరిలించటానికి, ప్రచురించటానికే నేను అన్నివిధాలా ప్రయత్నిస్తుంటాను.

"మరి మీరు రచనలేవీ వ్రాయదలచుకోలేదా"

"ఎందుకు లేదూ, రేపోమాపో ఒకనవల పుస్తకంగా ప్రచురణౌతుందికూడా" అన్నాడు ప్రకాశం. అంతలో కాఫీ రావటంతో సంభాషణ ముగిసింది. కాఫీ సేవించిన తర్వాత, "సాయంత్రమయింది. అలాషికారు వెళ్దాంరండి" అంది ఆమె.

"ఎటువేపు"

"కృష్ణా ఒడ్డుకు"

"సరే!"

ప్రకాశం మౌనంగా ఆమెననుసరించాడు. ప్రకాశం తన కారువేపు దారి తీయబోయాడు.

"మా కారుంది రండి" అంది ఆమె.

"దీన్నేం చేయమంటారు?"

"మరి..."?

"మీరే నాకార్లోకి రండి. అది మీ నాన్నగారికి అవసరముంటుంది"

ఆమెవచ్చి ఫ్రంట్ సీట్లో కూచోంది. ఆరిపోయిన పైపు మరీ వెలిగించి, కారు స్టార్టుచేశి, "పోగపీలిస్తే మీకేమయినా అభ్యంతరమా!" అన్నాడు

"కాల్చండి" అంది ఆమె.

కొద్దిక్షణాల తర్వాత కారు కృష్ణాఒడ్డున ఆగింది! ఇద్దరూ దిగి ముందుకు నడిచారు మౌనంగా. కృష్ణామ్మ నిండుగా ఒయ్యారంగా ప్రవహిస్తోంది. అక్కడక్కడ యిసుకతిన్నెపై కొందరు గుంపులుగుంపులుగా కూచొన్నారు. వీరి రాకను గమనించిన ఒకగుంపులో ఒకవ్యక్తి వీరిని చూస్తూ "ఆయనే సాపీసుధామ్" అన్నాడు.

"మరి ఆవిడో!"

"ఆ విశ్వేశ్వరయ్యగారు లేరూ... అతని కూతురు"

"జంట బాగా కలసిందే"

ప్రకాశంకు ఈమాటలు వినిపించకపోలేదు గాని అతను తనకేదీ పట్టనట్టుగా మౌనంగా గంభీరంగా నుంచిపోయాడు. రమాదేవి - తనివేపు సిగ్గుతో తొట్రుపడుతూ చూశింది.

"ఇక్కడ కూచుందామండీ"

ఇద్దరూ యిసుకతిన్నెలపై కూలబడ్డారు. నాలు గయిదు క్షణాలవరకూ వారిమధ్య ఏవిధమైన సంభాషణా జరుగలేదు. రమాదేవి గారికి ఆయనతో ఎన్నెన్నో మాటాడా లనుంది ఒక్కసారిగా తన భావాలన్నీ మనసువిప్పి అతని ముందు పెట్టాలనుకుంది. కాని అతని గంభీరతజూచి ఏమాటా సరిగ్గా బయటకురాలేదు. అతని వ్యక్తిత్వానికి ఆమె నిజంగా తెల్లబోయింది. ఏమిటీ మానవుని జడ ప్రకృతి? అనుకొంది. తానై తాను పలుకరించేవరకూ ఒక్కమాటకూడా మాటాడడు ... ప్రకాశాన్ని అలా మౌనంగావుంచి తద్వారా తాను మథన పడటానికి ఆమె మనసు అంగీకరించలేదు. బల వంతంగా ఆమె అతన్ని సంభాషణకు దింపవలసి వచ్చింది. అతనితో మాటాడటమంటే ఆమెకదో మధురానుభూతిలా వుంది. అతనిలోని ఏ ఆకర్షణ తన్నింతగా బధిస్తూంది అనుకొనేది. శూన్యమైన జవాబుతో అతని సుందరరూపం వేపు చూస్తూ తృప్తిపడేది.

* * * * *

రమాదేవిగారిని ఆమెయింటిదగ్గర 'డ్రాప్'చేసి ప్రకాశం నేరుగా యింటికి వచ్చాడు.

కారును పోర్టికోలో పార్క్‌చేసి తాళపుచెవి గుత్తిని విలాసంగా చేతిలో త్రిప్పుకుంటూ ప్రకాశం మెట్లెక్కాడు!

అప్పటికే ఏడుగంటలు దాటింది. డిశంబర్ నెల గావటంచే పూర్తిగా చీకటి ఏర్పడింది.

బూట్లచప్పుడు చేస్తూ ప్రకాశం హాల్లో ప్రవేశించ గానే, సోఫాలలో కూచొని ఏదో సంభాషిస్తున్న శ్రీధర్, అరుణ, మరో నూతనవ్యక్తి అతనివేపు ఒక్కసారిగా దృష్టి ప్రసారించారు. ప్రకాశం యాదాలాపంగా వారివేపు చూశి, అక్కడ కన్పించిన నూతనవ్యక్తిని జూచి క్షణకాలం ఉన్న చోటునే ఆగిపోయాడు ఆశ్చర్యంతో నిశ్చేష్టుడై! "రా...ధ..." అస్పష్టంగా అతని పెదవులు అప్రయత్నంగా గొణిగాయి.

రాధ నిస్సబ్ధురాలై, తనచూపుల నతనిపై అలాగే నిల్పింది ఆశ్చర్యాందోళనలతో! తన్నుతాను నమ్మలేనట్టుగా కంటిరెప్పలు మరీమరీ తాటించి చూశింది...సందేహంలేదు ..."ప్ర...కాశం" అని ఆమె గొణుక్కుంది... దాదాపు ఆమాట బయటకనేశింది. ఎంతిగుర్తు పట్టలేనివిధంగా మారి పోయాడు. ఎంతలో ఎంత మార్పు!

బలిష్ఠమైన ఆరడుగుల ఉన్నత దృఢశరీరం... తెల్లటి హవాయి పాంట్, తెల్లటికోటు, కళ్ళపై మిలమిలా మెరిశే తెల్లటి అద్దాలూ, నోట్లో నిశ్చలంగా వెల్గుతూన్న పొడుగాటి పైపు. అతను నిల్చున్న తీరు, ఒక్కక్షణం ఆమె విస్మయంతో తన పరిసరాలను విస్మరించింది.

ఆకస్మాత్తుగా వీరిమధ్య ఏర్పడ్డ ఈ నిశ్చల గంభీర వాతావరణం, అరుణా శ్రీధర్‌లను ఆశ్చర్యంలో ముంచెత్తింది.

"ఏమిటి ప్రకాశం! అలా నిలబడ్డావ్! ఇలారా!" అని పిలిచాడు శ్రీధర్.

ప్రకాశం గంభీరంగా నాలుగడుగులు ముందుకువేశి రాధ కళ్లలోకి సూటిగా చూశాడు. రాధ బెదరుతూ చూపులు మరలించుకొంది

ప్రకాశం యింక అక్కడ ఆగలేకపోయాడు. నోట్లోంచి పైపును బయటకుతీసి గబగబానడచి మేడమెట్లు ఆరోహించబోయాడు..

"ప్రకాశం..." రాధ కంఠం, త్రుప్పుపట్టిన యినుములా వినిపించింది.

"క్షమించురాధా! మళ్ళీ ఈ జీవితంలో నా ముఖం నీకు చూపవలసి వస్తుందనుకోలేదు. పొరపాటయింది" అని చకచకా మేడమెట్లెక్కి తనగదిలోకి వెళ్ళిపోయాడు.

రాధ ముఖంనిండా చేతులుగప్పుకొని భోరునవడ్చింది.

ఇదంతా రెండు క్షణాలలో జరిగింది. ఈ సంఘటనకు శ్రీధర్ అరుణలు నిర్ఘాంతపోయారు. ఏమిటిది! అనుకొని అరుణ విస్తుపోయింది. ఆ అరక్షణంలోనే శ్రీధర్ మస్తిష్కంలో కొన్నివేల ఆలోచనలు దొర్లాయి.

"ఏమిటిదిరాధా! ప్రకాశం నీ కింతకుముందే తెలుసా" వింతగా ప్రశ్నించిందిఅరుణ.

రాధ కళ్ళనుండి అశ్రుబిందువులు జలజలారాలాయి.

"ఏమిటమ్మా ఆ కన్నీళ్ళు? అసలు విషయంచెప్పక" అడిగాడు శ్రీధర్ గారు.

"అన్నయ్యా!" అని యిక ఆగలేక భోరున గట్టిగా ఏడ్చిందిరాధ

"ఏమిటమ్మా రాధా! ఇది" ఆమె తలనిమురుతూ జాలిగా అడిగింది అరుణ.

"వారికి. వారికి క్షమించరాని ద్రోహం చేసింది నేనే అన్నయ్యా! వారి విషాదజీవితానికి అన్నివిధాలా కారణం నేనే" బావురుమంది రాధ.

"ఏమిటమ్మా! నాకేదీ అర్థంగావటంలేదు.. అసలు ప్రకాశం నీకెలా తెలుసు?"

"అదంతా ఒకపెద్దగాథ అన్నయ్యా! అమృతంలాంటి వారి ఆత్మలో హాలాహలం చిందించాను.. వారి పవిత్ర ధర్మాల మనసును అర్థంచేసుకోలేక వారి భవిష్యత్‌ను చేతులారా నాశన చేశాను.. నేను ఇంటర్ చదివే రోజులలో" అంటూ ప్రారభించింది రాధ.

ప్రకాశం గదిలోకివచ్చి తన్నుతానే ఏవేవో ప్రశ్నిం చుకుంటూ, గదంతా పచారు చేయసాగాడు. ఆ చీకటి గదిలో, అతని పైపునుండి వెలువడుతున్న పొగ గదినంతా రెండుక్షణాలలో నింపివేసింది.

రాధకు శ్రీధర్‌కూ ఏంసంబంధం? ఆమె యిక్కడికి ఎలా వచ్చింది?

అతని మస్తిష్కంలో ఏవేవో ప్రశ్నలు ఏర్పడ్డాయి. ఏదేదో జ్ఞాపకం చేసుకోవటానికి ప్రయత్నించాడు.

పదిక్షణాలతర్వాత అతని మస్తిష్కంలో తళుక్కున ఏదో ఆలోచన మెరిసింది. ఎప్పుడో తనకు 'రాజారావుగారు

చెప్పిన "తన పెద్దకుమారుడు విజయవాడలో ఏదో సంస్థలో మేనేజర్‌గా పనిచేస్తున్నాడన్న" మాటలు అతనికిప్పుడు మళ్ళీ జ్ఞప్తికొచ్చాయి.

ఐతే శ్రీధర్ చెల్లెలేనన్నమాట రాధ. ఇన్నాళ్ళు తను శ్రీధర్ వ్యక్తిగత విషయాలు తెలుసుకోకపోవటంవల్ల ఈనాడు తనకిదంతా కొత్తగావుంది.

రాధ చెప్పటం పూర్తిచేసి "ఇక ఆ పవిత్రమూర్తి నన్ను క్షమించరన్నయ్యా! అసలు వారిక్కడకెలావచ్చారు?" అనడిగింది కన్నీళ్లు తుడుచుకుంటూ.

ఆమె గాథ విన్న శ్రీధర్ బరువుగా నిట్టూర్చాడు. ప్రకాశం స్వగ్రామంలో సావి తిని ప్రేమించటం, ప్రతికక్షులు చేసిన ద్రోహానికి బలిగావటం మొదలుకొని తమ యింటికి చేరటంవరకూ చెప్పి ఆ తర్వాత జరిగిన అతని జీవిత గాథను కూడా వినిపించటంతో పూర్తిచేశాడు శ్రీధర్‌గారు.

రాధ కన్నీరు కపోలాల మీదుగా సహస్రపాయలై ప్రసరించి, ఆరి నల్లగా గీతలు ఏర్పడ్డాయి.

ప్రకాశం నాలుగయిదుసార్లు ఆరిన తన పైపును వెలిగించుకొని పరిసరాలే విస్మరించి ఆలోచనలను ఛేదిస్తున్నాడు.

ఒక్కసారిగా గదిలో చీకటిని అణస్తూ లైటు వెలిగింది. అదేసమయంలో తలుపుదగ్గరేదో చప్పుడైంది. ప్రకాశం ఆశ్చర్యపోతూ వెనుదిరిగి అటువేపుచూశాడు. రాధ వదనంలో విషాదమేఘాలు క్రమ్ముకొని కళ్ళనిండా నీరు నింపుకొన్న ఆమెను చూడగానే ప్రకాశం విచలితుడై పోయాడు.

"ప్రకాశం..."

"రాధా"

రాధ యిక ఆగలేక వేగంగావచ్చి అతనికాళ్ళను పెనవేసుకొని "నన్ను క్షమించండి, నా ద్రోహానికి కనీసం ఆ క్షమాభిక్షనైనా అందచేయండి" అంది.

"ఛా... ఛా... ఏమిటీపనిరాధా! లే నేనీనాడు ఎవర్నీ క్షమించటానికి అనర్హుణ్ని" అంటూ ఆమె భుజాలుపట్టుకొని లేవనెత్తబోయాడు.

"మీరలాఅంటే మీ పాదాలముందే తల బద్దలు గొట్టుకొని చస్తాను. నా హృదయంలో ఎన్ని అగ్నిపర్వతాలు ప్రయ్యలవుతున్నాయో మీకేం తెలుసు. చేసిన పాప కార్యానికి పశ్చాత్తాపంతో క్రుంగిపోతున్నాను. ఒక్కమాట నండి "రాధా నిన్ను క్షమించాను" అని మనస్ఫూర్తిగా ఒకేఒక్కమాటనండి. ఆ విధంగానయినా నా పాపాన్ని క్షాళనం చేసుకుంటాను. ఇక ఆ తర్వాత మీ జీవితంలో ఎన్నడూ ఏ విధంగానూ తటస్థపడను"

"పిచ్చిరాధా! దీనికెవరూ కర్తలుగారు ఇందులో నీ తప్పేంలేదు. గతంవల్ల ఎన్నడూ బాధను పెంచుకోరాదు లే రాధా!"

"ఊహూఁ... మీరు నన్ను మనస్ఫూర్తిగా క్షమించాలి"

"నిన్ను నేను ఎప్పుడో క్షమించానురాధా" అంటూ ఆమె భుజాలు పట్టుకొని పైకి లేవనెత్తాడు.

"క్షమకు కూడా అతీతురాలయిన నన్ను క్షమించారా ప్రకాశ్! నన్ను క్షమించారు, క్షమించారు" పిచ్చిగా ఏదేదో అంది రాధ

* * *

మరురోజు ఉదయం లేచేసరికి రాధలో ఏదో నూతన్న మార్పు సంభవించింది.

శ్రీధర్ అరుణలకు ఆమెపై ఎంతో సానుభూతీ జాలి ఏర్పడ్డాయి. అసలే వారివి సహృదయాలు.

ఆరోజు, గతాన్ని పూర్తిగా విస్మరించినట్టుగానే, రాధా ప్రకాశంలు చనువుగా మాటాడటంచూసి అరుణ కెంతో ఆశ్చర్యం ఆనందం వేసింది! "నిజంగా ప్రకాశం హృదయం ఆకాశమంత విశాలం" అనుకొంది!

అంతవరకూ రాధ మెడలోగల పచ్చదారాన్ని పరికించని ప్రకాశం ఆరోజు ఉదయమే గమనించి. "అదృష్టవంతురాలివి రాధా! ఇంతకూ ఆయనగారెవరు...?" అన్నాడు మందహాసం చేస్తూ.

రాధకు చాలా సిగ్గువేసింది, "మీలాంటి సామాన్యుడు మాత్రం కాదులెండి ఆయన," అంది పరిహాసంగా కిలకిలా నవ్వుతూ!

ఆమాటకు ప్రకాశం పెద్దపెట్టున పకపకానవ్వి, "నిజం చెప్పావ్ రాధా...నిజం చెప్పావ్" అన్నాడు.

వారం రోజులవరకూ అక్కడే వుండిపోయింది రాధ. ఆరోజు సాయంత్రమే ప్రయాణం కావాలనే ఉద్దేశంలో వుంది! ఆరోజు ఉదయం అందరూ కాఫీ సేవిస్తూండగా రమాదేవి ప్రవేశించింది! శ్రీధర్ అరుణలు ఆమెను సగౌరవంగా ఆహ్వానించి కాఫీ అందచేశారు.

"ఎవరీవిడ?" అన్నట్టుగా అన్నయ్యవేపు చూశింది రాధ.

"ప్రకాశం ప్రెస్ పార్టనర్ విశ్వేశ్వరయ్యగారి కుమార్తె" అన్నాడాయన.

రమ రాధవేపే పరకాయించి చూస్తూ ఏదో ఆలోచనలో పడిపోయింది.

"ఈమె నా చెల్లాయి రాధ" అంటూ పరిచయం చేశాడు శ్రీధర్?

"ఏమ్మా! చాలాపెందలాడే వచ్చావ్" అంది అరుణ!

రమాదేవి కాస్త తొట్రుపడింది, "అబ్బె, ఏంలేదండీ, ఉబుసుపోక అలావచ్చాను" అంది ఆమె.

ఆమె తొట్రుపాటును ఒక్కరాధ మాత్రమే స్పష్టంగా గమనించింది, "మీరచయిత గారికోసం వచ్చారు కాబోలు" అంది చిన్నగా నవ్వుతూ.

రమ కాస్త సిగ్గుపడింది. ప్రకాశం వీరిమాటలేవీ వినిపించుకున్నట్టు లేదు. పైప్‌లో పొగాకు రాల్చి వెలిగించటంలో నిమగ్నుడయ్యాడు!

అంగంటవరకూ ఏదో పిచ్చాపాటితో కాలక్షేపం చేశారు వారు! వీరి సంభాషణలో అణుమాత్రంకూడా పాల్గొనని వ్యక్తి ఒక్క ప్రకాశం... మాత్రమే!

"ప్రకాశం! నీవిలా మౌనంగా, ఏమీపట్టనట్టుంటే నేను సహించనుసుమా! మీకోసం వసిగట్టుకువచ్చిన రమా దేవి గారితోనైనా నాలుగుమాటలు మాటాడకూడదూ!" మందలింపుస్వరంలో అంది రాధ. ప్రకాశం మందహాసం గావించాడు. రమకు ఆమాటల్లో ఏదో వ్యంగ్యం స్ఫురించింది!

"పేకాట వేద్దామా," అన్నాడు శ్రీధర్.

'ఓ' అంటే 'ఓ' అన్నారందరూ.

"నీవు ప్రకాశ్?"

"మీయిష్టం"

రాధా శ్రీధర్‌లు ఒకజట్టుగా. రమా ప్రకాశంలు ఒకజట్టుగా ఆట ప్రారంభించారు. అరుణకీఆట బొత్తిగా తెలియదు. ప్రేక్షకత్వం కూడా వహించలేకపోయింది. వంటింటివేపు దారితీసింది.

ఐదారు ఆటలు చకచకా సాగిపోయాయి. ప్రకాశం జట్టు చిత్తుగా ఓడిపోయింది! అప్పటికే పాతికరూపాయల నష్టం ఏర్పడింది

"అన్నయ్యా! ప్రకాశంవద్దర బ్యాలెన్స్ యింకా ఏమైనా మిగిలిందేమో అడుగు" పేకముక్కలు కలుపుతూ నవ్వుతూ అంది రాధ!

రాధ వరస రమ కేమాత్రం నచ్చలేదు. ఆమె ప్రకాశంపట్ల వ్యవహరించే కలుపుగోలుతనం ఆమెకు దుర్భరమై పోయింది.

"అదీ చూద్దాం! ఇంకా రెండు ఆటలు వెయ్యి... నీబ్యాలెన్స్ ఎంతుంటుందో చూసుకుందువు గాని." అన్నాడు ప్రకాశం.

మరీ ఆరు ఆటలు గడచాయి. రాధముఖం పేలవంగా తయారయింది.

"ఏం రాధా! డబ్బేమైనా మిగిలిందా" ప్రకాశం నవ్వుతూ అడిగాడు.

"ఇంకెక్కడిది! రైలు ఛార్జీలకుకూడా మిగలలేదు..."

ఈమాటకు రమాదేవితప్ప అందరూ ఫక్కున నవ్వారు...రమ ఈవాతావరణాన్ని సహించలేక లేచి నిలబడింది.

"వెళ్తున్నారా" అన్నాడు శ్రీధర్.

"ఔను... వెళ్ళొస్తానండి సుధామ్‌గారూ," అని నమస్కారంచేసి చకచకా బయటకు వెళ్ళింది.

"ఆమెకోపం చూశావా ప్రకాశ్! నిజంగా మీవరస నాకేం నచ్చలేదు. ఆ అమ్మాయి మీకోసం ఎంతో ఉత్సాహంతో వచ్చినట్టుంది... మీరేమో పెద్ద మౌనిలా తపస్విలా, గంభీరంగా..." అంది రాధ కోపంగా.

ప్రకాశం ఏమీ జవాబివ్వలేదు గాని చిన్నగామాత్రం నవ్వాడు.

*　　*　　*　　*　　*

ఆసాయంత్రం రాధ బయలుదేరేముందు ప్రకాశం గదికి వెళ్ళింది.

అతను కుర్చీలో కూచొని మేజాపై చేతులాన్చి ఏదో వ్రాస్తూండిపోయాడు. ఆమె రాకను గమనించి, "కూచో రాధా" అన్నాడు.

"నేను కూచోటానికి రాలేదు... ఇప్పుడే ట్రైన్‌కు వెళ్తున్నాను."

"ఇప్పుడా!"

"అవును"

"అంత తొందరేమొచ్చింది. ఓహో! ఆయనగారు జ్ఞప్తికి వచ్చారు కాబోలు." అన్నాడు.

"చాల్లెండి! మీరు మరీనూ..." అని ఆగి, "ప్రకాశం, మిమ్మల్ని ఒకవిషయం అడగాలనుకుంటున్నాను... అడుగ వచ్చా!

"అభ్యంతరం లేదు"

"రమ గురించి మీఅభిప్రాయం?"

"ఎటువంటి అభిప్రాయం."

"ఆమెఅంటే మీకు యిష్టమేనా."

"ఇష్టమే"

"మరి పెళ్ళి చేసుకోరాదూ."

"రాధా! యిష్టమున్నంత మాత్రాన వివాహానికి ముడిపెట్టటం మంచిదిగాదు."

"ఎందుకు పెళ్ళిఅంటే అలా బెదిరిపోతారు! చూడండి! మీరిలా ఎన్నాళ్ళీఒంటరి జీవితం సాగిస్తారు! తోడులేనిదీ 'నిశ'కూడా వృండదనంటారు. మీకు చెప్పేంతటి దాన్ని కాదనుకోండి... అయినా మిత్రునిగా నా అభిప్రాయం, కోరికా అది."

"నీ కోరిక ఉత్తమమే గావచ్చు రాధా! కాని ఇక నేనీజీవితంలో ఆవైవాహిక బంధాన్ని జయించలేనను కుంటాను. పెళ్లిచేసుకోని నేనూ సుఖపడలేను, ఇంకొకర్నీ సుఖపెట్టలేను। సావిత్రిని ప్రేమించిన ఈహృదయంతో మరొకర్ని ప్రేమించలేను, పెళ్లి చేసుకోలేను."

"అయితే మీరింకా సావిత్రిని విస్మరించ లేదన్న మాట."

"అదెలా సాధ్యం రాధా। నేనీనాడు పైకి ఎంత గంభీరంగా కన్పిస్తున్నానో, లోపల సావిత్రి గురించిన వ్యధను అంత అనుభవిస్తున్నాను."

"ఇంకా సావిత్రిని తలచుకొని మీరీ మోడు వారిన జీవితంలో ఏమి సాధిస్తారు."

"నాకేదీ సాధించాలన్న ఆశగాని ఆకాంక్షగాని ఈ నాడేమాత్రం లేదురాధా. నా జీవితం యిలా సాహిత్య సేవలోనే గడచిపోనీ. నీమాట పాటించనందుకు క్షమించు రాధా. ఇక ఆ ప్రస్తావన తేవద్దు."

రాధ నిశ్చలంగా నిర్వికారంగా అతని ముఖంవేపు చూస్తూండిపోయింది.

*　　　*　　*　　*

# 28

రమాదేవి ప్రకాశంగురించి ఒకవిధమైన నిశ్చయ నిర్ణయానికొచ్చింది. తను ఆశిస్తున్న ప్రకాశంకు తనెంత దగ్గరగా వెళ్ళాలని ప్రయత్నించినా, అతనంతకంటె దూరంగా తననుండి తప్పించుకుపోవటంచే ఆమె కతనిపై రెట్టింపు ఆకాంక్ష, అభిమానం, పట్టుదల అధికమయ్యాయి.

నాలుగు మాసాలయిండి తమకు పరిచయం ఏర్పడి. తనంటే ఎంతో యిష్టమున్నట్టుగానే ఆయన ప్రవర్తిస్తున్నాడు. అతని గతజీవితం గురించి తనకేదీ యింతవరకూ తెలియదు; అతనికి ఒక్క-పెళ్ళి మాత్రం గాలేదన్న విషయందప్ప. అతను వ్రాశిన ఒకానొక నవల చదివినపుడు "రచయిత భగ్నప్రేమికుడేమో! అనిపించింది తనకు! అదెంతమాత్రం నిజమో తనకింతవరకూ తెలియదు. అతనిలో మరి ఆభగ్న ఛాయలే కన్పించవే! ఏదిఏమైనా ప్రకాశం అలావుండటానికి, తనకు దూరమవటానికీ వీల్లేదు! అతనెందుకో తనకు కావాలి! అతనులేనిదీ తనులేదు! అతనిలోని ఏదోవిశిష్ట గంభీర నిఘూఢ సుందర సురుచిర శక్తి తన్ను పూర్తిగా ఆకర్షించి లోబరచుకొంది.

రమాదేవి చిన్నప్పట్నుంచీ అల్లారుముద్దుగా, అమ్మా నాన్నా బొమ్మల మురిపెంలో పెరిగిన పిల్ల. ఆమెకు చిన్నప్పట్నుంచీ పట్టుదలా, ఆవేశమూ జాస్తీ! పెంపకంవల్ల అది బాల్యంనుండీ వేళ్ళతోసహా పాతుకొని పెరిగింది. ప్రకాశం గురించిన పట్టుదల ఆమె మస్తిష్కంలో పెద్ద యెత్తున పనిచేయసాగింది ఈనాడు. ఆమె హృదయంలో ప్రకాశం మూర్తి బాగా ముద్రవేసుకుంది. అనుక్షణమూ అతని గురించిన ఆలోచనలూ, ఊహాగానాలు.

మొదటిసారిగా తన మనోభావాల్ని తల్లియెదుట బయట పరచింది ఆమెకు ఈ విషయం విన్నతర్వాత "అంతటి గొప్పవ్యక్తి తమ అల్లుడైతే" అన్నఆశ చిగురించక పోలేదు.

విశ్వేశ్వరయ్యగారికి కూడా కొద్దిరోజుల్లో ఈవిషయం తెలిసిపోయింది! ముందునుంచీ ఆయనగారికి కూడా యిలాంటి ఆశ వుండకపోలేదు, ఆనాడే ఆయన తనఆశకు పునాది రాయి వేసుకున్నాడు. రానురాను ఆయన ఆశలతో భవననిర్మాణం కూడా జరిగిపోయింది. రమ మనసు తెలిసిన తర్వాత ఇక అభ్యంతరం లేదనుకున్నాడు! తనడిగితే, ఏమాత్రం ఎదురు చెప్పక, సంతోషంతో ప్రకాశం అంగీకరిస్తాడని ఆయన దృఢ విశ్వాసం. ఆ తర్వాత ఎన్నెన్నో వ్యూహాలు ఆయనలో మెదిలాయి. 'సాపీసుధామ్' తనకు కాబోయే అల్లుడు అనుకొని గర్వించాడు.

*

అరుణా శ్రీధర్‌లకు, ఏవిధంగానైనా ప్రకాశం మనసు మార్చి వివాహం గావించాలన్న సంకల్పం మొదట్నుంచీ వుంది. కాని వారి ఆశలను ఎప్పటికప్పుడు ప్రకాశం త్రుంచి వేస్తూండుటచే రానురాను వారిలో కొంత నిరుత్సాహం ఏర్పడింది. ప్రకాశం పెళ్ళిచేశి, చూశి ఆనందించాలనే బలీయమైన కోర్కె అరుణకు ఈ నాటికికూడా వుంది.! కాని ప్రకాశందీ మొండిపట్టు.

"నా కెందుకక్కయ్యా, పెళ్ళిపెటాకులూ! ఇలాగే గడచిపోనీ నా శేషజీవితం" అనేవాడు పెళ్ళిప్రస్తావన తెచ్చినపుడల్లా.

వీరి బలవంతంవలననే రాధకూడా ఈ విషయమై ప్రయత్నించి విఫలురాలు గావలసివచ్చింది.

"ఎన్నిరోజులిలా ఒంటరిజీవితం అనుభవిస్తావ్ ప్రకాశం" అనేవాడు శ్రీధర్ గారు.

"నాది ఒంటరిజీవితమెలా అవుతుంది శ్రీధర్! మీరంతా నాకు తోడుగా వుండటంలేదూ?" అనేవాడు ప్రకాశం.

"అదిగాదు ప్రకాశం"

"ఇకఏదీగాదు శ్రీధర్! ఈ జీవితంలోమాత్రం నా నిర్ణయం మార్చుకోలేను. సావిత్రితోనే ఆ ఆశ అంతరించి పోయింది. చచ్చి వచ్చేజన్మలో నీ కడుపునబుట్టి తప్పక మీ ఆశ నెరవేరుస్తాను" అనేవాడు. శ్రీధర్ ఆ మాటలకు ఎంతో విచారించి నిరుత్సాహం చెందేవాడు.

ఆరోజు ప్రకాశం యింట్లోలేడు. సాహిత్యమండలిలో ఏదో సమావేశం వుండటంచే అధ్యక్షుడు తానుగావటంచే జరుగురుగా వెళ్ళిపోయాడు.

ఆ సమయంలో విశ్వేశ్వరయ్యగారు వచ్చారు. శ్రీధర్ గారితో తన ఆంతర్యం బయటపెట్టాడు.

"మీకోర్కె మంచిదే విశ్వేశ్వరయ్యగారూ! మీ వియ్యంకం మాకు సర్వదా ఆనందదాయకమే! కాని లాభం లేదనుకుంటాను" అన్నాడు శ్రీధర్‌గారు.

"అదేమిటండీ అలాఅంటారు!" నిర్ఘాంతపోతూ అన్నాడు విశ్వేశ్వరయ్యగారు.

"నిజమంతేనండీ. ప్రకాశం జీవితం మీ కింతవరకూ తెలియదు"

ప్రకాశం జీవితగాధ పూర్తిగా విన్నతర్వాత విశ్వేశ్వరయ్యగారు, "నాకుమాత్రం ఈ విషయంపట్ల పూర్తి విశ్వాసం ముందండీ! అమ్మాయిరమా, అయనా ఎంతో చనువుగావుంటూ వచ్చారు. ఆ చనువును పురస్కరించుకొనే ఇలా అడగవలసివచ్చింది. వారిద్దరూ ప్రేమించుకున్నారనీ కూడా నా అనుమానం"

శ్రీధర్‌గారు చిన్నగా నవ్వాడు, "ప్రకాశం జీవితంలో ఆ ప్రణయదశ పూర్తిగా దాటిపోయిందండీ! అతను మీ అమ్మాయిని ప్రేమిస్తున్నాడనుకోవటం కేవలం మీ భ్రమమాత్రమే! అయినా మేమూ ఈ విషయమై పూర్తి ప్రోత్సాహం యిస్తాము. సాధ్యమయినంతవరకూ ప్రయత్నించి

ప్రకాశాన్ని ఒప్పించేలా చూస్తాను. విఫలమయితే నేనేం చేయలేను. అందుకు మీరేం బాధపడకూడదు"

విశ్వేశ్వరయ్యగారు "సరే" అన్నాడు చిన్నగా! తన కోర్కెకు ఈవిధమయిన వైరుధ్యం లభిస్తుందని ఆయన కలలో కూడా వూహించలేదు. అయినా అంతో యింతో ఆశ ఇంకా ఆయన హృదిలో లేకపోలేదు.

"మీరూ ప్రయత్నించండి. మీ కోర్కె కాదనడు. అమ్మాయి శ్రేయస్సుకై నేనే ఆయన్ను నోరు తెరచి అడుగుతాను" అన్నాడాయనమళ్ళీ.

"మీ యిష్టం" అన్నాడు శ్రీధర్‌గారు.

ఆ రోజు రాత్రి భోజనకార్యక్రమం పూర్తయిన తర్వాత శ్రీధర్ అగుణలుమేడమీద ప్రకాశంతోసహా బాల్కనీలోకూచొని ఈ విషయం ప్రారంభించారు.

"చూడుప్రకాశం! విశ్వేశ్వరయ్యగారి కూతురు రమ నీకు బాగా తెలుసనుకుంటాను" అన్నాడు శ్రీధర్‌గారు.

"బాగాఅంటే"

"పరిచయంవల్ల ఆమెను బాగా అర్థంచేసుకొనే వుంటావనుకుంటాను"

"నిజమే!"

"ఆమె గురించి నీ అభిప్రాయం"

"నిర్మలహృదయ, కల్మషంలేని అమ్మాయి. ఇంతకంటే ఏంచెప్పగలను" అన్నాడు.

"మరి నీ వంగీకరిస్తే ఆ అమ్మాయిని..."

ప్రకాశంకు వీరి సంభాషణోద్దేశం పూర్తిగా అర్థ మయింది. అనాడు రాధకూడా యిదేవిధంగా ప్రస్తావన తెచ్చింది.

"క్షమించు శ్రీధర్! నాకు మీ మనసు అర్థఅయింది. కాని మీ రనుకున్నట్టు ఆమెను గురించి నా కలాంటిభావం లేదు. నా హృదయంలో అలాంటిభావాలే క్షీణించిపోయాయి. ఇప్పట్లో నేను మీ కోర్కెకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నందుకు నాకెంతో బాధగావుంది. ఏనాడన్నా నాకు పెళ్ళిచేసుకో వాలన్న తలంపంటూ కలిగితే ముందుగా ఆ విషయం మీకు చెప్పి మీరు నిర్ణయించిన అమ్మాయినే వివాహంచేసుకుం టాను. ఇప్పట్లోమాత్రం అది సాధ్యపడదు"

'కాని ప్రకాశం! వర్తమానాన్ని విస్మరించి భవి ష్యత్ మీద కేవలం గ్రుడ్డిచూపుంచుకోవటం నాకేమాత్రం సమంజసంగా లేదు"

"అవునన్నయ్యా! నీవు సమ్మతిస్తావనే ఉద్దేశంతోనే విశ్వేశ్వరయ్యగారు స్వయంగావచ్చి పిల్లనిస్తామన్నారు"

"ఇక నేను మీకు ఏవిధంగాచెప్పాలో అర్థంగా లేదక్కయ్యా" తల వెనక్కువాలుస్తూ అన్నాడు.

అరుణా శ్రీధర్‌లు ఒకరిముఖం ఒకరు చూసుకొని నిట్టూర్చుకొన్నారు. ప్రకాశం ఆకాశంవేపు శూన్యదృక్కు లతో చూస్తూండిపోయాడు.

మరుసటిరోజు శ్రీధర్‌గారు విశ్వేశ్వరయ్యగారితో ఈ విషయంచెప్పాడు. ఈ విషయంవిన్న ఆయన చిన్నగా నిట్టూర్చి, "నాదే పొరపాటయిపోయిందిలెండి! ఆయునగారి

మనసు సర్ధం చేసుకోలేకపోయాము. సన్యాసి రమనూ క్షమించమని ఆయనతో చెప్పండి. ఈ విషయం తెలిస్తే అమ్మాయి ఎంతబాధపడుతుందోననే నా చింత. అసలే ఆవేశం జాస్తిగలపిల్ల. ఏఅఘాయిత్యం తలపెడుతుందో నని నా భయం! అయినా అన్నిటికీ ఆ భగవంతుడున్నాడు" అన్నాడు బరువుగా.

* * *

రమ కీవిషయం తెలిసి మొదలునరికిన చెట్టులా కూలి పోయింది. ఆమెకు ప్రపంచమంతా శూన్యంగా కన్పించ సాగింది. "ఇలా జరుగుతుందని తను కలలో కూడా అనుకో లేదు. ఆయనగారింత మొండిపట్టుదల పడుతారని పొరపా టునకూడా వూహించుకోలేకపోయింది. అబ్బ! ఏమిటిహృదయ మంతా ముక్కలుముక్కలుగా తయారయిపోతోంది. ఎలా భరించగలను ఈ ఆవేదనను! ఎవరాలకిస్తారు ఈ నివేదనను"

"ప్రకాశంలేని ఈ జీవితం, ఆయన నిరాకరించిన ఈ శరీరం యికవుంటే ఎంత? లేకపోతేఎంత? గుండెల్లో ఆయనే వచ్చి బాకులుదూసి వెళ్ళకూడదూ?"

"వద్దు, వద్దు. ఈ ఘోరబాధాఝురిలో యిక ఈ బ్రతుకేవద్దు ఈ బ్రతుకేవద్దు"

* * * * *

మరుక్షణోదయం విశ్వేశ్వరయ్యగారి ఇంటిచుట్టూ వందలకొలదీ జనం ప్రోగయి ఏదోవింతచూస్తున్నట్టుగా వుండి పోయారు. ఆ యింట్లో ఏడ్పులూ, పెడబొబ్బలూ మిన్ను ముట్టుతున్నాయి. "అయ్యో! ఎంతపనిచేశావే తల్లీ!" అన్న ఆ మాతృమూర్తి ఆక్రందననువిన్న ప్రతిఒక్కరూ కళ్ళనీళ్ళు తుడుచుకున్నారు.

అప్పుడే అచ్చటకు ప్రవేశించిన శ్రీధర్‌గారు అంత మందిజనాన్నిచూసి ఆశ్చర్యంతో వారిని త్రోసుకుంటూ లోపలకెళ్ళాడు.

ఎదురుగా శరీరమంతా నల్లగాకాలి, బొబ్బలతో బొగ్గయిపోయి రూపమే కన్పించకుండా దహించుకుపోయిన రమ వికృతశవాన్ని చూడగానే "అబ్బా!" అని కళ్ళు మూసుకొన్నాడు.

*　　*　　*　　*　　*

'రమ మరణం' పాఠకులకు అసహజత్వంగా కన్పి...
అందుకు నేనేం జవాబివ్వలేను. సత్యానికితోడు అబద...
కల్పించటం ఆత్మవంచనకూడా.

*　　*

"అయ్యో భగవాన్! ఏమిటీ వైపరీత్యం! ఈ పాపం కూడా నాదేనా? ఎంతఘోర విపత్కర పరిస్థితిలో నన్ను పడ

ద్రోశావయ్యా! ఇదేనా నీ దయాపూరిత నిర్మల హృదయం? నేనేం ద్రోహంచేశానని నాకీశిక్ష విధించావ్! ఇంతకుమించి నన్నే ఒక్కసారిగా నిలువునా దహించివేయ కూడదా! అయ్యయ్యో, నా జీవితమంతా యిందుకేనా? నాకిందుకేదీ ప్రాయశ్చిత్తంలేదా? అబ్బా! నిష్కృతేలేని ఈ జీవితంతో యిక ఎలా పోరాటం సాగించాలి?" శూన్యం వేపుచూస్తూ పిచ్చివానిలా అరచాడు ప్రకాశం.

# 29

రెండు సంవత్సరాలు గతించాయి.

ఈ మధ్యకాలంలో చెప్పుకోదగ్గ సంఘటనలేవీ ప్రకాశం జీవితంలో జరుగలేదు. జరిగినా అంత ప్రాముఖ్యతకలవి కాదు.

ఈ రెండు సంవత్సరాలలో ప్రకాశం అన్నివిధాలా మారిపోయాడు. అతనికేనాడూ ఎవరితోనూ పెద్ద సంబంధాలంటూ ఏవీలేవు. తనెంతో, ఆఫీసుపనెంతో, సంపాదకునిగా తనబాధ్యతెంతో, అంతదప్ప లోకంతో అతనికి ఏ విధమైన సాన్నిహిత్యంలేదు. రమ ఆత్మహత్యా సంఘటనతో అతను ఎవర్నీ నమ్మలేకపోయాడు. ఆ సంఘటనే అతని మనసులో పెద్దసంక్షోభాన్నీ మార్పునూ తెచ్చిపెట్టింది. తటస్థించిన ఏ స్త్రీనీ ఒక్కఅంగుళంకూడా తనదగ్గరకు రానివ్వలేకపోయాడు. ఈనాడతను యింట్లోకూడా ముభావంగా, మౌనంగా, గంభీరంగా వుంటాడు. ఉదయం లేవటం స్నానంచేసి ఫలహారా

దులు ముగించి ఆఫీసుకెళ్ళటం, తిరిగి సాయంత్రం యింటికి రావటం రాత్రికాగానే భోజనంచేసి తనగదికెళ్ళటంమినహా ఒకరితో మాటాడడు, ఏదీపట్టించుకోడు, ఏదోరాస్తుంటాడు, చేస్తుంటాడు, వాటిని ప్రచురిస్తుంటాడు. ఇంతకుమించి ఏ విధమయిన కార్యక్రమమూ అతని దైనందిన జీవితంలోలేదు.

ఈ కాలంలో అతను డబ్బు రెండుచేతులా గడించాడనే చెప్పాలి. పత్రికద్వారా చాలా పెద్దమొత్తాలు లాభం సంపాదించాడు. కాని ఎంతసంపాదించినదీ అతనికే తెలియదు. తనకు వచ్చినడబ్బంతా ముభావంగా శ్రీధర్ గారికి వప్పచెప్పటంతో చేతులు దులుపుకోనేవాడు. వృథాగా అతనిమనసు బాధపెట్టడమెందుకని శ్రీధర్ ఆ డబ్బు తీసుకొని జాగ్రత్త పరుస్తూండేవాడు.

ఈ రెండేళ్ళలో అరుణా, శ్రీధర్ లూ పిల్లలూ నౌకర్లూ, తమగృహంలో ప్రకాశం వుండటమే లోపించినట్టుగా ఫీలయ్యారు. అందుకు ప్రకాశందీర్ఘమౌనమే కారణం!

ఈనాడు ప్రకాశానికి బరువుబాధ్యతలుగాని సమస్యలుగానిలేవు. అంతానిరాకారం, అయోమయం! ప్రకాశంగాదిప్పుడుడతను. కేవలం 'సాపీసుధామ్' మాత్రమే! విలాసాలూ, విందులూ, సినిమాలూ, సభావేశాలూ, అవేవీ ఈనాటి అతనిజీవితంలో లేవు. అతనీనాడొక జడప్రకృతి కాని ఆ జడప్రకృతిలోనే ఏదోగంభీర ఉజ్వలతేజస్సు వుట్టిపడుతూంది.

ఆ రోజు సాయంత్రం ప్రకాశం తనకారులో ఆఫీసు నుండి తిరిగివస్తూ, సడన్ గా "సిల్కుహౌస్" దగ్గర ఆపు

చేశాడుకారును. వారంరోజులలో రాబోయే సంక్రాంతిపం డుగకు బట్టలుకావాలన్న ఆలోచన అతనికి జ్ఞప్తికివచ్చింది. ప్రతిపండుగకూ యిది అతని అలవాటు. "సిల్క్‌హౌస్" యజమాని ఆయన్ను గౌరవంగా ఆహ్వానించారు.

ప్రకాశం కావలసిన వస్తువుల వివరాలన్నీ చెప్పాడు. అరగంట తర్వాత కార్యక్రమం అంతా ముగిసింది. బట్టలన్నీ 'ప్యాక్' చేయబడ్డాయి క్యాషియర్ బిలును అందించ బోయాడు.

"ఎంతయింది?"

"ఆరువందలఏభయి'

ప్రకాశం మొత్తం చెల్లించి బయటకువచ్చాడు. ప్యాక్ చేసినబట్టలను నౌకరు తెచ్చి కార్లోవుంచాడు. కారు కదలింది.

కారును 'పోర్టికో'లో ఆపుచేసి బట్టలను తీసుకొని నేరుగా మేడమెట్లుఎక్కి తనగదిలోకివెళ్ళి కుర్చీలో కూలబడ్డాడు.

ఐదునిమిషాల తర్వాత ఆ గదిలోకి అరుణ కాఫీకప్పులతోసహా ప్రవేశించింది, కాఫీకప్పు అతనిచేతికందిస్తూ అతని కెదురుగా మేజాపైనున్న పెద్దప్యాకెట్‌ను చూసింది.

"బట్టలు తెచ్చారు చూడక్కయ్యా!"

అరుణ ప్యాకెట్‌పైగల కాగితాలన్నిటినీవిప్పి క్రింద వేసి చూసింది

"ఎందుకిన్ని తెచ్చావ్ అన్నయ్యా?"

"ఇంట్లోవారందరకూ"

అరుణ ఏదో అనబోయి ఆగిపోయింది. ఏమయినా అభ్యంతరంచెప్తే అతనిమనసు తీవ్రంగా బాధపడుతుందని ఆమెకు తెలియని విషయంగాదు. అతని ఖాళీచేసినకప్పుతో సహా వాటిని తీసుకొని మౌనంగా క్రిందికి దిగిపోయింది.

మరురోజు ఉదయం ఏడుగంటలకు ప్రకాశం నిద్ర నుండిలేస్తూ మత్తుగా వళ్ళువిరుచుకొని మంచంనుండి క్రిందకు దిగబోయాడు. అతని పాదాలకు గరగరా అంటూ కొన్ని కాగితాలు వెంటనే తగిలాయి. ప్రకాశం అప్రయత్నంగా అరక్షణం వాటివేపుచూసి కళ్ళకు స్పష్టంగా కన్పిస్తున్న ఏదో వార్త ఆకర్షించి వేగంగా ఆ పేపర్‌ను చేతికి తీసుకొన్నాడు.

గజిబిజిగావున్న ఆ కాగితాన్ని సరిచేస్తూ తన్నాకర్షించిన ఆ వార్తవేపు అరక్షణం చూసి "ఆ..." అన్నాడు అస్పష్టంగా ఆ స్వరంలో ఆశ్చర్యంతోపాటు తొట్రుపాటు, ఆందోళన ప్రతిధ్వనించాయి.

ప్రకాశం కళ్లు నులుముకుని ఆ విషయాన్ని పూర్తిగా చదివాడు అందులో యిలా వుంది. అదొక కోర్టు నోటీసు.

"......... సబ్ కోర్టులో

ఎస్. సి. 457-58...

వాదులు, జీవం గోవిందయ్య, కొత్త హనుమయ్య, నార్ల రామయ్య... ప్రతివాది. వెంకటరామయ్య

...సబ్ రిజిస్ట్రారు యిలాకా రామాపురంగ్రామం తాలూకు పైపేర్కొన్న ప్రతివాది యావత్ స్థిర, చరాస్తులూ, వాదుల బాకీల క్రింద డిక్రీఅయి, కోర్టువారి

వలన తేది 8-1-53 న, ఉదయం పండ్రెండు గంటలకు రామాపురంలో అందరి సమక్షమున వేలంవేయబడును. కావ లసిన వారు సవాల్ వేయవచ్చును...

రావుల ఉపేంద్ర
వాదుల తరపు వకీలు.

ప్రకాశం తనప్రక్కనే పెద్దపిడుగుపడ్డట్టుగా చలించి పోయాడు. అతని కళ్ళముందు వికటాట్టహాసాలుగావిస్తూ ఏవో వికృతరూపాలు చరిస్తున్నట్టుగా అలజడి చెందాడు. అతనిముందు తండ్రిరూపం దైన్యనేత్రాలతో మెదలి ఒక్కసారిగా "నాన్నా" అని అనాలోచితంగా గట్టిగా కేక వేశాడు

హాల్లో అప్పుడే కాఫీసేవిస్తున్న శ్రీధర్‌లు అరుణలు ఆ కేకకు నిర్ఘాంతపోయారు. భయాందోళనలతో ఒక్క పరు గున ప్రకాశం గదిలోపడ్డాడు శ్రీధర్, "ఏమిటి ప్రకాశం" అంటూ గాభరాగా.

ప్రకాశం స్థాణువులా నిల్చుండిపోయాడు. అతని చేతిలో కాగితం గాలికి రెపరెపలాడుతోంది.

"ఏమిటిది ప్రకాశం" దగ్గరగావచ్చి ప్రశ్నించాడు శ్రీధర్.

ప్రకాశం మౌనంగా, జాలిగా దీనంగా అతనివేపు చూసి ఆ పేపరు అందించాడు. శ్రీధర్ ఒక్కగుక్కలో దాన్ని చదివాడు.

"అయ్యో ఎంతపనిజరిగింది. ఈనాడేగదూ 8 వ తేదీ ఇంతకూ ఈ పేపరెలా ఈ రోజు లభించింది"

ప్రకాశంకు తళుక్కున జ్ఞప్తికివచ్చింది. అది నిన్న తను తెచ్చిన బట్టలప్యాకెట్ పై చుట్టినది.

శ్రీధర్ ఆందోళనాస్వరంతో అతనివేపే చూస్తూ "ప్రకాశం! గాబరాపడకు, ఇప్పటికీ ఏమాత్రంమించిపోలేదు. వెంటనే బయలుదేరు. తప్పక నీవీసమయంలో మీ నాన్న గారిని రక్షించాలి" ప్రకాశం పిచ్చివానిలా శ్రీధర్ అరుణలవేపు చూస్తూండిపోయాడు. అతని కనుకొలకులలో నీటి బిందువులు నిలచి తారాడుతున్నాయి.

శ్రీధర్ గబగబా అట్నుంచి క్రిందకి దిగబోయి ఐదు నిముషాలలో తిరిగివచ్చి, "ప్రకాశం! ఏమాత్రం ఆలస్యమయినా అంతా ముగిసిపోతుంది. వెంటనే బయలుదేరాలి, ఇదిగోడబ్బు" అంటూ మేజాపై ఏభయివేల కరెన్సీకట్టలుంచాడు.

"అవునన్నయ్యా! మీరు వెంటనే బయలుదేరి ఈస్థితి నుండి మీనాన్నగారిని రక్షించాలి" అంది అరుణ.

ప్రకాశం వారివేపూ నోట్లకట్టలవేపూ క్షణకాలం ఉన్మాదిలాచూసి, "ఇంతడబ్బా! నా కోసం మీ రింత మొత్తాన్ని" అని యింకా ఏదో అనబోతూండగా.

"పిచ్చిప్రకాశం! అది నా డబ్బనుకుంటున్నావా! అందులో ఒక్కచిల్లీకానీ కూడా నాదికాదు, ఇదంతా నీవు కష్టించి సంపాదించిన మొత్తమే! ఇంకింతడబ్బు నీపేర బ్యాంక్‌లోవుంది. ఇకఏదీ ఆలోచించవద్దు. వెంటనే డ్రస్ చేసుకో. అరుణా, వెళ్ళికాఫీపట్రా. అబ్బ! అప్పుడే ఏడున్నర

కావస్తోంది. ఇకనాలుగు గంటలుమాత్రమే. ప్రకాశంఉఊ... క్విక్"

ప్రకాశం ఆశ్చర్యంతో వారివేపు కృతజ్ఞతా పూర్వకంగా చూసి, "నిజంగా మీరు దేవతలు శ్రీధర్" అని గబ గబా బాత్‌రూమ్‌వేపు నడిచాడు.

డ్రస్ చేసుకొని కాఫీముగించి, డబ్బుకోటు జేబులో వేసుకొని మేడమెట్లుదిగి క్రిందకువచ్చేసరికి ఠంగ్ ఠంగ్ అంటూ ఎనిమిదిగంటలుకొట్టింది గడియారం.

అందరిముఖాలలోనూ ఏవేవో భావాలు, స్పష్టంగా సంచరిస్తున్నాయి.

ప్రకాశం బయటకువచ్చి షెడ్‌లో నుండి కారు బయటకుతీసి అరుణా శ్రీధరులవేపు జాలిగా చూస్తూ, "వెళ్ళొస్తా శ్రీధర్! వెళ్ళొస్తా నళ్ళయ్యా!" అన్నాడు.

"విష్‌యు గుడ్‌లక్" అన్నాడు శ్రీధర్.

ప్రకాశం ఆక్సిలేటర్ బలంగా త్రొక్కాడు. శర వేగంతో కారుముందుకు దూసుకుపోయింది.

కారు విజయవాడ సరిహద్దులుదాటింది. ప్రకాశం టయిమ్ చూసుకున్నాడు. బలంకొద్దీఆక్సిలేటర్‌ని త్రొక్కుతూ డ్రైవ్ చెయ్యసాగాడు.

ముల్లు ఏభయ్, అరవై, డెబ్భయి సూచించింది. ప్రకాశంకు తృప్తిగా కనిపించ లేదు.

ముల్లు ఎనభయిదాటుతోంది. కారు విడిచినబాణంలా ముందుకు దూసుకుపోతోంది.

# 30

ఈ మూడు సంవత్సరాలలో వెంకటరామయ్యగారి సంసారపరిస్థితి ఎంత అధఃస్థితికి దిగజారిదంటే, చివరకీనాడు అతని యావత్ స్థిరచరాస్తులూ నడివీధిలో వేలం వేయబడేంత దౌర్భాగ్య దుర్భర క్లిష్టస్థితికి దిగజారింది.

వెంకటరామయ్యగారికి పక్షంరోజులక్రితం కోర్టు ద్వారా వేలంనోటీసు రావటంతో నిలువుగుడ్లేసి ఉన్నపళంగా తలబరిగి నేలవాలిపోయాడు.

ఇంటిల్లిపాదీ ఈ విపరీత పరిస్థితికి గుండెలరచేత బట్టుకొని ఈ జగత్తులోని గుండెవున్న ఏ వ్యక్తినైనా నిలువునా నీరుగావించేలా విలపించారు.

ఈ విధమయిన గృహచ్ఛిదంగావటానికి నిష్పక్షపాతంగా ఆలోచిస్తే వెంకట్రామయ్యగారిలో ఏ విధమైన అపరాధం లేదనిపిస్తుంది.

పుత్రుల ఉజ్వల భవిష్యత్ నాశించి, వారిని వంశదీపకులుగాచేసి తమ వంశానికే వెలుగులా ప్రకాశింపచేద్దామని ఇరువుర్నీ దాదాపు పదిహేనువేలు అప్పుచేసి చదివిస్తే ఒకడు తనమాటనే కాలదన్ని జన్మభూమినీ కన్నవారినీవదలి ఏ అగాధసీమలకో పయనించాడు ఇంకొకడు బి. ఎల్. ఫెయిలై దానితో పోరాడి విసిగి, విసిగి దాన్ని జయించలేక చివరకీనాడు ఏదయినా ఉద్యోగంకోసమై ఒక ఎం. ఎల్. ఎ.

చుట్టూ తిరుగుతూ పడిగాపులు కాస్తున్నాడు. ఇందులో వెంకట్రామయ్యగారి తప్పేదయినా వుందా?

తన బిడ్డల జీవితాలకాధారమౌతుందని అగ్గువగా సంక్రమించిన ఆ స్తిని చివరకు అప్పుచేసికొని వాటికై కోర్టు వ్యవహారాలలో దిగటానికి వెనుకాడని వెంకట్రామయ్యగారిలో ఏదయినా అపరాధముందా?

పెద్దకూతురు సుఖశాంతుల జీవితంకోసం నాలుగు వేలప్పుచేసి కట్నరూపంగా అల్లునికి ధారపోసి చివరకు అల్లుడినుండి కూతురుకు విడాకులిచ్చేంత పరిస్థితివచ్చి, శారద ఆత్మహత్యను కళ్ళారాచూసి కుమిలి కుమిలి కృంగిపోయిన రామయ్యగారిలో ఏదయినా అక్రమకార్యం కనిపిస్తోందా?

ప్రకాశంను డాక్టరీ చదవించాలనే ప్రధానోద్దేశంతో మేనరికానికి వాగ్దానంచేసి, ఆ విధంగా అప్పుచేసిన డబ్బు కోసం కుమారుణ్ని పెళ్ళిచేసుకోమని కన్నీళ్ళతో ప్రాధేయ పూర్వకంగా ప్రార్థించి, కొడుకుకూడా తిరస్కృతుడై భరించలేని కోపవిషాదాలతో కుమారుడినే యింటినుండి వెడలగొట్టిన రామయ్యగారి ఆత్మలో ఏదయినా కల్మషం వుందంటారా?

పుత్రులభివృద్ధిచెంది, అప్పుచేసినా గంటల్లో తీర్చ గలరు గదా అనుకొని ఎంత అప్పులు చేయటానికైనా వెను కాడని అతనికి చివరకు కన్నీటిబొట్లు శూన్యద్వారాలు ఎదురుగావటంతో అతడు చేసుకున్న స్వయంకృతాపరాధం ఏదైనా వుందనగలరా?

నిస్వార్థంతో సర్వమూ త్యాగంచేయ సిద్ధించిన ఆ పవిత్రమూర్తి నిర్మల హృదయంలో ఏ విధమైన కుటిలత్వం గాని సంకుచితత్వంగాని వుందని మానవత్వమున్న ఎవరైనా అనగలరా?

స్వార్థాన్ని త్యజించటంలో పుత్రులభవిష్యత్ నాశిం చటంలో ఈ జగత్తులోని ఏ తలిదండ్రులదైనా, ఏదైయినా అపరాధముందని నోరెత్తి అనగలరా?

ఇన్ని వ్యథలున్నా ఒకర్ని నిందించక తనఖర్మను తనే వగస్తూ ఇంకా బిడ్డల భవిష్యత్ కై ప్రాకులాడే ఆయన పితృ హృదయాన్ని, మృదువ్యక్తిత్వాన్ని ఈ ప్రకృతిలోని ఏశక్తి యైనా దూషించగలుగుతుందా?

చివరికీనాడు - తన యావదాస్తితోపాటు పరువు, ప్రతిష్ట, గౌరవం, మానమర్యాదలుకూడా నడివీధిలో వేలం వేయబడుతూన్నా ఇతరులనేమాత్రం దూషించక, తన దుర దృష్టం తన ఖర్మ అనుకొని కృంగి, కృశించి నశి[illegible]సించి పోయిన అతని తప్త పీడిత ఆత్మకీనాడు కనీసం సానుభూతి వాక్యాలైనా లభించలేదంటే, గుండెన్నున్న ఏ మానవుడు కన్నీరు గార్చడు? ఇందులో ఏదైనా అపరాధాన్ని ఎవరిలో వేలెత్తిచూపించగలరా? అతడు శిక్షార్హుడని ఏన్యాయశాస్త్ర మైనా నిర్ణయించగలదా?

మరి ఎవరిదీ అపరాధం? ఎవరిదీదోషం? ఎవరు దీనికి కర్తలు? ఎవరు కల్పించారీ పరిస్థితులు? జవాబెవరైనా చెప్ప గలరా? లేదు, ఎవరూ జవాబు చెప్పలేని విషాద జీవితం ఈనాటి వెంకట్రామయ్యగారిది.

మూడేళ్ళలో సంభవించిన యీ పరిణామాలను ఎవరూ ఈనాడు లెక్కించరు, తలంచరు.

ప్రకాశంను గురించిన ఆశలావిధంగా అంతంగావటంచే అతని బావమరదికూడా యీనాడు నిర్దాక్షిణ్యంగా, కర్కశంగా బంధుత్వాన్నే విస్మరించి. కోర్టులో అందరితోపాటు తనూ దావా చేసినఫలితంగా అతనూ వాదులలో ఒకడయ్యాడు. ఎంతైనా లోకం లోకమే! తనపని తను నిర్వర్తించుకోవటంతో అది తృప్తిపొందుతుంది. మంచీ చెడు ఆలోచించదది.

శారద తన మోడుబారిన జీవితాన్ని భరించలేక గ్రామంలో తలెత్తుతున్న అపవాదులను భరించలేక భర్త విడాకులివ్వనున్నాడని తెలియగానే సర్వమూ త్యజించి ఆత్మహత్యపేరుతో ఈ లోకానికి దూరమైపోయింది.

కోర్టు వ్యవహారాలలో న్యాయం, ధర్మం తనప్రక్కనున్నా అన్యాయమే జయించింది! బాకీదార్లు అసలు పరిస్థితులు గమనించి వెంటనే తమ అప్పులక్రింద అతని ఆస్తిని జప్తుచేయటానికి ఆర్డరు తెచ్చుకొన్నారు.

ఆరాత్రి ఆ క్షీణించిన గృహంలో ఎవరూ నిద్రించలేదు వెంకట్రామయ్యగారు పిచ్చివానిలా అందరివేపు చూస్తూండిపోయాడు.

లలిత "నాన్నా" అంటూ అతని ఒడిలో వాలింది.

"అయ్యో లలితా! నీకెంత అన్యాయం చేశానే! చివరకు నీకు పెళ్ళికూడా చేయలేని ఈ దౌర్భాగ్యుణ్ని క్షమించమ్మా! అయ్యో! భగవాన్! ఏమిటయ్యా ఈదుస్థితి?

రేపు నేను భార్యాపిల్లలతో యింట్లోంచి గెంటబడి నడి వీధిలో...అబ్బా..." అని బాధగా ఎదను చేతుల్లో వుంచు కొని రక్తం కక్కుతున్నాడు.

లలిత "నాన్నా!" అని యిల్లంతా అదిరేలా బాధగా కెవ్వున కేకపెట్టింది.

ఆ విచ్ఛిన్న గృహంలో కాలుడు తన భయంకర పాదాలతో నృత్యం చేస్తున్నాడు.

* * *

సాంబయ్య గృహస్థితికూడా చాలా అధ్వాన్నంగా తయారయింది. ప్రస్తుతం రామయ్యగారికి యితనికీ ఒకే తేడా! అతని ఆస్తి వేలంకు సిద్ధమైంది. ఇతని ఆస్తి సిద్ధమౌతూంది! ఇదే భేదం.

సాంబయ్యగారు ఊహించినట్టు జరుగుంటే ఈస్థితికి ఏమాత్రమూ దిగేవాడుగాదు. తన అగ్రిమెంట్ తప్పక జయిస్తుందనీ, కోర్టు ఖర్చులతోసహా పదివేల రూపాయల ఆస్తి సులభంగా చేతికి దక్కుతుందిగదా అని రంకె లేసు కొన్నాడు, ఇంతకుముందు సాంబయ్య.

కానివిధి విడ్డూరించింది. పరిస్థితులు ఒక్కసారిగా తారుమారయ్యాయి. అటు యింకో కొత్తవర్గం వారు దొంగపత్రాలు సృష్టించి, అప్పులు రాబట్టుకోటానికై, వెంకయ్య ఆస్తిని అనుభవిస్తున్న వారందరిపై ఐ. పి. కి దాఖలు చేయటంచే, వారి సాక్ష్యాలూ, పత్రాలూ,

స్టాంపులూ, అన్నీ నిజమని ఋజువుగావటంచే, వెంక ట్రామయ్యా, వెంకటరెడ్డి, మరికొందరి విక్రయాలతో సహా తన అగ్రిమెంట్ కూడా రద్దుచేయబడింది. ఈ విషయం తెలిసి సాంబయ్య భోరున ఏడ్చాడుకూడా! అంతవరకూ కోర్టు ఖర్చులకై ఐదారువేలు అప్పుచేశాడు. అందుకు తాకట్టుగా తనిపుడుంటూన్న యిల్లు రెండెకరాల మాగాణి, కుదువ పెట్టటంచే అతనిపరిస్థితి ఎటూగాకుండా ఐపోయింది.

జరిగినదంతా జరిగిపోయాక యిప్పుడు సాంబయ్య పశ్చాత్తాపంతో కృంగిపోతున్నాడు! అన్నీ ముగిసిపోవటంతో ఈనాడతనికి ధైర్యంచెప్పే ఆశ్రితులుకూడా లేరు! ఆవిషయం మరీ నలిచివేశింది సాంబయ్యను. గతమంతా తలచుకొని, తాను రామయ్యకు చేశిన అన్యాయానికి, ప్రకాశంపై చేశిన దౌర్జన్యానికి, సావిత్రికి చేశిన ద్రోహానికీ కుమిలి కుమిలి పరితపిస్తున్నాడు ఈనాడతను! తనైతాను ఈ వ్యవహారాలను లేవదీసి, పండంటి రామయ్య సంసారాన్నీ, తన కుటుం బాన్నీ చేజేతులా నాశనం చేశానే అనుకొని పసిపిల్లవానిలా ఏడ్చాడు! రామయ్యగారి దగ్గరకువెళ్ళి కాళ్ళపైపడి క్షమా పణ చెప్పాలందా మన్నంతబాధ, ఆవేదన అతనిలో మెదిలింది. కాని ఏముఖం పెట్టుకొని రామయ్యగారిని తను పలుకరించగలడు?

ప్రకాశంను తలచుకొనేకొద్దీ అతని ఆ వేదన మరీపొంగి పొరలేది! తనగుండానేగా అతను స్వగ్రామమూ, తల్లీ తండ్రీ, సర్వమూ వదలివెళ్ళాడే, తనెంత పాపాత్ముడు అనుకొనేవాడు

బాధగా। చేతులు కాలినతర్వాత ఆకులుపట్టుకొని లాభమేమి అనుకొని నిస్పృహతో బాధగా చప్పరించేవాడు.

"పాపం! ఈరోజే రామయ్యగారి స్థిరచరాస్తులూ, నడివీధిలో వేలం వేయబడుతున్నాయి. తనమూలానే ఈ దురవస్థంతా! ఇందుకు ప్రతిఫలం తనూ త్వరలో అనుభవించక పోడు. అప్పుడే తన బాకీదార్లందరూ కోర్టుద్వారా నోటీసు లందచేస్తున్నారు. ఇక ఏమనుకొని ఏం లాభం...? కొద్ది రోజులలో తనూ, భార్యాపిల్లలతోసహా వేలం వేయబడు తాడు... అబ్బ!.

* * * *

మధ్యాహ్నం పన్రెండు గంటలయింది! సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తున్నాడు!

గ్రామంలోని పెద్దలందరూ పంచాయత్ ఆఫీసుదగ్గర గుమిగూడారు రామయ్యగారి ఆస్తిని వేలం కొనాలన్న ఆసక్తిగల వారికన్నా ఈ వింతను పరీక్షిద్దామన్న వాంఛ గలవారే అందులో అధికంగావున్నారు. వెంకటరెడ్డి అందుకు సిద్ధంగా మీసం మెలివేస్తూ ముందుగానే హాజ రయ్యాడు. వారికితోడు వాదులుకూడా ఆ ప్రదేశంలో తయారయ్యారు.

పన్రెండుగంటలు కాగానే కోర్టు సిబ్బందితోసహా అమీనాగారు ఆఫీసు అరుగుపైనున్న మేజాప్రక్కగా నిల్చొని, కంఠం సవరించుకొని రామయ్యగారి ఆస్తి వివరా

లన్నీ ఆమూలాగ్రంగా ఇరవై నిముషాలు ఏకధాటిన చదివాడు.

అందరూ ఆసక్తిగా అతనివేపే చూస్తూన్నారు. అమీనాగారి కంఠంతో ఆ వీధిఅంతా మారుమ్రోగి పోతుంది. తన ఇంట్లోవుండి.

ఆకంఠం వింటున్న రామయ్యగారి గుండెల్లో బాకులు దూసినట్టవుతోంది. అతనితప్త నిస్త్రాణ హృదయంలో విషప్రవాహం పొంగులుపారుతూ కాలుస్తూన్నట్టు అమితమైన వేధమండించి వేస్తోంది. బాధగా మంచంపై వాలి కళ్ళు మూసుకొన్నాడు, "అబ్బా!" అంటూ;

"నాన్నా" అంటూ బావురుమంది లలిత భరించలేని ఆవేదనతో! తల్లి ఏదో గొణుగుతూ సముదాయించ ప్రయత్నించింది గాని, తన కళ్ళగుండా కూడా నీళ్ళు దుముకుతున్నాయన్న విషయం ఆమె గమనించలేక పోయింది

ఈ విషాదభరిత వైరాగ్య వాతావరణంలో రఘు ప్రవేశించగానే "బావా" అంటూ అతనివేపు బాధగా జాలిగా దీనంగా చూశింది లలిత.

...అమీనాగారు అన్నివివరాలూ పూర్తీచదివిన పదిక్షణాల తర్వాత, వేలంపాట ప్రారంభించాడు అందరివేపూ దర్పంగా చూస్తూ.

మొదటిసారిగా, ఆ గ్రామమునసబు కంఠం తడుముకుంటూ "పంద్రెండువేలు" అన్నాడు.

"ఇంతేనా" అన్నట్టుగా చూశాడు అమీనా.

"పదిహేనువేలు". అన్నాడు గంభీరంగా వెంకట రెడ్డి.

"మీ పేరు" అడిగాడు అమీనా!

ఎవరో వెంటనే అతనిపేరు ఉచ్చరించారు

"వెంకటరెడ్డిగారు పదిహేనువేలు" ఆమాట పూర్తి గాక ముందే.

"ఇరవై వేలు" అని ఎవరో కాస్త గట్టిగానే అరచారు.

"మీ పేరు" అన్నాడు అమీనా అటుతిరిగి.

"రాజయ్య"

"రాజయ్యగారు. ఇరవై వేలు." అమీనా గట్టిగా అరస్తున్నాడు.



12.30. దాటుతోంది.

"అబ్బ! ఇంకా ఏభై మైళ్ళుంది!". ప్రకాశం శరీరమంతా స్వేదజలంలో తడసిపోయింది. అతని కళ్ళముందు మరోకసారి ఆకోర్టు నోటీసు, దానిప్రక్కనే తనతండ్రి విషాదనేత్రాలూ మెదిలాయి. అతని, ఒళ్లు భయంతో జలదరించింది. వాదుల జాబితాలో తన మేనమామగారి పేరుకూడా ఉండటం, ఆశ్చర్యాన్నీ, కాస్త సంచలనాన్నీ కల్గించింది. ఏవేవో ఆలోచనలు అతని మస్తిష్కంలో సుళ్లు తిరిగాయి.

ఉన్న శక్తినంతా కేంద్రీకరించి, ఆక్సిలేటర్ త్రొక్కుతూ వేగంగా డ్రైవ్ చేస్తున్నాడు.

ఒక్కసారిగా ముల్లు 100 సూచించింది.

"ఇప్పటికే కాలం మించిపోయింది. భగవాన్ ఇక నీవే రక్షించాలి."



వెంకట్రామయ్యగారి ఇంట్లో పిశాచి నృత్యం చేస్తోంది. చలన రహితంగా మంచంపై పడున్న రామయ్యను చూస్తూ అతని భార్యా పిల్లలు విషాదగీతికల నాలపిస్తున్నారు.

అమీనా కంఠం రామయ్యగారి చెవుల్లో వికటాట్ట హాసం చేస్తూ గింగిరుమంది. భయపడ్డట్టుగా ఒక్కసారి కళ్ళు తెరచాడు.

"మామయ్యా" బాధగా అన్నాడు రఘు!

"నాన్నా"

"వెంకటరెడ్డిగారు ఇరవై రెండువేలు" అన్న అమీనా స్వరం వెంకట్రామయ్యగారి కర్ణాలకు కఠోరంగా సోకింది. పిచ్చివానిలా అందరివేపూ చూస్తూ 'అబ్బా' అని గుండెలు పట్టుకొని కళ్ళు మూసుకొన్నాడు స్మృతిదప్పుతూ.



"బాలవీరయ్యగారు ఇరవై మూడు వేలు"

"24 వేలు" భీకరంగా గర్జించాడు వెంకటరెడ్డి పోటీ పడుతూ.

"25 వేలు" అంతకంటే గంభీరంగా గర్జించాడు శాలవీరయ్య.

"26 వేలు" తన్నుతాను మరచి ఆవేశంలో అర చాడు వెంకటరెడ్డి.

"వెంకటరెడ్డిగారు... ఇరవై ఆరువేలు". అమీనా గారి స్వరం అలసటతో తగ్గుస్థాయి నందుకొంది.



ఒంటిగంటకు పదినిమషాలు తక్కువగా ఉంది.

"అబ్బ! ఇంకా ఇరవై మైళ్ళుందే!"

ప్రకాశం తన కాళ్లలో శక్తి నశిస్తున్నా, యాంత్రికంగా ఆక్సిలేటర్లపై కాళ్ళు బలంగా ఆన్చి కారును శర వేగంతో కన్నూ మిన్నూ గానక, నడుపుతున్నాడు. అంత వేగంగా వెళ్తున్న ఆ కారును చూస్తూ, రోడ్డుపై ప్రయాణం చేస్తూన్నవారు భయంతో పక్కకు తప్పుకొని, ఆశ్చర్యంతో ముక్కుపై వేలేసుకున్నారు.

ఏది ఆలోచించటానికీ ప్రకాశం మెదడు పనిచెయ్య లేదు. ఒకేదృష్టి... ఒకే లక్ష్యం.



"వెంకటరెడ్డిగారు... 28 వేలు". అమీనా గారు పొడిగాదగ్గి, గట్టిగా అరవాలని ప్రయత్నిస్తున్నారు.

"29 వేలు" వీరయ్యగారు సగం బిక్కచచ్చి అన్నాడు.

"30 వేలు" ఇక ఆగలేక వెంకటరెడ్డిగారు చివరి సారిగా, తన, అదృష్టాన్ని పరీక్షించుకోదలచి, అలసటతో అన్నాడు.

"వెంకటరెడ్డిగారు ... 30 వేలు"

"వీరయ్యగారి నోరిక పెగులలేదు"

"ఒక్కసారి... వెంకటరెడ్డిగారు 30 వేలు"

" "

"ఒక్కసారి... వెంకటరెడ్డిగారు... 30 వేలు"

"రెండవసారి... 30 వేలు, వెంకటరెడ్డిగారి సవాల్."

బాల వీరయ్యగారివేపు కొందరాసక్తిగా చూశారు. కాని లాభం లేకపోయింది.

"మూడవ..." అమీనాగారి నోటిగుండా ఆమాట పూర్తిగాక మునుపే.

"35 వేలు" అన్న గంభీరస్వరం ఆ ప్రదేశాన్నంతా ఒక్కసారి స్తంభింపచేసింది.

అందరూ ఆశ్చర్యంతో ఆస్వరం వచ్చినవేపు దీర్ఘంగా చూశారు. అప్పుడే అక్కడ ఆగిన ఒకకారులోంచి ఆ కంఠం వినిపించిందని తెలుసుకోటానికి వారికి ఎక్కువకాలం పట్టలేదు. క్షణకాలం అమీనాతోపాటు అందరూ నిశ్చేష్టులై

పోయారు. వెంకటరెడ్డి త్రుటిలో జారిపోయిన తన అవ కాశానికి నిర్విణ్ణుడై కారువేపు నిస్సబ్ధుడై చూస్తూండి పోయాడు. అమీనాగారు నిశ్చేష్టతనుండి కోలుకొని, "మీపేరు సార్" అని ఎంతో వినయంగా అడిగాడు.

అరక్షణం తర్వాత అదే గంభీరకంఠం, "సుధామ్" అని పలికింది.

ఈపేరు విని అందరూ జిజ్ఞాసతో ప్రకాశంవేపు నిక్కి-నిక్కి చూస్తూండిపోయారు. కారులోనే వున్నందున వారికి ఆవ్యక్తి ఎవరో స్పష్టంగా అంతుచిక్క లేదు.

"సుధామ్‌గారు ... 35 వేలు."

"... ... ..."

"ఒక్కసారి"

"... ... ..."

"రెండవసారి"

అందరూ వెంకటరెడ్డివేపు ఉత్సుకతగా చూశారు. వెంకటరెడ్డి అవమానంపొందిన వాడిలా ఫీలై తల క్రిందకు దించుకున్నాడు!

"మూడవసారి."

సభంతా నిశ్శబ్దంతో మూల్గింది!

"ఇంతటితో యిక వేలం ఆపుచేయబడింది! వెంక ట్రామయ్యగారి యావత్ స్థిర చరాస్తులూ, సుధామ్ గారికి యిందుమూలకంగా సంక్రమించాయని తెలియచేయ బడు తూంది." అన్నాడు అమీనా.

సభలో గుసగుసలు ప్రారంభమయ్యాయి. కార్లో కూంచొని నిశ్చలంగా గంభీరంగా పైపు కాలుస్తూన్న ప్రకాశం వేపు నిర్విణ్ణులై చూస్తూండిపోయారు!

అమీనాగారు వేదికనుండి క్రిందకుదిగి కారుదాకా నడచి! "మీ వివరాలు తెలియచేయండి సాబ్! మీ పేర బాండ్ తయారుచేస్తాం" అన్నాడెంతో వినయవిధేయతలతో.

"నాపేర అవసరంలేదు. ఇప్పుడు నాకు సంక్రమించిన యావదాస్తీ వెంకట్రామయ్యగారి పేరనే వ్రాయండి" అంటూ కారులోంచి క్రిందకు దిగాడు.

అమీనాగారితో పాటు అందరూ నిర్ఘాంతపోయి నోళ్ళు తెరచారు.

క్రిందకుదిగి అమీనావేపే చూస్తూ గంభీరంగా పైపు కాలుస్తూ నిలబడ్డ ప్రకాశాన్ని అందరూ పరీక్షగా చూడసాగారు. వెంటనే గుసగుసలు ప్రారంభమయ్యాయి.

"అదేమిటిసార్!" అమీనాగారు చిన్నగా గొణిగాడు.

"ఆదంతేనయ్యా! వెంటనే వ్రాయండి" అన్నాడు ప్రకాశం నిశ్చలంగా.

వెంకటరెడ్డి ప్రకాశాన్ని జూస్తూ దగ్గరగావచ్చి ముఖం వేపు అరక్షణం పరీక్షగా చూశి తనకళ్ళను తాను నమ్మలేక, "మీరు... మీరు..." అని సణిగాడు ఆశ్చర్యంతో.

"నేను ప్రకాశంను. రామయ్యగారి కుమారుణ్ణి. మీకేం ఆశ్చర్యం చెందవలసిన అవసరంలేదు. "అమీనాగారూ వెంటనే బాండ్ సిద్ధంచేయండి" అన్నాడు.

ఈమాటవిని వెంకటరెడ్డితోపాటు అమీనాతోసహా అందరూ "ఆ" అంటూ నిర్ఘాంతపోయారు.

గుర్తుపట్టలేని విధంగా మారిన ప్రకాశాన్ని వెంటనే పరామర్శ చేయటానికి ఎవరికీ ధైర్యం లేకపోయింది.

"మొత్తానికి కుమారుడన్న పేరు నిలబెట్టుకొన్నాడు." అని ఎవరో పక్కవానితో చిన్నగా అన్నారు.

ప్రకాశం యిక అక్కడే నిలువలేకపోయాడు. పైపు ఆర్పి కోటు జేబులో వేసుకొని చకచకా నడక సాగిస్తూ తన యింటివేపు వెళ్తూన్న అతనివేపు చూస్తూ వెంకటరెడ్డి నిస్సబ్ధుడై ప్రమాన్పడి పోయాడు.

*     *     *     *     *

రఘూ, లలితా, చంద్రం, రామయ్యగారి భార్యా, మంచంచుట్టూ నిల్చొని విషణ్ణవదనులై కన్నీరు గ్రక్కుతూ, అతనివేపే చూస్తూండిపోయారు! రామయ్యగారు జీవచ్ఛవంలా పడున్నాడు. చూడగానే మృతుడేమో అనిపించే స్థితిలో పడిపోయాడు!

'నాన్నా. మమ్మల్నిలా ఒంటరిచేసి వెళ్లొద్దు నానా!"

"అయ్యో! ఇదేమిటండో... మమ్మల్ని..." ఆమె కంఠంలో కొన్నిలక్షల ఆవేదనా స్వరాలు ధ్వనించాయి.

రఘు హృదయం విషాదంతో చెరువై పోయింది. వీరి స్థితి చూస్తూంటే గుండెల్లో ఎవరో చేతులుబెట్టి గెలుకు తూన్నట్టుంది

ఇంతలో పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వస్తున్న ప్రకాశం బూట్లచప్పుడు తలుపుదగ్గర వినిపించింది. కాని ఎవరూ ఆ విషయాన్ని గమనించలేకపోయారు.

ప్రకాశం తలుపుదగ్గర ప్రవేశించి ఆవేపు చూశాడు. ఎవరూ ఇతన్ని గమనించలేదు. మంచంచుట్టూ విషాద ముఖాలతో నిల్చొన్నవారిని చూడగానే ప్రకాశంకు పట్టలేని దుఃఖం నిండి, "అమ్మా" అన్నాడు... ఎంతో బాధ ఆవేదన హృదయంలో గూడుగట్టుకుంటేగాని అలా పిలువలేరు.

ఏదో అగాధలోకంనుండి వెలుపడినట్టున్న ఆ పరిచిత స్వరం వినగానే ఆమె ఒక్కసారిగా తలత్రిప్పి చూసి, నాయనా! బాబూ ప్రకాశం! నువ్వా" అంది. ఆ కంఠంలో ఆనందం, బాధ ఆశ్చర్యం సమ్మిళితం చెందాయి. ఆ మాట లంటున్నపుడు ఆమె పెదవులు వణికాయి. కళ్ళువర్షించాయి.

"అవునమ్మా! నేనే మిమ్మల్నిందర్నీ ఇలా వదలి వెళ్ళిన పాపాత్ముణ్ణి నేనేనమ్మా" అంటూ కన్నీరుగార్చాడు దగ్గరగావస్తూ.

"అన్నయ్యా!" ఏదీ తెలియని సంతోషంతో లలిత కంఠం పూడ్చుకుపోయింది.

"ప్రకాశం!" రఘు కంఠంలో ఆనందమేగాదు బాధ కూడా పొంగిపొరలింది.

ప్రకాశం మంచందాపుగావచ్చి "నాన్నా! అయ్యో! ఇదేటమ్మా! నాన్నగారిలా..." ఆ తర్వాత అతనికంఠం పెగలలేదు.

"నాన్నా" అంటూ మంచంపై కాళ్ళపై బడ్డాడు.

"ఏమండీ! బాబొచ్చాడు. లేవండి. మన ప్రకాశం వచ్చాడు. ఒక్కసారి చూడండి"

రామయ్యగారు ఏ స్థితిలో ఉన్నారోగాని వెంటనే కళ్ళువిప్పి, తన కెదురుగా తనప్రక్కనే కూచొనున్న ప్రకాశం ముఖాన్ని తేరిపార చూసి, 'బాబూ ప్రకాశం! వచ్చావా తండ్రీ' అంటూ బరువుగా పకిలేవబోయి "అబ్బా" అన్నాడు బాధగా.

ప్రకాశం కన్నీరు తుడుచుకుంటూ, "మీరిం విశ్రాంతి తీసుకోండి నాన్నా" అన్నాడు.

"అయ్యో! ఇంకెక్కడి విశ్రాంతిరా బాబూ! ఒకే దీర్ఘవిశ్రాంతి ఎలాంటి సమయంలో నువొచ్చావ్ నాయనా! అయ్యో ఇక మీకు దిక్కెవరు?"

"ఇక ఇలా విచారించాల్సిన భయంలేదులే రామయ్యా! మీ కష్టాలన్నీ గట్టెక్కాయి. మీ కుమారుడు రావటం, వేలంలో ఆస్తికొనటమూ ఒక్కసారిగా జరిగి పోయాయి" అంటూ ఒక బంధువు అప్పుడే ప్రవేశించాడు.

"జరిగిపోయిందన్నమాట! అంతా ముగిసిపోయిం దన్నమాట! అయ్యో! నీ కెలాంటి స్వాగతం చెబుతున్నానో చూడు బాబూ! ఇంతకూ వేలంలో ఆస్తి కొన్నవాడెవడు"

"ఇదేమిటిరామయ్యా! ఇలా మాటాడతావ్! మీ కుమారుడే ఆ స్త్రీని కొన్నాడని చెబుతున్నానే. ఇంతకూ అదృష్టవంతుడవు"

"ఆ నిజమేనా! ఏమిటి ప్రకాశం! నాకేదీ అర్థం గాలేదు"

"అవునునాన్నా! ఆమాత్రం అదృష్టమైనా నాకు లభించింది"

"బాబూ!" అంటూ ఆనందంతో వణికిపోతున్న తన ంరస హస్తాలతో కుమారుణ్ని గట్టిగా కౌగలించుకొన్నాడు రామయ్య.

*　　　*　　　*

రామయ్యగారి కుమారుడు అకస్మాత్తుగా ఊడిపడి వేలంఅవుతున్న ఆ స్త్రీని రక్షించాడన్నవార్తఅంచెలమీదుగా ఒక్కనిముషంలో ఆగ్రామమంతా ప్రాకిపోయింది. అందరూ 'శహభాష్' అని మెచ్చుకున్నారు.

సాంబయ్యగారికీవార్త తెలియగానే క్షణకాలం ఆశ్చర్యంలోమునిగిపోయి ఆనందంతో, "భగవంతుడెన్నటికీ మంచివారిని అన్యాయం చెయ్యడు. ఇకఫరవాలేదు. రామయ్య అన్నివిధాలా గట్టెక్కాడు. అనుకొని ఏదో ఒక స్థిరనిశ్చయానికొచ్చి, పైపంచె భుజంపై వేసుకొని రామయ్యగారింటివేపు నడక సాగించాడు.

*

ప్రకాశాన్ని చూస్తూంటే రామయ్యగారికి జ్ఞప్తి కొస్తోంది. కన్నీళ్లుగారుస్తూ, "బాబూ! ఆవేశంలో ఆనాడు నిన్ను వెళ్ళగొట్టినందుకు నన్ను క్షమించరా! ఆనాటినుండీ నిన్ను తలచుకోని క్షణమంటూలేదు, నీకు ద్రోహంచేసి నందుకు పశ్చాత్తాపంతో నా హృదయం కృంగిపోతోంది. నీవే ఈనాడు రాకుంటే..." అన్నాడు బాధగా.

"అదంతా మళ్ళీ ఇప్పుడు జ్ఞప్తిదెచ్చుకొని బాధపడ తారేలనాన్నా! ఇక ఆ ప్రసక్తితేవద్దండి..." అన్నాడు బరువుగా.

రామయ్యగారు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బులై పోతున్నాడు. అతని పితృహృదయం వాత్సల్యంతో, కృతజ్ఞతతో ఆనందబాష్పాలు రాల్చింది.

"ఇక నాకేం భయంలేదు. భయంలేదు. నీ వసలు నాకు దక్కవేమో అనుకున్నానురా. నీ మూలంగానే ఈ నాడు మేము జీవించగలిగాము"

"అంత మాటనకండి నాన్నా! భగవాన్ మనల్ని రక్షించాడు. ఇందులో నా గొప్పదనం ఏమీలేదు"

అంతవరకూ ప్రకాశం రఘును గమనించలేదు. రఘు ప్రకాశాన్ని నఖశిఖపర్యంతం పరీక్షగాచూస్తూ, "ఎంతమారి పోయావ్ ప్రకాశం!" అన్నాడు.

ప్రకాశం అతనివేపు తిరిగి, "నువ్వెట్టారఘూ! నేనట్టా మారింది. మరి నీవేమిటి ఇలాతయారయ్యావ్!" అన్నాడు గాఢంగా ఆలింగనం చేసుకుంటూ, వారిద్దరికళ్ళూ చెమర్చాయి.

ప్రకాశం శారదకోసం అటూయిటూ చూశాడు.

"శారదేదీ అమ్మా"

"... ..." ఎవరూ జవాబివ్వలేదు. ఇవ్వలేక పోయారు.

"శారద కన్పించలేదే అమ్మా"

"ఇంకెక్కడి శారద నాయనా! వెళ్ళిపోయింది బాబూ శారద"

"నాకు తెలుసమ్మా! వెంకటేశం పొరపాటున ఏదో చేసినా మళ్ళీ శారదను పరిగ్రహించగలడని, క్షేమంగా ఉందిగదూ! నాకు మరి అల్లుళ్ళనేమైనా..."

"అయ్యో! అదిగాదురా బాబూ! శారద... శారద..." పూర్తి చేయలేక బావురుమన్నాడు రామయ్య.

"నాన్నా!"

"అవును నాయనా! శారద ఆత్మహత్య చేసుకుంది"

"ఆత్మహత్యా! అయ్యోశారదా! ఎంతపనిచేశావమ్మా! అసలేం జరిగింది నాన్నా! ఆ వెంకటేశంగాడు..."

రామయ్య బాధతో అన్నివిషయాలూ చెప్పి కన్నీరు గార్చాడు. ప్రకాశం కన్నీరుతుడ్చుకుంటూ, "మరి అన్నయ్యేడినాన్నా" అనిఅడిగాడు.

"రెండుమూసాలైంది వెళ్ళి! వాడసలు ఈ ఇంటి పరిస్థితులే తెలీవు. ఏదోఉద్యోగమంటూ ఒక ఎం. ఎల్. ఎ. చుట్టూ పడిగాపులు గాస్తున్నాడు. వాని అదృష్టమలాఉంది. ఇక నీ వొచ్చావ్! మాకేమీ దిగులులేదు. ఇక లలితపెళ్ళి ముగిస్తేనా కన్నివిధాలశాంతి లభించినట్టే"

"లలితకింకా పెళ్ళిగాలేదూ!" అని చటుక్కున రఘు వేపు తిరిగి "రఘు!" అన్నాడు గంభీరంగా.

"ఏం ప్రకాశం"

"లలితను నీ విన్నాళ్ళుగా ఎందుకు పెళ్ళి చేసుకోలేదు?" తీక్షణంగా, సూటిగా ప్రశ్నించాడు.

రఘు తలవంచుకొని మౌనంగా వుండిపోయాడు.

"లలితంటే నీ కిష్టమేగదూ"

రఘుమౌనంగానే తలాడించాడు.

"లలితను నాలుగయిదు సంవత్సరాలక్రితమే ప్రేమించావ్ గదూ! మరెందుకు పెళ్ళి చేసుకోలేదు?"

"ప్రకాశం..." రఘు బాధగా ఏదో అనబోయాడు.

"ఛీ! ఛీ! నిజంగా మీరు మనుష్యులుగాదురా! మా నాన్నగారిలా క్షీణించిపోగానే, మీరూమాకు శత్రువులై పోయారు. ఆస్తి హరిస్తోందని తెలియగానే ప్రేమంతా ఎగిరిపోయిందా? సిగ్గులేదూ! నీవూ ఒక మనిషివేనా"

"ప్రకాశం! వాణ్ణలా అనకురా! ఇందులో వాని తప్పేంలేదు. ఆనాడే నాతో లలితను చేసుకుంటానని మాటిచ్చాడు. అందుకు పిన్నిమామ కూడా అంగీకరించాడు. కాని అంతలో రఘుకు అకస్మాత్తుగా పిచ్చిబట్టింది."

"పిచ్చా! ఎందుకూ?" ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

"రఘు చిన్నమామగారు లేడూ! ఆయనభార్య, తన కుమార్తెను రఘువివాహం చేసుకోనందుకు మండిపడి, ఏదో మందుపెట్టింది. అదికాస్తా పిచ్చిగా పరిణమించి, బాగాముదిరి

విశాఖపట్టణం పిచ్చాసుపత్రిలో రెండుసంవత్సరాలు కాపురం చేసి నెలక్రితమే తిరిగివచ్చాడు" అన్నాడు వెంకట్రామయ్య.

"ఎంతపనిజరిగింది" అని గొణుక్కొని. "క్షమించు రఘు! కోపంతో ఏదేదో అన్నాను. మరేమనుకోకు!" అన్నాడు బాధగా ప్రకాశం.

"ఎంతకోపగించుకున్నా నీ విక నాబావవేగదోయ్!" అన్నాడు రఘు చిన్నగనవ్వుతో. ఆమాటకు అందరూహృదయ పూర్వకంగా నవ్వారు.

"మరి ముహూర్తం ఎప్పుడు?" నవ్వుతూ అడిగాడు ప్రకాశం.

"ఎప్పుడు నిర్ణయించినాసరే" అంటూ రఘు లలిత వేపు ఓరగా చూశాడు. ఆమె స్నిగ్ధకపోలాలుసిగ్గుతో కెంపుల్లా మెరిశాయి. మెల్లగా తలదించుకొంది.

ఇంతలో గడపపై అడుగుంచి, సంకోచిస్తున్న సాంబయ్యపై ప్రకాశం దృష్టిపడింది.

"మామయ్యా! మీరా!" అన్నాడు ఆశ్చర్యంతో.

"అవును, నేనే ప్రకాశం! సిగ్గువిడిచి క్షమాపణకై యిలా వచ్చాను" అన్నాడు తలవంచుకుంటూ.

"ఛా! ఛా! అదేమిటి మామయ్యా! క్షమించమని అడగటానికి మీరేంతప్పుచేశారుగనుక. ఇంకోసారి ఆ మాట అనకండి" అంటూ దగ్గరగావచ్చి, అతనిచేతులు పట్టుకొని లోపలకు తీసుకొచ్చాడు ప్రకాశం.

రామయ్యగారు సాంబయ్యనుజూచి మొదట్లో ఆశ్చర్యపోయినా, అతని ఖిన్నవదనంజూచి జాలిచెందాడు.

రామయ్యగారిని చూడగానే సాంబయ్య "బావా! నన్ను క్షమిస్తారుగదూ!" అంటూ చేతులుపట్టుకొన్నాడు కన్నీరుగారుస్తూ.

"అదేమిటోయ్! ఆడపిల్లలా ఏడుస్తావ్, జరిగిందంతా ఒక పీడకల అనుకో! నీపై నాకేనాడూ కక్షగానీ, కోపం గానిలేవు, నీవేం బాధపడకు" అన్నాడు రామయ్య.

"మీలో ఇంత గొప్పగుణంవుందని నాకు తెలుసు బావా! మీ ముందు ఎలా తలెత్తుకు తిరుగాలోకూడా నాకు తోచలేదు. మీరు క్షమించాలి! అంతేచాలు!" అన్నాడు.

"అవేంమాటలుమామయ్యా! ఇక ఎన్నడూ అలా భావించకు" అన్నాడు ప్రకాశం.

"నాకు తెలుసు ప్రకాశం! నీ ఎంత గొప్పహృదయుమని. ఆనాడు నిన్ను..."

"మళ్ళీ అవన్నీ ఎందుకు జ్ఞప్తికితెస్తారు మామయ్యా! జరిగినవాటిని గురించి ఆలోచించటంకన్నా, జరిగేదాన్ని గురించి ఆలోచించటం ఉత్తమం" అన్నాడు ప్రకాశం.

# 31

మర్నాడు సాయంత్రం, 'ప్రకాశం', మామిడివనంలో, గలగలా ఎండిన ఆకులను వర్షిస్తూన్న, మామిడివృక్షం క్రింద నిశ్చలంగా నిల్చొని, పైపు పీలుస్తూ, గతస్మృతులు లీలగా మెదలుతూండగా శూన్యభావాలతో, నిర్లిప్తంగా ఆకాశం వైపు చూస్తూండి పోయాడు.

అతని దృష్టిపథంలో, దూరంగా ఆకాశాన్ని ఆవరించేంత ఎత్తుకలిగి, నునుపుదేలియున్న పర్వత శిఖరాలూ, సంధ్యా భాస్కరుని ఎర్రటికిరణాల తాకిడికి కాలిన యినుంలా కమిలిపోతున్న మేఘపు తునకలూ; ప్రకృతి నిశ్శబ్దతకు జోల పాట పాడుతూ, అక్కడక్కడ గుంపులు గుంపులుగా తిరుగుతూన్న రకరకాల పక్షుల సమూహాలూ; కన్పిస్తూండగా, గత ఛాయలంతా కళ్ళముందు మెదలుతూండగా, ఒకవిధమైన మధురానుభూతిలో అతని హృదయం మైకం చెందింది.

అతని స్మృతిపథంలో వరుసగా రాధ, ఇందిర, సావిత్రి, రమ, ఒక్కసారిగా మెదిలారు. ఆఖరున అగుపించింది అతని చెల్లాయి శారద ఆమె ముఖం కళావిహీనమై, జాలి, దైన్యత, కన్నీటి రూపంగా ప్రవహిస్తున్నాయి. గంభీరమైన శ్వాస ఒకటి నాసికలనుండి బరువుగా వెలువడింది.

పది నిముషాల గాఢ నిశ్శబ్దత తర్వాత, ప్రకాశం, అప్రయత్నంగా వెనుదిరిగి, తన ఎదుటనున్న ఒక స్త్రీమూర్తిని చూచి ఆశ్చర్యంతోపాటు నిర్ఘాంత పోయాడు.

సావిత్రి మౌనంగా నిల్చొనుంది. తెల్లటి రంగు చీర, అదేరంగు రవికె ధరించివుంది. కురులను ముడివేసి కొప్పుగా చుట్టుకొనుంది. బలహీనంగా, నీరసంగా, ఎండిన ఆకులావుంది ఆమె శరీరం. కళావిహీనమై శూన్యంగా ఉన్న ఫాలభాగం... దీనత్వం, జాలి కొట్టొచ్చినట్టు కన్పించే సజలనయనాలూ,... బోసిపోయిన ఆభరణాలులేని మెడ... గాజులు లేని మొండిచేతులు... నిరాడంబరమై, నిర్వికారమై, స్వచ్ఛతను వైధవ్యాన్ని స్ఫురింపచేస్తూన్న ఆ తెల్లటిదుస్తులూ

...అందమైన ఆ రూపు రేఖలలో నల్లటి మ్లానఛాయలు. విషాదం మూర్తీభవించిన ముఖంలో, చారడేసిన ఆ కళ్ళు మాత్రం నమక బెదురుగా కన్పిస్తూ మిలమిలా మెరుస్తున్నాయి.

ప్రకాశం ఆమెను వింతగా బాధగా చాలాసేపు పరికించి చూశాడు, విపరీతమైన జాలి, సానుభూతి అతని చూపుల్లో తొణకిసలాడాయి.

"సావిత్రీ" అని అస్పష్టంగా పిలిచాడు. అది పిలిచినట్టుగా లేదు, తనలో తాను గొణిగినట్టుగా ఉంది.

సావిత్రి అతని వేపలాగే రెండుక్షణాలు చూశింది. అప్రయత్నంగా ఆమె నయనాలనుండి రెండు కన్నీటిబొట్లు దొరుతూ, కనుకొలకులలో నిలచి, ఆ సంధ్యారుణ కిరణాలలో ఎర్రగా మెరిశాయి.

"బావా!" బాధగా, బరువుగా, అస్పష్టంగా, పిలిచింది

ప్రకాశంకు ఆమె సంబోధన వినిపించినట్టుగా లేదు. నిస్సబ్ధుడై ఆమెవేపే చూస్తూండిపోయాడు. ఏవేవో భావ తరంగాలు సుడిగుండాలై అతనిలో గిరగిరా తిరుగుతున్నాయి.

"సావీ!" అని ఎంతగానో పిలవాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు ఆ పిలుపుకోసం అతని అధరాలు ఆరాట పడుతున్నట్టుగా స్పందిస్తున్నాయి.

ఆమె అతని కళ్ళవేపు నిశ్శబ్దంగా చూస్తోంది.

"బావా" అంది స్పష్టంగా జీరపోయిన కంఠంతో.

"సావీ" అన్నమార్దవ స్వరం ఈసారి ఇతని పెద వులగుండా స్పష్టంగా వినిపించి సావిత్రి నరజణాం విచలితు రాల్ని చేశింది.

"ఈ విధంగా నిన్ను చూడవలసి వస్తుందనుకో లేదు సావీ" ఎంతో బాధగా అన్నాడు ప్రకాశం.

ఒక్క నిముషం సావిత్రి మౌనంగా ఉండిపోయింది. కళ్ళెత్తి అతని ముఖంవేపు దీర్ఘంగా చూశింది. అంత వరకూ కనుకొలకులలో ఉన్ననీరు ఇక ఆగలేక జలజలా క్రిందకు రాలాయి.

"బావా!. మీరు నన్ను క్షమించ లేరని నాకు తెలుసు. కాని, ఈ పాపిష్టిదుర్బల ఆత్మ ఆక్షమే మీనుండీ పొందాలని ఎంతో పరితపిస్తోంది. ఈనాడు మీనుండి అది ఆశించటం కూడా పెద్దనేరమే! కాని ఈ చపల హృదయాన్ని అరికట్టే శక్తి నాకీనాడు లేదు. మీనుండీ క్షమాభిక్ష లభించటం దుస్సాధ్యమైనదని తెలిసీ, ఈ దుర్బలచిత్తం అందుకే ఆరాట పడుతోంది. ఏంచెయ్యను బావా! ఈ శేషజీవితంలో ఏనాడైనా మిమ్మల్ని కళ్లారా గాంచాలనిఈ చూపును విపరీతమైన ఆకాంక్షతో ప్రసుగ్గుతున్నాయి. సౌభాగ్యవంత మైన మీజీవితాన్ని శిథిలంగా మార్చి, మరీ దాన్నే చూడా లని ఆశించే ఈ దౌర్భాగ్య సావిత్రిని క్షమించవలసి వస్తుందని మీ కెలా తెలుస్తుంది.? పవిత్రమైన మీ జీవనభాండంలో హాలాహలాన్ని రేకెత్తించాను, మళ్లీ శేషాన్నే కళ్ళారా గాంచాలని ఆరాటపడే ఈ నికృష్టపాపిని క్షమించాలని మీ మనసెలా అంగీకరిస్తుంది!. కాని బావా.! అన్నీ అంత

రించినా శేషోమాషో ముగిసిపోయే ఈ కష్టానికు ఆమాత్రపు క్షమాపూరిత భిక్ష లభించకపోతే, దానిఆత్మ ఎలా శాంతి స్తుంది!. ఈ దీనురాలి వ్యధిత హృదయంపై ఆమాత్ర మైనా కటాక్షం, క్షమ, ప్రసాదించలేరా.

"అయ్యో. ఏమిటిదంతా సావీ. నీకేమైనా పిచ్చి బట్టిందా! నను నిలువునా ఈమాటలతో ఎందుకు దహించి వేస్తావ్."

"దహించివేయటానికి గాని, మండే మంటలను ఆర్పి వేయటానికిగాని, అశక్తురాలను బావా! మీరుకూడా నన్ను."

"అయ్యయ్యో. సావీ,. నీవూ నన్ను అర్థంచేసుకో లేక పోతున్నావనే నాబాధ.! ఇలాంటిమాటలను మరీ మరీ అనకు సావీ.

"ఇంకా ఎలా ప్రాధేయపడాలో నా కర్థంగాలేదు బావా! మీరు హృదయపూర్వకంగా నన్ను క్షమించ గలరనే."

"అబ్బా...! ఏమిటీ అర్థంలేనిమాటలు, నేనుచేప్పేది పూర్తి వినిపించుకోకుండా. మానవులుగా ఒకర్ని ఒకరు క్షమించుకోటాకి, మనమెవరు? ఇందులో నీతప్పేముందని నన్నిలా ప్రాధేయపడతావ్.

"అయితే నన్ను క్షమించారా బావా!"

"అబ్బ! మళ్ళీ అదే సమస్యతో నన్ను చిత్రవధ చేస్తున్నావ్"

"సావిత్రి తృప్తిగా నిట్టూర్చింది. చూడు బావా! ఎంతో భారంగావున్న నా మనసీక్షణంలో ఎంత తేలిక పడిందో..." అని తనవేపు దీక్షగా చూస్తున్న ప్రకాశాన్ని జూచి చటుక్కున ఆగింది.

ప్రకాశం ఆమెకళ్ళవేపు, దివ్యకాంతులు అప్పుడప్పుడే వెల్లివిరుస్తూన్న ఆమె చూపులవేపు ఏదో కొత్తదనం నిండుదనం అప్పుడప్పుడే కన్పిస్తూన్న ఆమె ముఖంవేపు నిశ్చలంగా మౌనంగా శ్రద్ధగా చూస్తూండిపోయాడు. ఏదో రాగరేఖ అతని హృదయంలో ఏదో భావరేఖ అతని మస్తిష్కంలో తళుక్కున మెరిశాయి.

సావిత్రి అతని చూపులకు కాస్త బెదిరిందనే చెప్పాలి.

"బావా"

"ఏంసావీ"

"మీరీనాడు నాగుండా ఏకాకిగా జీవించటానికి నా మనసంగీకరించదు. గతంనాస్తి అని మీకు తెలియందగాదు. ఆ గతాన్ని చేతికర్రగా పట్టుకొని భవిష్యత్ వేపు నడకసాగించటం విజ్ఞులలక్షణంగాదు. మీకు చెప్పవలసిన బాధ్యత, అధికారం నాకీనాడు లేకపోలేదు. ఆ అధికారాన్నికూడా మీరే ఇచ్చారు. బావా! అన్నీ విస్మరించి మీరు భవిష్యత్‌ను గమనంలో ఉంచుకొని వెంటనే పెళ్లిచేసుకోండి. కనీస మీ వివాహం చూడటానికైనా ఈ కన్నులు నోచుకుంటే అంతే చాలు. మీరీవిధంగా దుర్భరయాత్రసాగిస్తే నా మనసు భరించలేదు. కనీసం మా అందరితృప్తికోసమైనా ఎక్కడేనా మంచిసంబంధంచూసి పెళ్ళిచేసుకో బావా!"

ప్రకాశం నిముషం మవునంగావుండి ఆమెవేపే చూస్తూ. "నిజం సావీ! నీవు కోరినట్టుగా నేను తప్పక పెళ్లి చేసుకుంటాను" అన్నాడు.

"నాకు తెలుసు బావా! మీరు తప్పక నా మాట వింటారని! ఇకచాలు. ఇదొకటీ జరిగితే నా కదేతృప్తి. మరెక్కడైనా అమ్మాయిని అప్పుడే నిర్ణయించుకున్నావా బావా"

ప్రకాశం ఆమె కనుల్లోకి సూటిగాచూస్తూ "అవును సావీ! అప్పుడేగాదు, ఇప్పుడేచూసి అన్నీనిర్ణయించు కొన్నాను... నేను నిన్ను పెళ్లిచేసుకుంటాను సావీ"అన్నాడు.

సావిత్రి నిర్ఘాంతపోయింది. ఆమె నవనాడులూ అదొక విధమయినభీతితో ఒక్కసారిగా స్పందించాయి. కంపిస్తున్న అధరాలతో, "బావా" అంది.

"సత్యం సావీ! అన్నీ ఆలోచించే ఈ నిర్ణయాని కొచ్చాను. నిన్నుదప్ప మరెవర్నీ నేను వివాహం చేసుకో లేనని నాకేనాడో తెలుసు. నా జీవితంలో : సౌఖ్యాన్నీ, భవిష్యత్ లో అభివృద్ధినీ కాంక్షించేదానివైతే తప్పక నీవీ వివాహానికి అంగీకరిస్తావ్"

సావిత్రి అదిరిపోయింది. "వద్దు బావా వద్దు! నా మూలంగా కష్టాలుపడటం నేను సహించలేను. నా పాపిష్టిజీవితం ఇలాగే అంతరించిపోనీ! ఈ పంకిల సావి ఆ స్థానం యివ్వాలని ఏ మాత్రం ఆశించకు బావా! మీ హృదయానికి నాకా స్థానం ఉంటే అంతేచాలు. ఇక నేనేదీ ఆశించను"

"సావీ! ఎందుకు నిన్ను నీవిలా కించపరుచుకుంటావ్! నన్నర్థంచేసుకోసావీ! నా శేషజీవితానికి ఈ మాత్రమైనా అదృష్టాన్ని చేకూర్చలేవూ? తప్పక నిన్ను పెళ్ళిచేసుకుంటాను సావీ"

"బావా! మీరాలోచించే ఈ నిర్ణయానికొచ్చారా? మీ మాటలు మీ కర్థమవుతున్నాయా... నేను... నేను విధవను"

"సావీ! అమంగళం పలుకకు! నీవీనాడు సర్వమంగళ సౌభాగ్యవతివి. శ్రీమతి సావిత్రీప్రకాశ్ వి"

"ఏమిటి బావా ఇదంతా! నాకేదో కలగావుంది"

"కలగాదుసావీ! వాస్తవం. ఇకమనల్ని ఎవరూ వేరు చెయ్యలేరు, చెయ్యలేరు" అంటూ ఆమె భుజాలపై తన చేతులానాడు.

సావిత్రికి ఆనందంతో కంఠం పూడుకుపోయింది. "బావా! ఈ దీనురాలికంత స్థానమిస్తున్నారా! నేనంతటి అదృష్టవంతురాలినా! అంటూ ఒరిగి అతని పాదాలను గట్టిగా కావలించుకుంది.

ప్రకాశం తృప్తిగా శ్వాసపీల్చి "లేసావీ!" అన్నాడు. ఆనందపారవశ్యంతో అతని కనుకొలకులలో నీళ్లునిలచాయి ఆమె రెండుభుజాలూ పట్టుకొని పైకిలేపబోయాడు.

కాని ఆమె అతని పాదాలమీదినుంచీ లేవలేదు. తన కన్నీటితో అతని పాదాలను అభిషేకిస్తూ, ఆనందంతో అస్పష్టంగా, "బావా" అంటూ మరింత గట్టిగా ఆ పాదాలను కౌగలించుకుంది.

సమాప్తం